శ్రీః

# శ్రీ శివమంగళాచరణసురభి

వ్యాఖ్యాత

**డా॥ తాడేపల్లి పతంజలి**



ప్రకాశకులు

**శ్రీమతి రావి కృష్ణకుమారి**

**404, జంజనం కాంప్లెక్స్,**

**చీరాల - 523 155**

శ్రీః

# శ్రీ శివమంగళాచరణసురభి

వ్యాఖ్యాత

**డా॥ తాడేపల్లి పతంజలి**


ముద్రణ : ***11-05-2016 - శ్రీ శంకరాచార్య జయన్తి***

ప్రతులు : ***500***

పేజీలు : ***276***

వెల రూ. : ***250-00***





**RAVI MOHAN RAO,** M.Sc., M.A.,
Dandy House,
Flat No : 404, Janjanam Complex,
Opp. I Town Police Station,
CHIRALA-523 155, Prakasam Dist.
Cell : 9440115411



***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

***Printed at -***
**Karshak Art Printers,**
**HYDERABAD**



# శివాంజలి

నా పుస్తకం గురించి నేనే వ్రాసుకోవటం....
మా అమ్మాయిని గురించి నేనే చెప్పుకోవటం...

ఒకింత ఇబ్బంది అయినా... వివరించటానికి ఆనందం లేదనటం అబద్ధం...

సంస్కృతంలోను, తెలుగులోను ఉన్న మొత్తం నూట ఎనిమిది కావ్యాలలో శివయ్యను వర్ణించిన నాందీ పద్యాలలో / శ్లోకాలలో ప్రతిపదార్థ, తాత్పర్య విశేషాలను తెలుపుట ఈ గ్రంథ ప్రణాళిక.

ఇంతకు మునుపు ఎవరన్నా ఇలాంటి పని చేసారా! అంటే లేదు అనే చెప్పాలి.

కనుక శివనాందీ వర్ణనలతో, శివమయంగా మొట్టమొదటిసారి సాహిత్య లోకపు తలుపులు తడుతున్న ఈ పుస్తకానికి – ఇలా రావాలని ఆలోచన చేసినవారు శ్రీ రావి మోహనరావుగారు. నా అన్నమయ్య కౌముదిని ప్రచురించి, వెనువెంటనే – వారు ఈ పుస్తక ప్రణాళిక నా ఫేస్‌బుక్ టైం లైన్‌లో ఉంచి ఈ పుస్తక రచన చేయమని ప్రోత్సహించారు. వారి సౌజన్యతకు, వదాన్యతకు ధన్యవాదాలు.

అయినా – మోహనరావుగారు అభిమానంగా చెప్పినా – నాక్కొంచెమయినా ఆలోచన ఉండద్దూ! అసలే సంస్కృతం. ఒక్క అక్షరం సరిగ్గా లేకపోయినా, దీర్ఘం పెట్టవలసిన చోట హ్రస్వం పెట్టినా కొంపలంటుకొంటాయి. సంస్కృత కవులు, తెలుగు కవులలో చాలామంది శాస్త్రాలు చదువుకొన్నవారు. కర్మ మీమాంస, బ్రహ్మమీమాంస, పురాణాలు, వేదాలు – చదివిన ద్రఢిమతో రచనలు చేసినవారు.

నేను చదివినదేపాటి!?

అయినా శివయ్య అంతా చూసుకొంటాడులే అని సాహసించాను.

పుస్తకాలు దొరకటం, ఆ మొదటి పద్యం / శ్లోకం మస్తకానికి ఎక్కటం, జీర్ణమయిన భావం టైప్ లో అక్షరాలుగా ప్రవహించటం – ఇవన్నీ కొన్ని గంటల రచనా సమాధిలో వరుసగా – నాకే ఆశ్చర్యం కలిగేటట్లుగా ప్రతిరోజూ జరిగాయి. కొన్ని పుస్తకాల స్కాన్డ్ కాపీలు పంపి మోహనరావు గారు పుణ్యం కట్టుకొన్నారు. మిగతా పుస్తకాలు అంతర్జాలంలో, కొన్ని నా గ్రంథాలయంలో దొరికాయి. ఒకటి రెండు పెద్దలు పంపించారు.

నన్నెచోడుని నుంచి, తనికెళ్ళ భరణి దాక – శివ నుతులు, శివ గతులు ఇందులో ఉన్నాయి.

ఇప్పుడొక ప్రశ్న.

ఈ పుస్తకం వల్ల ప్రయోజనమేమిటని?

"ప్రయోజనమనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే" ప్రయోజనము లేకుండా మూర్ఖుడు కూడా ఏ పని చేయడట. కనుక నేనుకూడా ఈ పుస్తక రచనవల్ల ఒక ప్రయోజనము రావాలని కోరుకొంటున్నాను.

శివునియొక్క దయతో లోకమంతా సుభిక్షంగా ఉండాలని. ప్రజలందరూ కొట్టుకోకుండా ఆప్యాయతలతో కలిసి మెలిసి ఉండాలని.

నాందీ గురించి ఒకటి రెండు ముచ్చట్లు...

గ్రంథారంభములో కవి చేసే ప్రార్థనకి సంబంధించిన శ్లోకాన్ని, లేదా పద్యాన్ని మంగళాచరణము అంటారు. దీనికే ఇంకొక పేరు నాంది. నాందీలో ఎనిమిది పదాలుండాలని కొందరు, కాదు – పన్నెండు పదాలుండాలని ఇంకొందరు చెప్పారు. (అష్టభిర్వా ద్వాదశిభిః పదైః).

పదమంటే పాదమయ్యా... అందుకే పుస్తకం మొదట్లో చేసే ఎనిమిది పాదాలు, (రెండు పద్యాలు) పన్నెండు పాదాలు (మూడు పద్యాలు) ఇవికూడా నాందీయే అని పెద్దలు సెలవిచ్చారు. ఆ ధైర్యంతోనే నేను ఇప్పుడు నా పుస్తకంలో – శివప్రార్థనలు – కావ్యాల్లో మొదటి, రెండు, మూడు వరుసల్లో ఉన్నా స్వీకరించాను.

నాందీ శ్లోకం / పద్యం చంద్ర నామాంకితం కావాలని ఒక నియమం. అంటే చంద్రుడు ఆ పద్యంలో ఎక్కడో ఒకచోట మనల్ని పలకరించాలని భావం. ఈ 108 నాందీ పద్యాల్లో / శ్లోకాల్లో ఆ నియమం చాలాచోట్ల కవులు పాటించారు.

సూచ్యార్థ సూచనము నాందీకొక ప్రత్యేకత. అంటే తాను రాయబోయే కావ్యంలో జరగబోయే కథని కాని, పాత్రని కాని ఆ కవి నాందీలో సూచించాలి. కొంతమంది కవులు ఈ నియమాన్ని పాటించారు. పాటించినచోట్ల – ఇది సూచ్యార్థ సూచనము అని విశేషాలలో చెప్పటానికి ప్రయత్నించాను.

ఒకటి రెండు చోట్ల సరదా పుట్టినప్పుడు – మా తరగతి గదిలోని ప్రశ్నోత్తర

పద్ధతిని వ్యాఖ్యానంలో పాటించాను. అలాంటి సందర్భాలు చాలా తక్కువ. శ్లోకం, ప్రతిపదార్థం, తాత్పర్యం, విశేషాలు – ఈ ప్రాచీన సంప్రదాయపు రైలు పట్టాల మీదనే బండి నడిచింది. అప్పుడప్పుడు ఉబలాటం ఎక్కువై ఆ నాందీ వ్రాసిన కవి కావ్యంలోని అందాలను విశేషాలలో ఆరేయటానికి – నాకు చేతనయినంతవరకు ప్రయత్నించాను. అలా చేయటం వల్ల ఎవరికన్నా ఆ కావ్యం మీద మనసు పుట్టి చదువుతారేమో అని ఒక దురాశ.

శివ సంబంధమైన కావ్యాలకోసం అంతర్జాలంలో పిచ్చి పట్టిన వాడిలా వెతుకుతున్నప్పుడు – ఆ కావ్యాలను స్కాన్ చేసిన మహానుభావుల పాదాల చిత్రాలు కూడా ఉంచితే బాగుంటుందనిపించింది. వందలాది కావ్యాలలోని అక్షర దోషాలు దిద్ది ఎడిట్ చేసినవారు కొందరు. వ్యాఖ్యానాలు వ్రాసినవారు ఇంకొందరు, జాగ్రత్తగా భావి తరాల కోసం వాటిని స్కాన్ చేసినవారు మరికొందరు – నిస్వార్థంగా తమ జీవితంలో ఎంత సమయాన్ని ఇతరులకోసం ఖర్చు పెట్టి ఉంటారు. ఊహించటానికే చేత కావటం లేదు. పెద్దలు మోహనరావుగారు నాతో అన్నారు. రెండు లక్షలకు పైగా సంస్కృత గ్రంథాలు స్కానింగ్‌లో ఉన్నాయట. తలచుకొంటేనే ఒళ్లు జలదరిస్తుంది. అంతర్జాలంలో అప్‌లోడ్ చేసినవారు ఎంతో పుణ్యధన్యులు – "ఎవరో ఒకరు – ఎపుడో అపుడు" వీటిని వాడుకొంటారు. భర్తృహరి అనలేదూ! "కాలో హ్యయం నిరవధిః – విపులా చ పృథ్వీ" – ఆ అంతర్జాలంలోని పుస్తకాలలో కొన్నింటిని నేను ఈ పుస్తకానికి వాడుకొన్నాను. అందుకే – ఆ మహానుభావుల పాదాలకు మనస్సులోనే నమస్కృతులు తెలియచేస్తున్నాను.

నమకంలో ఏకాదశానువాకం అయిపోయిన వెంటనే **"అయం మే హస్తో భగవానయం మే భగవత్తరః"** అన్న మంత్రం వస్తుంది. నాకు మోక్షాన్ని ఇస్తోంది ఈ నా చేయి. మోక్షాన్నిచ్చేది భగవత్స్వరూపం కాదు. మోక్షాన్నిచ్చేది ఈ చేయి. అందుకే ఈ చేయి భగవంతుడు. ఇది భగవంతుని మించినది. ఇది భగవత్తరము. "ఈ చేయి ఇలాంటి మంగళాచరణశివస్తుతిని వివరించే ప్రయత్నం చేసింది. మా అమ్మ సుశీలమ్మ, మా నాన్న పార్వతీశశాస్త్రి. ఈ పిండాండానికి ఆకృతి ఇచ్చిన ప్రయోజనాలలో నెరవేర్చటానికి శివయ్య ఇచ్చిన సదవకాశమిది.

ప్రస్తుతం ప్రపంచవ్యాప్తంగా 150 కోట్ల మందికి పైగా వినియోగదారులు ఉన్న ఫేస్‌బుక్ సంస్థమీద మంచి, చెడు రెండు అభిప్రాయాలున్నాయి.

తన స్నేహితుడు ఫేస్‌బుక్ విపరీతంగా వాడుతున్నాడని, దానివల్ల అతడి ప్రవర్తనలో మార్పులు వస్తున్నాయని భావించి ఆవేశానికి లోనైన ప్రియురాలు.. అతడ్ని హత్య చేసింది. ఈ కేసును విచారించిన కోర్టు నిందితురాలికి 12 ఏళ్ల జైలుశిక్ష విధిస్తూ, ఆ గడువు ముగిసిన తర్వాత పెరోల్‌పై బయటకు వెళ్లేందుకు అవకాశం కల్పించింది. (సాక్షి 23-02-2016) ఇలాంటి నీలినీడలు ఉన్నా - ప్రతిరోజు నేను వ్రాసిన శివస్తుతిని ఫేస్‌బుక్‌లో పోస్ట్ చేయటం ఒక నియమంగా పెట్టుకొన్నాను.

నా లక్ష్యం ఒక్కటే. కొంతమంది అయినా చదువుతారని. నేనేమి పండితుడిని కాను. ఎక్కడన్నా పదం కొంచెం జారుతుంటే-ఇదుగో-సరిదిద్దుకో-అని చెప్పేవాళ్లు దొరుకుతారని నా ఆశ. నా ఆశయం పూర్తిగా నెరవేరిందని చెప్పలేను కాని - గోరఖ్ - లాంటి పదాల దగ్గర- నాతో విభేదించి ఇంటికి ఉత్తరాలు వ్రాసినవాళ్లు ఉన్నారు. నన్ను ప్రతిరోజు ప్రోత్సహించి ముందుకు నడిపించిన సహృదయులూ ఉన్నారు. అందరికీ ధన్యవాదములు.

**"పాతు వో నీలకంఠస్య కంఠః శ్యామాంబుదోపమః / గౌరీభుజలతా యత్ర విద్యుల్లేఖేవ రాజతే!"** (ఎక్కడ పార్వతీదేవియొక్క లతవంటి బాహువు మెరుపు తీగలా ప్రకాశిస్తోందో, అటువంటి నీలకంఠుని యొక్క నీలిమేఘము వంటి గళసీమ మమ్ములను రక్షించుగాక!) శివుని కంఠం నల్లటి మేఘంలా ఉంటే, అమ్మవారి చేయి అనే తీగ మెరుపు తీగలా ఉందట. పోలిక మీద పోలికను ఎంతో అందంగా చెప్పిన ఇటువంటి ఒకటి రెండు అందమైన శ్లోకాలు - ఈ పుస్తకం కోసం సేకరించి - ఏ కావ్యంలోవో - ఈ పామరునికి - తెలియక వదిలివేసిన సందర్భాలూ ఉన్నాయి.

శంకరులు శివానందలహరి స్తోత్రంలో **"భవదర్థం మమ మనః"** అన్నారు. "నీకు బంగారు కానుకలు ఇవ్వాలని ఉంది. కాని నువ్వు బంగారు ధనుస్సు ధరించిన వాడివి. నీకు ధనం ఇవ్వాలని ఉంది. కాని కుబేరుడు నీదగ్గర దాసోహమని నిలబడతాడు. కామధేనువులు, కల్పవృక్షం, చంద్రుడు ఏది లేదయ్యా నీదగ్గర! అందుకే నా మనస్సును నీకు ఇస్తున్నాను. (అది నీదగ్గరలేదు) స్వీకరించు" అని ఎంతో గొప్పగా చెప్పారు.

శివయ్యా! ఇది నా 108 పద్య / శ్లోకాల వ్యాఖ్యానం - నా మనస్సు పెట్టి వ్రాసినవి. నువ్వు వ్రాయించుకొన్నవి. వాటిని నీకు అందచేస్తున్నాను. తప్పులను మన్నించి స్వీకరించవయ్యా! శివోఽహం

డా॥ తాడేపల్లి పతంజలి.



# కిరణసూచిక

26. భవభూతి "మాలతీమాధవమ్"
27. కాళిదాసు **"రఘువంశమ్"**
28. హర్షవర్ధనుని "ప్రియదర్శిని"
29. పోకూరి కాశీపతి "సారంగధరీయము"
30. విశాఖదత్తుని "ముద్రారాక్షసమ్"
31. కూచిమంచి తిమ్మకవి "శ్రీ సింహాచలక్షేత్రమాహాత్మ్యము"
32. శ్రీహర్షుని "రత్నావళి"
33. కాళ్లకూరి నారాయణరావు "చింతామణి"
34. శూద్రకవి "మృచ్ఛకటికమ్"
35. సత్యవోలు సోమసుందరకవి "చంపూ భాగవతము"
36. కాళ్లకూరి నారాయణరావు "వరవిక్రయము"
37. పెరుమాళ్ళ వీర్రాజు **"కామకళ"** నాటకము
38. త్రివిక్రమభట్టు "నలచమ్పువు"
39. భట్టనారాయణుని "వేణీసంహార" నాటకము
40. శార్ఙ్గదేవుని "సంగీతరత్నాకరము"
41. నందికేశ్వరుని "అభినయదర్పణము"
42. రుద్రభట్టు "శృంగారతిలకము"
43. త్రిపాఠి శ్రీశివరామకవి "నక్షత్రమాల"
44. పుణ్యానందసరస్వతి "కామకలావిలాసము"
45. భట్టనారాయణుని "స్తవచింతామణి"
46. కాళ్లకూరి నారాయణరావు "మధుసేవ"
47. పుచ్చా వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి "సంగీతమార్తాండము" (తాళాధ్యాయము)
48. మలయరాజ "శివస్తుతి"
49. విశ్వనాథ "నర్తనశాల"
50. మల్హణ కవి "శివస్తుతి"
51. కల్హణ కవి "అర్ధనారీశ్వరస్తోత్రమ్"
52. తిరుపతి వేంకటకవుల "పాండవవిజయము"
53. బలిజేపల్లి లక్ష్మీకాంతకవి "సత్యహరిశ్చంద్రీయము"
54. నన్నయ "మహాభారతము"
55. గౌరన "నవనాథచరిత్ర"

56. మారన "మార్కండేయపురాణము"
57. భోజుని "శృంగారప్రకాశము"
58. శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారి "శివతాండవము"
59. కూచిమంచి తిమ్మకవి "నీలాసుందరిపరిణయం"
60. శ్రీనాథుని "హరవిలాసము"
61. ధూర్జటి "శ్రీకాళహస్తీశ్వరశతకము"
62. రాజానక కుంతకు "వక్రోక్తిజీవితము"
63. కూచిమంచి తిమ్మకవి "అచ్చతెలుగురామాయణము"
64. తెనాలి రామకృష్ణుని "పాండురంగమాహాత్మ్యము"
65. సదాశివబ్రహ్మేంద్రుల **"శివమానసికపూజ"**
66. పింగళి సూరన "రాఘవపాండవీయము"
67. కేదారభట్టు "వృత్తరత్నాకరమ్"
68. శ్రీహర్షుని "ప్రియదర్శిక"-02
69. శ్రీ శంకరభగవత్పాదుల **"అమరుకశతకమ్"**
70. విశ్వనాథ "ధన్యకైలాసము"
71. విశ్వనాథ "శ్రీగిరిశతకము (మధ్యాక్కరలు-01)"
72. కాళిదాసు **"చిద్గగనచంద్రిక"**
73. సింహభూపాలుని "రసార్ణవసుధాకరము"
74. కందుకూరు రుద్రకవి "నిరంకుశోపాఖ్యానము"
75. అభినవగుప్తుని **"భైరవస్తోత్రము"**
76. జగద్ధారభట్ట "స్తుతికుసుమాంజలి"
77. రాజానక జయద్రథుని "హరచరితచింతామణి"
78. సంకుపాల నృసింహకవి "కవికర్ణరసాయనము"
79. వినుకొండ వల్లభరాయని "క్రీడాభిరామము"
80. అప్పయదీక్షితుల "కువలయానందము"
81. **శివగీతలోని నాందీ శ్లోకము**
82. విశ్వనాథ "కాళహస్తిశతకము" (మధ్యాక్కఱలు)
83. పుష్పదంతుని **"శ్రీ శివమహిమ్నఃస్తోత్రము"**
84. శ్రీ దక్షిణామూర్తిశాస్త్రి "త్రికూటత్రిశతి"
85. ఉత్పలదేవుని **"శివస్తోత్రావళి"**

86. మంఖక కవి "శ్రీకంఠచరితము"
87. జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి "సాలంకార కృష్ణదేవరాయలు"
88. క్షేమరాజ "ప్రత్యభిజ్ఞాహృదయం"
89. విశ్వనాథ "సిద్ధాబ్జహేళి"
90. **"శివమీడేస్తవము"**
91. **శివసహస్రనామము**
92. తులసీదాస్ "శ్రీరామచరితమానసము"
93. టేకుమళ్ల రంగశాయికవి "వాణీవిలాసవనమాలిక"
94. బేతవోలు రామబ్రహ్మం "శృంగారశ్రీకంఠము"
95. అప్పకవి "అప్పకవీయము"
96. పతంజలి "చరణశృంగరహితస్తోత్రము"
97. కంకంటి పాపరాజు "ఉత్తరరామాయణము"
98. బమ్మెర పోతన "భాగవతము"
99. డా॥ చెఱువు సత్యనారాయణశాస్త్రి **"సుందరేశ్వరవిలాసము"**
100. కోవెల సుప్రసన్నాచార్య "శివాభిసారిక"
101. గౌరన "హరిశ్చంద్రోపాఖ్యానము"
102. పప్పు వేణుగోపాలరావు "సప్తతాండవము"
103. విహారి "సుందరకాండ"
104. వావిలకొలను సుబ్బారావు "రామాయణము"
105. శంకరభగవత్పాదుల "దక్షిణామూర్తిస్తోత్రము"
106. కొఱవి గోపరాజు "సింహాసనద్వాత్రింశిక"
107. అప్పయ్య దీక్షితులవారి (1520–1593) "శివార్చనాచంద్రిక"
108. తనికెళ్ళ భరణి "శబ్బాష్ రా శంకరా!"

**పాణిమంత్రమ్**



# ఓ మాట

**ఇది**

**ఒక సుమధుర ఆమ్రఫలం**

అధ్యయన, అధ్యాపన, అనుష్ఠానాలతో ఆరగిస్తూ ఆస్వాదిస్తూ ఆనంద రసానుభూతులను అందుకొందురుగాక.

సద్భక్తితో సర్వులు ఇహపరములను సాధించుకొందురుగాక.

**పరమశివుని కరుణాంతరంగాలలో ఓలలాడుదురుగాక.**

గ్రంథ ప్రణాళికను పట్టుదలతో నిర్వహించిన **డా॥ తాడేపల్లి పతంజలి** గారికి శుభాశీస్సులు.

**– రామోరా,** సంపాదకుడు.



# ఓం నమః శివాయ

**అథ శ్రీమద్భగవత్పాద పద్మపాదాచార్య విరచిత**
**శ్రీ శివపంచాక్షరీభాష్యమ్ - ఓం నమశ్శివాయేతి మన్త్రః**

తస్య ప్రథమం వ్యాఖ్యానమ్

త్యాగో హి నమసో వాచ్య ఆనన్దః ప్రకృతేస్తథా ।
ఫలం ప్రత్యయవాచ్యం స్యాత్త్యాజ్యం పత్రఫలాదికమ్ ॥ 1

త్యజామీదమిదం సర్వం చతుర్థ్యామిహ సిద్ధయే ।

**ఓం నమశ్శివాయ**

అథవా నమసో వాచ్యః ప్రణామో దైన్యలబ్ధయే ॥ 2

దైన్యం సేవా తథా జ్ఞప్తిః సిద్ధిస్సర్వస్య వస్తునః ।
నమామి దేవదేవేశం సకామోఽకామ ఏవ వా ॥ 3

**ఓం నమశ్శివాయ**

నఞా నిషిధ్యతే భావవికృతిర్జగదాత్మనః ।
మననం దేవదేవేశ నేహనానాస్తి శబ్దతః ॥ 4

అయేతి గమయేత్యర్థే తస్మాచ్ఛుద్ధోఽస్మి నిత్యశః ।
ప్రణామో దేహగేహాదేరభిమానస్య నాశనమ్ ॥ 5

**ఓం నమశ్శివాయ**

శివో బ్రహ్మాదిరూపస్స్యాచ్ఛక్తిభిస్తిసృభిస్సహ ।
అథవా తుర్యమేవ స్యాన్నిర్గుణం బ్రహ్మ తత్పరమ్ ॥ 6

నమసో నమనే శక్తిర్నమనం ధ్యానమేవ చ ।
జేఽన్తాత్తాదాత్మ్యసమ్బన్ధః కథ్యతే ప్రత్యగాత్మనోః ॥ 7

అహం శివః శివోఽహఞ్చ మన్యే వేదాన్తనిష్ఠయా ।
ఇత్యేవం నమ ఇత్యుక్తం వేదైశ్శాస్త్రైశ్చ సర్వశః ॥ 8

అథవా దాస ఏవాహమహం దాస ఇతీరణమ్ ।
ఇత్యేవ నమ ఇత్యుక్తం వేదైశ్శాస్త్రైశ్చ సర్వశః ॥ 9

అథవేదమిదం సర్వం త్యజామి పరమాప్తయే ।
అర్థం ధర్మఞ్చ కామఞ్చ వాఞ్ఛంశ్చ జగదీశ్వరమ్ ॥ 10

ఏతన్మన్త్రార్థతత్త్వజ్ఞైర్వేదవేదాన్తతత్పరైః ।
నిర్ణీతం తత్త్వగర్భం యద్విజ్ఞేయం ముక్తిలబ్ధయే ॥ 11

అథవా ముక్తిలాభాయ ధ్యేయం తత్త్వం వివేకతః ।
భిన్నం బుద్ధ్వా హృదా దేవం మన్త్రేణేశం జగద్గురుమ్ ॥ 12

**ఓం నమశ్శివాయ**

నమేరచి నమః ప్రోక్తో జన్తా స్యాజ్జగదీశ్వరే ।
తస్మాద్దాసోఽహమిత్యేవం మత్వా మాం ప్రాపయాత్మని ॥ 13

**ఓం నమశ్శివాయ**

అస్మిఞ్ఛేతే జగత్సర్వం తన్మయం శబ్దగామి యత్ ।
తద్వానాచ్ఛివ ఇత్యుక్తం కారణం బ్రహ్మతత్పరైః ॥ 14

న మా యస్యాస్తి లక్ష్మీశ! సోఽహం దేవో న సంశయః ।
తస్మాన్మే ప్రాపయేహైవ లక్ష్మీం విద్యాం సనాతనీమ్ ॥ 15

యస్మాదానన్దస్వరూపస్త్వం దేవైర్వేదైర్నిగద్యసే ।
తస్మాన్మే దేహి యోగీశ! భద్రం జ్ఞానం సుభావనమ్ ॥ 16

**ఓం నమశ్శివాయ**

యస్మాత్త్వం నేతి నేతీతి నఞర్థం మాసి వేదజమ్ ।
తస్మాన్నమోఽసి భద్రం మే యతో జాతోఽనమో నమః ॥ 17

శివం శివమథాఽప్రాప్తః శివాయేతి నిగద్యసే ।
శివాయ మే తథా ప్రాప్త్యా శివాయం కురు సర్వదా ॥ 18

**ఓం నమశ్శివాయ**

శివాం యతో మహాభద్ర! నమోఽహం మాయయా ధ్రువమ్ ।
తతో నమాయ మహ్యం మః శివాయం కురు సర్వథా ॥ 19

**ఓం నమశ్శివాయ**

శివమేషి యతో జ్ఞప్త్యా శివాయస్త్వం ప్రపఠ్యసే ।
నతే మాయా యతో జ్ఞప్త్యా నమో వేదైః ప్రపఠ్యతే ॥ 20

నమోఽహఞ్చ శివాయోఽహం నమో మహ్యం నమో నమః ।
నమో నమాయ శుద్ధాయ మఙ్గళాయ నమో నమః ॥ 21

నమో న మసనం శంభో! నిరాకారాయతే నమః ।
నిర్గుణం నిష్క్రియం శాన్తమిత్యాద్యాః శ్రుతయో జగుః ॥ 22

నమో బ్రహ్మనిరాకారం శివాయం శివ సర్వదా ।
అతోఽహఞ్చ న మా భద్ర! శివాయోఽహం న సంశయః ॥ 23

ఇతి శ్రీమద్ భగవత్పాదపద్మపాదాచార్యవిరచితం
శ్రీ శివపఞ్చాక్షరీభాష్యమ్
సమాప్తమ్





శ్రీః

# నమశ్శివాయ

## శ్రీ శివపంచాక్షరికి శ్రీశంకరభగవత్పాదుల శిష్యులైన పద్మపాదాచార్యులవారు చేసిన తొమ్మిది రకాల వ్యాఖ్యానము (సంగ్రహంగా తెలుగులో)

### ప్రథమ వ్యాఖ్యానం

### ఓం నమశ్శివాయ

నమః శబ్దముయొక్క వాచ్యార్థం – త్యాగం, శివ శబ్దానికి వాచ్యార్థం – ఆనందం. శివాయ అనుదానిలో చతుర్థీ ప్రత్యయమయిన "ఆయ" యొక్క వాచ్యార్థం – ఫలం. ఈ లోకంలో ధర్మము, అర్థము, కామము, మోక్షము అను నాలుగు పురుషార్థాలు నెరవేరుట కొరకు ఈ సర్వ దృశ్యప్రపంచాన్ని విడిచిపెడుతున్నాను అని ఓం నమశ్శివాయ మంత్రానికి అర్థం.

### ద్వితీయ వ్యాఖ్యానం

### ఓం నమశ్శివాయ

నమః శబ్దము యొక్క వాచ్యార్థం నమస్కారం. సేవాభావము, జ్ఞానము, సర్వ పదార్థముల సిద్ధి కారణములు. కోరికలు కలిగి, (సకాముడనై) లేదా కోరికలు లేకుండా (నిష్కాముడనై) పరమేశ్వరునికి నమస్కరిస్తున్నాను.

## తృతీయ వ్యాఖ్యానం
## ఓం నమశ్శివాయ

నమః శబ్దమునకు పరిణామము చెందనివాడు అని అర్థము. శరీరము, ఇండ్లు మొదలైన వాటిలో గల అభిమానమును నివృత్తిచేయు నమస్కారము అను అర్థములో **అయ** అను ధాతువు ప్రయోగింపబడినది. శివునికి నమస్కారము చేయుటచేత నేను ఎప్పుడూ శుద్ధుడగుచున్నాను అను అర్థము ఓం నమశ్శివాయ మంత్రమునకు వచ్చుచున్నది.

## చతుర్థ వ్యాఖ్యానం
## ఓం నమశ్శివాయ

నమః శబ్దముయొక్క శక్తి నమస్కరించుటలో ఉంది. (నమనం నమః). నమస్కరించుట అంటే ధ్యానము. "అయ" అను చతుర్థీ విభక్తి ప్రయోగము చేత జీవాత్మ పరమాత్మల ఏకత్వము చెప్పబడింది. నేను శివుడనని, శివుడే నేనని భావిస్తున్నాను. నేను శివునితో ఐక్యము పొందేవరకు నమస్కారము (నిదిధ్యాసనము) చేయుచున్నాను. అందువలన ధ్యాతా (ధ్యానము చేయువాడు) ధ్యానము (చింతన) లను విడిచి నేను బ్రహ్మమునే అగుచున్నాను.

నమః శబ్దమునకు రెండవ అర్థం – దాసుడను నేను, నేను దాసుడనని చెప్పుట నమః శబ్దానికి ఇంకొక అర్థం. సర్వభూతములకు ప్రభువు ఈశ్వరుడు కనుక సర్వభూతములు ఈశ్వరునికి దాసులని చెప్పబడింది.

మొదటి వ్యాఖ్యానములో ధర్మము, అర్థము, కామము, మోక్షము అను నాలుగు పురుషార్థాలు నెరవేరుట కొరకు ఈ సర్వదృశ్య ప్రపంచాన్ని విడిచిపెడుతున్నాను అని చెప్పబడింది. విడిచిపెట్టుట ఎందుకనగా జగదీశ్వరుడైన శివుని పొందుటకు. ముక్తి ప్రాప్తించుటకు జగద్గురువయిన పరమశివుని సర్వోపాధులకు (శరీరము మొదలయినవి) భిన్నముగా తెలుసుకొని తన మనస్సుచేత వివేక విచారము చేయాలి. ఓం నమశ్శివాయ మంత్రముచే తత్త్వమగు లక్ష్యాన్ని (శివుని) ధ్యానించాలి.

## పంచమ వ్యాఖ్యానం
## ఓం నమశ్శివాయ

సర్వమును భక్షించువాడు, సంహరించువాడు అని నమః శబ్దమునకు అర్థము పాణినీయసూత్రములచే ఏర్పడుచున్నది. శివ శబ్దానికి కూడా ఇదే అర్థం. (ఎవరిలో

సర్వము నిద్రించునో అతడు శివుడు). ఎవరియొక్క శ్రద్ధ ఎవరియందు ఉంటుందో అతడు అదే అవుతాడు. ఈవిధముగా నన్ను భావించి, ఓ శివా! నన్ను నీలో చేర్చుకో! అని ఓం నమశ్శివాయ మంత్రానికి అర్థం.

## ఆరవ వ్యాఖ్యానం
## ఓం నమశ్శివాయ

**'శి'** శబ్దము అవ్యక్తమును తెలియచేస్తోంది. **'వా'** శబ్దము నామరూపాలచేత వ్యక్తము చేయుచుండుటను తెలుపుతున్నది. (వా గతి గంధనయోః). నామరూపాలనగా ఆకాశము, వాయువు మొదలైన రూపాలు. బ్రహ్మయందు ఆసక్తి కలిగినవారిచేత కారణ బ్రహ్మము శివుడని చెప్పబడుచున్నది.

## ఏడవ వ్యాఖ్యానం
## ఓం నమశ్శివాయ

ఓ శివా! వేదములో ఉన్న "నువ్వు ఇది కాదు; ఇది కాదు (నేతి నేతి)" అనే నిషేధార్థముతో నువ్వు నమ అయి ఉన్నావు. నీ మంగళ స్వరూపము నాకు అగుగాక! ఎందుకంటే నేను అనమను, నమను అయిన ఉన్నాను.

## ఎనిమిదవ వ్యాఖ్యానం
## ఓం నమశ్శివాయ

ఓ పరమ కల్యాణరూపా! (శివాయ) నేను మాయచేత నిశ్చయంగా విద్యా విహీనుడిని అయి ఉన్నాను. (నమ) విద్య ఎవనికి లేదో అలాంటివాడు నమ. విద్యారహితుడనయిన నాకు ఈ కనిపించే ప్రపంచాన్ని ఆత్మ స్వరూపంగా (అనగా నీ రూపంగా) ప్రకాశింపచేయి.

## తొమ్మిదవ వ్యాఖ్యానం
## ఓం నమశ్శివాయ

నువ్వు జ్ఞానముచేత ఆనందస్వరూపాన్ని తెలిసికొంటున్నావు. నువ్వు స్వరూప ద్రష్టవి (శివాయ) మాయ నీయందు లేదు. అందుకే వేదాల ద్వారా నువ్వు **"నమః"** అను పేరుతో పిలువబడుచున్నావు.

**ఓం తత్ సత్**





శ్రీః

# శ్రీ శివమంగళాచరణసురభి

*వ్యాఖ్యాత : డా॥ తాడేపల్లి పతంజలి*

**శ్రీ శివాయ గురవే నమః**

("సంస్కృతాంధ్రకావ్యాలలోని ప్రథమ మంగళాచరణశ్లోకాల్లో శివసంబంధమైన వాటికి విస్తృతవ్యాఖ్య అందిస్తే పుస్తకరూపంలోకి తేవచ్చు" అని ప్రముఖ పండితులు, పెద్దలు శ్రీ రావి మోహనరావుగారు అక్టోబర్ 19, 2015 తేదీన నా ఫేస్‌బుక్ టైమ్ లైన్ పై ఒక సందేశం పంపారు. ఆ ప్రేరణను అనుసరించి నన్నెచోడుని కుమారసంభవ కావ్యంతో ఆ సత్కార్యం మొదలుపెడుతున్నాను. శివస్వామి నిరాటంకంగా ఈ రచనా కార్యక్రమాన్ని పూర్తిచేసే శక్తి నాకు ఇవ్వాలని హృదయపూర్వక అభ్యర్థన.)

**1**

నన్నెచోడుని **'కుమారసంభవం'** లోని మొదటి పద్యం ఇది.

**శ్రీవాణీంద్రామరేంద్రార్పిత మకుట మణిశ్రేణిధామాంఘ్రి పద్మా**
**జీవోద్యత్కేసరుం డాశ్రితజనలషితాశేషవస్తుప్రదుం డా**
**దేవాధీశుండు నిత్యోదితుడజుడు మహాదేవు డాద్యుండు విశ్వై**
**కావాసుం డెప్పుడున్ మా కభిమతములు ప్రీతాత్ముడై యిచ్చుగాతన్.**

**ప్రతిపదార్థము, భావవివరణ :** శ్రీవాణీంద్ర = శ్రీలక్ష్మి, సరస్వతి భర్తలచేత (విష్ణువు, బ్రహ్మలచేత); అమరేంద్రార్పిత = దేవతలకు ప్రభువయిన ఇంద్రునిచేత అర్పించబడిన; మకుట మణిశ్రేణిధామాంఘ్రి పద్మాజీవోద్యత్కేసరుండు = కిరీటములలోని మణుల వరుసకాంతుల చేత ప్రకాశిస్తున్న పాదపద్మములచే జీవము కలిగి ప్రకాశిస్తున్న ఆకరువులు కలవాడు;

శివునికి విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుడు నమస్కరిస్తున్నారు. ఆ సమయంలో వాళ్ల కిరీటాల కాంతులతో శివుని పాదాలు ప్రకాశించాయి. ఈ కాంతులు శివుని పాదపద్మములకు ఆకరువులు అని కవి మాట. ఆకరువు అంటే తామరదుద్దు లోనగువానిచుట్టునుండునది; శివుని పాదము తామర. ఆ కిరీట రత్న కాంతులు ఆ పాదానికి చుట్టూ దుద్దులా ఉన్నాయని కవి భావన.

ఆశ్రితజనలషితాశేషవస్తుప్రదుండు = ఆశ్రయించిన జనుల చేత కోరబడిన అనేకమైన కోరికలను ఇచ్చేవాడు. ఆశ్రయించిన భక్తుల కోరికలను శివుడు తీరుస్తాడని భావం;

దేవాధీశుండు = దేవతలకు అధిపతి; నిత్యోదితుడు = నిత్యమయిన వాక్కు కలవాడు. వేదము నిత్యమైనది.వేదములు శివుని వాక్కు అని భావము; అజుడు = పుట్టుక లేనివాడు; మహాదేవుడు = శ్రేష్ఠుడైన దేవుడు; ఆద్యుండు = సృష్టికి మొదటివాడు; విశ్వైకావాసుండు = సర్వసృష్టిలోను తాను ఒకటిగా కలిసిపోయి ఉండేవాడు. (సర్వము శివమయమని భావం); ఎప్పుడున్ = అటువంటి శివుడు ఎప్పుడు; మాకభిమతములు = మా కోర్కెలు; ప్రీతాత్ముడై యిచ్చుగాతన్ = సంతోషించిన మనస్సు కలవాడయి ఇచ్చుగాక!

**విశేషాలు :** నన్నెచోడుని గురువు జంగమ మల్లికార్జున శివయోగి. మొదటి పద్యంలో శివ స్మరణము ద్వారా గురువుగారిని కూడా నన్నెచోడుడు స్మరించుకొన్నాడు. కావ్యాన్ని శ్రీకారముతో మగణముతో ప్రారంభించే సంప్రదాయము ఇందులో కవి పాటించాడు.

అయితే కావ్యానికి సంబంధించిన మొదటి పద్యాలలో / శ్లోకాలలో మగణము తర్వాత రగణము రాకూడదని – అలా వచ్చే స్రగ్ధరా వృత్తాన్ని మొదటి పద్యంగా చెప్పటం వలన నన్నెచోడుని జీవితము అర్థాంతరంగా ముగిసిందని కొంతమంది చెబుతారు. దీనికి ఆధారముగా ఈ పద్యం చెబుతారు.

మగణమ్ము గదియ రగణము
వగవక కృతి మొదలు నిలుపువానికి మరణం
బగు నిక్కమంద్రు, మడియడె
యగునని యిది తొల్లి టెంకణాదిత్యుండనిన్. (అథర్వణచ్ఛందం)

అని ప్రసిద్ధి. నన్నెచోడుని ఇంకొకపేరు టెంకణాదిత్యుడు.

కాళిదాసు శాకున్తలము మొదట్లో **"యా సృష్టిః"** శ్లోకము రాసాడు. ఇది స్రగ్ధరా వృత్తమే. కాళిదాసుకి విపత్తు జరిగినట్లు ఎక్కడా లేదని కొంతమంది పెద్దలు ఈ వాదాన్ని ఖండించారు.

స్రగ్ధర గంభీరమైన వృత్తం. స్తోత్రాలకు ఎక్కువ ఈ వృత్తాన్ని వాడతారు. మయూరుడు స్రగ్ధరావృత్తాలతో **'సూర్యశతకం'** రచించాడు.

మ, ర, భ, య, న, న, య, య, య అనే గణాలు వరుసగా వస్తాయి.

మొదటి అక్షరానికి ఎనిమిదవ, పదిహేనవ అక్షరాలతో యతి మైత్రి. తిక్కనగారు **"మౌళిస్రక్సంగ రంగ న్మధుకరపటలీ మానసా కృష్టి విద్యా"** (విరాట. 3.78) అని అందంగా విరాటపర్వంలో స్రగ్ధర వృత్తము వాడారు.

శివుడు ఎప్పుడు మా కోర్కెలు; సంతోషించిన మనస్సు కలవాడయి ఇచ్చుగాక! అనుటలో ఒక చమత్కారముంది. భక్తులు కోరే కోర్కెలు దేవునికి ఇష్టమయ్యేటట్లు ఉండాలి. అంటే చెడు కోర్కెలు దేవుని కోరకూడదని ఒక అర్థం. ఎవరికయినా ఇచ్చేటప్పుడు సంతోషించే మనస్సుతో ఇవ్వాలని ఇంకో సందేశం. **"మహాంశ్చాసౌ దేవశ్చ మహాదేవః"** శ్రేష్ఠుడైన దేవుడు మహాదేవుడు.

తారకాసురసంహారము జరగటానికి కుమారస్వామి జననము కావాలని దేవతల కోర్కె. ఇది కావ్యవస్తువు కూడా. కావ్యవస్తువును మొదటి పద్యంలో పేర్కొనటం మహాకవుల సంప్రదాయం. నన్నెచోడుడు ఆశ్రయించిన భక్తుల కోరికలను శివుడు తీరుస్తాడని (ఆశ్రితజనలషితాశేషవస్తుప్రదుండు) కావ్య వస్తువు తన మొదటి పద్యంలో వ్యంగ్యంగా తెలిపాడు. ఈ పద్యములో శివుని బాహ్యరూపవర్ణన లేదు.

నిత్యోదితుడు (= నిత్యమయిన వాక్కు కలవాడు) అజుడు (= పుట్టుక లేనివాడు) మొదలయిన పదాల ద్వారా శివుని అంతస్స్వరూపవర్ణన ఈ పద్యంలో జరిగింది. సగుణోపాసనకంటె నిర్గుణోపాసన ఉదాత్తమైనది. ఈ పద్యము కూడా. ❀

## 2

పరమశివునికి పెండ్లి జరుగుతోంది. ఆయన ఒంటినిండా ఆభరణాలు పెట్టారు. కాబోయే భర్తగారి ఆ ఆభరణాల సమూహ సౌందర్యం చూసి హిమవంతుడనే కొండకు పుట్టిన కుమార్తె పార్వతీదేవి మనస్సు అనే వీథి కంపించిపోయింది. రాతికి పుట్టిన అమ్మాయి మనస్సు కూడా రాయిలా కఠినంగా ఉండాలి కదా! కాని ఆ రాతిలాంటి

చలించని మనస్సు కూడా శివుని అందానికి కదిలిపోయింది. అంటే ఇక శివుని అందం ఎంత బాగుంటుందో ఊహించండి! హృదయంలోని కదలికకు ఆమె కొప్పు విడిపోయింది. నెమలిపింఛము అయింది. నెమలంటే పాములకు భయం కదా! అందువల్ల శివుని ఆభరణాల మధ్యలో ఉన్న కొన్ని చిట్టి పాములు ఆ నెమలి పింఛం చూసి, భయంతో తలలు దించుకొన్నాయి. ఇదంతా గమనిస్తున్నాడు శివయ్య, ఆయనకి నవ్వు వచ్చింది. అది మామూలు నవ్వుకాదు. జరుగుతున్న సంఘటనలను బాగా ఆమోదించిన నవ్వు. అలా నవ్వే, సుఖాలను ఇచ్చే ఆ శంభుడు – మాకు ఎల్లప్పుడు అధిక సౌఖ్యాలు ఇచ్చుగాక!

ఈ మాటలు కూచిమంచి తిమ్మకవి (18వ శతాబ్దము) **"రసికజనమనోభిరామము"** అనే కావ్యంలో ప్రారంభంలో చేసిన పద్యకాంతులు. అసలు పద్యమిది.

**శ్రీ మీఱం దన పెండ్లి వేళ నొడలం జెన్నారు భూషామణి**
**స్తోమంబుం బొడగాంచి శైలసుతచేతో వీథి గంపింప ద**
**ద్భామా రత్నము కొప్పు బర్హమని యప్పాముల్దలల్వ్రంప న**
**త్యామోదంబున నవ్వు శంభుడిడు మా కశ్రాంత సౌఖ్యోన్నతుల్.**

శ్రీ మీఱన్ = కాంతి అతిశయించేటట్లుగా; తన పెండ్లి వేళన్ = తన పెండ్లి సందర్భములో; ఒడలన్ = శరీరమందు; చెన్నారు = అందమగు; భూషామణిస్తోమంబున్ = మణుల అలంకారములు; పొడగాంచి = చూసి; శైలసుత = పార్వతి; చేతో వీథి గంపింప = మనస్సు అనే వీథి చలించగా; తత్ + భామా రత్నము కొప్పు = భామలలో శ్రేష్ఠురాలయిన ఆ పార్వతీదేవి తలయందు దోపిన వెంద్రుకలముడి (విడివడి); బర్హమని = నెమలి పురి అని; అప్పాముల్ = ఆ + పాముల్ = శివుని ఆభరణాలలో ఉన్న పాములు; తలల్వ్రంపన్ = భయముతో తలలు వంచుకోగా; అత్యామోదంబున నవ్వు = బాగా సంతోషముతో నవ్వు; శంభుడు = శివుడు; మాకు = మా అందరికి, (మన అందరికి) అశ్రాంత = ఎప్పుడు; సౌఖ్యోన్నతుల్ = గొప్పవైన సౌఖ్యములు; ఇడు = ఇచ్చుగాత.

**విశేషాలు :**

1. ఈ పద్యములో వర్ణించిన శివుడు కుక్కుటేశ్వరుడు.

కుక్కుటమంటే కోడి. తూర్పుగోదావరి జిల్లాలో పిఠాపురంలో కుక్కుటేశ్వర ఆలయం

ఉంది. రసికజనమనోభిరామాన్ని ఈ కుక్కుటలింగప్రభుమణికి తిమ్మకవి అంకితమిచ్చాడు.

2. ఈ కావ్యము రసిక జనులను మెచ్చుకొనే ఇతివృత్తంతో ఉంది. అందుకే నాంది ప్రస్తావనలో కూడా రసిక జన ఆహ్లాదకరమైన వర్ణన కవి చేసాడు.

3. అలంకారము – అప్రస్తుత వస్తువు యొక్క గుణము, క్రియ మొదలగువాని సంబంధముచేత ప్రస్తుత వస్తువును అప్రస్తుతముగా తలచుట ఉత్ప్రేక్షాలంకారం. ఉత్ప్రేక్షలో ధర్మము అప్రసిద్ధంగా ఉంటుంది. ఉపమానములో ధర్మము ప్రసిద్ధం. ధర్మాన్ని అనుసరించి ఈ రెండలంకారాలకు భేదము వస్తుంది. ఉత్ప్రేక్షము వాచ్యమని, గమ్యమని రెండు రకాలు.

తలంచెద, ఎంచెద, సత్యము, అదియో అనునట్లు – మొదలయినవి ఉత్ప్రేక్షావాచకాలు. ఉత్ప్రేక్షావాచకాలు ఉంటే **వాచ్యోత్ప్రేక్ష,** లేకపోతే **గమ్యోత్ప్రేక్ష;**

ఈ పద్యంలో బర్హమని అనుపదంలో "అని" అను ఉత్ప్రేక్షావాచకము ఉంది కనుక ఇది **వాచ్యోత్ప్రేక్ష.**

4. శమ్ అంటే సుఖం. అది ఇచ్చేవాడు కనుక శంభుడు అని శివునికి పేరు. "శంభుడిడు మా కశ్రాంత సౌఖ్యోన్నతుల్" అనుచోట శంభు శబ్దము సాభిప్రాయం కనుక **పరికరాలంకారం.**

5. శివుని ఒంటిమీద రత్నాలున్నాయని కవి ఒక పక్క వర్ణిస్తూ, పార్వతిని భామారత్నము అన్నాడు. ఇద్దరు అన్ని రకాలుగా సరిపోయిన, సమానమయిన జంట అనే అర్థం చదివే పాఠకులలో కలగటానికి ఆహ్లాదకరమయిన భామారత్న విశేషణం కవి వాడాడు.

6. పిఠాపురం సంస్థానాధీశుల ఆదరణ పొందినప్పటికి, తన కావ్యాన్ని శివునికి అంకితమిచ్చిన వ్యక్తిత్వం కూచిమంచి తిమ్మకవిది. ❀

## 3

ఈ పద్యము శ్రీనాథుని **"కాశీఖండము"** లోనిది.

> **శ్రీ కాశీనగరాధిరాజ్యపదవీ సింహాసనాధ్యాసి లో**
> **కైక గ్రామణి విశ్వనాథుడు విశాలాక్షీ మనోభర్త సు**
> **శ్లోకుందొడ్డయ యల్ల భూవర తనూజున్ వీర భద్రేశ్వర**
> **క్ష్మా కాంతున్ జగనొబ్బగండని మహైశ్వర్యాన్వితున్ జేయుతన్.**

"భళా శ్రీనాథా! మా మీద అనుగ్రహంతో, మా కోరికను మన్నించి కాశీఖండాన్ని మా సోదరుడు వీరభద్రునికి అంకితమిస్తూ చక్కటి పద్యంతో గ్రంథాన్ని మొదలుపెట్టారు. మీద్వారా గ్రంథారంభములో మీరు చేసిన శివ ప్రార్థన వివరణ కూడా తెలుకొందామని మా కోరిక."

"రెండవ శివుడైన వేమారెడ్డి గారి కోరిక కాదంటానా! వేమ విభా! అవధరించండి. శ్రీ కాశీనగరాధిరాజ్యపదవీ సింహాసనాధ్యాసి మోక్షమనే లక్ష్మికి ఒక ఆకారము ఇస్తే దానికి పేరు కాశి. ఆ కాశీపట్టణము యొక్క ఆధిపత్యానికి చెందిన జ్ఞానముతో కూడుకొన్న సింహాసనాన్ని శివుడు అధిష్ఠించి ఉన్నాడు."

"కాశీరాజ్య సింహాసనాన్ని శివుడు అధిష్ఠించి ఉన్నాడు అని భావం. కదా!"

"అవును.."

"మరి సింహాసనం జ్ఞానంతో కూడుకొనటం ఏమిటి? అందులోనూ ఆధిపత్యానికి చెందిన జ్ఞానము..."

"కల్పాంతములో – ప్రళయములో అన్నీ నశిస్తాయి. కాని ప్రళయములో కూడా నశించక శివుని త్రిశూలముపై వెలుగొందే ఏకైక పట్టణం కాశి. మరి.. మిగతా ఆధిపత్యాలకు, శివుని ఆధిపత్యానికి తేడా ఉన్నట్టే కదా! మిగతా రాజుల అధికారాలన్నీ పరిమిత కాలం వరకు. శివుని పరిపాలన కల్పాంతము... కాదు.. కాదు.. కల్పాంతములకు మించి నిరంతరంగా కొనసాగుతుంటుంది. అందుకే శివుని 'పదవీ సింహాసనాధ్యాసి' అన్నాను.

పదవీ అంటే జ్ఞానం. పదం వేదయతీతి పదవీ. సింహాసనమంటే జ్ఞాన సింహాసనము. మాయ నశిస్తుంది. జ్ఞానము నశించదు. కాశృ దీప్తౌ – ప్రకాశించే కాశీనగరాన్ని జ్ఞానముతో ప్రకాశించే సింహాసనము మీద కూర్చుని శివుడనే రాజు పరిపాలిస్తుంటాడు. తన దగ్గర ఉన్నదానినే రాజు ఇతరులకు పంచిపెడతుంటాడు. కాశీ నగరము అనే పేరు తలుచుకొన్నవారికి, ఆ పట్టణంలో తనని దర్శించుకొన్నవారికి పరమశివుడు అఖండ మోక్ష జ్ఞానాన్ని పంచిపెడుతుంటాడు."

"అద్భుతం శ్రీనాథ మహాకవీ! ఇక లోకైక గ్రామణి...."

"లోక+ఏక గ్రామణి. లోకానికంతటికీ ఒకే ఒక ప్రభువు శివుడు అని అర్థం.

"విశాలాక్షీ మనోభర్త"

విశాలమైన కన్నులు కలిగినది పార్వతీదేవి. ఆమె మనస్సుకు అధికారి శివుడని పైకి అర్థం. లోపల నిగూఢార్థం ఉంది. కళ్లు మాయ చేస్తాయి. అందునా – విశాలమయిన కళ్లు లోకాన్ని ఇంకా మాయలో ముంచుతాయి. మనస్సుని ఒక ఆట ఆడిస్తాయి. ఆ విశాలాక్షి మనస్సులో విశ్వాన్ని సృష్టించాలన్న ఆలోచన శివుడు ఇస్తాడు. అప్పుడు అమ్మ కళ్లతో జీవుల మనస్సులను మాయా ప్రపంచంలో ఉరకలు వేయిస్తుంది. శివుని ఆజ్ఞ అయిన వెంటనే అమ్మ కళ్ళు మూస్తుంది. ఆమె మనస్సులో నుంచి పుట్టిన మాయా ప్రపంచం తిరిగి ఆమెలోనే లీనమవుతుంది. ఆమె మనస్సును ఇలా చేయమని చెప్పే అధికారి కనుక 'విశాలాక్షీ మనోభర్త' అని శివుని విశేషణము. విశాలాక్షి, అన్నపూర్ణ ఇద్దరూ పార్వతీదేవి రూపాలే. ఒకరు తపోమూర్తి. ఇంకొకరు (అన్న) ప్రసాదమూర్తి."

"అబ్బా! విన్నకొద్దీ మీ వ్యాఖ్యానము వినాలనిపిస్తోంది. ఎన్ని విషయాలు చెబుతున్నారు!?"

"శివానుగ్రహం. ఇటువంటి శివుడు – వీరభద్రారెడ్డి అనే మహాప్రభువుని గొప్పదయిన ఐశ్వర్యముతో కూడినవానిగా చేయమని మహైశ్వర్యాన్వితున్ జేయుతన్" అని ముక్తాయింపు ఇచ్చాను.

"అష్ట – ఐశ్వర్యములు 1. దాసీజనము, 2. భృత్యులు, 3. పుత్రులు, 4. మిత్రులు, 5. బంధువులు, 6. వాహనము, 7. ధనము, 8. ధాన్యములు – మా తమ్ముడు వీరభద్రారెడ్డికి ఇవ్వమని ప్రార్థన. అవునా!?"

"అవేకాదు ప్రభూ! ఈశ్వరస్య భావం ఐశ్వర్యమ్. ఈశ్వరుని యొక్క భావం ఐశ్వర్యం. నిగ్రహము, అనుగ్రహము కలిగిన ఈశ్వరుని శక్తి ఐశ్వర్యము. అది పుష్కలంగా వీరభద్రారెడ్డి అనే మహాప్రభువుకి ఇమ్మని ప్రార్థన.

వీరభద్రారెడ్డి ప్రభువు సుశ్లోకుడు – మంచి కీర్తికలవాడు. దొడ్డయ యల్లవర భూతనూజుడు – దొడ్డారెడ్డి అను ప్రభువు కొడుకు. జగనొబ్బగండడు – అను బిరుదము కలవాడు. మొత్తముమీద ఈ పద్య తాత్పర్యము ఇది.

"ఆ కాశీపట్టణము యొక్క ఆధిపత్యానికి చెందిన జ్ఞానముతో కూడుకొన్న సింహాసనాన్ని అధిష్ఠించి ఉన్నవాడు, లోకానికంతటికీ ఒకే ఒక ప్రభువు, విశాలమైన కన్నులు కలిగిన పార్వతీదేవి మనస్సుకు అధికారి అయిన విశ్వనాథుడు – మంచి కీర్తి కలిగిన, దొడ్డారెడ్డి అను ప్రభువు కుమారుడైన, జగనొబ్బగండడు – అను బిరుదము

కలిగిన వీరభద్రారెడ్డి ప్రభువుకు చక్కటి ఐశ్వర్యము ఇచ్చి ఆశీర్వదించుగాక!"

"సెహబాస్! కవిసార్వభౌమా! ఈ మంగళాచరణ పద్యంలో కాశీఖండ కావ్యానికి సంబంధించిన జ్ఞానమనే వస్తువును, కాశీ గొప్పతనాన్ని చక్కగా తెలియచేసారు."

"ఈ పద్యంలో **పరికరాలంకారం** ఉంది. సరిపోయే పదం, సాభిప్రాయమైన పదం వాడితే అది పరికరాలంకారం. శివునికి నేను ప్రయోగించిన లోకైక గ్రామణి, విశ్వనాథుడు, విశాలాక్షీ మనోభర్త మొదలైన విశేషణాలన్నీ సార్థకమైనవి. లోకానికంతటికి ఒకే ఒక ప్రభువు అయిన శివుడు ఈ ప్రభువుకి ఐశ్వర్యము అనుగ్రహించాలని చెప్పటంలో ఇచ్చేవాడి గొప్పతనాన్ని చెప్పాను."

"మీ పద్యంలో ఇది ఉంది అని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు శ్రీనాథ మహాకవి. లేనిదేదో వెతుక్కోవటం కష్టం. ధన్యోస్మి." 

## 4

ఇది బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు **యామావిక** కావ్యరచనలో రచించిన మొదటి పద్యం.

**శ్రీవిద్యా మహనీయ యోగమున నిర్ణిక్తాంతరంబైన చే**
**తోఽవస్థానమునన్ నిరంతరము సోహంహంస భావంబుతో**
**భావింపంబడు నమ్మహేశ్వర పరబ్రహ్మమ్ము మమ్మేలు స**
**త్త్వావష్టంభ సుఖానుభూతి భవ భావాభావభానమ్ములన్.**

**భావం :** ఓ శివదేవా! మహేశ్వరా! శ్రీవిద్యామంత్రముతో కలిసి అంతః పరిశుద్ధమయిన (నిర్ణిక్తము), మనస్సు ఎప్పుడూ అప్రయత్నపూర్వకంగా హంస గాయత్రి చేస్తూ, నిన్ను స్మరిస్తూ ఉంటుంది. భవము, భావము, అభావముల కాంతులలో – జ్ఞానముయొక్క ఆధారము చేత లభించే సుఖముయొక్క అనుభూతి మాకు ప్రసాదించి మమ్మలిని రక్షించు.

**విశేషాలు :** శ్రీవిద్యా మహనీయ యోగమున శ్రీవిద్య అంటే త్రిపుర సుందరీ మంత్రముతో కూడిన ఒక మహావిద్య.

**"క–ఏ–ఈ–ల–హ్రీం–హ–స–క–హ–ల–హ్రీం–స–క–ల–హ్రీం"** అనే మంత్రంతో దేవిని ఉపాసించడం శ్రీవిద్య. ఇదే పంచదశాక్షరీమహామంత్రం.

ఎవరయినా దైవాన్ని ధ్యానించాలంటే ముందు ప్రదేశాన్ని శుభ్రం చేస్తారు.

శాస్త్రిగారు మనస్సుని శ్రీవిద్యా మహామంత్రంతో పరిశుద్ధము చేస్తున్నానని వ్రాసారు. వారి శ్రీవిద్యోపాసన జగత్ప్రసిద్ధమైనది.

**అంతరంబైన చేతోऽవస్థానమునన్**

శ్రీవిద్యోపాసన పదేపదే చేయటం వల్ల దానితో మనస్సు అంతఃపరిశుద్ధ మయింది. "అంతఃప్రజ్ఞుడు" అని ఒక మాట ఉంది. ఆత్మజ్ఞానం కలిగిన వ్యక్తి అంతః-ప్రజ్ఞుడు. శ్రీవిద్యోపాసనవల్ల ఆత్మజ్ఞానం లభిస్తుందని భావం.

ఇక్కడ శాస్త్రిగారు చేతోऽవస్థానము అని ఒక సమాసం ప్రయోగించారు. "మనస్సుకు సంబంధించిన ఉనికి" అని దీని అర్థం. ఇది విశ్లేషిద్దాం.

మనో, బుద్ధి, చిత్త, అహంకారంలతో కూడిన అంతఃకరణాన్ని **అంతఃకరణ-చతుష్టయం** అంటారు. ఇందులో మనస్సుది వాయుతత్త్వం కావటం చేత నిరంతరమూ చలిస్తుంటుంది. సంకల్ప, వికల్పములు దీని కార్యములు. అనిశ్చితస్థితి. చంద్రుడు అధిష్టానదేవత.

**బుద్ధి :** ఇది అగ్ని అంశము కలది. నిశ్చయం, మంచి చెడుల విచక్షణాజ్ఞానం దీని లక్షణం. స్వంత సామర్థ్యం కలది.

**చిత్తము :** ఇది జలాంశము కలది. మందగమనం దీని స్వభావం. శరీరములోని సర్వేంద్రియములను చలింపజేస్తుంది.

**అహంకారం :** పృథ్వీ అంశం కలిగి కాఠిన్యస్వభావంతో నేను, నాది అను అభిమానమును కల్గిస్తుంది.

ఈ అంతఃకరణచతుష్టయ విజృంభణ ఆగి, నిర్విషయస్థితి కలిగేటంతవరకు అంతరశుద్ధి కలుగదు. అంతఃకరణశుద్ధి కానంతవరకు ఆత్మతత్త్వం గ్రహించలేరు. తన మనస్సు అంతరశుద్ధి పొందిందనే విషయాన్ని శాస్త్రిగారు అంతర శబ్దంతో సూచిస్తున్నారు.

**నిరంతరము సోహంహంస భావంబుతో**

గాలి లోపలకు ప్రవేశిస్తున్నప్పుడు **"హం"** అని శబ్దం. బయటకు పోయేటప్పుడు **"సో"** అని ధ్వని వస్తుంది. అనగా మన ఉచ్ఛ్వాస నిఃశ్వాసాల్లో **"హంసో"** అన్న ధ్వని పుట్టుచున్నది. సంస్కృతభాషలో పదము చివర ఉండే ఓకారము - విసర్గ యొక్క

వికారము కనుక ఉచ్ఛ్వాస నిఃశ్వాసాలు "హంసః" అని శబ్దిస్తున్నట్లుగా భావించాలని పెద్దలు చెప్పారు. ఉచ్ఛ్వాసము తరువాత నిఃశ్వాసము కాకుండా – నిఃశ్వాసము తరువాత ఉచ్ఛ్వాసము లెక్కిస్తే "సోహం" అవుతుంది. సోహం మంత్రాన్ని ఉచ్ఛ్వాస నిఃశ్వాసాలతో సంబంధించడమే **అజపాగాయత్రి** లేదా, **హంసగాయత్రి** అని కూడా అంటారు.

"ఖేలతి పిణ్డాణ్డే. / ఖేలతి పిణ్డాణ్డే. / భగవాన్ – ఖేలతి పిణ్డాణ్డే." అనే కీర్తనలో **సదాశివబ్రహ్మేంద్రులు, హంసః సోహం హంసః సోహం హంసః సోహం సోహమితి** – బ్రహ్మాండమంతటా నిండియున్న భగవంతుడు నాయీ పిండాండములో – దేహములో హంసః సోహం అంటూ ఆడుచున్నాడు–" అని పరవశించారు. కలియుగ యోగి పుంగవులైన తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు కూడా తన మనస్సు నిరంతరము సోహం హంస భావంబుతో నిండి ఉందన్నారు.

**భవ భావాభావభానమ్ములన్**

భవము, భావము, అభావముల కాంతులు అని ఒక విచిత్ర పద సంయోజనము చేసారు శాస్త్రిగారు.

భవము అంటే సంసారము సత్త. భావము అంటే అభిప్రాయము మనోవికారము;

1. రతి, 2. హాసము, 3. శోకము, 4. క్రోధము, 5. ఉత్సాహము, 6. భయము, 7. జుగుప్స, 8. విస్మయము, 9. వీరము, 10. కారుణ్యము. (శివతత్త్వరత్నాకరము) అని **పది రకాలైన భావక తత్త్వాలు.**

**అభావాలు నాలుగు :** 1. ప్రాగభావము, 2. ప్రధ్వంసాభావము, 3. అత్యంతాభావము, 4. అన్యోన్యాభావము.

ఏదైనా ఒక వస్తువు తయారు కావడానికి ముందు ఆ వస్తువు గురించి ఏ భావం లేకపోవడం **ప్రాగభావం**. ఘటమో, మరొక వస్తువో ధ్వంసమైపోయినప్పుడు ఆ వస్తువు రూపం కనిపించకపోవడం **ప్రధ్వంసాభావం**. ఒక వస్తువును గురించిన రూపం ఎప్పుడూ లేకపోవడం (ఉదాహరణకు గాలికి రూపం లేదు) **అత్యంతాభావం**. రెండు విభిన్న వస్తువులు ఉన్నప్పుడు 'అది ఇది కాదు, ఇది అది కాదు' అనే తేడా తెలియడం **అన్యోన్యాభావం**. ఈ అభావ చర్చ తర్కశాస్త్రానికి సంబంధించింది.

చుట్టు ఉన్న ప్రపంచాన్ని చూస్తున్నప్పుడు జీవునికి ఆ ప్రపంచంలో జీవిస్తున్న జీవునిపై మొదట సంసార కాంతి పడుతుంది. ఇది భావ కాంతి. తరువాత తన

పూర్వజన్మ సంస్కారము వల్ల గురు శుశ్రూష వల్ల, చదివిన పుస్తకాల వల్ల ఈ సంసారముపై జీవునికి భావము ఏర్పడుతుంది. ఇది భావ కాంతి. జపంతో ఎద ఎదుగుతున్నకొద్దీ – అస్తిత్వంలో ఇమిడియున్న అద్వైతాన్ని కనుగొనే ప్రయత్నంలో తర్క విశ్లేషణ ప్రారంభ మవుతుంది. ఇది అభావకాంతి.

జీవునికి సంబంధించిన ఈ కాంతుల రహదారులలో ప్రయాణించే మాకు జ్ఞానము యొక్క ఆధారము చేత లభించే సుఖముయొక్క అనుభూతి ప్రసాదించమని జ్ఞానదాయకుడైన శివ పరబ్రహ్మానికి శాస్త్రిగారి వేడికోలు.

**యామావిక** కావ్యంలో ఒక యోగి సంచారము, భోగినీ, యోగ సంవాదము – ఇటువంటి కథాంశాలు ఉన్నాయి. కావ్య వస్తువుకు సంబంధించిన ఈ విశేషాలను భవభావాభావభానమ్ములన్ అను పదసంయోజనములో శాస్త్రిగారు వ్యంగ్యంగా తెలియచేసారు. ❁

## 5

ఇది కూచిమంచి జగ్గకవి **చంద్రరేఖావిలాపం** ప్రారంభంలో రచించిన శివస్తుతి.

**శ్రీకంఠుండు, భుజంగ భూషణుడు, భస్మీభూత పంచాస్త్రు ద**
**స్తోకాటో ప బలప్రతాప పుర రక్షోదక్ష సంశిక్షణుం**
**డాకాశోజ్జ్వల కేశపాశుడు, త్రిశూలాంకుండు, రుద్రుండు తా**
**వీకం జింతలపాటి నీల నృపతిన్ వీక్షించు నేత్రత్రయిన్.**

**ప్రతిపదార్థము :** శ్రీకంఠుండు = విషమ కంఠమునందు కలవాడు (దేహములో వ్యాపించేది విషము), భుజంగ భూషణుడు = పాములు భూషణముగా కలవాడు (వంకరగా పోయేది కాబట్టి పాముకి భుజగము అని పేరు), భస్మీభూత పంచాస్త్రుడు = మన్మథుని అయిదు బాణాలను బూడిద చేసినవాడు. (మన్మథుని అయిదు బాణముల వరుస రెండు రకాలుగా ఉంది. 1. అరవిందము, 2. అశోకము, 3. చూతము, 4. నవమల్లిక, 5. నీలోత్పలము. ఒక వరుస. 1. సమ్మోహనము, 2. ఉన్మాదము, 3. శోషణము, 4. తాపనము, 5. స్తంభనము. అని రెండో వరుస)

అస్తోకాటోప బలప్రతాప పుర రక్షోదక్ష సంశిక్షణుండు = అల్పము కాని, వేగము, బలము, ప్రతాపము నిండిన దక్షులైన త్రిపురాసురులను శిక్షించినవాడు. తారకుని కుమారులయిన త్రిపురాసురులు ముగ్గురు. 1. విద్యున్మాలి, 2. తారకాక్షుడు, 3.

కమలాక్షుడు. వీరు గొప్ప తపస్సుచేసి శివుని దయతో – ఇనుముతోను, బంగారంతోను, వెండితోను – చేయబడిన మూడు తిరిగే పట్టణాలను పొంది లోకాలను నాశనం చేసేవారు. విష్ణుప్రేరణతో శివద్వేషులయిన వీరిని శివుడు యుద్ధముచేసి సంహరించాడు.

ఆకాశోజ్జ్వల కేశపాశుడు = ఆకాశమంత పొడుగైన ప్రకాశించే కేశపాశము కలవాడు (కాశము జుట్టుగా గలవాడు.), త్రిశూలాంకుండు = త్రిశూలము పొందిన దేవుడు (త్రిశూల ధారి), రుద్రుండు = దుష్టులను దుఃఖింపచేసే రుద్రుడు, తా వీకన్ = తాను విజృంభించి, ఉత్సాహముతో, చింతలపాటి నీల నృపతిన్ = చింతలపాటి నీల మహారాజును, నేత్రత్రయిన్ = మూడు కళ్లతో, వీక్షించు = ఒక చూపు చూడవలసినది.

**తాత్పర్యము :** సుగమము

**విశేషములు :** ఏ కావ్యంలో అయినా శివుడిని దయ చూడమని ప్రార్థిస్తారు. కాని ఈ కావ్యంలో శివుడిని మూడో కంటితో కృతిపతిని ఒక చూపు చూడమని కవి ప్రార్థిస్తున్నాడు. దానికి కారణాలున్నాయి. కృతిపతి నీలాద్రిరాజు మొదట సగౌరవంగా జగ్గకవిని ఆహ్వానించి పుస్తకం రాయమన్నాడు. "చంద్రరేఖా విలాసం" అని జగ్గకవి పేరు పెట్టాడు. తీరా పుస్తకం పూర్తయిన తర్వాత జగ్గకవికి గౌరవమివ్వకుండా తిరస్కరించాడు. జగ్గకవికి ఒళ్ళు మండింది. "చంద్రరేఖావిలాసాన్ని" "చంద్రరేఖా విలాపం"గా మార్చాడు. కవులకి, కళాకారులకి ఇచ్చిన మాటని ఎలా నిలబెట్టుకోవాలో, కూచిమంచి జగ్గకవి లోకానికి హెచ్చరికగా ఈ పుస్తకంద్వారా నేర్పాడు.

కృతిపతి నశించాలని కోరుకొనే ఈ నాందీ పద్యంలో ఉగ్రరూపం ధరించిన శివుని విశేషణాలు ఉన్నాయి. అధిక్షేపకావ్యంగా పేరొందిన ఈ కావ్యంపై ఆచార్య వెలుదండ నిత్యానందరావుగారు పండిత ప్రశంసావహంగా పరిశోధన చేసారు. ఇటీవలే ఈ కావ్యము రావిమోహనరావుగారిచే చక్కగా ముద్రింపబడినది. ❀

**6**

పాల్కురికి సోమనాథుడు **బసవపురాణము**లో శివగురుని ప్రార్థించిన ద్విపద పంక్తులు ఇవి.

**శ్రీ గురుదేవు నంచితగుణోత్తంసు,**
**యోగీంద్రహృదయపయోజాతహంసుఁ,**
**బరమకృపామూర్తి, భక్తజనార్తి**
**హరుఁ ద్రిజగత్స్ఫూర్తి, నానందవర్తి.**

భవరోగవిచ్ఛేది, భక్తవినోది,
శివతత్త్వసంపాదిc, జిరతరామోది,
నిత్యస్వరూపు, నుస్నీలత్రపుతాపుc,
ప్రత్యయగతపాపు, భక్తప్రదీపు,
భావనాతీతు, సద్భావనోపేతు,
సావయవఖ్యాతు, నమితు, నజాతు,
నాద్యంతరహితు, వేదాంతార్థసుహితు,
విద్యాత్మసహితు, సంవిత్సౌఖ్యమహితు,
భక్తపరాధీను, భక్తనిధాను,
భక్తసమాధాను, భక్తావధాను,
భక్తపరంజ్యోతి, భక్తవిభూతి,
భక్తదుఃఖారాతి, భక్తానుభూతి,
భక్తప్రజాత్రాణు, భక్తధురీణు,
భక్తజనప్రాణుc, బరమకళ్యాణు,
మన్మనోరమ్యు, నిర్మలభావగమ్యు,
జిన్మయు, సౌమ్యు భజించి, కీర్తించి

**1. శ్రీగురుదేవునంచిత గుణోత్తంసు**

శ్రీ = ఇదిదేవతలకూ, పెద్దలకూ గౌరవ సూచక శబ్దం; గురుదేవున్ = గురువయినదేవునిని, దేవుడయిన గురువుని (కట్టకూరి పోతిదేవర); అంచితగుణోత్తంసు = పూజింపబడినగొప్పవానిని (కీర్తిస్తాను.)

**2. యోగీంద్ర హృదయ పయోజాతహంసు**

యోగీంద్ర = యోగాభ్యాసము జేయు పురుషులలో గొప్పవారి; హృదయ పయోజాత = హృదయములను పద్మములకు; హంసు = సూర్యుడు.

పద్మాలను సూర్యుడు వికసింపచేసినట్లు, తనను కొలిచే యోగుల హృదయాలను శివుడు కాంతితో నింపుతాడని భావము.

**3. పరమ కృపామూర్తి, భక్త జనార్తి హరు**

పరమ కృపామూర్తి = శ్రేష్ఠుడయిన దాయశాలి; భక్తజనార్తి హరు= తనను

కొలిచే భక్తుల కష్టములను హరించేవాడు.

**4. హరుఁ ద్రిజగత్స్ఫూర్తినానందవర్తి**

త్రిజగత్స్ఫూర్తి = 1. స్వర్గము, 2. భూమి, 3. పాతాళము అను మూడు లోకాలలో తోచువాడు, ప్రకాశించువాడు; అనందవర్తి = ఆనందమునందు ప్రవర్తించువాడు. శివుడు తనను కొలుచువారికి ఆనందాన్ని ఇస్తాడని భావము.

**5. భవరోగ విచ్ఛేది, భక్త వినోది**

భవరోగ విచ్ఛేది = పుట్టుక, సంసారమనే రోగాన్ని ఖండించేవాడు; భక్త వినోది = భక్త వినోదము కలవాడు. శివుడు తనను ప్రార్థించేవారికి మరలా జన్మను ఇవ్వడని "భవరోగ విచ్ఛేది" అను సమాసానికి భావము.

**6. శివతత్త్వ సంపాది, చిరతరామోది**

శివతత్త్వ = జిజ్ఞాసువులకు సైతం అందినట్టే అంది, అగోచరమయ్యే మహా మూర్తిమంతమైన తత్త్వం శివతత్త్వమును; సంపాది = గడించినవాడు (శివునికి, గురువుకు అభేదము కనుక ఈ విశేషము సోమనాథుని గురువుకు కూడా అన్వయిస్తుంది.); చిరతరామోది = బహుకాలమునుండి భక్తుల ఆమోదము కలవాడు. భక్తుల సంతోషము కలవాడు. శివుడు తనను ఆరాధించే భక్తులకు ఎప్పటినుండియో సంతోషము కలిగిస్తున్నాడని భావము.

**7. నిత్య స్వరూపు నున్మీలత్ప్రతాపు**

నిత్యస్వరూపున్ = శివుడు శాశ్వతమైన స్వరూపము కలవాడు; ఉన్మీలత్ = వికసింపచేసిన; ప్రతాపు = ప్రతాపము కలవాడు. శివుడు భక్తుల కష్టాలను పోగొట్టడంలో సమర్థుడని భావము.

**8. ప్రత్యయగత పాపు, భక్త ప్రదీపు**

ప్రత్యయగత పాపు = తనను నమ్మటం వలన పోయిన భక్తుల పాపములు కలవాడు, తనను నమ్మినవారి పాపములను శివుడు పోగొడతాడని భావము; భక్త ప్రదీపు = భక్తులందు దీపముగా వెలిగేవాడు లేదా భక్తులకు దీపముగా దాని చూపించేవాడు.

పరస్పరవిరుద్ధము లయినప్పటికి నూనె, ఒత్తి, అగ్ని మూఁడు కలిసి

లోకోపకారము చేస్తాయి. దీనిని **ప్రదీపన్యాయము** అంటారు. అలాగే శివుని రూపములోని, పాము, చంద్రుడు, బూడిద, గంగ మొదలయినవి పరస్పర విరుద్ధాలయినప్పటికీ లోకానికి మేలు చేస్తాడు కనుక శివుడు **ప్రదీపుడు**.

### 9. భావనాతీతు, సద్భావనోపేతు

భావనాతీతు = శివుడు భావనలకు అందని తత్త్వము కలవాడు; సద్భావనోపేతు = మంచి భావనల దగ్గరకు వచ్చువాడు.

శివుడు మంచి భావనలంటే ఇష్టపడతాడని భావము.

### 10. సావయవ ఖ్యాతు, నమితు, న జాతు

సావయవ ఖ్యాతు = ప్రణవముచే చెప్పబడు ఈశ్వరుడు అవయవములు లేనివాడు, అవయవములకు అందనివాడు. కాని ఈశ్వరుని నుండి సావయవమగు విశ్వము పుడుతుంది. ఈ ప్రపంచము పేరు మీద ఆయన ప్రసిద్ధుడు. కాలు చేయి మొదలగు శరీర భాగము అవయవము. తర్కశాస్త్రము ప్రకారము అవయవములు అయిదు. ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణము, ఉపనయము, నిగమనము (అనుమతి = అనుమానము వలన కలిగిన జ్ఞానము – లింగపరామర్శజన్య జ్ఞానము); నమితు = శివుడు నమస్కరింపదగినవాడు; న జాతు = పుట్టుక లేనివాడు.

ఉర్దూలో "నజాత్" అంటే మోక్షము. తెలంగాణము లోని ఉర్దూ పలుకుబడి ప్రభావముతో సోమన మోక్షము కలిగించువాడు అనే అర్థములో నజాతు అని ప్రయోగించాడా?

### 11. నాద్యంతరహితు, వేదాంతార్థసుహితు

నాద్యంతరహితు = శివుడు మొదలు తుది లేనివాడు; వేదాంతార్థ సుహితు = ఉపనిషత్తులోని అర్థములతో తృప్తి పొందినవాడు.

### 12. విద్యాత్మ సహితు, సంవిత్సౌఖ్య మహితు

విద్యాత్మ సహితు = విద్యలు నాలుగు. – ఆన్వీక్షకి (ఇందు విజ్ఞానము తెలుపఁబడును), త్రయి (ఇందు ధర్మాధర్మములు తెలుపఁబడును), వార్త (ఇందు అర్థానర్థములు తెలుపఁబడును), దండనీతి (ఇందు నయానయములు తెలుపఁబడును). ఈ విద్యలు తన శరీరముగా కలవాడు; సంవిత్సౌఖ్య మహితు = జ్ఞానసౌఖ్యము కలిగించుటచే గొప్పవాడు.

శుభేచ్ఛ, విచారణ, తనుమానసి, సత్త్వాపత్తి, అసంసక్తి, పదార్థాభావన, తురీయం అనువాటిని **జ్ఞానభూములు** అంటారు. వీటిద్వారా శివుడు జ్ఞాన సౌఖ్యము కలిగిస్తాడు. ఇందులో శుభేచ్ఛ, విచారణ, అనుమానసి దశలలోని వారు ముముక్షువులు. నాలుగవదైన సత్త్వాపత్తి దశను చేరినవారు బ్రహ్మవిదులు. చివరి మూడు, అంటే అసంసక్తి, పదార్థాభావన, తురీయ దశలలోని వారు ముక్తులు (జీవన్ముక్తులు). అసంసక్తుడు బ్రహ్మవిద్వద్వరుడు. పదార్థ భావనుడు బ్రహ్మవిద్యద్వరీయుడు. తురీయుడు బ్రహ్మవరిష్ఠుడు. జ్ఞాన భూమికలకు ఊర్ధ్వకాయంలోని 1. బొడ్డు, 2. కడుపు, 3. ఱొమ్ము, 4. మెడ, 5. ముఖం, 6. భ్రూ మధ్యం, 7. తల నివాస స్థానాలు.

శివుని త్రిశూలానికి కూడా **మహితము** అని పేరు. మహితము కలవాడు మహితుడు.

### 13. భక్త పరాధీను, భక్త నిధాను

భక్త పరాధీను = భక్తులకు లోబడి ఉండేవాడు; భక్తనిధాను = భక్తులు నిధిగా కలవాడు.

### 14. భక్త సమాధాను, భక్తావధాను

భక్త సమాధాను = భక్తులను దయాంగీకారముతో సమాధాన పరచువాడు; భక్తావధాను = భక్తులయందు జాగ్రత కలవాడు.

### 15. భక్త పరంజ్యోతి, భక్త విభూతి

భక్త పరంజ్యోతి = భక్తులకు మోక్షం కలిగించే జ్యోతిస్వరూపుడు; భక్త విభూతి = భక్తుల యొక్క ఐశ్వర్యము.

**విభూతి** – శైవులు త్రిపుండ్రముగ ఉంచుకొను భస్మము విభూతి... ఇది ఐశ్వర్యప్రదాయకము అనియు, సకల పాపనాశకము అనియు, భూతప్రేత పిశాచాది గ్రహముల వలని భయమును పోఁగొట్టి రక్షించును అనియు ప్రసిద్ధి. ఈ కారణములను అనుసరించి విభూతి, భసితము, భస్మము, క్షారము, రక్ష అని పేర్లు వచ్చాయి. శివుని విభూతి శివునివంటిదే.

### 16. భక్త దుఃఖారాతి, భక్తానుభూతి

భక్త దుఃఖారాతి = శివుడు భక్తుల దుఃఖమునకు శత్రువు. శివుడు భక్తుల దుఃఖాన్ని పోగొడతాడని భావం.

త్రివిధ–దుఃఖములు 1. జర, 2. వ్యాధి, 3. మరణము. (ఆ) 1. ఆధ్యాత్మికము, 2. ఆధిభౌతికము, 3. ఆధిదైవికము.

చతుర్విధదుఃఖములు : 1. సహజములు, 2. శారీరకములు, 3. మానసికములు, 4. ఆగంతుకములు.

భక్తానుభూతి = భక్తులకు స్వయంగా శరీరానికో, మనస్సుకో కలిగే అనుభవం శివుడు. తన భక్తులకు శివుడు అనుభూతి కలిగిస్తాడని భావం.

**17. భక్త వ్రజ త్రాణు, భక్త ధురీణు**

భక్త వ్రజ త్రాణు = భక్తుల సమూహమును రక్షించువాడు; భక్త ధురీణు = భక్తుల భారమును వహించువాడు.

**18. భక్త జన ప్రాణు, పరమకల్యాణు**

భక్తజనప్రాణు = భక్తజనులకు ప్రాణమయినవాడు; భక్తులను రక్షించి ప్రాణదానము చేయువాడు.

**పంచ – ప్రాణములు :** 1. ప్రాణము (హృదయమున నుండునది), 2. అపానము (గుదమున నుండునది), 3. సమానము (నాభి మండలమున నుండునది), 4. ఉదానము (కంఠమున నుండునది), 5. వ్యానము (శరీరమంతట వ్యాపించి యుండునది).

**“ప్రాణోఽపానః సమానశ్చోదానవ్యానే చ వాయవః శరీరస్థా ఇమే”**

(అమరకోశము 1–1–64)

దశ – ప్రాణములు : 1. కాలము, 2. మార్గము, 3. క్రియ, 4. అంగము, 5. గ్రహము, 6. జాతి, 7. కళ, 8. లయ, 9. యతి, 10. ప్రస్తారము (ఇవి తాళప్రాణములు).

పరమకల్యాణు = గొప్పవైన శుభములను ఇచ్చువాడు.

**19. మన్మనోరమ్యు నిర్మల భావగమ్యు**

మన్మనోరమ్యు = నా (పాల్కురికి సోమనాథుని) మనస్సులో (కు) అందమయినవాడు; నిర్మల భావగమ్యు = స్వచ్ఛమయిన భావములు కలిగినవారికి పొందదగినవాడు.

## 20. చిన్మయు, సౌమ్యు భజించి కీర్తించి

చిన్మయు = అటువంటి దేవుని; సౌమ్యు = సహృదయుని భజించి = సేవించి; కీర్తించి = పొగడి.

**విశేషాలు :**

పాల్కురికి సోమనాథుడు తన బసవ పురాణములోని ఈ మంగళ పంక్తులను ద్విపదలో రచించాడు. **ద్విపద** అంటే రెండు పాదములుగల పద్యం. ప్రతి పాదములోను మూడు ఇంద్రగణాలు, ఒక సూర్యగణము ఉంటాయి. ఉదాహరణమునకు మొదటి రెండు పాదములు తీసుకొందాం.

"శ్రీగురుదేవునంచితగుణోత్తంసు
యోగీంద్రహృదయ పయోజాతహంసు"

గణ విభజన

| ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | సూర్య |
|---|---|---|---|
| U I I | U I U | I I I U | U I |
| శ్రీగురు | దేవునం | చితగుణో | త్తంసు |
| ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | సూర్య |
| U U I | I I I I | U U I | U I |
| యోగీంద్ర | హృదయప | యోజాత | హం సు |

తిరుచిట్టంబలుని కథ, రుద్ర పశుపతి కథ, బెజ్జ మహాదేవి కథ మొదలైన కథలతో ఏడు ఆశ్వాసములున్న బసవపురాణము పాల్కురికి సోమన రచనా వైచిత్రికి తార్కాణము. పాల్కురికి సోమనాథుడు 1160–1230 కాలంవాడు. వరంగల్లు సమీపంలోని పాల్కురికి గ్రామంలో శ్రియా దేవి, విష్ణురామ దేవుడు అనే దంపతులకు జన్మించాడు. "ప్రజలకోసమే అతడు పుట్టాడు – ప్రజలే అతడిని అమర కవిని చేశారు" అన్నారు సమగ్రాంధ్ర సాహిత్యంలో ఆరుద్ర! "ఒక తెలుగు కవి తొలిసారిగా నిర్మించిన స్వతంత్ర పురాణం బసవపురాణం. ప్రప్రథమ ఆంధ్ర ద్విపద భారతి ఈ కృతి (ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం)"



## 7

విశ్వనాథ సత్యనారాయణగారి **శ్రీమద్రామాయణకల్పవృక్షము** లోని పద్యం

**శ్రీమంజూషిక భక్తపాలనకళాశ్రీచుంచు వానందవ**
**ల్లీమంజుప్రసవంబు చిద్గగనప్రాలేయాంశువున్ మోక్షల**
**క్ష్మీమాణిక్యవినూత్నమేఖల కటాక్షీభూతనీహారరుక్**
**శ్రీమంతంబయి పొల్చు వెల్గు నొకడే సేవింతు విశ్వేశ్వరా!**

**ప్రతిపదార్థము :** విశ్వేశ్వరా = ప్రపంచమునకు అధిపతీ! ఓ శివా!; శ్రీమంజూషిక = సంపదలకి పెద్ద పెట్టె అయిన (సంపదలని ఇవ్వగలిగిన); భక్తపాలనకళాశ్రీచుంచువు = భక్తులను పరిపాలించడమనే కళలో ప్రఖ్యాతిపొందిన; ఆనందవల్లీమంజుప్రసవంబు = ఆనందమనే తీగెకు పూచిన మనోహరమైన పుష్పమయిన; చిద్గగనప్రాలే-యాంశువున్ = జ్ఞానమనే ఆకాశములో చంద్రుడయిన; మోక్షలక్ష్మీమాణిక్యవినూత్నమేఖల = మోక్షమనే లక్ష్మికి మాణిక్యములతో కలిసిన కొత్తదైన వడ్డాణమయిన; కటాక్షీభూతనీహార రుక్శ్రీమంతంబయి = క్రీగంటిచూపులుగా మలచుకున్న చల్లని వెలుగు సంపదలు కలదయిన; పొల్చు వెల్గు నొకడే = ఒకటిగా ప్రకాశించు నీ వెలుగును; సేవింతు = సేవించెదను.

**తాత్పర్యము :** ప్రపంచమునకు అధిపతీ! ఓ శివా! సంపదలకి పెద్ద పెట్టె అయిన, భక్తులను పరిపాలించడమనే కళలో ప్రఖ్యాతిపొందిన ఆనందమనే తీగెకు పూచిన మనోహరమైన పుష్పమయిన, జ్ఞానమనే ఆకాశములో చంద్రుడయిన, మోక్షమనే లక్ష్మికి మాణిక్యములతో కలిసిన కొత్తదైన వడ్డాణమయిన, క్రీగంటిచూపులుగా మలచుకున్న చల్లని వెలుగు సంపదలు కలదయిన ఒకటిగా ప్రకాశించు నీ వెలుగును సేవించెదను.

**విశేషములు :**

విశ్వనాథ వారి తండ్రిగారు శోభనాద్రిగారు కాశినుండి తెచ్చి నందమూరులో ప్రతిష్ఠించిన శివలింగానికి అంకితముగా రామాయణ కల్పవృక్ష రచన చేస్తూ మొదట ఈ ప్రార్థనా పద్యాన్ని పేర్కొన్నారు. ఈ పద్యము ఇంతకుముందు వారు రచించిన విశ్వేశ్వర శతకములోనిది. 'శ్రీమంజూషిక' అనే పదం లక్ష్మీ స్వరూపిణి అయిన సీత-జనకునికి పెట్టెలో లభించడాన్ని జ్ఞాపకం తెస్తుంది. రామాయణానికి సీతా చరిత్ర అని ఇంకొక పేరు. **(సీతాయాః చరితం మహత్)** ఇలా కవి మొదటి పదంలోనే తన

కావ్యమయిన రామాయణాన్ని స్ఫురింపజేసారు. "భక్తపాలనకళాశ్రీచుంచువు", "ఆనందవల్లీమంజుప్రసవంబు" మొదలయిన సమాసాలు కావ్య నాయకుడయిన శ్రీరామచంద్రుని జ్ఞప్తికి తెస్తున్నాయి. వెలుగు అనే పదం విశేష్యము మరియూ క్రియ. ప్రకాశించు మరియూ ప్రకాశము అని రెండు అర్థాలు. ఈ పద్యము శార్దూల వృత్తములో ఉంది.( మసజసతతగ). ఈ పద్యములోని రెండవ పాదం వివాదాస్పదమయింది.

**ల్లీమంజు । ప్రసవం । బుచిద్గ । గన ప్రా । లేయాంశు । వున్ మోక్ష । ల(క్ష్మీ)**

"చిద్గగనప్రాలేయాంశు" అనేదానిని సంస్కృతసమాసంగా స్వీకరిస్తే "న" గురువౌతుంది. అప్పుడు గణభంగం జరుగుతుంది.. అందుకని "చిద్గగన" అనే పదము దగ్గర ఆపి, ప్రాలేయాంశువున్ మొదట్లో "ప్రా"ని ఊది పలికితే గణాలు సరిపోతాయి. విశ్వనాథ వారు జీవించి ఉన్న కాలంలోనే ఈ వివాదం చెలరేగింది.

శివార్కమణిదీపికలో **పుణ్యచుంచువు** అని ఒక నామం ఉంది. అంటే పుణ్యమును ప్రోదిచేసుకున్న వారికి మాత్రమే శివతత్వం లభ్యమవుతుందని తాత్పర్యం. అందుకే ఇక్కడ విశ్వనాథ భక్తపాలనకళాశ్రీచుంచువు అన్నారు.

**ఆనందవల్లీమంజుప్రసవంబు**

బ్రహ్మముగురించి విచారణము చేసిన తైత్తిరీయోపనిషత్తులో రెండవ భాగము ఆనందవల్లి. (బ్రహ్మవల్లి). **'రసో వై సః రసగ్గ్హ్యేవాయం లబ్ధ్వాఽనందీ భవతి.'** అని వేదము. రసమనగా బ్రహ్మ. ఆ రసమును పొందినవాడు ఆనంది అగుచున్నాడు. ఆనందము కలవా డానంది. రసో వై సః అనగా రసమే వాఁడు. వాడనగా బ్రహ్మయని అర్థము. రసమును పొంది ఆనంది అవుతున్నాడనగా ఆనందము కలవాడు –బ్రహ్మయగు చున్నాడని యర్థము.

మనుష్యగంధర్వులు, దేవగంధర్వులు, పితరులు, అజానజ దేవతలు, దేవతలు, ఇంద్రుఁడు, బృహస్పతి, బ్రహ్మ మొదలుగా ఒక్కరొక్కరి ఆనందముకంటె పైపై వారి యానందము వందవంద రెట్లుగా నుండును. మానుషానందము పొందుటయే కష్టము. బ్రహ్మానందము పొందుట యోగులకైన సాధ్యముకాదు. కాని, రసజ్ఞుడైనవాడు కావ్యానందమున పొందుతాడు. ఆ కావ్యానందము బ్రహ్మానంద సదృశమైనది. శివుని ప్రశంసలో ఈ ఆనంద ప్రస్తావన చేసి తన కావ్యము కూడా బ్రహ్మానంద సదృశమైనదని విశ్వనాథ చెప్పక చెబుతున్నారు.

**చిద్గగనప్రాలేయాంశువు**

> కైలాసాచలసానువాసము వృషస్కంధాగ్రసంస్థాయి త
> త్ప్రాలేయాచలకన్యకాకుచతటీపర్యంకనిద్రాగతం
> బాలోలాగ్రజటాతటీఘటితనాకౌకస్సరిత్కంబు దే
> హాలంకారితలేలిహానము వెలుం గర్చింతు విశ్వేశ్వరా! (2)

కైలాసపర్వత సానువులలో నివాసమున్నట్టిది. నందీశ్వరుని భుజములపైన ఉన్నది, మంచుకొండ కుమార్తె పార్వతీదేవియొక్క పాలిండ్ల ప్రదేశమను మంచముపై నిద్రను పొందేది. కొంచెంగా కదులుతున్న జటాజూటపు పైభాగంలో స్వర్గలోకపు నదిని కలిగినట్టిది. తన శరీరానికలంకారముగా పామును చేసికొన్నట్టిది అయిన నీ వెలుగును అర్చిస్తాను అని రామాయణ కల్పవృక్షంలోని నాంది తర్వాతి పద్యంలో కూడా ప్రాలేయ శబ్దాన్ని విశ్వనాథ మురిపెంగా వాడుకొన్నారు.

పుట్టపర్తి నారాయణాచార్యులవారు "తాండవమునకు రంగభూమి చిత్–అంబరము మానవ హృదయాంతర సీమయే. ఇది విజ్ఞులకు వేద్యమను అనుభూతిశాల. ఇచ్చట పరమశివుడు రంగస్థల మేర్పరచికొని, నృత్యమాడి, జీవునికి మోక్షమిచ్చును." (తాండవ ప్రశస్తి వ్యాసము) అని వ్రాసారు. విశ్వనాథ వారి సమాసము అంతిమముగా ఇచ్చు అర్థము కూడా ఇదే.

**మోక్షలక్ష్మీమాణిక్యవినూత్నమేఖల :**

"శీర్ణ మేఖల" అన్న పూర్వకవులనుంచి , "అలరులు కురిసిన ఈ ఇల మెరిసెను నూతన వధువులా, తొణికిన తూరుపు వెలుగులా పుడమికి అలరెను మేఖల". అను సిరివెన్నెలదాక మేఖల అందాలను అద్భుతంగా వర్ణించినవారే. విశ్వనాథ మేఖల వర్ణనలో ఒక ప్రత్యేకత ఉంది. మోక్షము ఇలా ఉంటుందని, దాని ఆకారము చెప్పగలిగిన వారు ఎవ్వరూ లేరు. నడుము యొక్క అందం సొగసు ఇదని , దానిని చుట్టి రసికులకి వివరించేది మేఖల. ఇప్పటి జన్మకి, మరో జన్మకి "నడుమ" ఉన్నది మోక్షము. ఆ మోక్షము కొలవగలిగిన వాడినని, దానిచుట్టుకొలత ఇది అని సాధికారికంగా చెప్పగలిగిన దేవుడు పరమశివుడు. ఆయనను కొలిచి మోక్షము పొందండనే అంతరార్థంతో మోక్ష మనే కాంత నడుము చుట్టూ ఉన్న మేఖల అని శివవర్ణన చేసారు విశ్వనాథ

**ఒకడు**

'ఏకం సత్ విప్రా బహుధా వదంతి" "సత్యం ఒక్కటే" దానిని జ్ఞానులు బహువిధాలుగా చెపుతారు. అను ప్రసిద్ధవాక్యాన్ని "ఒకడు" పదంలో అద్వైతపరంగా విశ్వనాథ ఆవిష్కరించారు. ఆ వెలుగును మనముకూడా త్రికరణశుద్ధిగా కొలిచి పునీతులమవుదాం. 

**8**

జాయప సేనాని **"నృత్తరత్నావళి"**లోని పద్యమిది.

**శ్లో॥ మౌలిం స్వేదజలార్ద్రకుంతలమురఃపూర్వాధికోష్ణస్తనం**
**శ్రోణీముచ్ఛ్వసదంశుకాం పులకితే పార్శ్వే ప్రకంపౌ కరౌ ।**
**సస్తంభం చరణద్వయం చ ముదితో గౌర్యాః శివకౌతుకాత్**
**తత్తన్నృత్తకలోచితాంగకథనవ్యాజైః స్పృశన్ పాతు వః ॥**

**ప్రతిపదార్థము :**

**తత్తన్నృత్త కలోచితాంగ కథన వ్యాజైః** – శివుడు అమ్మవారికి నృత్తకళకు సంబంధించిన అంగములను చెప్పు నెపముతో, దగ్గరగా వచ్చాడు. (కాని అసలు కారణము వేరే ఉందట)

**స్వేదజలార్ద్రకుంతలమ్ మౌలిమ్** – దగ్గరగావచ్చిన శివుడు మొదట చెమట నీటితో తడిసిన వెంట్రుకలు కలిగిన ఆమె తలను తాకాడు.

**ఉరఃపూర్వాధికోష్ణస్తనమ్** – తాను దగ్గరగా రావటంవలన పూర్వముకంటె వేడెక్కిన స్తనములు కల వక్షమును తాకాడు.

**శ్రోణీముచ్ఛ్వసదంశుకామ్** – మీదకు అతిశయించిన కటిభాగము కలిగిన చీరను తాకాడు.

**పులకితే పార్శ్వే** – పులకరించిన పార్శ్వములను తాకాడు.

**ప్రకంపౌ కరౌ** – వణుకుతున్న పార్వతీదేవి చేతులను తాకాడు.

**సస్తంభం చరణద్వయం చ** – చేష్టలు లేని పాదములను తాకాడు.

**ముదితో గౌర్యాః శివ కౌతుకాత్ స్పృశన్** – ఈ విధంగా నృత్త కళకు సంబంధించిన అంగములను చెప్పు నెపముతో గౌరీదేవి అవయవములను కుతూహలముతో తాకుచూ సంతోషపడుతుండే పరమశివుడు

**వః పాతు** – మిమ్ములను రక్షించుగాక!

**విశేషములు :**

**జాయపసేనాని** (క్రీ.శ1199–1259) – నృత్తానికి సంబంధించి తెలుగులో మొదటి లక్షణ గ్రంథాన్ని రచించిన జాయపసేనాని కాకతి గణపతిదేవ చక్రవర్తికి బావమరిది. గణపతిదేవునికి ఈ బావమరిదంటే చాలా ఇష్టంట. తన ఇంటికి తీసుకొని వచ్చి నృత్యానికి సంబంధించిన కళలన్నింటిని నేర్పించాడు. నృత్తరత్నావళి, గీతరత్నావళి జాయపసేనాని రచనలు.

తాను రాసిన పుస్తకం మీద జాయపసేనానికి చాలా నమ్మకం. తన పుస్తకపు గొప్పతనాన్ని ఇలా చెప్పుకొన్నాడు.

"ఆగత్య బ్రహ్మలోకాదిహ భరతమునిః శాస్త్రమేతన్మదీయం
దృష్ట్వా భూయః కృతాదౌ ప్రస్వమరపులకవ్యంజితాంతఃప్రమోదః ।
ఆశ్చర్యం పశ్యతేదం కథమధిగతవానాశయం మే సమగ్రం
సశ్రీమాన్ జాయపసేనాపతీరితి నియతం వక్ష్యతేఽగ్రేమునీనామ్ ॥

రాబోయే కృతయుగ ప్రారంభంలో బ్రహ్మలోకం నుంచి తిరిగి ఈ భూలోకానికి భరత మహర్షి వస్తాడు. నేను రాసిన ఈ నృత్తరత్నావళి చూచి, సంతోషంతో ఇలా అంటాడు. జాయపసేనాపతి నా ఆశయాన్ని సరిగ్గా ఎంత బాగా రాసాడో చూడండి – అని తన ముందున్న మునులతో తప్పక చెబుతాడు."–

ఈ మాటలు నిజమే అని ఆసాంతం పుస్తకం చదివిన సహృదయులు అంగీకరించారు. శరీరహస్తనేత్రాభినయములచేత భావమును తెలుపుచు ఆడెడు ఆట **నృత్తము**. ఇందులో అభినయముండదు. కేవలము అంగములను ఆడించుట మాత్రమే ఉంటుంది. అభినయము కలిగినది **నృత్యము**. అభినయము లేనిది **నృత్తము.**

నృత్తము రెండు రకములు : 1. లాస్యము (సుకుమారమైనది), 2. తాండవము (ఉద్ధతమైనది).

**"లాస్యతాండవభేదేన ద్వయమేతద్ద్విధా పునః, సుకుమారం తయోరాద్యం భవేదపర ముద్ధతమ్"** (నృత్తరత్నావళి 1–56)

మనం చెప్పుకొన్న జాయపసేనాని శ్లోకములోనిది లాస్యము.

నృత్తానికి / నృత్యానికి ఉపకరించే అంగములు 19 ఉన్నాయి.

1. శిరస్సు, 2. దృష్టి, 3. తారలు, 4. పుటలు, 5. కనుబొమలు, 6. నాసిక, 7. గండములు, 8. పెదవులు, 9. చిబుకము, 10. ముఖము, 11. కంఠము, 12. హస్తము, 13. వక్షము, 14. జఠరము, 15. పార్శ్వము, 16. కటి, 17. ఊరువులు, 18. జంఘలు, 19. చరణములు. జాయపసేనాని తన నాందీ శ్లోకములో వీటిలో కొన్నింటిని ఉపయోగించి తన నృత్త గ్రంథములోని విషయాన్ని వ్యంగ్యంగా చెప్పాడు. అద్భుతమైన రససౌధాన్ని కట్టాడు. 

## 9

ధూర్జటి **శ్రీకాళహస్తిమాహాత్మ్యము** లోని ప్రారంభపద్యమిది.

**శ్రీవిద్యానిధియై మహామహిమచే జెన్నై వసిష్ఠాజ లూ**
**తా వాతాశన సామజాటవిక గోత్రాదేవ నత్కీర రా**
**జీవాక్షీయుగ యాదవాధిపులకున్ శ్రేయస్కరంబైన యా**
**ర్యావామాంగము దివ్యలింగము మదీయాభీష్టముల్సల్పెడున్.**

**ప్రతిపదార్థ భావాలు**

**1. శ్రీవిద్యానిధియై :** పరమ శివుడు శ్రీవిద్యకు నిధిలాంటివాడు. త్రిపుర సుందరి ఉపాసనను శ్రీవిద్య అంటారు. తన పూర్వం నుంచి శ్రీవిద్యోపాసన ఉన్నప్పటికీ శంకరులు దీనిని వ్యాప్తిలోకి తీసుకొనివచ్చారని చెబుతారు. శ్రీవిద్యకు నిధి అమ్మవారయితే, అయ్యవారిని ధూర్జటి శ్రీవిద్యకు నిధిలాంటివాడు – అంటున్నాడు. అంటే అమ్మకి, అయ్యకి మధ్య తేడా ఏమీ లేదనే భావాన్ని కవి ఇక్కడ ప్రబోధిస్తున్నాడు. ధూర్జటి శ్రీవిద్యోపాసకుడని ఈ పదం స్పష్టం చేస్తోంది.

**2. మహామహిమచే :** శివుడు గొప్పదయిన మహిమ కలవాడు. మహిమ అన్నా, మాహాత్మ్యము (The Power of working miracles) అన్నా ఒకటే. ఈ మహిమ శబ్దం కావ్యంలోని ఇతివృత్త సూచకము.

**3. చెన్నై :** అందమై, విలాసమై (చెన్ను + అయి). పరమశివుడు అందమైనవాడు.

**4. వసిష్ఠ + అజ + లూతా + వాతాశన + సామజ + ఆటవిక + గోత్రాదేవ + నత్కీర + రాజీవాక్షీ యుగ + యాదవాధిపులకున్ శ్రేయస్కరంబైన :** వసిష్ఠుడు, బ్రహ్మ, సాలెపురుగు, పాము, ఏనుగు, తిన్నడు, బ్రాహ్మణుడు, నత్కీరుడు, పద్మములవంటి కన్నులు కలిగిన ఇరువురు వేశ్యలకు, యాదవాధిపతికి శ్రేయస్సును కలిగించినవాడు.

శ్రీకాళహస్తి మాహాత్మ్యములోని మొదటి ఆశ్వాసములో వసిష్ఠుడు, యాదవరాజు – వీరిద్దరిని శివుడు ఎలా కరుణించాడో వివరించబడింది. రెండవ ఆశ్వాసములో బ్రహ్మ, సాలెపురుగు, పాము, ఏనుగులను శివుడు ఎలా అనుగ్రహించాడో వివరించ బడింది. మూడవ ఆశ్వాసములో తిన్నడు, నత్కీరుడు, శివబ్రాహ్మణులను శివుడు ఎలా అనుగ్రహించాడో చెప్పబడింది. నాలుగవ ఆశ్వాసములో పద్మములవంటి కన్నులు కలిగిన ఇరువురు వేశ్యలకు శివుడు ఎలా ముక్తినిచ్చాడో చెప్పబడింది. ఈ విధంగా తాను కావ్యంలో చెప్పబోతున్న భక్తవరుల నామములను కవి ఈ నాందీ పద్యంలో పేర్కొన్నాడు.

**5. ఆర్యా వామాంగము :** పార్వతీదేవిని వామాంగముగా – ఎడమభాగంగా కలిగినవాడు శివుడు. **"ఓం శివవామాంగవాసిన్యై నమః"** అని అమ్మవారికి ఒక నామము.

శివ మహాపురాణములో అర్జునుడు శివుని ప్రార్థిస్తూ **"నమస్తేఽస్తు వామాంగ గిరిజాయ చ"** (ఎడమ భాగమునందు పార్వతిని ధరించినవాడు) అంటాడు.( శివ మహా పురాణము 41 వ అధ్యాయము 36 వ శ్లోకము)

**6. దివ్య లింగము :** శ్రేష్ఠమైన లింగస్వరూపుడైన పరమశివుడు. 'లీయతే గమ్యతే ఇతి లింగః' ... 'లిం' లీయతి, 'గం' గమయతి... అనగా ఈ ప్రపంచం దేనిలో తిరిగి, దేనిలో లయం చెందుతుందో అదే 'లింగము' అని అర్థం. ఆది, అంతము లేనిది లింగము. ఆత్మ అంటే లింగ తత్త్వము. ప్రతి శరీరంలో ఆత్మ అనే లింగము ఉంటున్నది. ఆ లింగస్వరూపుడే శివుడు.

**7. మదీయాభీష్టముల్ + సల్పెడున్ :** అటువంటి శివలింగము నా కోరికలు నెరవేర్చుగాత! అని ధూర్జటి ప్రార్థన.

**విశేషములు :** "ఈ కాళహస్తి మాహాత్మ్యము వంటి గ్రంథము తెలుగులో మరియొకటి లేదు. తక్కినవారి కవిత్వము మనస్సునకు వాడి పెట్టి హృదయమును పాటునకు తెచ్చును. ఈ (ధూర్జటి) కవిత్వము మనస్సు వాడిమిని దాటి, గుండెపాటు దాటి, దూరాన శివుడు కనిపించునట్లు చేయును." అని విశ్వనాథ సత్యనారాయణగారన్నారు. అటువంటి ధూర్జటి గ్రంథసారమైన ఈ నాందీ పద్యములో కొనియాడబడిన దివ్యలింగము మన కోరికలను కూడా నెరవేర్చుగాత.



## 10

శ్రీనాథుని **భీమేశ్వరపురాణము**లోని మొదటి పద్యము

> **శ్రీస్తన గంధసార పరిషేక సమంచిత సాయక ప్రయో -**
> **గాస్తమహా పురత్రాయు డాహార్య ధనుర్ధరుఁడర్క కోటి దీ**
> **ప్తి స్తవనీయ విగ్రహుడు భీమయ దేవుడు దక్ష వాటికా -**
> **వాస్తుడు ప్రోచుఁ గావుత ధ్రువంబుగ దేవయ యన్న ధీమణిన్.**

**ప్రతిపదార్థము :** శ్రీస్తన గంధసార = లక్ష్మీదేవి స్తనములలోని చందనపు; పరిషేక సమంచిత = చిలకరింపుచేత గౌరవింపబడిన (పరిషేక = Sprinkling over (Monier Willam's Sanskrit - English Dictionary, 2nd Ed. 1899); సాయక ప్రయోగ + అస్త + మహా పురత్రాయుడు = బాణమును ప్రయోగించుట చేత నశించిన గొప్పవైన మూడు పట్టణములు కలవాడు; ఆహార్య ధనుర్ధరుఁడు = కొండ, హరింపశక్యము కానిది, భేదింపరానిది అని వ్యుత్పత్తి. మేరుపర్వతాన్ని ఈ త్రిపురాసురసంహార సమయములో ధనుస్సుగా ధరించాడు శివుడు. ఆ విషయాన్ని కవి ఇక్కడ ప్రస్తావిస్తున్నాడు; అర్కకోటి దీప్తి స్తవనీయ విగ్రహుడు భీమయ దేవుడు = భీమేశ్వరదేవుడు అనేకమంది సూర్యుల కాంతి చేత పొగడబడిన రూపము కలవాడు; దక్ష వాటికా వాస్తుడు = దక్షా రామము నివాసముగా కలిగినవాడు; ప్రోచుఁ గావుత ధ్రువంబుగ దేవయ యన్న ధీమణిన్ = శివుడు దేవయకుమారుడైన అన్నమంత్రి అను బుద్ధిశాలిని కాపాడు గాక.!

భావము : అల్లాడ వీరభద్రారెడ్డికి ప్రధానామాత్యుడు, దేవయకుమారుడు బెండపూడి అన్నయ మంత్రి. అతనికి శ్రీనాథుడు భీమేశ్వర పురాణము అంకితమిచ్చాడు. ఆ అన్నమంత్రిని దక్షారామములో ఉన్న శివుడు కాపాడాలని త్రిపురాసుర సంహార ఘట్ట నేపథ్యంలో తన మొదటి పద్యములో కవి ఆశీర్వదిస్తున్నాడు.

త్రిపురాసురసంహారసమయములో లక్ష్మీదేవి స్తనములపై ఉన్న గంధము అంటుకొన్న వక్షస్థలము కల విష్ణువును బాణముగా చేసుకొన్నవాడు, మేరు పర్వతాన్ని ధనుస్సుగా ధరించినవాడు, అనేకమంది సూర్యుల కాంతి చేత పొగడబడిన రూపము కలవాడు, దక్షారామములో ఉన్న భీమేశ్వరుడు దేవయకుమారుడైన అన్నమంత్రిని రక్షించాలి అని పద్యభావము.

**విశేషాంశములు :**

1. తారకుని కుమారులయిన త్రిపురాసురులు ముగ్గురు. 1. విద్యున్మాలి, 2. తారకాక్షుడు, 3. కమలాక్షుడు. వీరు గొప్ప తపస్సు చేసి శివుని దయతో – ఇనుముతోను బంగారంతో వెండితోను – చేయఁబడిన మూఁడు తిరిగే పట్టణాలను పొంది లోకాలను నాశనం చేసేవారు. విష్ణు ప్రేరణతో శివద్వేషులయిన వీరిని శివుడు యుద్ధముచేసి సంహరించాడు. ఈ త్రిపురాసురసంహార సమయములో విష్ణుమూర్తి శివునికి బాణమయ్యాడని పురాణము. శ్రీనాథుడు ఈ విషయాన్ని తనదైన శృంగార (భక్తి) శైలిలో ఈ పద్యములోని మొదటి పాదములో చెప్పాడు.

2. ఈ గ్రంథంలో నాలుగవ ఆశ్వాసంలో త్రిపురాసురవధ ఉంది. దానిని నాందీ పద్యంలో శ్రీనాథుడు ప్రస్తావించాడు.

3. భీమేశ్వరపురాణము అను ఇంకొక పేరుగల భీమఖండము 6 ఆశ్వాసముల పరిమితి ఉన్నది. దక్షారామములో వెలసిన భీమేశ్వరస్వామి చరిత్ర ఇందులో ఉంది. వ్యాస ముని కాశిని విడచివచ్చుట, అగస్త్య లోపాముద్రల దక్షారామమున నివాస కారణములు, దివ్యతీర్థరాజముల వర్ణన ఈ గ్రంథములో ఉన్నాయి.

4. పంచారామములు అయిదు

దక్షారామము (ద్రాక్షారామము) – భీమేశ్వరుడు
కుమారారామము (సామర్లకోట) – భీమేశ్వరుడు
క్షీరారామము (పాలకొల్లు) – రామలింగేశ్వరుడు
భీమారామము (భీమవరం) – సోమేశ్వరుడు
అమరారామము (అమరావతి) – అమరేశ్వరుడు



## 11

పాల్కురికి సోమన **వృషాధిపశతకం**లోని మొదటి పద్యము

**శ్రీగురులింగమూర్తి! సువిశేషమహోజ్జ్వలకీర్తి! సత్క్రియో**
**ద్యోగకళాప్రపూర్తి! యవధూతపునర్భవజార్తి! పాలితా**
**భ్యాగత సంశ్రితార్థి కవిపండితగాయకచక్రవర్తి! దే**
**వా! గతి నీవె మాకు బసవా! బసవా! బసవా! వృషాధిపా!**

శ్రీగురులింగమూర్తి! = కాంతితో ఒప్పు గొప్పదయిన లింగాకారముకల స్వామీ!;

సువిశేష మహోజ్జ్వలకీర్తి! = చక్కటి విశేషములతో ప్రకాశించే కీర్తికలవాడా!; సత్క్రియోద్యోగ కళాప్రపూర్తి! = సత్ + క్రియ + ఉద్యోగ + కళా ప్రపూర్తి = చక్కటి విధానముతో కూడిన ప్రయత్న కళకు తృప్తి కలిగించువాడా! ( మేము చేయు చక్కటి ప్రయత్నములను నెరవేర్చువాడా!); అవధూత పునర్భవజార్తి! = కేవల బ్రహ్మనిష్ఠతో దండకమండలాదులను కూడ విడిచిపెట్టిన సంన్యాసికి సంసారికి, నిన్ను సేవించాలనే ఆర్తిని కలిగించేవాడా! (పునర్భవము = సంసారము); పాలితాభ్యాగతసంశ్రితార్థి = భోజనసమయమున వచ్చిన అతిథులను, ఆశ్రయింపబడిన కోరికగలవారిని రక్షించువాడా! (శివుడు తనను కొలుచు అన్నార్తులను, కోరికలు కలవారిని రక్షిస్తాడని భావము); కవిపండితగాయక చక్రవర్తి! = కవులకు, పండితులకు, గాయకులకు చక్రవర్తి అయినవాడా!; దేవా! గతి నీవె మాకు = ఓ దేవా! శివా! నువ్వే మాకు దిక్కు; బసవా! బసవా! బసవా! = ఓ శివా! శివా! శివా!; వృషాధిపా! = ధర్మమునకు అధిపతీ! (ఎద్దువాహనముగా కలిగినవాడా!) ఓ శివా! నీకు నమస్కారము.

**విశేషాలు :**

**1. అభ్యాగతుడు.**

గమ్ = గతౌ – అభి + ఆ + గమ్ + క్త. (కృ.ప్ర.).

ఉత్సవాది సందర్భాలలో ఏదైనా ద్రవ్యాదులు లభిస్తాయనో, ఏదైనా అడిగి లబ్ధి పొందుదామనో అపేక్షతో వచ్చే వ్యక్తి. పూర్వపరిచయంవల్ల ఇంటికి వచ్చిన అతిథి. భోజనం వేళకు వచ్చిన వాడు. అతిథి న + తిథిః యస్య. తన రాకకు నియతమైన తిథిలేనివాడు – అంటే ఆకస్మికముగా వచ్చువాడు అతిథి. అర్థభేదము కొంత ఉన్నను అతిథి – అభ్యాగతుడు అనువానిని కవులు పర్యాయములుగానే వాడినారు.

**2. బసవడు**

లింగధారి మతస్థాపకుఁడు. ఇతని తండ్రి శిలాదుఁడు. రమారమి 800 సంవత్సరములకు ముందు జీవించి ఉండెను. ఇతఁడు బ్రాహ్మణవంశమునందు పుట్టియు ఉపనయన సంస్కారమును నిరాకరించి తనవారిని వదిలి కల్యాణపురమునకు పోయి అందలి జైనమతస్థుఁడు అగు కర్ణాటకరాజు యొక్క ప్రాపు కలిగించుకొని లింగధారి మతమును స్థాపించెను. ఈ మతస్థులు శైవారాధకులు. వేదమును శంకరాచార్యులను నమ్ముదురుగాని జాతిభేదమును బ్రాహ్మణోత్కృష్టతను ఒప్పుకొనరు. కొందఱు

బ్రాహ్మణులును ఈ మతము ఒప్పుకొని ఉన్నారు. వారు **ఆరాధ్యులు** అనఁబడుదురు. ఈతని తల్లిదండ్రులు కేవల శివభక్తులు అయినందున శివుఁడు వారిభక్తికి సంతుష్టుఁడై నందిని వారికిఁ పుత్రుఁడుగా జనియించునట్లు చేసి శివమతోద్ధరణము చేయుము అని ఆనతిచ్చినట్లు బసవపురాణమునందు చెప్పఁబడి ఉన్నది. (పురాణనామచంద్రిక యెనమంద్రం వెంకటరామయ్య 1879)

శివభక్తులకు, శివునికి తేడా లేదు కనుక ఈ బసవని తన శతకములో సోమన "బసవా" అను పేరుతో సూచించి ఉండవచ్చు.

**3. బసవా!**

A proper name much used among worshippers of the Lingam. (బ్రౌణ్య తెలుగు – ఇంగ్లీష్ నిఘంటువు 1903) లింగమును పూజించువారు శివునికి తరుచుగా వాడు నామవాచకము బసవయ్య, బసవ మొదలైనవి.

**4. వృషాధిపా**

వర్షతీతి వృషా – వర్షించువాడు. అని ఇంద్రునికి వృషా అని పేరు. (వృషు సేచనే) ఆ ఇంద్రునికి అధిపతి కనుక శివుడు వృషాధిపుడు. వర్షతి అభిలషితమితి వృషః – కోరుకొన్నదానిని వర్షించునది కనుక పుణ్యమునకు (ధర్మము) వృషము అని పేరు. పుణ్యాలకు అధిపతి కనుక శివుడు వృషాధిపుడు. పుణ్యములను ప్రసాదించువాడని భావము. వర్షతి రేతస్సించతీతి వృషభః – వృషశ్చ – రేతస్సును విడచునది కనుక ఎద్దుకు వృషమని పేరు. ఎద్దుకు (నందికి) అధిపతి కనుక శివుడు వృషాధిపుడు. ❀

**12**

ఎడపాటి ఎఱ్ఱన మహాకవి రచించిన **శృంగారమల్లాణచరిత్ర**లోని మొదటి పద్యము

**శ్రీలలితంబు సానునయ శీత గుణంబును జారు పాదరే**
**ఖావిలసంబు జన్నుగవ గట్టితనంబు నితంబ శోభయున్**
**బోలును గౌరి తండ్రిబడి బుట్టినదంచు హసించు శంభుడే**
**వేళను జుండికాళునకు వేడిక నీవుత గామితార్థముల్.**

**ప్రతిపదార్థము :** శ్రీలలితంబు = కాంతివంతమైన అంగవిన్యాసరూపమైన చేష్టా విశేషమును; సానునయ శీత గుణంబును = స + అనునయ శీత గుణంబును =

తగిన పద్ధతిలో ఉన్న చల్లదనమును; చారు పాదరేఖావిలసంబు = అందమైన పాదరేఖల ప్రకాశము; చన్నుగవ గట్టితనంబు = స్తనముల కఠినత్వము; నితంబశోభయున్ = నితంబముల కాంతియును (ఈ గుణాలన్నీ); గౌరి = పార్వతీదేవి; తండ్రిబడి బుట్టినదంచు = తండ్రి నోటినుంచి ఊడిపడిందని చెప్పటానికి; పోలును = పోలికగా సరిపోతాయని; హసించు = నవ్వుతూ చెప్పు; శంభుడు = పరమశివుడు; ఏవేళను = ఏ సమయములో అయినా (ఎల్లప్పుడు); చుండికాళునకు = చుండికాళుడను మహా మంత్రికి; వేడుకన్ = సంతోషముతో; కామితార్థముల్ = కోరుకొన్న ప్రయోజనములన్నీ; ఈవుత = ఇచ్చు గాక!

**తాత్పర్యము :** పార్వతీదేవితో శివుడు నవ్వుతూ మాట్లాడుతున్నాడు. "మీ నాన్న హిమవంతుడిలో కాంతి విశేషముంది. నీ అంగవిన్యాస రూపమైన శృంగార చేష్టలలోనూ కాంతి ఉంది. నీతండ్రిలో తగిన పద్ధతిలో చల్లదనము ఉంది. నీలో కూడా తగినట్లుగా నాతో మాటలలో, భక్తులకు వరములిచ్చే వేళలోనూ చల్లదనముంది. నీ తండ్రి దగ్గర పర్వత పదములున్నవి. (పర్వత పదములు = పూర్వకాలమున పాడుకొను ఒక రకమైన పాటలు). నీతండ్రి అడుగుభాగమున (= పాదము) కాంతి కిరణాలు ఆటలాడు కొంటుంటాయి. దానికి తగ్గట్టే నీకు కూడా అందమైన పాద రేఖల ప్రకాశముఉంది. నీతండ్రి కఠినత్వము స్తనాల్లోనూ, విశాలత్వము నితంబములలోను నీకు వచ్చింది. అన్నీ తండ్రి పోలికలే" అని పార్వతీదేవితో నవ్వుతూ మాట్లాడే శుభదాయకుడైన శివుడు నా కృతిపతియైన చుండికాళునికి కోరుకొన్నవన్నీ ఇచ్చుగాక!

**విశేషములు :**

1. శ్రీకృష్ణదేవరాయల కాలంనాటి కవి ఈ ఎడపాటి ఎఱ్ఱన. ఏమి కారణమో తెలియదు కాని – శ్రీకృష్ణదేవరాయలకు తన కావ్యము అంకితమివ్వకుండా, ఆకాలమునాటి మంత్రులలో ఒకరయిన చుండికాళునికి అంకితమిచ్చాడు.

2. 1927లో ఆంధ్రపత్రిక ముద్రాలయములో దీనిని ముద్రించారు.

3. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి ప్రబంధరత్నావళిలో ఈ కవి ఇంటిపేరు పెదపాటి అని ఉంది.

4. పుష్పగంధి అను వేశ్య, శివభక్తుడైన మల్హణుడు ఇందులో నాయికా నాయకులు. శివుడు ఈ ప్రేమికులిద్దరిని కలిపి, అనుగ్రహించుటతో మూడు ఆశ్వాసములు కలిగిన ఈ కావ్యము ముగుస్తుంది.

5. నాయిక, నాయకుని మీద ఉమ్మి వేసిన సంఘటన ప్రాచీన ప్రబంధాలలో– నాకు తెలిసినంతవరకు – ఈ శృంగార మల్హణ చరిత్రలోనే చూడగలము.

**భాషా విశేషాలు :** గౌర వర్ణము కలది కనుక పార్వతీదేవికి గౌరి అని పేరు వచ్చింది. గౌర శబ్దానికి తెలుపురంగు అని ఒక అర్థముంది. కీర్తన చేయబడినది కనుక (గూయతే కీర్త్యతే గౌరః) గౌరవర్ణమని పేరు వచ్చిందట. ఎరుపు, పసుపు అను అర్థాలు కూడా గౌర శబ్దానికి ఉన్నాయి. పొందబడునది, ఎరుగబడునది గౌరము. సుఖరూపియైన వాడు శంభువు. సుఖము ఈయనవలన కలుగుతుంది కనుక శివుడు శంభువు. (సుఖం భవతి అస్మాత్ శంభుః) హిమము అంటే మంచు. వృద్ధి పొందేది కనుక మంచుకి హిమము అని పేరు వచ్చింది. (హిగతౌ వృద్ధౌచ) వృద్ధికి నిలయము హిమాలయము. వృద్ధి కోరేవారి చేత పొందబడేది గౌరి. సుఖాల వృద్ధి ఇచ్చేవాడు శంభువు. ఈ ముగ్గురిని ఒక పద్యంలో కలిపి మనస్సుకు సుఖాన్ని ఇచ్చినవాడు ఎల్హన కవీశ్వరుడు. ❁

## 13

నారాయణ పండితుడు రచించిన **హితోపదేశము**లోని మొదటి శ్లోకము

> **సిద్ధిః సాధ్యే సతామస్తు ప్రసాదాత్తస్య ధూర్జటేః ।**
> **జాహ్నవీఫేనలేఖేవ యన్మూర్ధ్ని శశినః కలా ॥**

సిద్ధిః, సాధ్యే, సతామ్ + అస్తు, ప్రసాదాత్, తస్య ధూర్జటేః,
జాహ్నవీఫేనలేఖా + ఇవ, యత్ + మూర్ధ్ని, శశినః కలా ।

**ప్రతిపదార్థము :** యత్ + మూర్ధ్ని = ఎవరి తలయందు; జాహ్నవీఫేనలేఖా + ఇవ = గంగా తరంగాల నురుగులా; శశినః కలా = చంద్రకళ ఉన్నదో; తస్య ధూర్జటేః = ఆ పరమశివుని యొక్క, ప్రసాదాత్ = అనుగ్రహము వలన; సతామ్ = మంచివారికి; సిద్ధిః – సాధ్యే –అస్తు = నెరవేరుట అనునది సాధ్యమునందు ఉండుగాక! (అనగా కోరుకొన్నది నెరవేరుగాక!)

**తాత్పర్యము :** ఎవరి తలలో గంగాతరంగాల నురుగులా చంద్రకళ ఉన్నదో, ఆ పరమశివుని యొక్క అనుగ్రహము వలన మంచివారికి కోరుకొన్నది నెరవేరుగాక!

**విశేషాలు :** దక్ష శాపమువలన భయపడి పరుగెత్తిన చంద్రునికి క్షయవ్యాధి వచ్చి శంకరుని శరణువేడాడు. శంకరుడు చంద్రుని క్షయరోగ ముక్తుని గావించి తన కపోల స్థలమున స్థలము ఇచ్చాడు. ఇట్లు చంద్రుడు తలపై ఆభరణముగా ఉన్నందువలన

శివుడు చంద్రశేఖరుడయ్యాడు (శ్రీబ్రహ్మవైవర్త మహాపురాణములో బ్రహ్మఖండములో తొమ్మిదవ అధ్యాయము). శివుని తలపై వున్న చంద్రుడు ఎప్పటికీ బాలచంద్రుడే అని వర్ణించడం కవి సమయము. మనందరికి బాగా పరిచితమైన రామకృష్ణుని "త్ర్పువ్వటబాబా తలపై / పువ్వట జాబిల్లి...." పద్యంలో చంద్రుడు శివుడు తలపై పువ్వుగా వర్ణించబడ్డాడు. (త్ర్పువ్వటబాబా అంటే ఎద్దు వాహనముగా కలవాడు). భయంకరమైన హాలాహలభక్షణసమయంలో కూడా శివుని తలపై ఉన్న చంద్రుడు ఆ వేడిమికి కంది పోలేదు. (నిజజూటార్ధేందుఁడున్ గందడున్– పోతన భాగవతము)

ఇంకా బాలకృష్ణుని అద్భుత వర్ణనలోకూడా ఈ చంద్ర ప్రస్తావన తెచ్చారు పోతన. ఉంగరాల జుట్టును పైకి ముడిచి ముత్యాలపేరుతో ముడివేసింది యశోదమ్మ. అది శివుని తలపై ఉండే చంద్రవంకలాగా కనపడుతున్నదట. **(ముంద వెలుఁగొందు ముక్తాలలామంబు తొగలసంగడికాని తునుక గాఁగ)**. తన కవితాగుణాలు ప్రకటిస్తూ హరచూడా హరిణాంక వక్రత అన్నాడు శ్రీనాథుడు. చంద్రుని వక్రతలా కవిత్వం ఉండాలి అన్నాడు. ఈ వక్రత వక్రోక్తి. నారాయణ పండితుడు గంగా తరంగాల నురుగులా చంద్రుడున్నాడని చెప్పాడు. ఎంత అద్భుతమయిన భావన. శివుని తలపై గంగమ్మ. ఆమె తరంగాల నురుగు చంద్రుడు. ఒక్కసారి కళ్లు మూసుకొని నారాయణ పండితుని భావనను ఊహించుకొంటే పరవశించి పోతాం.

"శీత గభస్తి బింబ శివలింగం బొప్పెఁ బ్రాచీదిశన్" ఆ రాత్రి ఉదయించిన చంద్రబింబము శివలింగంగా ధూర్జటికి కనిపించింది. చంద్రుడు ఉదయించిన ఉదయశైలం పానవట్టము. అభిషేకజలం తూరుపు సముద్రము. మసక చీకటి అగరొత్తుల ధూపం. వెన్నెల శివ దీపారాధన. నక్షత్రాలు శివపూజకు తెచ్చిన పూలు. ధూర్జటి వర్ణనఎలా ఒకదానికొకటి ఎంత అందంగా అమరాయో, నారాయణ పండితుని ఈ శ్లోకంలో వాడిన పదాలు కూడా ఒకదానికొకటి సంబంధించినవే. (పరికరాలంకారము) ధూర్జటి (జడలు) జాహ్నవి, చంద్రలేఖ – మంచివారు – ఒకదానికొకటి సంబంధించినవే. శివుని జడలలో తెల్లటి గంగమ్మ, ఆ జటాజూటముపై తెల్లని చంద్రరేఖ. ఇవన్నీ కలిగిన శివుడు తెలుపు. ఆయన అనుగ్రహించే మంచివారు కూడా తెల్లని (స్వచ్ఛమైన) హృదయము కలవారు.

పంచతంత్రంలా ఉండే గ్రంథం హితోపదేశం. పంచతంత్రంలో మిత్రలాభము 2. మిత్రభేదము 3. సంధివిగ్రహము 4. లబ్ధనాశము 5. అసంప్రేక్షకారిత్వము అని

అయిదు తంత్రములు ఉంటే హితోపదేశంలో మిత్ర లాభము, సుహృద్భేదం, విగ్రహము, సంధి అను నాలుగు భాగలున్నాయి. ఈయన కాలము 1000-1300 సంవత్సరాల మధ్య అని చెబుతున్నారు.

కాలము ఏదయితేనేం... కాలానికి అతీతులు ఇటువంటి మహాకవులు. ❁

## 14

నీలకంఠదీక్షితులు రచించిన **శివలీలార్ణవము** లోని మొదటి శ్లోకము

**పూతం స్వతఃపూతతరం తతో య -**
**ద్గాంగం పయః శంకరమౌళిసంగాత్ ।**
**తత్పాతు మాతుః ప్రణయాపరాధ -**
**పాదహతైః పూతతమం తతో నః ॥**

**ప్రతిపదార్థతాత్పర్యములు :**

అటువంటి గంగ నీరు మమ్మలిని కాపాడుగాక! **(తత్ గాంగం పయః నః పాతు)**

ఎటువంటి గంగ నీరు?

స్వయముగా సర్వజనపాపములను పోగొట్టు సామర్థ్యముకలిగిన పవిత్రమైన గంగనీరు మమ్మలిని కాపాడుగాక **(పూతం స్వతః)**

లోకాలను పవిత్రము చేసే శంకరుని జటాజూటస్పర్శ పొంది - పావనతరమైన గంగ నీరు మమ్మలిని కాపాడుగాక **(శంకరమౌళిసంగాత్ తతో పూతతరమ్)**

జగదంబ పార్వతీదేవి - గోత్ర స్ఖలనాదులు మొదలైన ప్రణయాపరాధ కారణముల వలన- తన పాదాలతో పరమేశ్వరుని శిరస్సును అనేక సార్లు తాకింది. అలా జగదంబ పాదస్పర్శతో పావనతమమైన గంగ నీరు మమ్మలిని కాపాడుగాక **(మాతుః ప్రణయాపరాధపాద హతైః పూతతమం తత్)**

**విశేషాలు :**

శివకేశవులను సమానంగా ఆరాధిస్తూ 104 గ్రంథాలను రచించిన అప్పయ్య దీక్షితులవారి మనుమడు 'నీలకంఠ దీక్షితులు' ... మీనాక్షీ అమ్మవారికి మహాభక్తుడు. 16 వ శతాబ్ది. ఈ శివలీలార్ణవంలో మధురలోని శివుని లీలలు వర్ణింపబడ్డాయి.

జ్ఞానసంబంధుల చరిత్ర (సుబ్రహ్మణ్యస్వామి అవతారము) కూడ ఆ వరుసలోనే చెప్పబడింది.

నీలకంఠదీక్షితులవారు ఈ శ్లోకంలో గంగకు మూడు దశలు చెప్పారు.

**పూతము. పూతతరము. పూతతమము.**
పూత పదానికి పక్కన తరతమప్రత్యయాలు చేర్చారు.

తరతమాలు :

Good (మంచి) -> better (ఇంకామంచి) -> best (అన్నిట్లోకీ / అందకంటేమంచి)

Comparative degree ని (ఔపమికస్థాయి) సూచించడం కోసం సంస్కృతంలో పదానికి – తరమ్ అనీ, Superlative degree ని (ఆత్యంతిక స్థాయి) న సూచించడానికి – తమమ్ అనీ చేరుస్తారు.

పూతమ్ = pure

పూతతరమ్ = purer or more pure

పూతతమమ్ = purest or most pure

సహజంగానే గంగ పరిశుద్ధమయింది. పూతము.

శివుని శిరస్సును తాకుట వలన గంగ పూతతరము.

అమ్మ పాదాల దెబ్బ తగిలిన శివుని శిరము తాకుటవలన పూతతమము.

**"పాదహతైః"** అను బహువచన ప్రయోగము వలన పరమేశ్వరుడు చాలాసార్లు తనను క్షమించమని పార్వతీదేవి కాళ్లమీద పడ్డాడని, ఆవిడ చాలాసార్లు తన పాదాలతో ఆయన శిరస్సును తడిమింది కనుక ఆయన జటాజూటము మరింత పవిత్రమైంది అనే అర్థాలు వస్తున్నాయి. ఇక్కడ భవానీదేవియొక్క మానాధిక్యం చెప్పబడింది. ఒక విషయమును బుజువుగా చెప్పక మరియొక విధముగా త్రిప్పిచెప్పుట పర్యాయోక్తి అలంకారము. అది ఇక్కడ ఉంది. సవతియైన గంగను నెత్తిమీదికి ఎక్కించుకోవటం పార్వతికి అసహన హేతువు. కోప హేతువు. ఆ కోపాన్ని పోగొట్టడం కోసం ఆయన పాద ప్రణతి. ఆవిడ గారి పాద ఘాతము. ఈ శ్లోకం చదివినవెంటనే అమ్మ గొప్ప , అయ్య తక్కువ అనే భావన మనకు రాకూడదు. శివలీలార్ణవములోనే **"అశక్యమంగాంతర ...."** అని ఇంకొక శ్లోకం ఉంది.

అర్ధనారీశ్వరచరణానుగ్రహం గొప్పదా లేక కటాక్షవీక్షణం గొప్పదా? చరణానుగ్రహమే గొప్ప అనుకొంటే ఏ చరణం? అన్న తగాదా , కటాక్షవీక్షణమే గొప్ప అనుకొంటే ఏ కంటిచూపు అని అనుమానం వస్తుంది. అందుచే ఆ అర్ధనారీశ్వర మూర్తిలో ఇద్దరకూ చెందిన వస్తువేది ఉన్నదో దాని అనుగ్రహం పొందితే ఇద్దరి అనుగ్రహమూ మనం పొందినట్లే. ఆ వస్తువు వారి అంతఃకరణము. అని ఆ శ్లోక భావం. మనము కూడా ఆ అంతఃకరణానుగ్రహము పొందుదాము. ❁

## 15

ఇది క్షేమేంద్రుని **"సువృత్తతిలకమ్"** లోని మంగళాచరణ శివస్తుతి.

**గణపతిగురోర్వక్రశ్చూడాశశాంకకలాంకురః**
**స్ఫుటఫణిఫణారత్నచ్ఛాయాఛటాఛురణారుణః ।**
**గిరిపతిసుతాసంసక్తేర్ష్యావిలాసకచగ్రహ**
**చ్యుతనఖశిఖాలేఖాకాన్తస్తనోతు సుఖాని వః ॥**

**ప్రతిపదార్థము :** గణపతి = శ్రీ వినాయకుని; గురోః = తండ్రియైన శివుని శిరస్సుపై; వక్రశ్చూడా శశాంక కలాంకురః = వక్రమైన చంద్రరేఖ యొక్క మొలక ఒకటి ఉన్నది; స్ఫుటఫణిఫణా = స్పష్టమైన పాముల పడగలపై ఉన్న; రత్న చ్ఛాయా ఛటా ఛురణారుణః = మణుల కాంతుల సమూహముల ప్రసారముతో (ఆ చంద్రరేఖ) ఎర్రగా ఉన్నది; గిరిపతిసుతాసంసక్త = హిమవంతుని కుమార్తె పార్వతిని చేరినప్పుడు; ఈర్ష్యావిలాస-కచగ్రహ = ఏర్పడిన ప్రణయ కలహములో విలాసముగా శివుని జుట్టు పట్టుకోవటం వలన; చ్యుత నఖశిఖాలేఖాకాన్తః = జారిన ఆమె గోటి గీరులా ఉన్న ఆ చంద్రరేఖ; తనోతు సుఖాని వః = మీ అందరకు సుఖాలు కలిగించుగాక!

**తాత్పర్యము :** శ్రీ వినాయకుని తండ్రియైన శివుని జుట్టుపై చంద్రరేఖ ఉన్నది. ఆ శివుడు అలంకారములుగా ధరించిన పాముల పడగలపై ఉన్న రత్నాల కాంతులు పైకి ప్రసరించటం వల్ల – ఎర్రగా ఆ చంద్రరేఖ ఉన్నది. శివుడు హిమవంతుని కుమార్తె పార్వతిని చేరినప్పుడు ఆమెతో ప్రణయకలహము ఏర్పడింది. ఆమె విలాసముగా శివుని జుట్టు పట్టుకొన్నది. అప్పుడు పడిన ఆమె గోటి గీరులా ఆ చంద్రరేఖ ఉన్నది. అది మీ అందరకు సుఖాలు కలిగించుగాక!

**విశేషములు :** అమావాస్య నాడు వెన్నెల తొలి వెలుగురేకతో చంద్రుడు లీలగా కనబడితే

అది **"సినీవాలి"** అని అంటారు. పరమేశ్వరుని నుదుటిపై అలంకారంగా ఈ చంద్రరేకను భరతుని నాట్యశాస్త్రం వర్ణించింది.

"ఫాలచంద్రుడు" అని శివమహాపురాణము తొమ్మిదవ అధ్యాయములో ప్రయోగమున్నది. అనగా నుదుటిపై చంద్రుడు ఉన్న శివుడు. ఈ ఫాలచంద్ర ప్రయోగము ఈ శ్లోకంలోకి అన్వయించుకొంటే బాగుంటుందని అనిపిస్తోంది. ఎందుకంటే జటా జూటము మీద నఖ క్షతమనే చంద్రరేఖ కనబడటం అన్వయ క్లిష్టము. జుట్టు కలిగిన నుదుటిపై అమ్మ చేసిన గోటి గీరు ఎర్రని చంద్రరేఖగా మారిందని ఊహ.

**ఛురణ :** "స నీడేయచ్ఛాయాచ్ఛురణశబలం చంద్రశకలం" (సౌందర్య లహరి 42 వ శ్లోకం) అని శంకర భగవత్పాదులవారు దివ్యకాంతులు ప్రసరిస్తూ పాపట బొట్టుగా ఉన్న అమ్మ చంద్రరేఖను వర్ణిస్తూ "ఛురణ"( చల్లుట, ప్రసరించుట) పదాన్ని అందంగా ప్రయోగించారు.

**అంకూరము :** అకి లక్షణే + ఉరచ్. (కృ.ప్ర.) గింజ మొలక రూపమున కానబడునది. (ఆంధ్రశబ్దరత్నాకరము చెలమచెర్ల రంగాచార్యులు 1966)

**నఖక్షతవిశేషాలు :** నఖక్షతవిశేషాలు అయిదు. ఆచ్ఛురితకము, ఆచ్ఛురితము, ఉత్పలపత్రము, క్రొన్నెల, నెమలియడుగు. (తెలుగు పర్యాయపద నిఘంటువు జి.యన్.రెడ్డి 1990 ) ఇందులో క్రొన్నెల అర్ధచంద్రునికి సంబంధించినది. క్షేమేంద్రుడు ఈ ప్రసిద్ధి గల ఉపమానాన్ని ఈ శ్లోకంలో ప్రయోగించాడు.

ఈ శ్లోకము పాదానికి 17 అక్షరములుగల **హరిణి** వృత్తానికి సంబంధించినది. ప్రతి పాదములో న , స , మ , ర , స , వ(లగ) గణములుంటాయి. ఏయే రసాలకి ఏ ఏ వృత్తాలు అనుకూలంగా ఉంటాయో, ప్రసిద్ధమహాకవుల ఉదాహరణములు ఇస్తూ ఈ సువృత్తతిలకములో క్షేమేంద్రుడు వివరించాడు. ❀

## 16

ఇది అప్పయదీక్షితులు (భరద్వాజ ముని) రచించిన శ్రీ **శివకర్ణామృతస్తోత్రము**లోని మొదటి శ్లోకము.

**శ్రీ పార్వతీసుకుచకుంకుమరాజమాన -**
**వక్షస్థలాంచితమమేయగుణప్రపంచమ్ ।**

**వన్దారుభక్తజనమంగలదాయకం తం**
**వందే సదాశివమహం వరదమ్మహేశమ్ ॥**

**ప్రతిపదార్థము :**

**శ్రీ పార్వతీ సుకుచ**

సంధులు (సందులు, సొరంగములు) కలిగినదానిని పర్వతమంటారు. (పర్వాణి సంధయః అస్య పర్వతః) హిమవంతుడనే పర్వతముయొక్క కుమార్తె కనుక పార్వతి అని పేరు వచ్చినది. ఆమె యొక్క శుభములు కలిగించు స్తనములలోని,

**కుంకుమరాజమాన**

ఎర్రని కుంకుమతో ప్రకాశించు (ఎండినప్పుడు కుమ్మని పలుకుతుంది కనుక కుంకుమము అని పేరు వచ్చింది.)

**వక్షస్థలాంచితమ్**

రొమ్ముతో పూజింపబడినవాడు. (అంచ్) గతి పూజనయోః+ క్త – ఇట్. (కృత్ప్రత్యయము)

**అమేయగుణప్రపంచమ్**

తెలిసికొనలేని, అనేకమైన గుణముల రచన (సమూహము) కలవాడు. (మాఙ్ మానే– మాతుం శక్యమ్ = మేయమ్ –న + మేయమ్. (నఞ్తత్పురుష సమాసము)

**వన్దారుభక్తజనమంగలదాయకమ్**

నమస్కరించు స్వభావము కలవాడు వందారువు. (వందతే తాచ్ఛీల్యేనేతి వందారుః వది అభివాదనస్తుత్యోః). అలా నమస్కరించు వారికి శుభములు ఇచ్చువాడు. సుఖాన్ని ఇచ్చేదాన్ని మంగళమంటారు. (మంగం సుఖం లాతీతి మంగలం లాదానే). ధన్యుని పొందేదాన్ని కూడా మంగలమంటారు. సంస్కృతంలో మంగలమని రాయాలి. తెలుగులో మంగళమని రాయాలి.

**వరదమ్ + మహేశమ్**

వరములిచ్చువాడు, మహేశ్వరుడు (గొప్ప ప్రభువయిన)

ఇరవై ఐదు లీలలు కలవాడు మహేశుడు . 1. చంద్ర ధారణ లీల, 2. ఉమామహేశ్వర లీల, 3. వృషభ వాహన లీల, 4. నటేశ్వర లీల, 5. వైవాహిక లీల, 6. భిక్షాటన లీల,

7. కామారి లీల, 8. కాలారి లీల, 9. త్రిపురారి లీల, 10. జలంధరారి లీల, 11. అజారి లీల, 12. వీరభద్ర లీల, 13. హరిధ్వండి లీల, 14. అర్ధనారీశ్వర లీల, 15. కిరాత లీల, 16. కంకాళధర లీల, 17, చండీశానుగ్రహ లీల, 18. విషాపహరణ లీల, 19. చక్ర ప్రదాన లీల, 20. విఘ్న ప్రసాద లీల, 21. ఉమాస్కంద లీల, 22. ఏకపాద లీల, 23. సుఖావ లీల, 24. దక్షిణామూర్తి లీల, 25. ఉరులింగోద్భవ లీల..

**వందే సదాశివమహమ్**

సదాశివునికి నేను నమస్కరించుచున్నాను. సదాశివుడు అంటే ఎప్పుడూ శుభాలు కలిగించేవాడు.

**తాత్పర్యము :** పరమశివుడు శ్రీ పార్వతీదేవియొక్క శుభములు కలిగించు స్తనములలోని ఎఱ్ఱని కుంకుమతో ప్రకాశించు వక్షస్థలము కలవాడు. (అమ్మను కౌగిలించుకొనుట వలన – అయ్యకు రొమ్ము మీద ఆ ఎఱ్ఱటి కుంకుమ సౌభాగ్యము కలిగినదని భావము.)

తెలిసికొనలేని, అనేకమైన గుణముల సమూహము కలవాడు, నమస్కరించు వారికి శుభములు ఇచ్చువాడు, వరములిచ్చువాడు, గొప్ప ప్రభువయిన సదాశివునికి నేను నమస్కరించుచున్నాను.

సదాశివ పదానికి శివమహాపురాణము ఇంకా విశేషార్థము ఇచ్చింది. సకల పదార్థముల జ్ఞానానికి ఇంద్రియములు కారణాలు. ఆ ఇంద్రియాలు ఏమీ లేకపోయినప్పటికి, ఏ వస్తువు ఏ విధముగా ఉందో, దానిని అదే విధముగా కచ్చితముగా తెలుసుకొనేవాడు సదాశివుడు. (**యద్యథావస్థితం వస్తు తత్తథైవ సదాశివః ద్వాత్రింశోధ్యాయః** – 43)

ఈ శ్లోకములోని వృత్తము **వసంత తిలకము**. (తభజజగగ). మూడు అధ్యాయములు గల ఈ కృతి శివస్తోత్రకావ్యాలలో తిలకమే (శ్రేష్ఠము)

**విశేషాలు :** ఒక సంస్థలా వందకు పైగా ధార్మిక , ఆధ్యాత్మిక పుస్తకాలను ప్రచురించిన పెద్దలు, పండితులు శ్రీ రావి మోహనరావు గారు ప్రచురించిన "శ్రీ శివ కర్ణామృత స్తోత్రమ్" నుండి ఈ ప్రథమ శ్లోకాన్ని స్వీకరించాను.

విద్వద్వరేణ్యులు శ్రీ దోర్బల విశ్వనాథశర్మగారు దీనికి తెలుగులో వ్యాఖ్య వ్రాసారు. వారు మొదటి శ్లోకంలో పేర్కొన్న వ్యాఖ్యా విశేషాలను పునరుద్ధరించే కార్యక్రమం పెట్టుకోకుండా స్వామి అనుగ్రహంతో నా చాపల్య శైలిని ప్రదర్శించాను. విపులంగా ఆ

మహాసరస్వతి చేసిన సాధికారికమైన వ్యాఖ్యను ఆ పుస్తకంలో చదివి ఆనందించ వలసినదిగా మనవి. **"శ్రీ శివకర్ణామృతస్తోత్రమ్"** భరద్వాజముని కృతమని ఈ పుస్తక శీర్షికలో పేర్కొన్నారు. కాని అప్పయ్య దీక్షితులవారు ఈ స్తోత్రాన్ని రాసినట్లుగా నా మనస్సులో పచ్చితనం కోల్పోని ఒక గాఢ నమ్మకం. అందుకే సమన్వయ రూపంగా "శ్రీ మదప్పయ దీక్షితులే ఈ శివకర్ణామృతమును రచించి శ్రీ భరద్వాజ మహర్షి పేర వెలయించి యుంటారని" వ్రాసిన పండితులు శ్రీ గరిమెళ్ళ సోమయాజులుశర్మ గారి మాటతో సంపూర్ణముగా ఏకీభవిస్తున్నాను. ❁

## 17

మహాకవి కాళిదాసు రచించిన **అభిజ్ఞానశాకున్తలము**లోని మొదటి శ్లోకము.

**శ్లో॥ యా సృష్టిః స్రష్టురాద్యా వహతి విధిహుతం యా హవిర్యా చ హోత్రీ**
**యే ద్వే కాలం విధత్తః శ్రుతివిషయగుణా యా స్థితా వ్యాప్య విశ్వమ్ ।**
**యామాహుః సర్వబీజప్రకృతిరితి యయా ప్రాణినః ప్రాణవన్తః**
**ప్రత్యక్షాభిః ప్రపన్నస్తనుభిరవతు వస్తాభిరష్టాభిరీశః ॥**

1.నీరు, 2. అగ్ని, 3.యజ్ఞం చేసే యజమాని, 4. సూర్యుడు, 5.చంద్రుడు, 6. ఆకాశం, 7. పృథ్వి, 8. ప్రాణవాయువు. ఈ ఎనిమిది రూపాలలో ఉన్న పరమశివుడు మిమ్మలిని కాపాడాలని కవి ప్రార్థన.

**ప్రతిపదార్థ భావాలు**

**యా సృష్టిః స్రష్టురాద్యా**

మొదటిగా సృష్టికర్త సృష్టించినది నీరు. ఆ నీటి రూపంలో ఉన్న శివుడు కాపాడుగాక!

**వహతి విధిహుతం యా హవిః**

శ్రుతి స్మృతి చెప్పిన విధాన ప్రకారము హోమం చేసిన హవిస్సును (అగ్నిహోత్రము నందు వేల్చుటకు ఇవురబెట్టిన అన్నము, నెయ్యి మొదలైనవి) దేవతలకు అందజేసే అగ్నిరూపంలో ఉన్న శివుడు కాపాడుగాక!

**యా చ హోత్రీ**

యజ్ఞం చేసే యజమాని రూపంలో ఉన్న శివుడు కాపాడుగాక. (లోకము మేలుకోసము చేసే యజమాని శివుని స్వరూపము.)

**యే ద్వే కాలం విధత్తః**

కాలాన్ని నియంత్రించే సూర్యచంద్రులరూపములో ఉన్న శివుడు కాపాడుగాక!

**శ్రుతివిషయగుణా యా స్థితా వ్యాప్య విశ్వమ్ ।**

శబ్ద విషయము తన గుణంగా కలిగి ప్రపంచమంతా వ్యాపించి నిలిచిన ఆకాశరూపంలో ఉన్న శివుడు కాపాడుగాక!

**యామాహుః సర్వబీజప్రకృతిరితి**

సర్వబీజాలకూ వృద్ధికి మూలంగా దేనిని చెబుతారో ఆ భూమి రూపంలో ఉన్న శివుడు కాపాడుగాక!

**యయా ప్రాణినః ప్రాణవన్తః**

దేనివల్ల ప్రాణులకు ప్రాణమనేది కలుగుతుందో, ఆ ప్రాణవాయువు రూపంలో ఉన్న శివుడు కాపాడుగాక!

**ప్రత్యక్షాభిః ప్రపన్నస్తనుభిరవతు వస్తాభిరష్టాభిరీశః**

ఈ విధంగా ఈ ఎనిమిది ప్రత్యక్ష రూపాలుకలిగిన ఆ ఈశ్వరుడు మిమ్మల్ని రక్షించుగాక

**విశేషాలు :**

**"అప ఏవ ససర్జాదౌ తాసు వీర్యమధాసృజత్"** బ్రహ్మ మొదట అప్పులను (నీటిని) సృష్టించాడు. (అప్పులు అనగా ప్రకాశోదకము) అని బ్రహ్మపురాణమున ప్రథమాధ్యాయము (శ్లో. సంఖ్య 38). అందువలన ఈ శ్లోకములో కూడా నీటిని మొదట మహాకవి ప్రస్తావించాడు.

అప్ అనేది పకారాంత స్త్రీలింగ నిత్య బహువచనము. ఎప్పుడూ వ్యాపించే స్వభావము కలిగినవి కనుక నీళ్లకు అపః అని పేరు. **(అప్ వ్యాప్తౌ అప్నువంతి ఇత్యాపః).**

నీటిలో శకుంతల ఉంగరము పోతుంది. ఆ ఉంగరము లేనిదే శకుంతలను దుష్యంతుడు గుర్తించలేడు. (అభిజ్ఞానము) ఈ నాటకములో కీలకమైన మలుపు ఇదే. అందుకే నాటక కథను కూడా నీటి పదము ద్వార కవి ఈ నాందీ శ్లోకములో ప్రస్తావించాడు.

**భూమిరాపోనలో వాయుః - ఖం మనో బుద్ధిరేవ చ ।**
**అహంకార ఇతీయం మే - భిన్నా ప్రకృతిరష్టధా ॥** (అ. 07- 5 శ్లో.)

అని భగవద్గీత చెప్పిన భగవంతుని ఎనిమిది మూర్తులలో భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచభూతాలు కాళిదాసు శ్లోకములో ఉన్నాయి. మనస్సు, బుద్ధి, అహంకారం కు బదులు యజ్ఞం చేసే యజమాని, సూర్యుడు ,చంద్రులను కాళిదాసు పేర్కొన్నాడు.

ఈ శ్లోకము "మ-ర-భ-న-య-య-య" అను గణములతో కూడిన **స్రగ్ధరా** వృత్తమునకు సంబంధించినది. పరోపకార శీలము కలిగిన అష్టమూర్తులను పేర్కొనటం ద్వార - పరమశివుని పరోపకారస్వభావాన్ని చెప్పక చెప్పినట్లయినది. నిరంతరము మనకళ్ల ఎదుట ఎనిమిదిమూర్తులలో కనబడుతూ మనలను రక్షిస్తున్న శివస్వామికి కృతజ్ఞతాపూర్వకంగా నమస్కరించుట మనవిధి. ❁

## 18

మహాకవి కాళిదాసు రచించిన విక్రమోర్వశీయములోని మొదటి శ్లోకము.

**వేదాంతేషు యమాహురేకపురుషం వ్యాప్య స్థితం రోదసీ**
**యస్మిన్నీశ్వర ఇత్యనన్యవిషయః శబ్దో యథార్థాక్షరః ।**
**అంతర్యశ్చ ముముక్షుభిర్నియమితప్రాణాదిభిర్మృగ్యతే**
**సస్థాణుః స్థిరభక్తియోగసులభో నిశ్శ్రేయాసాయాస్తు నః ॥**

**ప్రతిపదార్థ భావాలు :**

**1. వేదాంతేషు యమాహురేకపురుషం వ్యాప్య స్థితం రోదసీ**

వేదాంతేషు = ఉపనిషత్తులలో; రోదసీ = మన్ను మిన్ను అంతటా; వ్యాప్య = వ్యాపించి; స్థితమ్ = నిలుచున్నాడు, ఉన్నాడని; యమ్ = ఎవనిని; ఏకపురుషమ్ = ఒకే పురుషునిగా (పరమాత్మగా); ఆహుః = చెప్పుదురో (ఆ శివుడు మనకు మోక్షమును అనుగ్రహించుగాక!)

**2. యస్మిన్నీశ్వర ఇత్యనన్యవిషయః శబ్దో యథార్థాక్షరః ।**

యస్మిన్ = ఎవనియందు(ఎవరికి); ఈశ్వర ఇతి = ఈశ్వరుడను; అనన్య విషయః = ఇతరులకు చెందని, మయొకరి విషయముగా లేని (న + అన్య విషయః, న.త.); శబ్దః = వ్యాకరణశిక్షితమైన మాట; యథార్థాక్షరః = నిజమైన ఏ పరమాత్మకు చెందుతుందో (ఆ శివుడు మనకు మోక్షమును అనుగ్రహించుగాక!)

**3. అంతర్యశ్చ ముముక్షుభిర్నియమిత ప్రాణాదిభిర్మృగ్యతే**

ముముక్షుభిః = మోక్షముపొందు కోరిక గలవారిచే; నియమిత= నియమింప బడిన, కట్టబడిన; ప్రాణాదిభిః = ప్రాణము మొదలైనవానిచే (ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము.); అంతః యః చ మృగ్యతే = ఎవడు హృదయములో వెతుకబడుచున్నాడో (ఆ శివుడు మనకు మోక్షమును అనుగ్రహించుగాక!)

**4. సస్థాణుః స్థిరభక్తియోగసులభో నిశ్శ్రేయసాయాస్తు నః ॥**

సస్థాణుః = స్థిరుడైన ఆ శివుడు; స్థిర = చలించని; భక్తియోగసులభః = భక్తి ధ్యానములకూడికతో సులభముగా లభించువాడు; నిశ్శ్రేయసాయాస్తు నః = మనకు మోక్షమును అనుగ్రహించుగాక!

**విశేషాలు :**

**1. భక్తియోగసులభః :** శ్రద్ధా భక్తి ధ్యాన యోగాదివేహి ॥ (కైవల్యోపనిషత్ – ఖం – 1 – 2 సూక్తము) నీకు చిత్తమున మోక్షమందు కోరికయున్నచో ఉపాయమును చెప్పెదను. కోరికలన్నింటిని విడిచి శ్రద్ధా భక్తి ధ్యాన యోగములచే సత్పురుషులవలన తెలిసికొనుము అని **కైవల్యోపనిషత్తులో ఉన్న మంత్రము** కాళిదాసుని శ్లోక నాలుగవ పాదముగా పరిణమించినది.

**2. సస్థాణుః :** స్థిరమైనవాడు – అంటే చలించనివాడు. అన్ని చోట్లా వ్యాపించి ఉన్న ఆ శివుడు తాను ఎక్కడ లేడని – లేని చోటుకి వెళతాడు? అందుకే ఆయన స్థాణువు.

శివ పార్వతులిద్దరూ సరదాగా మాట్లాడుకొనే చాటు శ్లోకంలో (కస్త్వం? శూలీ. మృగయ భిషజం) తలుపు అవతల ఉన్న శివుడు "నేను స్థాణువును" అంటాడు. అమ్మ వెంటనే అయితే "చెట్టువన్న మాట" అని సరదాగా స్థాణువుకున్న రెండవ అర్థాన్ని అంటుంది. నిజంగానే శివుడు భక్తుల పాలిటి కల్పతరువు.

**3. అక్షరః :** 1. క్షరచలనే – క్షరతీతి క్షరః – న + క్షరః. (న.త.) చలింపనిది. వ్యు. 2. అశూ = వ్యాప్తౌ – అశ్నోతి – అశ్ + సరః. (ఔణా.) (కృ.ప్ర.) వేదాది శాస్త్రములను వ్యాపించునది.

**4.యస్మిన్నీశ్వరః :** "హరిర్యథైకః పురుషోత్తమః స్మృతః / మహేశ్వర స్త్ర్యంబక ఏవ నాపరః" – (రఘు 3–49). పురుషోత్తమ శబ్దం హరిని, మహేశ్వరశబ్దం శివుని

సూచిస్తాయనీ ఈశ్వరశబ్దం ఎవని యందు రూఢమో ఆయన భక్తసులభుడై అనుగ్రహం చూపిస్తాడని ఆ మహాకవి అని రఘువంశములో చెప్పిన మాటను ఈ ప్రార్థనా శ్లోకములో కాళిదాసు మళ్లీ పేర్కొన్నాడు. ఈశ్వర శబ్దము శివునికి సంబంధించినది. **"ఈశ్వరశ్శర్వ ఈశానశ్శంకరశ్చంద్రశేఖరః"** - అని అమరకోశములో ఉంది. లోకంలో కూడా శివాలయాన్నే ఈశ్వరాలయం అంటారు. ❁

## 19

శ్రీనాథుడు (1385-1470) రచించిన **శివరాత్రిమాహాత్మ్యము**లోని మొదటి పద్యము

**శ్రీగౌరీ స్తన గంధ సార ఘుసృణ శ్రీవాసితోరస్థలీ**
**నాగాధీశ విశిష్ట సంస్తవ లసన్నాళీక పాదద్వయ**
**ప్రాగల్భ్యుండగు శంకరుండు మనుచుం బ్రత్యక్షమై యెప్పుడున్**
**యోగీంద్రాఖ్యుని మమ్మడీంద్రసుతునిన్నుద్యుక్త శాంతాత్మునిన్.**

**ప్రతిపదార్థము :** శ్రీ = కాంతితో కూడిన; గౌరీ స్తన = పార్వతీదేవి కుచములలోని; గంధ సార = చందనము; ఘుసృణ శ్రీ = కుంకుమపువ్వుయొక్క సంపదచేత; వాసితోరస్థలీ = వాసిత + ఉరస్థలీ = వాసన కలదిగా చేయబడిన రొమ్ములో ఉన్న; నాగాధీశ = నాగ + అధీశ = పాములరాజయిన వాసుకియొక్క; విశిష్ట సంస్తవ = చక్కని నుతి చేత; లసన్నాళీక పాదద్వయ = లసత్ + నాళీక పాదద్వయ = ప్రకాశించుచున్న తామరలవంటి పాదములచే; ప్రాగల్భ్యుండగు = ప్రతిభ కలిగినవాడైన; శంకరుండు = పరమశివుడు; ఎప్పుడున్ ప్రత్యక్షమై = ఎప్పుడూ కళ్ల ఎదుట నిలిచినవాడై; ఉద్యుక్త = యోగ్యమైన; శాంతాత్మునిన్ = శాంత + ఆత్మునిన్ = శాంతగుణము కలిగిన; మమ్మడీంద్ర సుతునిన్ = మమ్మడి + ఇంద్ర సుతునిన్ = మమ్మడీంద్ర కుమారుని; యోగీంద్రాఖ్యుని = యోగీంద్ర + ఆఖ్యుని = యోగీంద్రుడను పేరు కలిగినవానిని; మనుచున్ = కాపాడుగాక!

**తాత్పర్య విశేషాలు :** శివుడు ప్రతిభకలవాడు. దేనిచేత? పాద పద్మములచేత ప్రతిభ కలవాడు. పాదపద్మములచేత - ప్రతిభ ఏమిటండి?

ఆ పాదపద్మములు పాముల రాజయిన వాసుకి (శేషుని తమ్ముడు) పొగడ్తతో ప్రకాశిస్తున్నాయి కనుక. ప్రతిభ మెరిసే గుణము. పొగడ్త కూడా మెరిసే గుణము. కనుక శివుడు పాదపద్మముల ప్రతిభకలవాడు.

శేషుడు ఎందుకు పొగిడాడు?

శివుడు తన వక్షస్థలములోని మంచి వాసనని , రొమ్ముకు అంటి పెట్టుకొని ఉన్న వాసుకికి సంక్రమింపచేసాడు కనుక.

శివునిదగ్గర ఉండేది బూడిదకదా! ఆయన దగ్గర సువాసనలేమిటండి బాబూ!?

వాళ్లావిడ పార్వతీదేవి స్తనాలకు సువాసనతో ఉండే గంధము, కుంకుమపువ్వు రాసుకొంది. ఆ సువాసనలు శివుని వక్షఃస్థలము మీదికి వచ్చాయి.

రాసుకొంది ఆవిడ కదండీ! శివుడికి ఆ వాసనలు ఎలా వస్తాయి?

ఛట్! నోర్మూయ్! పెళ్లి చేసుకో. జవాబు తెలుస్తుంది. అలా ఎప్పుడూ మన కళ్ల ఎదుట ఉండేటట్లుగా, పిలిస్తే పలికేటట్లుగా ఉండే పరమశివుడు కాపాడుగాక!

ఎవరిని?

శాంత గుణము కలిగిన, మమ్మడీంద్రుడనేవాని కుమారుని, యోగీంద్రుడను పేరు కలిగినవానిని.

బాగుందండి గురువు గారూ! శ్రీనాథుని "గంధసారఘుసృణ" ప్రయోగము కాశీఖండములో కూడా ఉందని ఇదివరలో చెప్పారు.

"అబ్బో! నీ బుద్ధి పాదరసంలా ఉంది. ఒక్కసారి ఆ పద్యం అందుకో!"

"ఈ క్షోణిన్నినుఁ బోలు సత్కవులు లేరీ నేటి కాలంబునన్
దక్షారామ చాళుక్య భీమవర గంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ గంధసార ఘుసృణ ద్వైరాజ్య భారంబు న
ధ్యక్షించున్ గవి సార్వభౌమ! భవదీయ ప్రౌఢసాహిత్యముల్."

గురువుగారూ! ఇందులోని గంధసార పదానికి తెలుగు అని, ఘుసృణము అనే పదానికి సంస్కృతము అని సంకేతార్థాలుగా గ్రహించాలని శ్రీ మల్లంపల్లి శరభయ్యగారు కాశీఖండ వ్యాఖ్యానములో చెప్పారు కదా! (కాశీ. వ్యా. 22వ పేజి తెవివి ప్రచురణ)"

"అబ్బా! ఏం గుర్తు పెట్టుకొన్నావ్! తెలుగు, సంస్కృత భాషల్లో శ్రీనాథుని వంటి కవితా సార్వభౌములు ఇంకొకరు లేరు. తెలుగు, సంస్కృత భాషలు రెండింటిని ఆయన కవిత పర్యవేక్షిస్తుంటుంది."

"గురువు గారూ! శివరాత్రి మాహాత్మ్యమునకు సుకుమారచరిత్ర అని ఇంకో పేరుంది కదా!"

"అవును! ఇంకా ఈ పద్యము గురించి సందేహాలున్నాయా?"

"శివుని ఆభరణము ఎవరు?"

"శివుని ఆభరణం వాసుకి...శేషుడు కాదు.

**శేషో అనన్తోః శేతే హరిరస్మిన్నితి శేషః శీఙ్ స్వప్నే –** హరి యతనిమీఁద శయనించును.

**కల్పంతేఽ పి శిష్యత ఇతి వా శేషః –** కల్పాంతమునందును మిగిలియుండువాఁడు.

**న విద్యతే అంతో నాశో యస్య సః అనంతః –** నాశము లేనివాడు.

**కాశ్యాం న వీణరుద్రాణాం భూషాయై భోగిమండలే**

**ఆశేషే నిర్గ తే శేషశ్శేషోభూన్న ఫణీశ్వరః ।**

కాశీ నగరములోని క్రొత్తరుద్రుల అలంకారము కోసం పాతాళములోని పాములన్నీ కదలిపోతే అదిశేషుఁడు శేషుడయ్యాడు కాని (మిగిలినవాడు) నాగులరాజు మాత్రము కాకపోయాడు. పాతాళములో పాములుంటే కదా శేషుఁడు నాగులరాజయ్యేది? పాములన్నీ రుద్రుల అలంకారానికి పోతే శేషుఁడు శేషుడు అయ్యాడని పెద్దలు చెప్పగా ఒక శ్లోకం విన్నాను.

1879 లో యెనమండ్రం వెంకటరామయ్యగారు ప్రచురించిన పురాణ నామచంద్రికలో వాసుకి గురించి వ్రాస్తూ "కశ్యపునకు కద్రువయందు పుట్టిన నాగులలో రెండవ వాఁడు. ఆదిశేషుని తమ్ముఁడు. ఇతఁడు రుద్రునికి కంఠభూషణము అయి ఉ ండును." అన్నారు. వాసుకికి కూడా సర్పరాజు అని పేరున్నట్లు అమరకోశములో ఉ ంది. (వాసుకిస్తు సర్పరాజః). ఈ పద్యములో శుభాలను ఇచ్చే శంకరుడు కాపాడాలి అనేచోట విశేష్యము సాభిప్రాయము కనుక పరికరాలంకారము. ❀

**20**

బాణాల వీరశరభేంద్రకవి రచించిన **శ్రీకాళహస్తిశతకము**లోని మొదటి పద్యము

**శ్రీజలధౌతహైమవతిచిత్తసుధారస! పాదదంష్ట్రయు**

**గ్రా జగవందను! జ్వరహరానపహాసధరా! ధురార్చితా!**

**రాజకిరీట! పంచముఖరంజిత! శుభ్రశరీర! బంధురాం**
**భోజభవానుతాంఘ్రి! ఫణిభూషణ! చంద్రహుతాశనార్క! గో**
**రాజిత! కాళహస్తిమణిగోపుర! సాంబశివా! మహాప్రభో!!**

**ప్రతిపదార్ధము :**

**శ్రీజలధౌత హైమవతి చిత్తసుధారస –** శ్రీ = కీర్తితో కూడిన; జలధౌత = నీటివలె స్వచ్ఛమయిన; హైమవతి = పార్వతీదేవి; చిత్తసుధారస = మనస్సునకు అమృతరసమువంటివాడా! (చిత్త చతుష్టయము – 1. మనస్సు, 2. బుద్ధి, 3. చిత్తము, 4. అహంకారము.)

**పాదదంష్ట్రయుగ్రా –** పాద = పర్వతముయొక్క అడుగుభాగము వంటి; దంష్ట్ర = కోఱపల్లతో; ఉగ్రా = భయంకరమైన వాడా ( శివ సహస్ర నామములలో సింహదంష్ట్రః = సింహము యొక్క దంతముల వంటి దంతములు కలవాడు – అని ప్రయోగమున్నది. ఇదే పద్ధతిలో ఈ కవి శివుని పాదదంష్ట్రయుగ్రా అన్నాడు.) జగవందను = ప్రపంచముచే నమస్కరింపబడినవాడా!; జ్వర హరా = జ్వరములను హరించువాడా!; అపహాసధరా = తన బరువును శివుడు మోయలేడని కారణములేని నవ్వు నవ్విన గంగను ధరించినవాడా!; ధురార్చితా = బరువు కలిగిన ఎద్దుచే అర్చింపబడినవాడా!; రాజకిరీట = చంద్ర సంబంధమైన కిరీటము కలవాడా!; పంచముఖరంజిత = 1. సద్యోజాతము, 2. వామదేవము, 3. అఘోరము, 4. తత్పురుషము, 5. ఈశానము – అను అయిదు ముఖములతో సంతోషపెట్టువాడా!; శుభ్రశరీర = తెల్లనిది, ప్రకాశించు శరీరము కలవాడా!; బంధురామ్భోజభవానుతాంఘ్రి = ఒప్పిదమైన పద్మమునుండి పుట్టినన బ్రహ్మచేత నుతింపబడిన పాదములు కలవాడా! అంఘ్రి = అఘి గతౌ 1. దీనిచే నడతురు. 2. వ్యాపించునది; ఫణిభూషణ = పాములు భూషణములుగా కలవాడా!; చంద్రహుతాశనార్క = చంద్రుడు, అగ్ని, సూర్యుడు నేత్రములుగా కలవాడా!; గోరాజిత = నందితో ప్రకాశించేవాడా!; కాళహస్తి మణిగోపుర = కాళహస్తిలో మణులు కలిగిన గాలిగోపురము కలిగినవాడా!, (దేవాలయముఖమున ఎత్తుగా కట్టినద్వారమును గోపురము అంటారు.); సాంబశివా = శివుడా! (.వ్యు. పార్వతితో కూడినవాఁడు.); మహాప్రభో = మిక్కిలి సమర్థుడా! నీకు నమస్కారము.

**విశేషాలు :**

**జ్వరములు 21.**

1. జ్వరము (మానవులకు వచ్చునది), 2. పాకలము (ఏనుగులకు వచ్చునది), 3. అభితాపము (గుఱ్ఱములకు వచ్చునది), 4. వారకము (గాడిదలకు వచ్చునది), 5. అలసకము (ఒంటెలకు వచ్చునది), 6. ఈశ్వరము (ఆవులకు వచ్చునది), 7. అక్షకము (సర్పములకు వచ్చునది), 8. హారిద్రము (దున్నపోతులకు వచ్చునది), 9. ప్రలాపము (మేకలకు వచ్చునది), 10. మృగరోగము (లేళ్ళకు వచ్చునట్టిది), 11. అవపాతము (పక్షులకు వచ్చునది), 12. ఇంద్రమదము (చేపలకు వచ్చునది), 13. గ్రంథికము (గుల్మములకు వచ్చునది), 14. జ్యోతిస్సు (ఓషధులకు వచ్చునది), 15. పర్వతము (పుష్పములకు కలుగునది), 16. రూపకము (తామరలకు వచ్చునది), 17. చూర్ణకము (ధాన్యమునకు వచ్చునది), 18. లలము (ఆళ్ళకు వచ్చునది), 19. మధుకము (శాకములకు వచ్చునది), 20. ఊసరము (భూమియందు కలుగునది), 21. నీలిక (నీటిలో కలుగునది). అస్త్రము అను అర్థములో **జ్వరశబ్దప్రయోగము** పూర్వకవుల ప్రయోగాలలో ఉంది.

పరువడి వైష్ణవజ్వరముఁ బంచిన నయ్యుభయజ్వరంబులున్
వెరవును లావుఁ జేవయును వీరము బీరము గల్గి ఘోర సం
గర మొనరింప నందు గరకంఠకృతజ్వర ముగ్రవైష్ణవ
జ్వరమున కోడి పాఱె ననివారణ వైష్ణవివెంట నంటఁగన్.

(పోతన భాగవతము10.2-426-చ.)

భాగవతపద్యములో వైష్ణవజ్వరవిజయము ఉంది. కాళహస్తి శతకపద్యములో శివ జ్వరవిజయము కవి ప్రస్తావిస్తున్నట్లు తోస్తోంది.( వైష్ణవజ్వరమును జయించినవాడా)

**పంచముఖరంజిత**

శివాలయంలో ఉండే శివలింగానికి మొత్తం 5 ముఖాలు ఉంటాయి. అందులో నాలుగు ముఖాలు, నాలుగు దిక్కులని చూస్తుంటే, ఐదవ ముఖం ఊర్ధ్వముఖమై (పైకి చూస్తు / ఆకాశంవైపు చూస్తూ) ఉంటుంది.

1. సద్యోజాతము, 2. వామదేవము, 3. అఘోరము, 4. తత్పురుషము, 5. ఈశానము. ఆ 5 ముఖాలలోనుంచి సృష్టి, స్థితి, లయ, తిరోధానము, అనుగ్రహము కలుగుతాయి.

**1. సద్యోజాతము :** శివాలయాలు అన్నింటిలో బాగా మహిమ కలిగినది పశ్చిమంగా ఉన్న శివాలయం. శివలింగం పశ్చిమంవైపు చూస్తూ ఉంటుంది. అలా శివలింగంకి ఎదురుగా ఉన్న ద్వారం పశ్చిమంవైపు ఉన్నా, లేదా, శివలింగం పశ్చిమంవైపు చూస్తున్నా, దానిని, సద్యోజాత శివలింగం అని అంటారు. అప్పుడు మనం తప్పకుండా, అటువంటి శివలింగాన్ని చూసినప్పుడు, **ఓం సద్యోజాతముఖాయ నమః** అని అనాలి. **శ్రీకాళహస్తీశ్వర క్షేత్రంలో ఉన్న శివలింగం**, సద్యోజాత శివలింగం. **2. వామదేవము :** ఉత్తరంవైపు చూసే ముఖంని, "వామదేవ" ముఖం అని అంటారు. వామదేవముఖం అంటే విష్ణుస్వరూపం. అందుకే, విష్ణువు శివుడు ఒకరే. **3. అఘోరము :** శివలింగం, దక్షిణానికి చూసే ముఖాన్ని, దక్షిణామూర్తి స్వరూపంగా, చూడమని చెప్తారు. ఆ ముఖాన్నే, అఘోరముఖం అంటారు. మృత్యువు పట్ల భయం పోగొట్టేది, మనకి జ్ఞానం ఇచ్చేది ఇదే. కాశీలో ఉండే ముఖం, అఘోరముఖం. **కాశీలో శివలింగం** ఉత్తరంవైపు కూర్చొని, దక్షిణంవైపు చూస్తూ ఉంటుంది. **4. తత్పురుషము :** శివలింగం, తూర్పువైపుకు చూస్తూ ఉంటే, అటువంటి శివలింగాన్ని, తత్పురుషముఖం అని అంటారు. తత్పురుషముఖం అనేది మనల్ని తిరోధానాన్ని చేస్తూ ఉంటుంది. తిరోధానము అంటే చీకటిలో ఉంచటం. అది, మనల్ని మాయచేత కప్పబడిస్తూ చీకటిలో ఉంచుతూ ఉంటుంది. **5. ఈశానము:** శివలింగం పైన (అంటే, ఆకాశం వైపు చూస్తూ ఉండే ముఖం) ఉండే ముఖం, "ఈశాన ముఖం" అంటారు. ఈశానముఖ దర్శనం, మనం మిగిలిన 4 ముఖాలని దర్శించిన తర్వాతనే దర్శించాలి. అప్పుడే విశిష్టఫలితం అని చెప్పబడింది.

**కాళహస్తి మణిగోపుర :** రాజగోపురము సుమారు 120 అడుగుల ఎత్తుగలది శ్రీకాళహస్తిలో ఉన్నది. ఇది దురదృష్టవశాత్తు ఇటీవలకాలంలో కూలిపోయింది. దీనిని శ్రీకృష్ణదేవరాయలు 1516 లో కట్టించినట్లు శాసనప్రమాణం ఉంది. ఈ శతక కవి కాలములో ఈ గోపురానికి మణులు కూడా ఉండేవేమో! అందుకే మణిగోపుర అన్నాడు.

## వీరశరభేంద్రకవీంద్రుఁడు

ఈ శతక కర్త వీరశరభేంద్రకవీంద్రుఁడని శతకములోని ఈ రెండవ పద్యాన్ని అనుసరించి తెలుస్తోంది.

> మూలము విశ్వకర్మకులభూషణ భద్రయపుత్త్రరత్న బా
> ణాలవవంశదీపక సనాతనగోత్ర ప్రశస్తభూప్రతీ
> పాలకుఁడైన వీరశరభేంద్రకవీంద్రుఁడు నిత్యకోటిలిం

గాలను బూజచేసి శతకంబు రచించె గ్రహించవయ్య నా
పాలిటి కాళహస్తిపరమాత్ముఁడ! సాంబశివా! మహాప్రభో!

నిత్య కోటి లింగాలను పూజ చేసి ఈ శతకము రచించాడట. అంతటి మహిమాన్వితమైన ఈ శతక మంగళాశాసనము మనలను కూడా కాపాడుగాత! ❁

## 21

కూచిమంచి తిమ్మకవి రచించిన **శివలీలావిలాసము**లోని మొదటి పద్యము

**శ్రీనగజాఘనస్తన విసృత్వర, సంకుమదైణనాభి పం**
**కానిశవాసిత స్ఫుటభుజాంతరుడిందుసుధా పయో సదృ**
**గ్భూనుత కీర్తి, పీఠపుర కుక్కుట లింగమహాప్రభుం, దశే**
**షానతభక్తపాలన పరాయణు, డీవుత మాకభీష్టముల్.**

**ప్రతిపదార్థము :** శ్రీ = కాంతితో కూడిన; నగజా ఘనస్తన = గంగాదేవి ఉన్నతమైన స్తనములపై; (ఎక్కడికి కదలలేనిది నగము. పర్వతము. న గచ్ఛత ఇతి నగౌ. పర్వతరాజయిన హిమవంతుని కూతురు కనుక గంగాదేవికి నగజ అని పేరు); విసృత్వర = ప్రసరించు స్వభావము గలవాఁడు. సంకుమత్ + ఐణనాభి – సంకుమత్ = జవ్వాజి, ఐణనాభి = ఏణమునకు (లేడి) సంబంధించినది ఐణము. (ఏణస్య ఇదమ్ – ఏణ + అఞ్. త.ప్ర.); కస్తూరి మృగ (musk deer) నాభిలో ఉండే కస్తూరి అని ఐణనాభికి అర్థము. పంకానిశవాసిత = పంక + అనిశ వాసిత = బురదతో ఎప్పుడూ వాసన కట్టిన; స్ఫుట భుజాంతరుడు = స్పష్టమయిన రొమ్ము కలవాడు; ఇందు = చంద్రుఁడు. (ఉందీ = క్లేదనే – ఉంద్ + ఉః – ఆదేః ఇచ్చ. (ఔణా.) తన కిరణములచేత తడుపువాఁడు.); సుధా = అమృతము (సుఖేన దీయతే పీయత ఇతి సుధా– సుఖముగా పానము చేయబడినది. ధేట్ పానే); పయో = పాలు (పయ గతౌ. ప్రవహించునది. పీయత్ ఇతి వా పయః – పాపానేపానము చేయబడునది); సదృగ్భూనుత కీర్తి = సదృక్ + భూనుత కీర్తి = సమానమైన ప్రసిద్ధమయిన కీర్తి కలవాడు; అశేషానత భక్తపాలన పరాయణుడు = అశేష + ఆనత + భక్తపాలన పరాయణుడు; అశేష = మిగులులేకుండా (నాస్తిశేషః అన్యేత్యశేషం – శేషము లేనిది); ఆనత = వంగిన; భక్తపాలన పరాయణుడు = భక్తులను పాలించు ఆసక్తి కలవాడు; పీఠపుర కుక్కుట లింగమహాప్రభుండు = పిఠాపురములో లింగాకృతిలో ఉన్న కుక్కుటేశ్వర స్వామి;

మాకభీష్టముల్ = మాకు + అభీష్టముల్ = మాకు కోరికలను; ఈవుత = ఇచ్చుగాక! (ఇచ్చు + తన్ – ఈవు ఆదేశము. ఆశీరర్థకము.)

**తాత్పర్యము :** శివుడు కాంతితో కూడిన గంగాదేవి ఉన్నత స్తనములపై ప్రసరించు స్వభావము గలవాడు. ఆమె స్తనములపై ఉన్న జవ్వాజి, కస్తూరి బురదతో ఎప్పుడూ వాసన కట్టిన స్పష్టమయిన రొమ్ము కలవాడు. చంద్రుడు. అమృతము మొదలయిన వాటితో సమానమైన ప్రసిద్ధమయిన కీర్తి కలవాడు. సమస్త భక్తులను పాలించు ఆసక్తి కలవాడు. పిఠాపురములో లింగాకృతిలో ఉన్న ఆ కుక్కుటేశ్వర స్వామి మాకు కోరికలను ఇచ్చుగాక!

**విశేషములు :**

**నగజ :** గంగానది శ్రీరామాయణ బాలకాండ ప్రకారము హిమవంతుని యొక్క పెద్ద కూతురు (35వ సర్గ 14 వశ్లోకము). గంగాశివుల పరిణయగాథ ఈ కావ్యంలో వర్ణింపబడినది కనుక ఈ పద్యంలో నగజ శబ్దానికి గంగ అని అర్థం చెప్పబడింది. రెండు ఆశ్వాసములతో మూడువందల యేబది ఎనిమిది పద్యములు కలిగిన ఈ శివలీలావిలాసము అనే పేరుగల ఈ కావ్యాన్ని కూచిమంచి తిమ్మకవి 31 రోజులలో రచించాడట. ఈ కావ్యంలో కవి శివుని లీలలను చెప్పలేదు. గంగాశివుల పరిణయగాథను చెప్పాడు. కాని పేరు మాత్రము శివలీలావిలాసము. బహుశా – శివుడు – గంగను పెండ్లి చేసుకోవటం – కవి దృష్టిలో లీలా విలాసమేమో!

"హరునకు గంగకుఁ బెండిలి / సరగున నగునని నిలింప సతు లారతులీ / గరములఁ బట్టిన మేల్బంగరు పళ్ళెంబనఁగఁ దుహిన కరుఁడుదయించెన్" చల్లని కిరణాలు కలిగిన చంద్రుని శివునికి, గంగకు పెండ్లి జరిగే సమయంలో దేవతాస్త్రీలు పట్టిన హారతి పళ్లెంగా మనోహరంగా కూచిమంచి తిమ్మకవి వర్ణించాడు. ❀

**22**

తొలి జంటకవులు నంది మల్లయ్య, ఘంట సింగన (క్రీ.శ. 1600) రచించిన **ప్రబోధ చంద్రోదయము**లోని మొదటి పద్యము

> **శ్రీనిత్యంబుగ నిచ్చు నా హరి విరించి స్తంబ పర్యంతమీ**
> **నానాజీవులలోన రత్నములలోనన్ సూత్రముంబోలె దా**
> **లీనుండయ్యు జగత్కరండకనిచోళీభావముం దాల్చు బో**
> **ధానందైకమయుండు శంకరుఁడనంతామాత్యగంగయ్యకున్.**

**ప్రతిపదార్థము :** ఆ హరి = ఆ విష్ణువు; విరించి = బ్రహ్మల మధ్య; స్తంబ పర్యంతము = అతి భయంకరమగు ఆకారముగల పెద్ద అగ్నిస్తంబముయొక్క రూపము వరకు (ధరించి అని భావము) వారిద్దరి మధ్య నిలచిన ఆ శివుడు; ఈ నానా జీవులలోన = ఈ అనేక జీవులలో; రత్నములలోనన్ = రత్నములలో; సూత్రమున్ + పోలె = దారము లా; తాన్ = తాను; లీనుండు + అయ్యు = కలసిపోయినవాడయినప్పటికి; జగత్కరండక నిచోళీ భావమున్ = ప్రపంచము అనెడి పెట్టెపై కప్పిన దుప్పటి భావమును (మాయా స్వరూపమును); తాల్చు = ధరించు; బోధానందైక మయుండు = బోధ + ఆనంద + ఏక మయుండు = జ్ఞానము, ఆనందము ఒకటిగా నిండిన; శంకరుడు = శుభ దాయకుడైన శివుడు; అనంతామాత్య గంగయ్యకున్ = అనంతామాత్య గంగయ్య అనువానికి; శ్రీ = లక్ష్మి, సంపద, ఐశ్వర్యము, వృద్ధి, శోభ, సరస్వతి, బుద్ధి, కీర్తి; నిత్యంబుగన్ = ప్రతిదినము, ఎడతెగక, ఎల్లప్పుడు, శాశ్వతముగా; ఇచ్చున్ = కలిగించుగాక!

**తాత్పర్యము :** విష్ణువు, బ్రహ్మల మధ్య అతి భయంకరమగు ఆకారముగల పెద్ద అగ్నిస్తంబముయొక్క రూపము ధరించినవాడు, ఈ అనేక జీవులలో రత్నములలో దారములా ఉన్నవాడు, ప్రపంచము అనెడి పెట్టెపై కప్పిన దుప్పటి భావమును (మాయా స్వరూపమును) ధరించువాడు, జ్ఞానము, ఆనందము ఒకటిగా నిండిన శుభదాయకుడైన శివుడు అనంతామాత్య గంగయ్య అనువానికి శోభ శాశ్వతముగా కలిగించుగాక!

**విశేషాలు :**

## 1. బోధానందైకమయుండు

కృష్ణమిశ్రులు అనే కవి సంస్కృతంలో ప్రబోధచంద్రోదయమనే నాటకం రచించారు. దీనిని తెలుగులో తొలి జంటకవులు నంది మల్లయ్య, ఘంట సింగన అనువదించారు. సంస్కృతంలో **ప్రబోధచంద్రోదయము** ఆరు ఆశ్వాసాల నాటకం. తెలుగులో అయిదు ఆశ్వాసాల కావ్యంగా అనువదించబడింది. మూలములో నాందీ శ్లోకము అద్వైత బ్రహ్మమును ఉద్దేశించి వ్రాయబడింది. ఈ జంటకవులు శివభక్తులు కనుక శివ మంగళాశాసనముతో ఈ కావ్యము మొదలు పెట్టారు. వేదాంతదేశికులవారు కృష్ణమిశ్రుల గ్రంథాన్ని ఖండిస్తూ **"సంకల్పసూర్యోదయం"** అనే నాటకం రచించారు. తన సంకల్పసూర్యుని ముందు కృష్ణమిశ్రుల ప్రబోధచంద్రోదయం ఆగదని వారి భావం. మధ్వాచార్యులవారు **ఉభయగ్రాసరాహూదయమని** ఈ రెండు కావ్యాలను ఖండిస్తూ

మరొక్క గ్రంథం వ్రాశారు. రాహూదయమైతే చంద్రుడూ, సూర్యుడూ ఈయిద్దరూ ఆగలేరని వారి అభిప్రాయం.

ప్రబోధచంద్రోదయంలోని పాత్రలు విచిత్రంగా ఉంటాయి. వివేకుడు రాజు. వానికి శత్రువు మహామోహుడు. వివేకునికి మంచి గుణములన్నీ మంత్రులుగానూ, సైనికులుగాను ఉంటారు. చెడ్డగుణములన్నీ మోహునిపరివారం. వివేకునికి శాంతి అనే భార్యమూలంగా ప్రబోధుడనే పుత్రుడు పుడతాడు. ప్రబోధమంటే జ్ఞానం. జ్ఞానమనే చంద్రుని ఉదయం ప్రబోధచంద్రోదయం. ఈ కావ్య ఇతివృత్తము ఈ బోధానందైక మయుడు అను పదబంధంలో కవులు సూచించారు.

### 2. హరి విరించి స్తంబ

శంకరుని మాయతో బ్రహ్మతో ఒకసారి విష్ణువుకు భయంకరమగు యుద్ధము జరిగింది. (46వ శ్లోకం). వాళ్ల ఇద్దరి యుద్ధమును చల్లార్చుటకు వారిఎదుట లింగము ఆవిర్భవించింది (47). అది అనేక జ్వాలలతో నిండి, అసంఖ్యాకములగు ప్రలయ కాలాగ్నులను పోలియున్నది. (48). తగ్గుదల, పెరుగుదల లేని ఆ లింగమునకు తుది, మొదలు, మధ్యము లేకున్నది. ఆ లింగము సాటిలేనిది, పరిచ్ఛేదము లేనిది, ఇంద్రియములకు అందనిది, జగత్సృష్టికి ఆధారమైనది (49). ఆ లింగము యొక్క వేలాది జ్వాలలచే మోహితుడయిన విష్ణుభగవానుడు మోహితుడయిన బ్రహ్మతో ఇలా అన్నాడు." ఇప్పుడు నాతో నీకు ఈ స్పర్థ ఎందుకు? (50). మన ఇద్దరి మధ్య ఈ మూడవది వచ్చినది. మనము యుద్ధమును మానదాం. ఈ అగ్ని స్తంభము ఎచట నుండి వచ్చిందో పరీక్షిద్దాము. (51). ఈ సాటిలేని అగ్నిస్తంభముయొక్క క్రింది భాగమును నేను వాయువేగముతో వెళ్లి పరీక్షిస్తాను (52). నీవు వెంటనే పైభాగమును పరీక్షించుటకు ప్రయత్నించు. (శ్రీ శివమహాపురాణములోని రెండవది యగు రుద్రసంహితలో మొదటి ఖండములోని ఏడవ అధ్యాయము). ఈ వృత్తాంతమంతా **"ఆ హరి విరించి స్తంబ పర్యంతము"** అను పదబంధంలో జంటకవులు చెప్పారు.

### 3. ఈనానా జీవులలోన

> **"మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ ।**
> **మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥"**

ఓ ధనంజయా! నా కన్నను శ్రేష్ఠమైన సత్యము ఇంకొకటి లేదు. దారములో ముత్యములు

కూర్చబడినట్లు సమస్తము నా పైననే ఆధారపడియున్నది. అను భగవద్గీతను **"రత్నములలోనన్ సూత్రముంబోలె"** గుర్తుకు తెచ్చుచున్నది.

**4. జీవులు**

జీవులు - బద్ధజీవులని, ముక్తజీవులని, స్వేచ్ఛాజీవులని మూడువిధాలు. పాంచభౌతిక శరీరాన్ని ఆశ్రయించుకొని ఉండే జీవులు బద్ధజీవులు. బద్ధజీవులలో దేవతలు, మానవులేగాక, పశుపక్ష్యాదులు, చెట్లు లాంటి స్థావరజీవులు ఉంటాయి. (విశిష్టాద్వైతం). జీవులు ఒకే విధం కావు. స్థూలంగా ఐదు విధాలు. 1. ఏకేంద్రియ జీవులు. స్పర్శ జ్ఞానం కలిగిన జీవులు. 2. ద్వేంద్రియ జీవులు. స్పర్శ జ్ఞానం, జిహ్వ జ్ఞానం కలిగి ఉంటాయి. 3. త్రీంద్రియ జీవులు. స్పర్శ, జిహ్వ, ఘ్రాణ జ్ఞానం కలిగినవి. 4. చతురింద్రియ జీవులు. స్పర్శ, జిహ్వ, ఘ్రాణ, దృశ్య జ్ఞానాలు ఉంటాయి. 5. స్పర్శ, జిహ్వ, ఘ్రాణ, దృశ్య, శ్రవణ జ్ఞానాలు ఐదూ ఉంటాయి. ఈ ఐదు తరగతులలోనూ తిరిగి సంజ్ఞి, అసంజ్ఞి అనే మరో ఉపతరగతులు ఉంటాయి. (మనస్సు ఉండటం, ఉండక పోవడం తేడా.) (జైన)

**5. రత్నము :**

1. A jewel, precious stone, gem. మణి.

2. A masterpiece of fine thing, the best of its kind of species స్వజాతి శ్రేష్ఠము, నవరత్నములు the nine precious stones, viz, మౌక్తికము a pearl, పద్మరాగము an emerald, వజ్రము a diamond, ప్రవాళము a coral, మరకతము an emerald, నీలము a sapphire, గోమేధికము an agate. పుష్యరాగము a ruby, వైడూర్యముa cat's eye, అశ్వరత్నము a jewel of a horse, i.e., a noble stead. స్త్రీరత్నము an unrivalled woman. గగనరత్నము the sun, as the gem of heaven. అప్సరోరత్నములు the most lovely of nymphs. (బ్రౌణ్య తెలుగు – ఇంగ్లీష్ నిఘంటువు 1903 )

**6. మయము**

ఇది ఒక ప్రత్యయము. దానితో ఏర్పడినది - దానితో నిండినది అను అర్థములలో వచ్చు ప్రత్యయము. ఉదా:- జలమయము, హిరణ్మయము, రత్నమయము మొదలగునవి.

"కామం కర్ణాంత విశ్రాంతే / విశాలే తస్య లోచనే / చక్షుష్మత్తాతు శాస్త్రేణ / సూక్ష్మకార్యార్థ దర్శినా." విశాలమైన కళ్లతో లోకాన్ని చూడగలం. కాని సూక్ష్మదృష్టి గలిగినప్పుడు మాత్రమే కావ్యాల అర్థాలను, అందులోని సూక్ష్మకార్యార్థ దర్శనములను వివరించి చెప్పగలగడానికి ఎవరికైనా సాధ్యమౌతుంది. ఈ ప్రబోధచంద్రోదయ గ్రంథాల వంటివి చదవటానికి ఈ సూక్ష్మదృష్టి చాలా అవసరం. 

## 23

పింగళి సూరన **ప్రభావతీప్రద్యుమ్నము**లోని మొదటి పద్యము

**శ్రీమదుమామహేశు లతిచిత్రవిలాసులు దారు మున్ వియో**
**గామితచింత నొండొరులకై సగమౌటలు నిచ్చఁ దెల్పు కాం**
**క్షా మహిమంబుచేఁ జెఱుసగంబుగ నొక్క యొడల్ధరించు స**
**త్ప్రేమపుదంపతుల్ కృతిపతిం దనరింతురు గాతఁ గీర్తులన్.**

**ప్రతిపదార్థము :**

**శ్రీమదుమా మహేశుల్ –** శ్రీమత్ = శోభనకరమైన, సంపత్కరమయిన; ఉమామహేశుల్ = పార్వతీ పరమేశ్వరులు; అతిచిత్ర = అతి చిత్రమైన; విలాసులు = సొగసు కలిగినవారు, వేడుక కలిగినవారు; తారు = వారు తమకు తామే (They Themselves); మున్ = పూర్వము; వియోగము = విరహము కలుగునను; అమిత చింత = అపారమైన వగపుతో, విచారముతో; ఒండొరులకై = ఒకరికొరకు ఒకరు (పరస్పరము); సగమౌటలున్ = సగమగుట; ఇచ్చఁ దెల్పు = ఇచ్చన్ + తెల్పు = ఇష్టమయినది, ప్రియమైనది తెలుపు; కాంక్షా మహిమంబుచేఁ = కోరిక గొప్పతనముచే; చెఱు సగంబుగన్ = ఒక్కొక్కరికి సగముగా; ఒక్కయొడల్ + ధరించు = ఒకేశరీరమును ధరించు; సత్ప్రేమపుదంపతుల్ = చక్కటి స్నేహము కలిగిన ఆలుమగలు; కృతిపతిన్ = ప్రభావతీ ప్రద్యుమ్నము అను గ్రంథమును స్వీకరించినవానిని (గ్రంథము నంకితము గొన్నవాడగు అమరేశమంత్రికి (ని); కీర్తులన్ = 1. దానకీర్తి, 2. పుణ్యకీర్తి, 3. కావ్యకీర్తి, 4. వక్తృత్వకీర్తి, 5. వర్తనకీర్తి, 6. శౌర్యకీర్తి, 7. విద్వజ్జనకీర్తి అను ఏడు రకాల కీర్తులలో; తనరింతురు గాత = సంతోషింపఁజేయుదురు గాక!

**తాత్పర్యము :** శుభాన్ని ఇచ్చు పార్వతీ పరమేశ్వరులు అతిచిత్రమైన వేడుక కలిగినవారు. విరహము కలుగునను విచారముతో వారు తమకు తామే చాలా కాలం క్రితమే

పరస్పరము సగమయ్యారు. కోరిక గొప్పతనముచే ఒకేశరీరమును ధరించు చక్కటి స్నేహము కలిగిన ఆ అదిదంపతులు గ్రంథమునంకితము తీసుకొన్న అమరేశమంత్రిని 1. దానకీర్తి, 2. పుణ్యకీర్తి, 3. కావ్యకీర్తి, 4. వక్తృత్వకీర్తి, 5. వర్తనకీర్తి, 6. శౌర్యకీర్తి, 7. విద్వజ్జనకీర్తి. అను ఏడు రకాల కీర్తులలో సంతోషింపఁజేయుదురు గాక!

**భాషా విశేషాలు**

**కాతన్**

కాత అంటే అగుగాక! ఆశీస్సుల సందర్భములో తద్ధర్మార్థకక్రియల (మూడు కాలములను బోధించు క్రియాపదము తద్ధర్మము) అనుసరించి "కాత" అను పదమును కవులు వాడుతుంటారు. ఈ పద్యములో తనరింతురు (సంతోషింపఁజేయుదురు) అను తద్ధర్మార్థకక్రియప్రక్కన కాత అనుపదము కవి ప్రయోగించాడు.

**కావ్య విశేషాలు**

ప్రభావతి వజ్రనాభుడను రాక్షసుని కూతురు. కృష్ణుని కొడుకు ప్రద్యుమ్నుడు. వీరిద్దరి కథను **"కతరాజు"** అను బిరుదుగల పింగళి సూరన ఈ కావ్యంగా మలిచాడు. శబ్దసంస్కారం గల "శుచిముఖి" అనే హంస కబుర్లు, చేతలు ఈ కావ్యంలో కమ్మగా ఉంటాయి. దానికి సరస్వతీదేవి "ఉపమాతిశయోక్తి కామధేను" అనే బిరుదు కూడా ఇచ్చింది. ప్రభావతీ ప్రద్యుమ్నుల దాంపత్యము, వారి ప్రేమ ఈ నాందీ పద్యములో సూరన పార్వతీ పరమేశ్వరుల ప్రేమతో పోలుస్తూ వ్యంగ్యంగా చెప్పాడు. ❁

## 24

యథావాక్కుల అన్నమయ్య **సర్వేశ్వరశతకము**లోని మొదటి పద్యము

**శ్రీకంఠున్ బరమేశు నవ్యయు నిజ శ్రీపాద దివ్య ప్రభా**
**నీకోత్సారిత దేవతా నికర దుర్నీత్యక్షరధ్వాంతు జి**
**త్రాపకామ్యాంగు నపాంగ మాత్రరచిత బ్రహ్మాండ సంఘాతు జం**
**ద్రాకల్పుం బ్రణుతింతు నిన్ను మది నాహ్లాదింతు సర్వేశ్వరా!**

**ప్రతిపదార్థము :** సర్వేశ్వరా! = సర్వ + ఈశ్వరా = సమస్తప్రపంచానికి సార్వభౌమా! (పరమాత్మా); శ్రీకంఠున్ = విషము కంఠమునందు కలవానిని; పరమేశున్ = పరమ + ఈశున్ = శ్రేష్ఠుడయిన ఈశ్వరుని; అవ్యయు = ఎప్పుడూ నశింపనివాడిని; నిజ =

తనయొక్క; శ్రీపాద = శుభకరములైన పాదములయొక్క; దివ్య ప్రభానీక = దివ్య + ప్రభ + అనీక = దివ్యమైన కాంతి సమూహముతో; ఉత్సారిత = తొలగింపబడిన – దూరముగా నెట్టబడిన; దేవతా నికర = దేవతల సమూహముయొక్క; దుర్నీత్యక్షరధ్వాంతు = దుర్నీతి + అక్షరధ్వాంతు = చెడు నడత (అక్రమము) అను అక్షర అంధకారము కలిగినవానిని; చిత్ప్రాకామ్యాంగున్ = చిత్ + ప్రాకామ్య + అంగున్ = జ్ఞానమును ఐశ్వర్యముగా కలిగినవానిని; అపాంగ మాత్రరచిత = కడగంటిచూపుతో రచింపబడిన; బ్రహ్మాండ సంఘాతు = పదునాలుగులోకాల సమూహము కలవానిని; చంద్రాకల్పున్ = చంద్ర + ఆకల్పున్ = చంద్రుని అలంకారముగా కలవానిని; నిన్ను = అట్టి నిన్ను; ప్రణుతింతు = బాగా పొగుడుతాను; మది నాహ్లాదింతు = మదిన్ + ఆహ్లాదింతు = మనస్సులో సంతోషిస్తాను.

**తాత్పర్యము :** సమస్త ప్రపంచానికి సార్వభౌమా! నువ్వు విషము కంఠమునందు కలవాడివి. శ్రేష్ఠుడయిన ఈశ్వరుడివి. ఎప్పుడూ నశింపనివాడిని. నీ పాదముల దివ్యమైన కాంతితో దేవతల చెడునడత అంధకారమును దూరముచేస్తావు. (దేవతలను రక్షిస్తావు అని, దేవతలలో దుష్టభావనలను రానివ్వవని భావము.) జ్ఞానమును ఐశ్వర్యముగా కలిగిన వాడివి. నీ కడగంటి చూపుతో పదునాలుగులోకములను సృష్టించే శక్తి కలిగినవాడివి. చంద్రుని అలంకారముగా కలవాడివి. అటువంటి నిన్ను బాగా పొగిడి నా మనస్సులో సంతోషిస్తాను.

**విశేషములు :**

1. 12 వ శతాబ్దానికి చెందిన యథావాక్కుల అన్నమయ్య పాల్కురికి సోమనాథుని సమకాలికుడు. శివతత్త్వాన్ని **'సర్వేశ్వరశతకం'** ద్వారా లోకానికి చాటిన యథావాక్కుల అన్నమయ్య, కృష్ణానదీతీరంలో 'సత్రశాల' అనే క్షేత్రములో మల్లికార్జునస్వామిని సేవిస్తూ 'సర్వేశ్వరశతకం' రచించాడు. ఈ శతకాన్ని తాటి ఆకులపై రాస్తూ తన పాండిత్యానికి తానే పరీక్ష పెట్టుకున్నాడు. తాను రాసిన పద్యాల్లో శక్తి లేకపోతే అవి కృష్ణానదీ ప్రవాహంలో కొట్టుకుపోతాయని వాటిని నదిలో వదిలేవాడు. ఒక్క తాటాకు కొట్టుకుపోయినా తాను తన తలను నరుక్కుంటానని ప్రతిజ్ఞ చేసాడు.

అన్ని తిరిగి వచ్చాయి కాని 87 వ పద్యం రాసిన తాటి ఆకు రాలేదు. చెప్పిన మాట ప్రకారం తన తలను నరుక్కోవడానికి సిద్ధపడుతుండగా, ఒక పశువుల కాపరి

రూపంలో సర్వేశ్వరుడు ఆ తాటి ఆకు తీసుకువచ్చి ఇచ్చాడు. ఇంతటి శక్తి కలిగినవి యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వరశతక పద్యాలు.

2. తెలుగున శతకములు చంపకోత్పల మాలికలతో ప్రారంభమయ్యాయి. మల్లికార్జున పండితుడు పాల్కురికి సోమనాథు చంపకోత్పలమాలికలు రచించాడు. కాని యథావాక్కుల అన్నమయ్య తన సర్వేశ్వరశతకమున మత్తేభ శార్దూల వృత్తములలో శివుని స్తుతించాడు. శార్దూల వృత్తములో మొదటిపద్యం రచించాడు. "శివుడు గజాజిన, వ్యాఘ్రచర్మాంబరధారి. కావున మత్తేభ శార్దూల వృత్తము లన్వర్థములైనవి" అని శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు దీనిని సమర్థించారు. (ఆంధ్రశతక వాఙ్మయపరిణామచరిత్ర)

3. అష్టైశ్వర్యములను అష్టసిద్ధులుగా కొంతమంది చెబుతారు. వీటి వివరణమిది.

1. అణిమ : అణుప్రమాణమైన అతి తేలికైనది అణిమ. ఈ విద్య వచ్చినవారు గాలిలో తేలినట్లు తేలికగా మారిపోతారు.

2. గరిమ : గడ్డిపోచను కూడా కొండంత బరువుగా మార్చి వేయగలిగే సిద్ధి.

3. లఘిమ : చేరవలసిన గమ్యాన్ని మనోవేగంతో సంకల్పమాత్రంతో చేరుకొనుట.

4. మహిమ : అంతటా గౌరవము. పరిచయం లేనివారు కూడా పిలిచి గౌరవించుట.

5. ప్రాప్తి : ఏది కోరుకుంటే దాన్నిపొందే సమర్థత.

6. ప్రాకామ్యము : అంతటా వ్యాపించి ఉండుట. తాను ఉన్న చోటనే ఉండి అన్నీ చోట్లలో తానుగా గమనించుట. ఈ శతకపద్యములో చిత్ప్రాకామ్యాంగున్ (జ్ఞానమును ఐశ్వర్యముగా కలిగినవానిని) అని ప్రయోగము. సర్వత్రా వ్యాపించిన జ్ఞానముకలవాడు శివుడు అని సమన్వయము.

7. ఈశత్వము : అన్నిటిలోనూ అందరిలోనూ తానే అధికుడగుట.

8. వశిత్వము : ఆత్మను, బుద్ధిని, మనస్సును, సమస్తాన్ని వశం చేసుకోవడం .

ముగింపు

"ఇతడొకడే సర్వేశ్వరుడు సితకమలాక్షుడు శ్రీవేంకటేశుడు" అని తాళ్లపాక అన్నమయ్య అంటే సర్వేశ్వరుడు శివుడని "యథావాక్కుల అన్నమయ్య" చెప్పాడు. విష్ణు, శివులిద్దరూ రెండురూపాలలో కనిపించే ఒకే సర్వేశ్వరుడు.



## 25

కాళిదాసు **మాళవికాగ్నిమిత్రనాటకము**లోని మొదటి శ్లోకము

**శ్లో॥ ఏకైశ్వర్యస్థితోఽపి ప్రణతబహుఫలే యస్స్వయం కృత్తివాసాః**
**కాంతాసమ్మిశ్రదేహోఽప్యవిషయమనసాం యః పరస్తాద్యతీనామ్ ।**
**అష్టాభిర్యస్య కృత్స్నం జగదపి తనుభిర్బిభ్రతో నాభిమానః**
**సన్మార్గాలోకనాయ వ్యపనయతు స వస్తామసీం వృత్తిమీశః ॥**

**ప్రతిపదార్థము :** ప్రణతబహుఫలే = తనకు నమస్కరించేవారికి, శరణు కోరేవారికి అనేకరకాలయిన ఐశ్వర్యాలు ఇవ్వగల; ఏక + ఐశ్వర్య స్థితః + అపి = పరమ ఐశ్వర్యాధిపత్యము కలిగినప్పటికీ; యస్స్వయం కృత్తివాసాః = ఏ శివుడు స్వయముగా గజ చర్మాన్ని ధరించి ఉన్నాడో; కాంతా సమ్మిశ్ర దేహోఽపి = భార్యపై మోహము కలిగినవానిలా తన భార్యను క్షణము విడిచి ఉండలేని అర్ధనారీశ్వరదేహము ధరించినప్పటికీ; అవిషయమనసామ్ = విషయములపట్ల మోహములేని జితేంద్రియులైన; యతీనామ్ = మహర్షులు అందుకోలేని; పరస్తాత్ = దూరములో; యః = ఏ శివుడు ఉన్నాడో; అష్టాభిః తనుభిః = తన ఎనిమిది మూర్తులు; కృత్స్నం జగదపి బిభ్రతః = సమస్త జగత్తును నిర్వహిస్తున్నప్పటికీ; నాభిమానః = నేనే ఇదంతా చేస్తున్నానని ఏ మాత్రము గర్వాభిమానములేక ఏ శివుడు ఉన్నాడో; సన్మార్గాలోకనాయ = మంచి మార్గము చూడాలనుకొనే మీ చూపును; తామసీం వృత్తిమ్ = అడ్డుకొనే మీ తామస వృత్తిని (అజ్ఞానాన్ని); సః ఈశః = ఆ శివుడు; వ్యపనయతు – పోగొట్టుగాక!

**తాత్పర్యము :** తనను ప్రార్థించే భక్తులకు సమస్త ఐశ్వర్యాలు ఇవ్వగల శివుడు తన ఒంటి మీద – నిరుపేదలా – గజచర్మాన్ని కట్టుకొని ఉన్నాడు. అర్ధనారీశ్వరునిలా కోరికలకు లోబడినవానిలా ఉన్నప్పటికీ – శివుడు – ఇంద్రియాలను జయించిన మునులకంటె అధికుడు. తన ఎనిమిది మూర్తులు సమస్త జగత్తును నిర్వహిస్తున్నప్పటికీ నేనే ఇదంతా చేస్తున్నానని ఏ మాత్రము గర్వాభిమానములేనివాడు శివుడు. అటువంటి శివుడు మంచి మార్గము (మోక్ష మార్గము) చూడాలనుకొనే మీ చూపును అడ్డుకొనే మీ అజ్ఞానాన్ని పోగొట్టుగాక!

**విశేషాలు :**

1. కృతీ ఛేదనే – కోయబడునది కనుక చర్మానికి కృత్తి అని పేరు.

2. తన భక్తులెందరికో ఐశ్వర్యవరములిచ్చినవాడు శివుడు. ఉదాహరణకు తనను కొలిచిన శుక్రుడనే వానికి ప్రజాపతిత్వమును కుబేరత్వమును అవధ్యత్వమును కూడ వరములుగా ఇచ్చాడు. (మత్స్య మహాపురాణము – నలభై ఏడవ అధ్యాయము)

3. ఈ శ్లోకములో విరోధాభాసాలంకారముంది. పైకి విరోధముగ కనిపించినప్పటికీ ఆలోచించినచో విరోధము తొలఁగిపోవుట విరోధాభాసము. ఉదాహరణకి అంత ఐశ్వర్యవంతుడయిన శివుడు గజచర్మము కట్టుకొనుట విరోధము. రెండింటికి సమన్వయము కుదరటంలేదు. అయితే శివుడు భక్తపాలకుడు కనుక గజాసురుని కోరిక మన్నించి అతని చర్మాన్ని ధరించాడనే విషయం తెలిసిన తర్వాత విరోధం తొలగిపోతుంది.

4. శుంగవంశపు రాజయిన పుష్యమిత్రుని కుమారుడు అగ్నిమిత్రుడను గొప్ప రాజు ఈ నాటకములో వర్ణించబడతాడనే విషయాన్ని శివునికి సంబంధించిన విశేషణాల్లో వ్యంగ్యంగా తెలియచేయబడింది.

5. విదిశా నగరాధిపతి అగ్నిమిత్రుడు. అతని రాణి ప్రధాన చెలికత్తె మాళవిక. వీరిద్దరి మధ్య ప్రేమను అంశముగా తీసుకొని రచింపబడిన నాటకము **మాళవికాగ్నిమిత్రము.**

6. పాతది అయినంత మాత్రాన, ఆ విషయం గొప్పదికాదు. అలాగే, కొత్తది అయినంత మాత్రాన, ఆ విషయం చెడ్డది అనుకోనక్కర్లేదు. విషయంలోనైనా ఉన్న పస బట్టి గొప్పదనం వస్తుంది. కాలాన్ని బట్టి కాదని కాళిదాసు ఈ నాటకంలో చక్కటి తీర్పు ఇచ్చాడు.

7. మార్గశబ్దము ఈ నాటకములో కీలకమైన నాట్యశబ్దాన్ని ప్రతిపాదిస్తోందని, ఆధారాలతో మాళవికాగ్నిమిత్ర నాటకానికి కుమారగిరిరాజీయము అను పేరుతో చక్కటి వ్యాఖ్యానం వ్రాసిన **కాటయవేమారెడ్డి**. (1364–1386) చెప్పాడు.

8. గీత ప్రకారం భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం, మనస్సు, బుద్ధి, అహంకారం. అనునవి అష్ట మూర్తులు. (అ.07 – 5 శ్లో.) వీటిలో మనస్సు, బుద్ధి, అహంకారం కు బదులు యజ్ఞం చేసే యజమాని, సూర్యుడు, చంద్రులను కాళిదాసు శాకుంతల నాందీశ్లోకంలో పేర్కొన్న విషయం మనం ప్రస్తావించుకొన్నాం.

ముగింపు

"శివుడు మోక్షమార్గాన్ని ఇవ్వాలి. బతికున్నంతకాలం మనందరిని సన్మార్గంలో నడిపించాలి" అను కాళిదాసు గొంతుతో మనంకూడా జత కలుపుదాం. ❀

## 26

భవభూతి **మాలతీమాధవ** నాటకములోని మొదటి శ్లోకము.

**శ్లో॥ చూడాపీడకపాలసంకులగలన్మందాకినీవారయో**
**విద్యుత్ప్రాయలలాటలోచనపుటజ్యోతిర్విమిశ్రత్విషః ।**
**పాంతు త్వామకఠోరకేతకశిఖాసందిగ్ధముగ్ధేందవో**
**భూతేశస్య భుజంగవల్లివలయస్రజ్నద్ధజూటాజటః ॥**

**ప్రతిపదార్థ భావములు**

**చూడాపీడకపాలసంకులగలన్మందాకినీవారయో**

(భూతేశస్య = శివునియొక్క); చూడాయాం = సిగలో; ఆపీడ = నలుగుతూ; కపాల = పుర్రెపై; సంకులమ్ = వ్యాపిస్తూ; గలత్ = ప్రవహించుచున్న; మందాకినీ వారయః = గంగాజలములు;

శివుని నెత్తిపై ఉన్న సిగదండ నుండి మెడలోని పుర్రెల జపమాల మీదికి పవిత్రమైన గంగాజలములు కారుతున్నాయి. శివుని తలవెంట్రుకలముడిలో ఉన్న గంగ నీరు ఆయన మెడలోని పుర్రెల జపమాల మీదికి పాకుతోందట. ఆ విధంగా పుర్రెల మీదికి ప్రవహిస్తున్న గంగ నీరు కల శివుని జూటాజటలు (చుట్టచుట్టినజడలు) మిమ్మలిని రక్షించుగాక!

**విద్యుత్ప్రాయలలాటలోచనపుటజ్యోతిర్విమిశ్రత్విషః**

విద్యుత్ ప్రాయమ్ = మెరుపుతో సమానమయిన; లలాట లోచనపుట జ్యోతిః = నుదుట ఉన్న మూడవ కన్నులోని కాంతితో; విమిశ్ర = కలిసిన; త్విషః = తేజస్సుకలిగినవి;

శివుని నుదుట ఉన్న మూడవకన్నులో దేదీప్యమానంగా జ్వాలలు వెలుగుతున్నాయి. ఆ కాంతితో కలగలిసిన కాంతులు కలిగిన శివుని జూటాజటలు (చుట్టచుట్టినజడలు) మిమ్మలిని రక్షించుగాక!

**అకఠోరకేతకశిఖాసందిగ్ధముగ్ధేందవో**

అకఠోర = కోమలమైన; కేతకశిఖా = కేతకీ పుష్పపు అగ్రమా అను; సందిగ్ధ = సంశయమును; ముగ్ధ = అందమైన; ఇందవః = చంద్రునికి కలిగించునవి;

ఇలా చుట్టుప్రక్కలంతా ఎర్రని కాంతులు ఉండటంవల్ల బాలచంద్రుడు మృదువైన మొగలిపువ్వు అగ్రమా అను సందేహాన్ని కలిగిస్తున్నాడు. అలా సందేహాన్ని కలిగించే చంద్రుడు గల శివుని జూటాజటలు (చుట్టచుట్టినజడలు) మిమ్మలిని రక్షించుగాక!

**భుజంగవల్లి వలయ స్రఙ్నద్ధజూటాజటః**

భుజంగ = పాములు; వల్లి వలయ = తీగల వలయములా చుట్టూ అల్లుకొని ఉండటంవల్ల; స్రక్ = పూల హారములవలె; నద్ధః = కట్టబడిన; జూటః = చుట్ట చుట్టిన; జటః = జడలు; త్వాం పాంతు = మిమ్మలిని రక్షించుగాక!

శివుని జటాజూటము పాముల పూలహారాలతో అల్లుకొని ఉంటుంది. అటువంటి శివుని జూటాజటలు (చుట్టచుట్టినజడలు) మిమ్మలిని రక్షించుగాక!

**విశేషాలు :**

1. శివ లింగావిర్భావ సమయంలో మొగలిపువ్వును బ్రహ్మ బ్రతిమలాడి తాను పైభాగాన్ని తాకివచ్చానని అసత్యం చెప్పమన్నాడు. మొగలిపువ్వు అలాగే చెప్పింది. విషయం గ్రహించిన రుద్రుడు మొగలిపువ్వుకు పూజార్హత లేకుండా చేసాడు. కాని ఇప్పుడు కవి వర్ణనలో ఆ మొగలిపువ్వు చంద్రునిరూపంలో శివపూజ చేసింది. ఇదే కవి బ్రహ్మ సృష్టి.

2. పుట శబ్దము (=దొన్నె) సమస్త నేత్రభాగములోని తేజస్సును సూచిస్తుంది.

3. వల్లి వలయము (తీగల వలయము) అనుచోట రూపకాలంకారము.

3. **దశ రూపకాలలో** నాటకము, ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవాకారము వీధి, అంకము, ఈహామృగము – **ప్రకరణానికి సంబంధించినది ఈ మాలతీమాధవము**.

4. ప్రకరణ లక్షణాలు : ఇందులో ఇతివృత్తం కల్పితం.

నాయకుడు ధీరశాంతుడు. శృంగారము ప్రధాన రసముగా ఉంటుంది. నాయకుడు, మంత్రి కానీ, వణిజుడు కానీ, బ్రాహ్మణుడు కానీ అయి ఉండాలి. ఇందులో కులస్త్రీ గానీ, వేశ్యగానీ లేదా ఇద్దరూ కానీ కావ్యనాయికలై ఉండవచ్చు. ప్రస్తుత ప్రకరణములో నాయకుడు విదర్భరాజు మంత్రియైన దేవరాతుని పుత్రుడు మాధవుడు ధీరశాంతుడు. (ధీరత్వమును, శాంతగుణముచే కలిగిన మనః ప్రసన్నత కలిగినవాడు).

మాలతీమాధవములో నాయకుడు ప్రకరణలక్షణమును అనుసరించి మంత్రి కాదు. మంత్రి కుమారుడు. మాలతీమాధవములో నాయిక భూరి వసువు కూతురు కులస్త్రీ. (smile emoticon వ్యభిచారముఁ జేయక కులమును మానమును గాపాడుకొను స్త్రీ.)

ముగింపు :

సీతను కోల్పోయిన రాముని బాధకు రాయి సైతము ఏడుస్తుందని భవభూతి అద్భుతంగా అన్నాడు. ఈ వాక్యానికి మురిసిపోయి గోవర్ధనాచార్యుడు ఆర్యా సప్తశతిలో ఇలా అన్నాడు.

భవభూతేః సమ్బన్ధాత్ భూధరభూరేవ భారతీ భాతి ।
ఏతత్కృతకారుణ్యే కిమన్యథా రోదితి గ్రావా ॥

(భవభూతి సంబంధము వల్ల భారతీదేవి కొండ పుట్టువుగానే (పార్వతీదేవి) ప్రకాశిస్తోంది. అలా కాకపోతే అతడు చేసిన కారుణ్య వర్ణనవల్ల రాయిలా ఎలా ఏడువ నేరుస్తుంది?) అంతటి గొప్పవాడయిన భవభూతి భారతికి నమస్సులు. 

## 27

కాళిదాసు **రఘువంశము**లో ని మొదటి శ్లోకము

**వాగర్థావివ సంపృక్తౌ – వాగర్థప్రతిపత్తయే ।**
**జగతః పితరౌ వందే – పార్వతీపరమేశ్వరౌ ॥**

**ప్రతిపదార్థము :** వాగర్థావివ = వాక్ + అర్థౌ + ఇవ = శబ్దము, అర్థము వలె; సంపృక్తౌ = కూడుకొని ఉన్నవారు (నిత్యమైన సంబంధము కలవారు); జగతః = ఈ లోకానికి; పితరౌ=తల్లిదండ్రులైనవారుఅగు; పార్వతీపరమేశ్వరౌ= పార్వతీ పరమేశ్వరులకు; వాగర్థ = శబ్దము, అర్థముయొక్క; ప్రతిపత్తయే = జ్ఞానము కొరకు; వందే = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** శబ్దము, అర్థము వలె నిత్యమైన సంబంధము కలిగి, ఈ లోకానికి తల్లిదండ్రులగు పార్వతీపరమేశ్వరులకు శబ్దము, అర్థముయొక్క జ్ఞానము కొరకు నమస్కరించుచున్నాను.

**విశేషాలు :**

1. ప్రసిద్ధమయిన సంబంధాలు తొమ్మిది. – 1. పితాపుత్ర సంబంధము, 2. రక్ష్యరక్షక

సంబంధము, 3. శేష శేషి సంబంధము, 4. భర్తృ భార్యా సంబంధము, 5. జ్ఞాతృజ్ఞేయ సంబంధము, 6. స్వస్వామిభావ సంబంధము, 7. శరీరి శరీర సంబంధము, 8. ఆధారాధేయ సంబంధము, 9. భోక్తృభోగ్య సంబంధము.

వీటిలో లేని శబ్దార్థ సంబంధాన్ని నిత్యమని మీమాంసాశాస్త్రము చెప్పింది (మల్లినాథుని రఘువంశ వ్యాఖ్యానము). పార్వతీపరమేశ్వరులు నిత్యసంబంధము కలవారు.

2. ఈ ప్రసిద్ధమయిన శ్లోకములో ఉపమాలంకారముంది.

3. పార్వతీపరమేశ్వరౌ = పార్వతీప + రమేశ్వరౌ అని విడదీస్తే శివుడు, విష్ణువు అనే అర్థం వస్తుంది. సంస్కృతభాషలో "పితరౌ" అంటే ఇద్దరు తండ్రులు అని కూడా అర్థం. అందువల్ల ప్రపంచానికి తండ్రులైన శివవిష్ణువులను కూడా ప్రార్థిస్తున్నానని ఈ శ్లోకాన్ని కొంతమంది వ్యాఖ్యానించారు.

4. పర్వతము యొక్క కూతురు పార్వతి. శ్రేష్ఠుడయిన ప్రభువు పరమేశ్వరుడు.

5. "వాణ్యర్థావివ సంయుక్తౌ వాణ్యర్థప్రతిపత్తయే / జగతో జనకౌ వన్దే శర్వాణీశశిశేఖరౌ" మొదలగు అనేక అభ్యాస శ్లోకాలు ఈ శ్లోక ప్రభావంతో తయారయ్యాయి.

6. సూర్యునినుంచి వెలుగును, చంద్రునినుంచి వెన్నెలను, అగ్నినుంచి వేడిని విడదీయలేము, అలాగే పార్వతీపరమేశ్వరులది విడదీయలేని అవినాభావసంబంధమని, శబ్దార్థముల పోలికతో కాళిదాసు అద్భుతంగా ఆవిష్కరించాడు.

7. రాముని మేని లోని ప్రతి రక్తపు బిందువు జానకీ మనో
జ్ఞామృత భావనా సు మధురాంచిత కోమల పారిజాత మా
లా మధు వాసనా భర విలాసముగా అయిదింద్రియమ్ములన్
బ్రామినదౌ యవాచ్య మధురంబనుభూతి యొకండు పొల్చుచున్.

(కల్పవృక్షము - బాల - కల్యాణ ఖండము 151)

శ్రీరామునకు ప్రతిరక్తపుబిందువులో సీత ప్రేమకు సంబంధించిన ప్రేమ మాధుర్యము కలిసిపోయి పారిజాతపూల వాసనలా చెప్పటానికి వీలులేని మధురిమలను అనుభూతిగా నింపిందట. శబ్దార్థముల నిత్యసంబంధము విశ్వనాథ భావనలో అంతస్సూత్రముగా పరిమళించింది.

8. తన కుమారసంభవ మహాకావ్యములో కాళిదాసు తనకు ఇష్టమయిన శబ్దార్థాల ఉపమానాన్ని మళ్లీ వాడుకొన్నాడు. (తమర్థ– 06 స–79శ్లో)

9. ఉచ్యత ఇతి వాక్. వచ పరిభాషణే. పలుకబడునది వాక్కు. అర్థ్యత ఇత్యర్థః. అర్థ ఉపయాచ్ఞాయాం. కోరబడునది.

10. శివమహాపురాణంలో ఏడు సంహితలు ఉన్నాయి. 1. విద్యేశ్వర సంహిత 2. రుద్ర సంహిత 3. శతరుద్ర సంహిత 4. కోటిరుద్ర సంహిత 5. ఉమా సంహిత 6. కైలాస సంహిత 7. వాయు సంహిత అనేవి. ఇందులో వాయు సంహితా వచనములో శివపార్వతులను శబ్దార్థములతో పోల్చారు. ఉపమాలంకారములో లింగ వ్యత్యయ దోషము రాకుండా ఉండటానికి, కాళిదాసు శబ్ద శబ్దాన్ని "వాక్" అని మార్చాదని శ్రీవేదం వేంకటరాయ శాస్త్రి గారు తమ రఘువంశ వ్యాఖ్యానములో పేర్కొన్నారు.

11. ఈ శ్లోకము **అనుష్టుప్** చందస్సులో ఉంది. ప్రతి పాదములోను – 5వ అక్షరము లఘువు, 6వ అక్షరము గురువు. 7వ అక్షరము – 1, 3 పాదములలో గురువును, 2, 4 పాదములలో లఘువు.

12. శివపార్వతుల్లా శబ్దార్థాల వలె కలిసిన ఇందుమతీ అజుల, సీతారాముల మొదలయిన ఆదర్శదాంపత్య వర్ణనలు ఈ రఘువంశ కావ్యంలో రాబోతున్నాయనే విషయము ఈ నాందీశ్లోకములో సూచింపబడినది.

13. ప్రాచీనకాలంలో చిత్రమీమాంస, రసగంగాధరము, సరస్వతీకంఠాభరణము – ఇలా ఎన్నో ఆలంకారిక గ్రంథాలలో ఈ శ్లోక ప్రసక్తి ఉంది. ఆధునిక కాలంలో ఒక చలనచిత్రపు పుణ్యమా అని–సామాన్యుని వరకు ఈ శ్లోకం చేరింది. కాళిదాసు వాక్కులకు అందని కవి. అర్థాల సముద్రాలు కల శ్లోకాలు తన కావ్యాలలో వ్రాసాడు. ❀

## 28

శ్రీహర్షుని **"ప్రియదర్శిక"** నాటకములోని మొదటి శ్లోకము.

**శ్లో॥ ధూమవ్యాకులదృష్టిరిందుకిరణైరాహ్లాదితాక్షీ పునః**
**పశ్యంతీ వరముత్సుకా నతముఖీ భూయో హ్రియా బ్రహ్మణః ।**
**సేర్ష్యాపాదనఖేందుదర్పణగతే గంగాం దధానే శివే**
**స్పర్శాదుత్పులకా కరగ్రహ విధౌ గౌరీ శివాయాస్తు వః ॥**

**ప్రతిపదార్థము :** కరగ్రహ విధౌ = చేతిని పట్టుకొనుట అనే పనిని జరిపించే పాణిగ్రహణములో (అనగా పెండ్లిలో); ధూమ = వివాహపు హోమగుండంలో నుంచి వచ్చే పొగచేత; వ్యాకుల దృష్టిః = కలతపొందిన దృష్టి కలది; ఇందుకిరణైః = చంద్రుని వెలుగులచేత; ఆహ్లాదితాక్షీ = ఆహ్లాదిత + అక్షీ = సంతోష పెట్టబడిన కన్నులు కలది;

**పునఃపశ్యంతీ వరముత్సుకా –** పునః ,ఉత్సుకా, వరమ్ ,పశ్యంతీ – పునః ఉత్సుకా = మళ్లీ ఉత్సాహము కలదై; వరమ్ పశ్యంతీ = పెండ్లి కుమారుని చూచుచున్నది; **నతముఖీ భూయో హ్రియా బ్రహ్మణః –** బ్రహ్మణః, భూయః, హ్రియా, నతముఖీ – బ్రహ్మణః = దగ్గరగా ఉన్న బ్రహ్మ వల్ల; భూయః = మళ్లీ; హ్రియా = సిగ్గు చేత; నతముఖీ = వంచిన ముఖము కలిగినది;

**సేర్ష్యాపాదనఖేందుదర్పణగతే గంగాం దధానే –** గంగాం దధానే, పాద, ఇన్దు ,నఖ, దర్పణగతే , శివే, సేర్ష్యా – గంగాం దధానే = శివుడు నెత్తిపై గంగను ధరించుటను; పాద, ఇన్దు, నఖ, దర్పణగతే = తన కాలియొక్క గోరు అనెడి చంద్రునిలో చూసి; శివే, సేర్ష్యా = శివుని విషయమై కాసింత అలుక పూనినది; స్పర్శాదుత్పులకా = స్పర్శాత్ + ఉత్పులకా = శివునిచేతి స్పర్శవలన మొలిచిన పులకింతలు కలిగినదయిన; గౌరీ = పార్వతీదేవి; **శివాయాస్తు వః –** వః శివాయ, అస్తు – వః = మీకు; శివాయ అస్తు = శుభమును ఇచ్చుగాక!

**తాత్పర్యము :** శివునితో పార్వతికి వివాహము జరుగుతోంది. వివాహపు హోమగుండంలో నుంచి వచ్చే పొగచేత పార్వతీదేవి కళ్లు కలత పొందాయి. అంతలోనే శివుని నెత్తిపై ఉన్న చంద్రుని వెలుగులచేత ఆమె కళ్లు చల్లబడ్డాయి. సంతోషపడింది. ఒక్కసారి ఉత్సాహము తెచ్చుకొని పెండ్లి కొడుకును శివుడిని చూద్దామనుకొంది. తల ఎత్త బోయి ఆగింది. ఎందుకంటే ఆ పెళ్లి పీటల పక్కనే బ్రహ్మదేవుడు కూర్చున్నాడు. ఒకరు చూస్తుండగా పెళ్లికూతురు పెండ్లికొడుకుని ఎలా చూస్తుంది? అందుకే శివుడిని చూడలేక సిగ్గు ముంచుకొచ్చి ముఖం దించుకొంది. కాని పాపం – తలదించుకొన్నప్పటికీ ఆవిడ కాలియొక్క గోరు అనెడి చంద్రునిలో– శివుని నెత్తి మీద ఉన్న గంగ అనే సవతి కనబడింది. శివుని విషయమై పార్వతికి కాసింత అలుక వచ్చింది. ఇంతలో కథానాయకుడు శివుడు పార్వతి చేయి పట్టుకొన్నాడు. అలుక, కోపం – ఇవన్నీ హుష్ కాకి. శివుని చేతి స్పర్శవలన పులకింతల గిలిగింతలతో మేను జలదరించింది. అలా శివ కరస్పర్శతో ఆనందంగా ఉన్న పార్వతీదేవి మీ అందరికి శుభాన్ని ఇచ్చుగాక!

**విశేషాలు :**

1. ఏడవ శతాబ్దములో కన్యాకుబ్జము పరిపాలించిన శ్రీహర్షుడు ఈ **"ప్రియదర్శిక"** నాటక రచయిత. శ్రీహర్షుని కాలంలో రాజభాష సంస్కృతం. ప్రియదర్శికతో పాటు రత్నావళి, నాగానందం అనే సంస్కృత నాటకాలను రాశాడు. ఇతడి ఆస్థానకవి బాణభట్టుడు. బాణుడు హర్షచరిత్రతోపాటు **'కాదంబరి'** అనే కావ్యాన్ని రాశాడు. ఇవి సంస్కృత సాహిత్యంలో 'మణిరత్నాలు'గా వెలుగొందాయి. హర్షుడి ఆస్థానంలో మయూరుడు (సూర్యశతకం), మాతంగుడు, దివాకరుడు అనే కవులు ఉన్నారు.

2. ప్రియదర్శిక అంగరాజు కూతురు. కథానాయిక. ఉదయనుడు (వత్సరాజు) కథానాయకుడు.

3. ఈ శ్లోకములోని వృత్తము శార్దూల విక్రీడితము.

4. "వాసవదత్త" అను పట్టపు దేవికి బాగా ఇష్టమయిన వత్సరాజు – ప్రియదర్శికను ఆమె అనుమతితో వివాహము చేసుకొంటాడు. ఈ నాటక కథాంశము గంగను నెత్తి మీదికి ఎక్కించుకొన్న శివుడు పార్వతిని పెండ్లి చేసుకొనుట అను అంశము ద్వార కవి నాందీలో వ్యంగ్యంగా ప్రస్తావించాడు.

5. గోరు అనెడి చంద్రుడు – అనుచోట రూపకాలంకారము. ఉపమేయానికి (గోరు) ఉపమానము యొక్క రంగు – (ఉపమానత్వము) – చంద్రత్వము కలిగినది కనుక రూపకాలంకారము.

6. పార్వతీదేవి పేర్లలో ఒక పేరు గౌరి. గౌర వర్ణము కలది గౌరి. (గౌరవర్ణత్వాత్ గౌరీ) గౌరము అంటే 1.ఎఱ్ఱనిది, 2. తెల్లనిది, 3. పసుపుపచ్చనిది, 4. స్వచ్ఛమయినది. అను నాలుగు అర్థాలను శబ్దరత్నాకరము ఇచ్చింది.

7. శివునికి, పార్వతికి మధ్య భేదం లేదు. ఈ శ్లోకంలో పార్వతి రక్షించుగాక! అంటే శివుడు రక్షించుగాక అని కూడా అర్థము తీసుకోవచ్చు. "శివా" అంటే పార్వతీదేవి. సంస్కృతములో శివా అనే శబ్దము చివరి దీర్ఘము తొలిగితే తెలుగులో "శివ" అవుతుంది. ఇక్కడ సంస్కృతము, తెలుగు కలిపిన ఒక భాషా చమత్కారము. "శివా" అని అంటే "శివాని" అవుతుంది. భాషా చమత్కారాలు ఇలాగే ఉంటాయి. పండిత నేమానివారు ఒక సందర్భం ఇలా పేర్కొన్నారు.

“ ఒక శతావధాన సభలో అవధాని దేవళము అనే శబ్దము సంస్కృతపదము అనుకొని సమాసము చేయగా సభ నుండి అభ్యంతరము వచ్చినది. “అయ్యా దేవళము తెలుగు శబ్దముకదా సంస్కృత శబ్దముగా భావించి సమాసము ఎట్లా చేసేరు” అని. అవధానికి ఏమి సమాధానము చెప్పాలో తోచలేదు. కీ.శే. డా॥ చెరువు సత్యనారాయణ శాస్త్రి గారు సభా సంచాలకులుగా ఉన్నారు. వారు “దేవానాం లాలయతి ఇతి దేవళం అని ఆ విధముగా సాధిస్తే దేవళము అనే పదమును సంస్కృతపదముగా వాడుకొన వచ్చును” అని చెప్పారు.

8. **శ్రీహర్షో నిపుణః కవిః –** శ్రీహర్షుడు నిపుణుడైన కవి అని ఈ నాటకములో ఆయనే చెప్పుకొన్నాడు. ఈ మాట సార్థకమైనది. ❁

## 29

పోకూరి కాశీపతి (1892–1974) **‘సారంగధరీయం’**లోని (త్ర్యర్థి కావ్యం) మొదటి పద్యము

**శ్రీసన్మార్గవిలోలుడై కువలయక్షేమప్రదోద్యత్కళో**
**ల్లాసుండై కలధౌతధాముడయి లీలాసోముడై ప్రత్యరి**
**త్రాసుండై గతదోషుడై బుధగురుత్వఖ్యాతి శోభిల్లు రా**
**జౌ సారంగధరుండు మత్కృతిపతిన్ సామోదునిం జేయుతన్.**

**ప్రతిపదార్థము :** శ్రీ = సంపదతో కూడిన; సత్ + మార్గ = మంచి మార్గములో; విలోలుడు + ఐ = మెలిగినవాడై; కువలయ క్షేమ = భూమికి శుభాలను; ప్రద + ఉద్యత్ + కళోల్లాసుండై = బాగా ఇచ్చుటకు ఎత్తబడిన కళలతో సంతోషము కలవాడై; కలధౌత = వెండి(కొండ); ధాముడు + అయి = ఇల్లుగా కలిగినవాడై; లీలా సోముడై = విలాసమైన సోముడను పేరుకలవాడై; ప్రతి + అరి + త్రాసుండు + అయి = ప్రతి శత్రువునకు భయంకరుడై; గత దోషుడు + అయి = పోయిన దోషము కలవాడయి; బుధ గురుత్వఖ్యాతి శోభిల్లు = బుధుడు మొదలైన దేవతలయందు గొప్పదైన కీర్తి చేత ప్రకాశించు; రాజౌ = రాజు + ఔ = రాజయిన; సారంగధరుండు = జింకను ధరించిన శివుడు; మత్ + కృతిపతిన్ = నాకృతికి పతి అయిన గద్వాల సంస్థానాధీశ్వరులైన శ్రీసీతారామ భూపాలరావు గారిని; స + ఆమోదునిన్ + చేయుతన్ = ఆనందముతో కూడిన వానిగా చేయుగాత!

**తాత్పర్యము :** శివుడు సంపద కలిగినవాడు. భూలోక వాసులకు శుభాలను ప్రసాదిస్తూ సంతోషపడేవాడు. వెండికొండ ఇల్లుగా కలిగినవాడు. సోముడను పేరు కలవాడు. శత్రు భయంకరుడు. దోషములు లేనివాడు. దేవతలయందు ప్రకాశించు తన కీర్తి కలవాడు. రాజు. జింకను ధరించిన వాడు. అటువంటి శివుడు నాకృతి పతి అయిన గద్వాల సంస్థానాధీశ్వరులైన శ్రీసీతారామ భూపాలరావు గారికి ఎప్పుడూ ఆనందము కలిగించుగాక!

**విశేషాలు :**

1. రెండర్థాలు వచ్చే కావ్యాలు ద్వ్యర్థి కావ్యాలు. (ఉదా : పింగళి సూరన రాఘవ పాండవీయం 1550) మూడర్థాలు వచ్చేవి త్ర్యర్థి కావ్యాలు. (రాఘవయాదవపాండవీయం – బాలసరస్వతి 17వశతాబ్ది) నాలుగర్థాలు వచ్చేవి చతురర్థికావ్యాలు (నలయాదవరాఘవ పాండవీయం – మరింగంటి సింగరాచార్యులు)

2. ఆధునిక యుగంలో త్ర్యర్థి కావ్యం రచించిన కవి పోకూరి కాశీపతి (1892–1974). ఈ నాలుగాశ్వాసాల కావ్యం **"సారంగధరీయం"** లో పార్వతీకల్యాణం –తారా శశాంకం – సారంగధరీయం – ఈ మూడూ కలిసి పాఠకులను సంతోష పెడతాయి. 'గద్వాల సంస్థానాధీశులు సీతారామభూపతిరావు సారంగధరీయాన్ని 1939లో అంకితం తీసుకున్నారు. 'కవిసింహం' బిరుదు తో ఆయనను గద్వాలసంస్థానఆస్థానకవిగా గౌరవించారు.

3. కవిగారు నివసించే గుంటూరు జిల్లాలోని మాచర్ల కు మహబూబ్‌నగర్ జిల్లాలోని గద్వాలనుంచి సంస్థానమర్యాదలతో పల్లకీ వచ్చేదట. కాశీపతి దాదాపు 60కి పైగా గ్రంథాలు రచించారు.

4. "సారంగధర" అను పదాన్ని ఎన్నుకోవటంలోనే కవి ప్రతిభ కనబడుతుంది. శివుడు సారంగధరుడు. **సారాణి అంగాని యస్య సః సారంగః**– మంచి అవయవములు కలిగిన జింకను సారంగము అంటారు. జింకను ధరించినవాడు శివుడు. జింక గుర్తుగా ఉన్నవాడు చంద్రుడు. అలా శివుడు, చంద్రుడు, సారంగధరుడు ఈ ముగ్గురి పేర్లను కలిపింది. ఆ జింకను ధరించినవాడు కనుక శివుడు సారంగధరుడు. "ఓ రంగశాయి పిలిచితే / ఓయనుచు రా రాదా / సారంగధరుడు జూచి / కైలాసాధిపుడు కాలేదా "అని త్యాగరాజస్వామి ఒక కీర్తనలో శివుని పర్యాయ పదమయిన సారంగధర శబ్దాన్ని అందంగా ప్రయోగించారు.

5. శివుడు కీర్తికలవాడు అని చెబితే మామూలు వాక్యము. శివునికీర్తి దేవతలలో ప్రకాశిస్తోందంటే అందమైన కవితోక్తి.

6. **సూతే అమృతమితి సోమః–** అమృతమును పుట్టించినవాడు సోముడు. శివుడు హాలాహలాన్ని కంఠమందు ఉంచుకొన్నప్పటికీ, ఆయన పేరు తలచుకొని పరవశించే భక్తుల హృదయంలో జ్ఞానామృతాన్ని పుట్టిస్తాడు. అందుకే ఆయన సోముడు. సోమ అను పదమును స + ఉమ అని విడదీస్తే పార్వతితో ఉన్నవాడు అను అర్థము శివపరంగా వస్తుంది. ప్రతి సోమవారం శివునికి ఇష్టమని అందుకే కొంతమంది ఆ రోజు నిష్ఠతో ఉంటారు. పోకూరివారు ఈ సోమ శబ్దాన్ని" లీలా సోముడై" అని ముగ్గురి పరంగా వాడినతీరు ప్రశంసనీయము.

7. కేలాసము అంటే స్ఫటికం. తెల్లని పటికరాయి. దాని సంబంధమైనది కైలాసము. కలం కాలుష్యం ధౌతమన్యేతి కలధౌతం. ధావు గతిశుద్ధ్యోః పోగొట్టబడిన కాలుష్యము కలది కనుక వెండిని కలధౌతము అంటారు. కలధౌతము, కేలాసము – ఛాయలో దగ్గరి సంబంధము కలిగినవి. అందుకే కైలాసస్ఫురణము కలిగించే కలధౌత శబ్ద ప్రయోగంలో కవి చక్కని శ్రద్ధ తీసుకొన్నారనిపిస్తోంది. కలధౌత ధాముడు మన పాప కాలుష్యాలను పోగొడుతాడు.

8. పరమశివుని రూపంలో ఒక్కొక్కదానికి ఒక్కొక్క అర్థం ఉన్నది అని పెద్దలు చెబుతారు.

ఆయన పట్టుకున్న నాలుగు జింక కాళ్ళు నాలుగు వేదాలకు సూచన. **నందీశ్వరుడు** సత్సాంగత్యానికి, **మూడవ నేత్రం** జ్ఞానానికి ప్రతీక. శివుని **త్రిశూలం** సత్వ, రజ, తమో గుణాలకు ప్రతీక. **డమరుకం** శబ్ద బ్రహ్మస్వరూపం. శివుని తలపైన ఉన్న **చంద్రవంక** మనోనిగ్రహానికి గుర్తు. **గంగాదేవి** శాశ్వతత్వాన్ని నిరూపిస్తుంది. స్వామి శరీరంపై ఉన్న **పాములు** జీవాత్మలు. ధరించిన **ఏనుగుచర్మం** అహంకారాన్ని త్యజించమని బోధిస్తుంది. కూర్చున్న **పులిచర్మం** కోరికలకు దూరంగా ఉండమని చెబుతుంది. **భస్మం** పరిశుద్ధత ఆవశ్యకతను వివరిస్తుంది.

9. "శరధి శరధి తార తార చంద్ర చంద్ర సదృశా" (సముద్రాన్ని, ఈశ్వరుని, వెండిని, కర్పూరాన్ని, చంద్రుని పోలిన కీర్తి కలవాడా!) అని కృతిపతిని పోకూరి కాశీపతి ఈ సారంగధరీయపు చివరి పద్యంలో పొగిడారు. ఈ మాటలు పోకూరి కాశీపతికి కూడా వర్తిస్తాయి.



## 30

విశాఖదత్తుని **ముద్రారాక్షసనాటకము**లోని మొదటి శ్లోకము.

**శ్లో॥ ధన్యా కేయం, స్థితా తే శిరసి,శశికలా కిం ను నామైతదస్యాః?**
**నామైవాస్యాస్తదేతత్ పరిచితమపి తే విస్మృతం కస్య హేతోః ।**
**నారీం పృచ్ఛామి నేందుం, కథయతు విజయా న ప్రమాణం యదీన్దు -**
**ర్దేవ్యానిహ్నోతుమిచ్ఛోరితి సురసరితం శాఠ్యమవ్యాద్విభోర్వః ॥**

**ప్రతిపదార్థము :**

పార్వతీ పరమేశ్వరుల సంభాషణ

స్థితా తే శిరసి = నీ నెత్తి మీద ఉన్న; ధన్యా కేయమ్ = ధన్యా కా ఇయమ్ = పుణ్యవతి ఎవరు?; శశికలా = చంద్రకళ; కిం ను నామైతదస్యాః? = కిమ్ + అస్యాః నామ + ఏతత్ + ను = ఈమె పేరు ఇదేనా?; నామైవాస్యాస్తత్ = అస్యాః తత్ + ఏవ + నామ = ఈమెకు అదే పేరు; ఏతత్ పరిచితమపి తే విస్మృతమ్ = ఇది నీకు బాగా తెలిసిన పేరే అయినప్పటికి మరిచిపోయావు; కస్య హేతోః = కారణము ఏమిటి?; నారీం పృచ్ఛామి నేందుమ్ = న + ఇందుమ్ = స్త్రీని అడుగుతున్నాను. చంద్రుని కాదు; న ప్రమాణం యదీన్దుః = యది + ఇన్దుః = ఒకవేళ చంద్రుడు నీకు ప్రమాణము కాకపోతే; కథయతు విజయా = విజయ చెప్పుగాక!; దేవ్యానిహ్నోతుమిచ్ఛోరితి సురసరితమ్ = దేవ్యా నిహ్నోతుమ్ + ఇచ్ఛోః + ఇతి + సురసరితమ్ = ఈ విధంగా పార్వతీదేవి వలన(నుండి) గంగానదిని దాచిపెట్టదలచు కోరిక కలిగిన; శాఠ్యమవ్యాద్విభోర్వః = శాఠ్యమ్ + అవ్యాత్ + విభోః + వః = ప్రభువైన ఈశ్వరుని యొక్క కపటత్వము మిమ్మలిని కాపాడుగాక!

**తాత్పర్యము :** ఇది ఒక అందమైన సన్నివేశం. పార్వతీదేవి శివునిచేత ఆయన నెత్తి మీద ఉన్న గంగానది పేరును చెప్పించాలనుకొంటోంది. ఆయనేమో చెప్పడు. ఆవిడన్న మాటకు వేరే అర్థములో ఆయన జవాబిస్తుంటాడు. విజయ అనే పార్వతీదేవి చెలికత్తె కూడా మౌనప్రేక్షకురాలిలా ఈ సన్నివేశంలో ఉంది. ఇక సన్నివేశ సంభాషణలు చిత్తగించండి.

పార్వతి - ఏమండి! మీ నెత్తిమీద ఉన్న ఆ పుణ్యవతి ఎవరండి?

శివుడు - చంద్రకళ.

పార్వతి – ఈమె పేరు ఇదేనా?

శివుడు – ఈమెకు అదే పేరు

పార్వతి – ఇది మీకు బాగా తెలిసిన పేరే అయినప్పటికి మరిచిపోయినట్టున్నారు.

శివుడు – నువ్వు అలా ఎందుకనుకొంటున్నావు. కారణము ఏమిటి?

పార్వతి – ఎందుకంటే నేను నెత్తిమీద ఉన్న స్త్రీని అడుగుతున్నాను. చంద్రుని కాదు.

శివుడు – ఒకవేళ చంద్రుని మీద నీకు నమ్మకము లేకపోతే నీ చెలికత్తె విజయ చెప్పుగాక!

ఈవిధంగా పార్వతీదేవి నుండి గంగానది పేరును దాచిపెట్టదలచు కోరిక కలిగిన ప్రభువైన ఈశ్వరుని యొక్క ప్రణయకపటత్వము మిమ్మలిని కాపాడుగాక!

**విశేషాలు :**

1. ఈ శ్లోకంలో విశాఖదత్తుడు, స్త్రీలింగ, నపుంసకలింగ శబ్దాలతో అందమైన సంభాషణా భవంతి కట్టాడు. పార్వతీదేవి ప్రశ్నలన్నింటా స్త్రీలింగ శబ్దాలే. (ధన్యా, నారీ,) ఈశ్వరుడు ఏమి తెలియనివాడిలా ఆమె అడిగిన ప్రశ్నకు “తత్” (అది) అని నపుంసకలింగ వాచకాలతో జవాబిస్తుంటాడు.

2. విజయ – అను స్త్రీ – పార్వతీదేవి చెలికత్తె అని కాళిదాసు కుమారసంభవములో ఉంది. (కుమారసంభవము – 08వసర్గ – 07వ శ్లో)

3. ఈ నాందీ శ్లోకంలో వక్రోక్తి అలంకారము ఉంది. ఒకరకముగా చెప్పిన వాక్యాన్ని ఇంకొకరకముగా ఊహించుట వక్రోక్తి.

4. తిన్నని మాటలు కలవాడు రాక్షస మంత్రి. వంకర మాటలు కలవాడు చాణక్యుడు. శ్లోకంలోని “ఇందు” శబ్దము చంద్రగుప్తుని సూచిస్తోంది. ఈ రకంగా నాందీ శ్లోకము కథలోని పాత్రలను సూచిస్తోంది.

5. ఈ శ్లోకంలోని వృత్తము **స్రగ్ధర** – గణములు : మ ర భ న య య య. 8వ అక్షరము, 15వ అక్షరము యతులు

6. **నాయిక లేని ఏడంకాల నాటకం ముద్రారాక్షసం**

7. చాణక్యుడు, చంద్రగుప్తుడు, రాక్షసమంత్రి,– వీళ్ల కథ ముద్రారాక్షసము.

8. **“ముద్రయో గృహీతం రాక్షసమధికృత్య కృతో గ్రంథః ముద్రారాక్షసం”** అని వ్యుత్పత్తి. ముద్ర అంటే ఉంగరం. రాక్షసుడంటే రాక్షస మంత్రి. ఈ నాటకంలో కీలకమైనది ఉంగరం. రాక్షసమంత్రి తెలివితేటలకు ఈ ఉంగరం ముసుగు కప్పుతుంది. అందుకే Rakshasa's Ring అనే పేరు మీద దీని ఆంగ్లానువాదం జరిగింది.

9. విశాఖదత్తుడు తన ముద్రారాక్షసనాటకం లో దీపావళిని **‘కౌముదీ మహోత్సవం’** అన్నాడు. కౌముది అంటే వెన్నెల. కార్తికమాసానికి కౌముదీ మాసం అని, కార్తిక పౌర్ణమికి దీపాల పండుగ అని పేర్లు ఉన్నాయి.

10. ఏమండీ! శివుడు రక్షించుగాక! అంటే సరిపోతుందికదా! పార్వతి ప్రశ్న, ఆయన జవాబు ఇవన్నీ ఎందుకండీ! అని ప్రశ్న.

ఒక్క అన్నమే తినవచ్చు కదా! కూర, పచ్చడి, రసము, తీపి ఇవన్నీ ఎందుకు? అని ప్రశ్న జవాబు.

రసము, అలంకారము, ధ్వని ఇవన్నీ మన జీవితంలో ఉన్నవే. కవిత్వంలో మన ఆనందం కోసం చేరాయి. ఆ కవిత్వపు ఆనందాన్ని ఆస్వాదించే హృదయాన్ని కాపాడుకోవటం సహృదయుల పని.

(ఇందులో కొన్ని విషయాలు శ్రీమాన్ నేలటూరి రామదాసయ్యంగారు రచించిన “ముద్రారాక్షసము” నుండి గ్రహించాను. వారికి కృతజ్ఞతలు) ❀

## 31

కూచిమంచి తిమ్మకవి **శ్రీ సింహాచలక్షేత్రమాహాత్మ్యము** లోని మొదటిపద్యము.

**శ్రీ కైలాస ధరాధరోపరి పరిస్నిగ్ధేందుశాలాతలా**
**నేకానూన చిరత్న రత్నరుచి సందోహస్ఫురద్దివ్యసిం**
**హాకారోన్నత హేమ పీఠమున నీహారాద్రిజం గూడి యం**
**దాకల్పంబుగ నుండు శంకరుని నే బ్రార్థింతు నశ్రాంతమున్.**

**ప్రతిపదార్థము :** శ్రీ కైలాసధరాధర = సంపద కలిగిన వెండికొండ; ఉపరి = మీద; పరిస్నిగ్ధ = స్నేహము గల; ఇందు = చంద్రుడు; శాలా = ఇంటియందు కొంతభాగము; తల = స్థలము; అనేక = బహు; అనూన = 1. అంతయు, 2. వెలితి లేనిది; చిరత్న = బహుదినములది, పాతది. చిరంతనము; రత్న = మణి, స్వజాతియందు శ్రేష్ఠమైనది;

రుచి = కాంతి; సందోహ = సమూహములతో; స్ఫురత్ = ప్రకాశించే, తళతళమని మెరిసే; దివ్య = దివియందుఁ బుట్టినది, ఒప్పునది; సింహాకార = సింహము ముఖముగా కలిగిన; ఉన్నత = ఎత్తైన, హేమపీఠమున = బంగారపు ఆసనముపై; నీహారాద్రిజన్ + కూడి = మంచుకొండ కుమార్తె పార్వతితో కలిసి; అందు = ఆ సింహాసనములో; ఆకల్పంబుగ = శాశ్వతముగా – కల్పపర్యంతము.వ్యు. కృపూ = సామర్థ్యే – ఆ + కృప్ + ఘఞ్ – రేఫస్య లః. (కృ.ప్ర.); ఉండు = నివసించు; శంకరుని = శుభములను చేయు శివుని; అశ్రాంతమున్ = ఎల్లప్పుడు; నేన్ + ప్రార్థింతు = నేను ప్రార్థిస్తుంటాను.

**తాత్పర్యము :** సింహముఖము ఉన్న బంగారముతో ఉన్న ఎత్తైన పీఠమును సింహాసనము అంటారు. పార్వతీదేవితో కలిసి శివుడు కూర్చున్న సింహాసనము వెండికొండతో స్నేహము గలది. (వెండికొండ మహిమ కలిగినదని భావము) చంద్రుని కాంతికిరణాలతో నిండినది కలిగినది. (చల్లనిదని, ఆ సింహాసన స్మరణముతో భక్తుల హృదయములకు చల్లదనము లభిస్తుందని బావము) అనేకమైన మణి కాంతులతో తళతళమని మెరిసేది. దివ్యమైనది. ఆవిధంగా సింహాసనముపై పార్వతీదేవితో కలిసి ఉన్న శాశ్వతుడయిన శంకరుని ఎల్లప్పుడు నేను ప్రార్థిస్తుంటాను.

**విశేషాలు :**

1. తాను వ్రాయబోతున్న కావ్యము శ్రీ సింహాచలక్షేత్రమాహాత్మ్యము. కాని నాందీ పద్యములో శివస్తుతి చేసాడు కూచిమంచి తిమ్మకవి.

2. శంకరుని సింహాసన ప్రసక్తి ఎందుకంటే కావ్యము సింహాచల క్షేత్రమాహాత్మ్యము కనుక. సింహశబ్దముద్వార కావ్యప్రసక్తిని నాందిలో కవి తీసుకువచ్చాడు.

3. ఏనుగులు మొదలైన మృగాలను హింసించేది అని సింహ శబ్దానికి అర్థం. **(హినస్తి హస్త్యాదికమితి సింహః హిసి హింసాయాం)** సింహ శబ్దము మన వాఙ్మయములోను – జీవితములోను కలిసిపోయింది. గతాన్ని అందులో తప్పొప్పులను నిలకడగా విశ్లేషించు కోవటం సింహావలోకనము (retrospection) అంటాము.

4. సింహము ఒక మృగాన్ని చంపి ముందుకు వెళుతూ, కొంతదూరము వెళ్లిన తరువాత తిరిగి వెనకకి తిరిగిచూస్తుంది. అపుడింకొక జంతువు కనబడితే పరుగుపరుగున వచ్చి దానినిగూడ చంపుతుంది. సిద్ధాంతి తనవాదమును సమర్థించుకొంటూ వాదములో కొంతదూరము ముందుకు పోయిన తరువాత వెనుదిరిగి వాదిని పూర్వపక్షము చేస్తూ యుక్తితో వాని ఓడిస్తాడు. **ఇది సింహావలోకన న్యాయం.**

5. ప్రహ్లాదుని కోరికపై సింహాచలంలో స్వామి నరసింహస్వామి, వరాహనృసింహ స్వామి రూపాలతో వెలిసాడు. పూర్వం హిరణ్యకశిపుణ్ణి సంహరించిన తరువాత ప్రహ్లాదుడు నరసింహస్వామిని ఇక్కడ ప్రతిష్ఠించినట్టు ఇతిహాసం చెబుతోంది.

6. సంవత్సరానికి 12 గంటలు మాత్రమే ఈ నరసింహదేవుని నిజరూపదర్శనం భక్తులకు లభిస్తుంది. మిగిలిన సమయంలో ఈ విగ్రహాన్ని చందనంతో కప్పివేస్తారు. నిజరూప దర్శనసమయాన్ని చందనయాత్ర లేదా **చందనోత్సవం** అంటారు. ఇది ప్రతీ సంవత్సరం వైశాఖమాసం శుద్ధ తదియనాడు వస్తుంది.

7. ఈ నరసింహుని అవతార నిజరూపం సింహము తల కలిగిన మనిషి శరీరంతో త్రిభంగి ముద్ర లో (the three-way standing attitude of the images of certain Hindu deities) ఉంటుంది. మిగిలిన సమయంలో చందనం కప్పబడి లింగాకారంలో స్వామివారి నిత్యరూపం ఉంటుంది. సాధారణంగా వైష్ణవ క్షేత్రాలకు శివుడు ... శైవ క్షేత్రాలకు విష్ణువు క్షేత్రపాలకులుగా ఉంటారు. అలా సింహచలంలోని క్షేత్రపాలకుడు ఈశ్వరుడు.

8. **"శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే, శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః"** శివుడూ, విష్ణువు ఒకరే. వేరు కాదు. వ్యాసుడు హరివంశంలో 'నమో హరిహరాయ చ' ప్రయోగించారు. తిక్కన మహాభారతంలో ఒక చోట 'వ్యాస సమాసైకరూప హరిహరనాథా!' అని ప్రయోగించాడు. (విరాటపర్వం – పంచమాశ్వాసం మొదటి పద్యం) హరి హర అనే రెండు పదాలు వ్యాసుడు ఒక సమాసంగా మార్చాడు. దానిని తిక్కన గ్రహించాడు. ఈ బాటలోనే కూచిమంచి తిమ్మకవి విష్ణు కావ్యానికి, శైవ నాంది చేసాడు. ఎత్తుకు పోతున్నకొద్దీ అంతా ఒకటిగా కనిపిస్తుంది. ❁

## 32

శ్రీహర్షుని **రత్నావళి**లోని మొదటి శ్లోకము

**శ్లో॥ పాదాగ్రస్థితయా ముహుస్స్తనభరేణానీతయా నమ్రతాం**
**శంభోః సస్పృహలోచనత్రయపథం యాంత్యా తదారాధనే ।**
**హ్రీమత్యా శిరసీహితస్సపులకస్వేదోద్గమోత్కంపయా**
**విశ్లిష్యన్ కుసుమాంజలిర్గిరిజయా క్షిప్తోఽంతరే పాతు వః ॥**

**ప్రతిపదార్థము :** పాదాగ్ర స్థితయా = పాద + అగ్ర స్థితయా = పాదాగ్రమున నిలబడినది;

ముహుః = మాటిమాటికి; స్తనభరేణ = స్తన భారమున; నమ్రతామ్ = వినయంగా ఉండటం (humbleness, politeness); ఆనీతయా = పొందింపబడిన; శంభోః = పరమేశ్వరుని యొక్క; సస్పృహలోచన త్రయ పథమ్ = మూడుకన్నులలో కోరికలు కదలాడుతుండగా; యాంత్యా = దగ్గరికి వచ్చినది; హ్రీమత్యా = సిగ్గు చేత; సపులక = పులకింతలవలన (రోమాంచమువలన); స్వేదోద్గమోత్కంపయా = స్వేద + ఉద్గమ + ఉత్కంపయా = చెమట పుట్టుక, వణుకు కలుగుచుండగా; గిరిజయా = పార్వతీదేవి చేత; తదారాధనే = శివపూజలో; శిరసి = తలయందు; ఈహితః = అర్పించుటకు కోరబడిన; క్షిప్తః = ఉంచబడిన; అంతరే = పార్వతీశివులమధ్య; విశ్లిష్యన్ = వదలిన, చెదరిన; కుసుమాంజలిః = పుష్పాంజలి (Presenting a nosegay or flowers held in both hands opened and hollowed); వః = మిమ్ములను; పాతు = రక్షించుగాక!

**తాత్పర్యము :** అయ్య కంటె, అమ్మ కొంచెం ఎత్తు తక్కువ (శ్రీహర్షుని ఊహ). అయ్య – శివయ్య నెత్తిమీద పూలు ఉంచుదామని అమ్మ తలంపు. అందుకే దోసిలిలో పూలు తీసుకొని శివుని నెత్తిమీద ఉంచుదామని చూసింది. మామూలుగా అందలేదు. అందుకే శివుని దగ్గరగా వచ్చి, ఆయన తలను అందుకొందామని పాదాల వేళ్ల మీద నిలబడింది. కాని స్తనభారముతో పూర్తిగా నిలబడలేక కొంచెం వంగింది. అంత దగ్గరగా ఉన్న పార్వతిని చూసిన శివయ్య మూడుకన్నులలో కోరికలు కదలాడాయి. అది గమనించిన పార్వతి శరీరంలో పులకింతలు, చెమట, వణుకు వచ్చాయి. ఆ పులకింతల కంగారులో పార్వతి దోసిలిలో ఉన్న పూలు శివుని నెత్తి మీద ఉంచకుండానే వాళ్లిద్దరి మధ్య జారిపోయి చెదరిపోయాయి. అలా చెదరిపోయిన పుష్పాంజలి మిమ్మలిని రక్షించుగాక!

**విశేషాలు :**

1. ఇందులో వృత్తము **శార్దూల** విక్రీడితము. (మసజసతతగ) శార్దూలములోని మొదటి మగణము శుభగణము.

2. ఈ శ్లోకంలో కావ్యలింగాలంకారమున్నది.

3. సమర్థించవలసిన అర్థానికి సమర్థనాన్ని (సాధనాన్ని) చెబితే అది కావ్య లింగాలంకారము అవుతుంది. శివపార్వతుల మధ్య పుష్పాంజలి చెదరి పోయింది. దీనికి హేతువు శివసాన్నిధ్యములో పార్వతికి కలిగిన పులకింత.

4. ఈ నాటికను మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు తెలుగులోకి అనువదించారు. వారి అనువాద పద్యమిది.

"పాదాగ్రస్థితయై పయోధరతటీభారంబునన్ మ్రొగ్గుచున్
శ్రీదాక్షాయణి యాశు చూపు గమి యూరింపన్ సపర్యన్ ద్రపా
స్వేదంబుల్ పులకల్ వడంకుగ శిరస్సీమం బడం జిమ్మనా
చేదోయిం బువులంతరాపతితముల్ శ్రీలిచ్చి మిమ్మోముతన్"

5. వాసవదత్త అను కథానాయిక తన చెల్లెలు రత్నావళిని – వత్సరాజు ఉదయనునికి అర్పించుట ఈ నాలుగు అంకముల నాటకములోని ప్రధాన కథ.

6. **పాదస్య అగ్రం పాదాగ్రం–** పాదముకొన.

7. ముహుః అనునది అవ్యయము. ముహుః, పునః పునః, శశ్వత్, అభీక్ష్ణం, అసకృత్ అను ఈ అయిదు మాటిమాటికి అను అర్థములో వర్తిస్తాయి.

8. **పుష్ప్యతీతి పుష్పం – పుష్పవికసనే** – వికసించునది కనుక పుష్పము.

9. **అంజ్యతే వ్యజ్యతే భక్తిరనేనేతి అంజలిః.** అంజూ వ్యక్తి శ్లక్ష్ణకాన్తి గతేషు. దీనిచేత భక్తి వ్యక్తము చేయబడుతుంది కనుక దోసిలికి అంజలి అని పేరు.

10. సింహళద్వీపమునుండి వచ్చు రత్నావళి సాగరములో పడిపోయినదను నాటక కథాంశము నాందిలోని పుష్పములు పడిపోవుటలో సూచింపబడినది. ❀

## 33

కాళ్లకూరి నారాయణరావు (1871–1927) **చింతామణి నాటకము** లోని మొదటి పద్యము.

**భామలపైఁ బసిండి పయి – భ్రాంతిఁ దృజించి, విశుద్ధతత్త్వబో**
**ధామృతముం గ్రహించి సముదంచితవృత్తిఁ జరించు సజ్జన**
**స్తోమములం గృపాజలధిఁ దోఁగఁగఁ జేసి భరించు భక్త చిం**
**తామణియైన ఈశ్వరుడుదారమతిన్దరిజేర్చు మిమ్ములన్.**

**ప్రతిపదార్థము :** భామలపైన్ = 1. ఆడువారిపై 2. వీథిభాగవతములో నాయికా పాత్రలపై (వీరిపై పల్లెలలో పెద్ద మోజు.); పసిండి పయి = బంగారముపై; భ్రాంతిన్ = భ్రమను; త్యజించి = విడిచి; విశుద్ధతత్త్వ = పరిశుద్ధమైన పరమాత్మ యొక్క; బోధామృతమున్ = బోధ + అమృతమున్ = బోధ అనెడి అమృతమును; గ్రహించి = స్వీకరించి; సముదంచిత = గౌరవింపఁబడిన; వృత్తిన్ + చరించు = నడవడికతో

ప్రవర్తించు; సజ్జనస్తోమములన్ = మంచివారి సమూహములను; కృపాజలధిన్ = దయ అనెడి సముద్రములో; తోగగన్ + చేసి = మునుగునట్లుగా చేసి, తడియునట్లుగా చేసి; భరించు = మోయు, కాపాడు; భక్త చింతామణియైన = కోరినకోరికల నిచ్చెడు దేవమణి వంటి; ఈశ్వరుడు = పరమశివుడు; ఉదారమతిన్ = గొప్పబుద్ధితో; మిమ్ములన్ = మిమ్మలనందరిని; దరిన్ + చేర్చు = సంసారసాగరమునుండి ఒడ్డుకు చేర్చుగాక!

**తాత్పర్యము :**

ఆడువారిపై, బంగారముపై భ్రమనువిడిచి పరిశుద్ధమైన పరమాత్మయొక్క బోధ అనెడి అమృతమును స్వీకరించి గౌరవింపబడిన నడవడికతో ప్రవర్తించు మంచివారి సమూహములను దయ అనెడి సముద్రములో తడియునట్లుగా చేసి కాపాడు, కోరినకోరికల నిచ్చెడు, దేవమణి అయిన చింతామణివంటి పరమశివుడు గొప్పబుద్ధితో మిమ్ములనందరిని సంసారసాగరమునుండి ఒడ్డుకు చేర్చుగాక! (మోక్షము అనుగ్రహించాలని భావము)

**విశేషములు :**

1. ఉన్నది లేనట్టును లేనిది ఉన్నట్టును తలచుట భ్రాంతి. ప్రాపంచిక ఆకర్షణలు భ్రాంతి అని, వాటిని విడిచిపెట్టమని కవి ప్రబోధము.

2. **చింతామణిం పరిత్యజ్య కాచమణిగ్రహణన్యాయం** అని ఒక న్యాయం ఉంది. చింతామణిని వదలిపెట్టి గాజుచిప్పను గ్రహించినట్లు. (బ్రహ్మజ్ఞానాన్ని వదలిపెట్టి సాంసారికసుఖాలకు అఱ్ఱులు చాచడం.) అని దీని అర్థం.

3. చింతామణి ఒక వేశ్య. భవాని శంకరుడు, సుబ్బిశెట్టి బిల్వమంగళులను ఆమె ఆకర్షిస్తుంది. బిల్వమంగళునిలో పరివర్తన వచ్చిన తరువాత చింతామణికి శ్రీకృష్ణ దర్శనమవుతుంది. ఆమె సంన్యాసిని అవుతుంది. బిల్వమంగళుడు లీలాశుక యోగీంద్రుడుగా మారి **శ్రీకృష్ణకర్ణామృతం** అనే సంస్కృతగ్రంథాన్ని రచిస్తాడు.

4. కర్ణాటక రాష్ట్రంలో 'చింతామణి' అనే మహిమాన్వితమైన క్షేత్రం ఉంది. పూణే కు దగ్గరగా ఉన్న థియుర్ అనే చిన్న గ్రామంలో కూడా చింతామణి దేవాలయం ఉంది.

5. మన కథల్లో ఇద్దరు చింతామణులు వున్నారు. ఒకరు కాళ్లకూరి చింతామణి, రెండో చింతామణి తనకు నచ్చిన మగాళ్ళతో సుఖాలు తలలు నరికించే సహస్ర చింతామణి.

6. ఈ చింతామణి నాటకం రక్తికట్టడానికి నాటక పాత్రధారులు అసలు నాటకానికి

భిన్నంగా ఎన్నో ప్రక్షిప్తాలను జోడించారు. హాస్యం పేరుతో కొన్ని వర్గాలను కించపరిచారు. అసలు నాటకం చదివితే కాళ్లకూరి సంస్కరణాభిలాష మనకు బాగా తెలుస్తుంది.

భక్తచింతామణి అను సమాస ఘటన ద్వార – ఈ నాందీ పద్యములో కాళ్లకూరివారు చింతామణి అను వేశ్య కథను తాను చెప్పబోతున్నట్లుగా భావి కథాంశమును స్ఫురింపచేసారు. 

## 34

శూద్రకుని **మృచ్ఛకటికము** లోని మొదటి శ్లోకము.

> **పర్యంక గ్రంథి బంధ ద్విగుణిత భుజగాశ్లేష సంవీత జానో**
> **రంతఃప్రాణావరోధవ్యుపరతసకలజ్ఞానరుద్ధేంద్రియస్య! ।**
> **ఆత్మన్యాత్మానమేవ వ్యపగతకరణం పశ్యతస్తత్త్వదృష్ట్వా**
> **శంభోర్వః పాతు శూన్యేక్షణఘటితలయబ్రహ్మలగ్నస్సమాధిః ॥**

**ప్రతిపదార్థము :** పర్యంక = వీరాసనము యొక్క; గ్రంథి బంధ = ముడి సడలమికై; ద్విగుణిత = రెట్టింపు చేయబడిన; భుజగాశ్లేష సంవీత జానోః = పాముచేత చుట్టబడిన మోకాలు కలవాడును; అంతః ప్రాణ = లోపల ఉన్న ప్రాణవాయువుని; అవరోధ = బయటికి రాకుండా అడ్డగించుట చేత; వ్యుపరత = వి + ఉపరత = నివర్తింపబడిన; సకలజ్ఞానరుద్ధేంద్రియస్య = సకలజ్ఞాన + రుద్ధ + ఇంద్రియస్య = అన్నిరకాల జ్ఞానరూపములయిన చిత్తవృత్తులచేత అడ్డగింపబడిన ఇంద్రియములు కలవాడు; తత్త్వదృష్ట్వా = తత్త్వదృష్టి చేత; ఆత్మని = తనయందు; ఆత్మానమేవ = ఆత్మానమ్ + ఏవ = తనకంటె వేరు కాని పరమాత్మను; వ్యపగత కరణమ్ = అడగిన బహిరంతఃకరణ వ్యాపారములు కలిగి; పశ్యతః = చూస్తున్న; శూన్యేక్షణఘటిత = శూన్య + ఈక్షణ ఘటిత = దేనియందు తగులుకొనని చూపు చేత; లయ = దానియందు లీనమయిన స్థితిలో; బ్రహ్మలగ్నః = పరబ్రహ్మములో లగ్నమయిన; శంభోః సమాధిః = శివుని సమాధిస్థితి; వః = మిమ్మలిని; పాతు = రక్షించుగాక!

**తాత్పర్యము :** పరమశివుడు వీరాసనము వేసుకొని కూర్చున్నాడు. కుడిమోకాలుపై ఎడమపాదాన్ని ఉంచి, ఎడమతొడ క్రింద కుడిపాదం ఉంచి కూర్చునే భంగిమ వీరాసనం.

ఆ ఆసనంలో మోకాలి మడతల్లోంచి అరికాలు జారిపోకుండా పామును ముడిగా చుట్టుకొన్నాడు. ప్రాణవాయువుని బయటికి రాకుండా అడ్డగించుటచేత ఇంద్రియాలను నిరోధించాడు. ఆ నిర్వికల్పస్థితిలో తనకంటె వేరుకాని పరమాత్మను దర్శిస్తున్నాడు. అలా ఉన్న శివుని చిత్తైకాగ్రత మిమ్మలిని కాపాడుగాక!

**విశేషాలు :**

1. "తారకబ్రహ్మము తానైవున్నాడు" (రేకు: 1943-5 సం: 29-197 ) అనే కీర్తనలో రాముని చేత అన్నమయ్య వీరాసనము వేయించాడు (వీరాసనముతో నరిచి ఆనందాన నున్నాడు రాముడు).

2. ఇంద్రియాలు మూడు విధాలు. కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు, అంతరింద్రియాలు. వాక్కు, పాణి, పాదం, పాయువు (మలద్వారం), ఉపస్థం అనేవి కర్మేంద్రియాలు. త్వక్కు (చర్మం), చక్షువు, శ్రోత్రము, జిహ్వా, ఘ్రాణం అనేవి జ్ఞానేంద్రియాలు. జ్ఞాతృ, మనో, బుద్ధి, చిత్త, అహంకారాలు అంతరింద్రియాలు.

3. "యోగవాసిష్ఠం" ఉపశమ ప్రకరణం 62 వ సర్గలో 8 మొదలు 12 వరకు శ్లోకాలు సమాధిలక్షణాలను వివరిస్తున్నాయి. అవి : తృణానికి అగ్నివంటిదగు ఆత్మతత్వావ బోధంతో సమస్త ఆశల పరిష్కారం సమాధి గానీ తూష్ణీం భావం కాదు. "ఏకాగ్రమును, నిత్యతృప్తమును, సత్యవస్తువును అవలోకించునదియు, అబాధితమగు ఆత్మతత్వాన్ని దర్శించే పరాప్రజ్ఞయే సమాధి. క్షోభాహంకార రహితమును, ద్వంద్వములందు తగుల్కొన నదియు, మేరుపర్వతం కంటే స్థిరమైన ఆకృతి కలది ఐన స్థితే సమాధి. నిశ్చింతతో కూడినదీ, అభీష్ట ప్రాప్తినొందినదీ, హేయోపాదేయవర్జితమైనదీ పరిపూర్ణమైనదీ అయినట్టి మనోగతియే సమాధి. ఎప్పటి నుంచి మనస్సు సదా జ్ఞానయుక్తమై ఉంటుందో అప్పటి నుంచే సమాధి సిద్ధి." (శ్రీవ్యాసాశ్రమం ప్రచురించిన శ్రీపూర్ణానందస్వామి అనువాదం ఆధారంగా).

4. శంభు శబ్దముచేత సుఖము కలుగు సాధనమైన వసంతసేన, చిత్తమును చక్కగా ఉంచు సమాధి శబ్దము చేత అనురాగము బ్రహ్మశబ్దము చేత బ్రాహ్మణుడైన చారుదత్తుడు సూచింపబడ్డాడని మృచ్ఛకటిక వ్యాఖ్యలో శ్రీ నేలటూరువారు వ్రాసారు.

5. శ్రీ నేలటూరువారు ఈ శ్లోకంలోని శివుని ఆసనాన్ని వీరాసనమని చెబితే, స్పష్ట ప్రతిపత్తి కోసం ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు పద్మాసనమని వ్యాఖ్యానించారు.

6. అహి మోకాళ్ళకు రెండు చుట్టలుగ బర్యంకంబు బంధించి లో
నహముంద్రుంచి మనంబు వంచి విషయ త్యాగంబు గావించి యా
దహరాకాశమునందనంతబరమాత్మం జూచుచుం దత్త్వదృ
ష్టి హరుండున్న సమాధి నిష్ఠ మిము రక్షించుం దయావంతమై

అని తిరుపతి వెంకటకవులు ఈ శ్లోకానికి అనువాదము చేసారు.

7. మృత్ + శకటికమ్ = చిన్న మట్టిబండి. చారుదత్తుడనే ధనము లేని బ్రాహ్మణుడు, వసంతసేన అనబడే వేశ్యల మధ్య ప్రేమకు చిన్నమట్టిబండి ముడివేస్తుంది ఈ కథలో.

8. శివుని వర్ణన యథాతథముగా జరిగినది కనుక ఈ శ్లోకంలో స్వభావోక్తి అలంకారము ఉంది. 

## 35

సత్యవోలు సోమసుందరకవి (1923) **చంపూభాగవతము**లోని మొదటిపద్యము.

**సీ॥ శ్రీలాలితాలాప శైలేశబాలా వి**
**లాసానుకూల కలా విలోల!**
**కలితగంగా ఝరీకల్లోల జాలార్ద్ర**
**లలిహిమ భానుమాలా జటాల!**
**దోషావళీ తమః పూషాయిత! సువేష!**
**సాహితీపోష! శేషాహిభూష!**
**సార సుధాసార ధారానుకార! స**
**త్కారుణ్య రసపూర ఘనవిహార!**

**గీ॥ రచితనతభద్ర! భవ్యముద్రా వినిద్ర!**
**యక్షయాక్షుద్ర రుద్రాక్ష హత విపక్ష!**
**దివ్యమంగళయుత! శివదేవత హిత!**
**సతత కళ్యాణములు మాకొసంగుగాత!**

**ప్రతిపదార్థము :** శ్రీలాలిత = శ్రీయుతములైన, మనోహరములైన; ఆలాప = మాటలు; శైలేశబాలా = హిమవంతుని కుమార్తె పార్వతీదేవి; విలాసానుకూల కలా విలోల = విలాసములకు అనుకూలుడా!; కలిత = పొందబడిన; గంగాఝరీకల్లోలజాల = గంగా ప్రవాహముయొక్క పెద్ద అలల సమూహముతో; ఆర్ద్ర = తడిసిన; లలి = సొగసైన;

హిమభానుమాలా = చంద్ర కిరణకాంతుల సమూహముతో కూడిన; జటాల = జడలు కలిగినవాడా!; దోషావళీ = దోష సమూహములయిన; తమః = చీకటికి; పూషాయిత = సూర్యుని సిద్ధము చేయువాడా! (సూర్యుని వంటివాడా!); సువేష = చక్కని వేషము కలవాడా!; సాహితీ పోష = సాహిత్యమును పోషించువాడా!; శేషాహి భూష = శేషుడు హారముగా కలిగినవాడా!; సార = శ్రేష్ఠమయిన; సుధాసార = అమృత సారపు; ధారానుకార = ధారను అనుకరించేవాడా! (తెల్లని రంగు కలవాడా!); సత్కారుణ్య రసపూర = చక్కటి దయాప్రవాహ; రస = రసమునందు; ఘనవిహార = బాగుగా విహరించువాడా! కరుణారసములో వ్యాప్తి కలవాడు; రచిత = రచింపబడిన; నత భద్ర = వంగిన వీరభద్రుడు కలవాడా!; భవ్యముద్రా = గొప్పదైన యోగముద్రతో; వినిద్ర = యోగాభ్యాసపు హెచ్చరిక కలిగినవాడా; అక్షయ = నశింపని; అక్షుద్ర = అల్పముకాని రుద్రాక్ష = రుద్రాక్షలు కలిగి; హత విపక్ష = నశింపచేయబడిన త్రిపురుడు మొదలయిన శత్రువులు కలవాడా!; దివ్యమంగళయుత = శ్రేష్ఠమయిన శుభములతో కూడినవాడా!; శివదేవతహిత = కల్యాణదాయకుడై దేవుళ్లకు హితుడైన శివుడా!; సతత కళ్యాణములు = ఎప్పుడూ శుభములు; మాకొసంగుగాత! = మాకు ఇచ్చుగాత!

**తాత్పర్యము :** మనోజ్ఞ భాషణము, కటాక్షము మొదలైన పార్వతీదేవి విలాస కళలకు ఆస్పదమయినవాడా! గంగా ప్రవాహముయొక్క పెద్ద అలల సమూహముతో తడిసిన సొగసైన చంద్రకిరణకాంతుల సమూహముతో కూడిన జడలు కలిగినవాడా! చీకటికి సూర్యుని వంటివాడా! చక్కని వేషము కలవాడా! సాహిత్యమును పోషించువాడా! శేషుడను పామును హారముగా కలిగినవాడా! తెల్లని రంగు కలవాడా! కరుణారసములో వ్యాప్తి కలవాడా! వంగిన వీరభద్రుడు కలవాడా! గొప్పదైన యోగముద్ర కలిగినవాడా! రుద్రాక్షలతో త్రిపురుడు మొదలయిన శత్రువులను నశింపచేసినవాడా! శుభములతో కూడినవాడా! కల్యాణదాయకునివై దేవుళ్లకు హితుడైన శివుడా! ఎప్పుడూ శుభములు మాకు ఇవ్వవయ్యా!

**విశేషాలు :**

1) తెలుగులో చంపూభాగవతమును సత్యవోలు సోమసుందరకవిగారు రచించారు. చంపూ కావ్యమంటే పద్యాలు, గద్యాలూ రెండింటి తో చెప్పబడ్డ కావ్యం.

2) బ్రహ్మాదులు విష్ణుమూర్తిని కృష్ణునిగా జన్మించమని ప్రార్థించుటతో మొదలయిన ఈ చంపూ భాగవతము – దాదాపుగా దశమస్కంధవర్ణనలతో ఉంటుంది.

3) **"లలితాలాప"** అనుటతో పార్వతీదేవి నిరతిశయ సౌందర్యము, **"శైలేశబాలా"** అనుటతో పార్వతీదేవి ఉత్తమ వంశజాతత్వము తెలుస్తోంది. **"బాలా"** అనుటతో పార్వతీదేవి సౌకుమార్యము తెలుస్తోంది.

4) పద్యములోని **"ఆర్ద్ర"** శబ్ద ప్రతిపాదనముతో శివుని భక్తతాపనివారణక్షమత్వము తెలుస్తోంది. **"భానుమాలా జటాల"** అనుటతో శివుని శిరస్సులోని జటలకు చంద్రుని తెల్లదనము ఆపాదించబడింది. ఉపమేయమును కాదని (నిషేధించి) అపహ్నవించి – అంటే మరుగుపుచ్చి– సామ్యమున ఉపమానారోపముకలిగితే అది **అపహ్నవాలంకారము**.

5) **"యో యద్వాన్ స తద్దత్తే"** అని ఒక న్యాయము. ఎవరికి ఏది ఉందో, అదే వాడు ఇస్తాడు. కల్యాణములు కలిగిన శివుడు మనకుకూడా కల్యాణము అందచేయాలి అనే భావనతో కల్యాణ శబ్దప్రయోగము జరిగింది.

6) చంపూ భాగవతమును సంస్కృతములో రచించిన కవి "శ్లేష యమక ధ్వని చక్రవర్తి" బిరుదు కలిగిన **చిదంబరుడు**. అతని పౌరుషనామము అభినవకాళిదాసు. ఈ చంపూ భాగవతమును బెల్లంకొండ రామారాయకవి సంస్కృతంలో వ్యాఖ్యానించాడు. (వీరి వ్యాఖ్యాన విశేషములలో కొన్నింటిని ఈ పద్యవ్యాఖ్యలో వాడుకొన్నాను.)

7) 1949లో తాడేపల్లి వెంకటనారాయణ శ్రేష్ఠి సంస్కృత చంపూ భాగవతమును తెలుగులిపితో ముద్రించారు. మా పెదనాన్నగారు బ్రహ్మశ్రీ తాడేపల్లి సాంబమూర్తి శాస్త్రి గారు గ్రంథ కర్తృ పరిచయం చేసారు. పెద్దలు శ్రీ రావి మోహనరావుగారు సంస్కృత చంపూ భాగవతమును ఇటీవల ముద్రించారు.

8) సంస్కృతచంపూభాగవతములోని నాందీ శ్లోకమిది.

శ్లో॥ కల్యాణం నః ప్రభూతం కలయతు లలితాలాపశైలేశబాలా –
లీలాజాలానుకూలా శిశిరకరకలాభానుమాలాజటాలా।
భద్రా శేషాహి భూషా పరికలితసుధాపూరధారానుకారా
ఏషా ముద్రా వినిద్రా పురహరణవిధౌ కాపి కారుణ్యపూర్ణా ॥

9) మూలములోని యమక సౌందర్యం అనువాదములో యథాతథముగా సత్యవోలువారు తీసుకువచ్చారు.

10) రెండు లేక అంతకంటే ఎక్కువ అర్థభేదముగల అక్షరముల సమూహము మరల మరల ప్రయోగింపబడినచో దానిని **యమకాలంకారము** అని మనందరికి తెలుసు.

భరతుని నాట్య శాస్త్రములో తొమ్మిదిరకాల యమకాలు చెప్పాడు. 1. పాదాంత యమకము (నాలుగు పాదముల చివర ఒకటి కాని అంతకు మించి కాని సమాక్షరములు గల శబ్దములు గలది), 2. కాంచీ యమకము (పాదాదిలో, పాదాంతములో రెండేసి పదములు సమానముగా నున్నది), 3. సముద్గ యమకము (వృత్తములోని పూర్వోత్తరార్ధములు సమానముగా నుండునది), 4. విక్రాంత యమకము (పాదము విడిచి పాదము చొప్పున 2పాదములు సమముగా నున్నది), 5. చక్రవాల యమకము (పూర్వపాదాంత పదమే పరపాదాదిపదమై చక్రమువలె నుండునది), 6. సందష్ట యమకము (ప్రతిపాదము యొక్క ఆదియందును రెండేసి యక్షరములు పాదములందును ఆదిపదములు సమానముగా నున్నది), 7. ఆమ్రేడిత యమకము (పాదాంతమున ద్విరుక్తమయిన పదము గలది), 8. చతుర్వ్యవసిత యమకము(అన్ని పాదములును నియతాక్షరములై సమముగా నుండునది), 9. మూలా యమకము (ఒకే హల్లు భిన్నస్వర సంయోగముతో పెక్కు పదములందు వచ్చునది). (భరతనాట్యశాస్త్రము 16 అధ్యాయము.)

11) శివభక్తులు ధరించెడి ఒకానొక కాయ రుద్రాక్ష. త్రిపురాసురుని కొఱకు రుద్రుడు దేవస్వరూపిణి అగు గాయత్రిని బాణముగా చేసుకొన్నాడు. ఆ సమయంలో కళ్ళు మూసికొని ధ్యానము చేసేవేళ అతని కనురెప్పలనుండి జలబిందువులు పడ్డాయి. అవే రుద్రాక్షలు. ఇవి అనేక భేదములతో ఉన్నాయి. వీటిని ధరించుట మహా మోక్షసాధకమని నమ్మకముతో ధరిస్తుంటారు. ఏకముఖి రుద్రాక్షకు విలువ ఎక్కువ. నాందీ పద్యానికి వలె. ❁

## 36

కాళ్లకూరి నారాయణరావు (1871-1927) **"వరవిక్రయము"**లోని మొదటిపద్యము.

**భూరి గరిష్ఠమై విబుధపుంగవ మంగళ వాక్సమృద్ధమై,**
**చారుతరాప్సరోనటన సంభృతమై, సవినోదమై యహం**
**కార వికార దూరమయిగర్వితరోభయ శుల్క శూన్యమౌ**
**గౌరి వివాహ సంస్మరణ గల్గగజేసెడు గాక! భద్రముల్.**

**ప్రతిపదార్థము :** భూరి = అధికమైన; గరిష్ఠమై = మిక్కిలి శ్రేష్ఠమై; విబుధపుంగవ = విద్వాంసశ్రేష్ఠులు పలికే; మంగళ = శుభకరమైన; వాక్సమృద్ధమై = వాక్ + సమృద్ధమై = వాక్కులతో, ఆశీర్వచనములతో సంపూర్ణమై; చారుతరాప్సరోనటనసంభృతమై =

చారుతర + అప్సరస్ + నటన సంభృతమై = మనోహరములగు అప్సరసల నటనలతో చక్కగా ధరింపబడినదయి; సవినోదమై = వేడుకలు కలిగినదయి; అహంకార వికార దూరమయి = గర్వమనెడి వికారమునకు దూరముగా ఉన్నదై; గర్హ్యతరోభయ శుల్క శూన్యమౌ = గర్హ్యతర + ఉభయ శుల్క శూన్యమౌ = నిందింపదగిన కట్నమను పన్ను ఉభయపక్షములలోను లేనిదయిన; గౌరి వివాహ సంస్మరణ = పార్వతీదేవి వివాహపు తలపు, కల్గగజేసెడు గాక! భద్రముల్ = భద్రముల్ కల్గగజేసెడు గాక = శుభములు కలిగించుగాక!

**తాత్పర్యము :** శివపార్వతుల వివాహపు సందడి మిక్కిలి శ్రేష్ఠమైనది. విద్వాంసులు, శ్రేష్ఠులు పలికే వాక్కులతో, ఆశీర్వచనములతో పవిత్రమైన వాతావరణము కలిగినది. మనోహరములగు అప్సరసల నటనలు కలిగినది. వేడుకలుకలిగినది. గర్వమనెడి వికారమునకు దూరముగా ఉన్నది. నిందింపదగిన కట్నమను పన్ను ఉభయ పక్షముల లోను లేనిది. అటువంటి పార్వతీదేవి వివాహపు తలపు శుభములు కలిగించుగాక!

**విశేషములు :**

1. వరవిక్రయమును కాళ్లకూరి నారాయణరావు 1923లో రచించారు.

2. ముత్యాలముగ్గు చలనచిత్రంలో 'మాడా' – రావు గోపాలరావుతో బేరమాడుతూ, "మర్డరుకీ సెపరేషనుకీ యెంతవుద్ది, సెపరేషనుకీ మేరేజికీ యెంతవుద్ది, మర్డరుకీ, సెపరేషనుకీ, మేరేజికీ యెంతవుద్ది..........వోలుమొత్తానికి యెంతవుద్ది? కన్సెసనేమైనా వుందా?" అంటూ గుక్కతిప్పుకోకుండా చెప్పిన ముళ్లపూడి వారి 'పొడవాటి' సంభాషణకి అంతకు యాభయ్యేళ్ల క్రితమే వరవిక్రయం నాటకంలోని ఈ క్రింది సంభాషణ ప్రేరణ. "అలాగైతే, సంబంధాల విషయంలో మీయభిప్రాయము ఏమిటో సంగ్రహముగా ముందు సెలవివ్వండి. మీకు కావలసింది చదువా? చక్కదనమా? సంపత్తా? సంప్రదాయమా? లేక చదువూ, సంప్రదాయమా? సంప్రదాయమూ సంపత్తా? సంపత్తూ చక్కదనమూనా? చక్కదనమూ చదువూ; చదువూ సంపత్తూ – ఈ విధముగా వుండవలెనా?" (కృష్ణశ్రీ)

3. భూరి – **భవత్యనల్పమితి భూరి** – భూసత్తాయామ్ – అధికముగా అవునది – భూరి శరాసారంబున (భీష్మపర్వము 2 – 106 ప) మొదలగు అనేక ప్రయోగాల్లో భూరి అనే పదము అధికము అను అర్థములో ఉంది.

4. Comparative degree ని (ఔపమికస్థాయి) సూచించడంకోసం సంస్కృతంలో

పదానికి – తరమ్ అనీ, Superlative degree ని (ఆత్యంతిక స్థాయి) సూచించడానికి – తమమ్ అనీ చేరుస్తారు. చారుతర, గర్వితర అని ఈ పద్యంలో ప్రయోగాలు.

5. గౌరవర్ణము కలది కనుక పార్వతీదేవికి గౌరి అని పేరు వచ్చింది. గౌర శబ్దానికి తెలుపురంగు అని ఒక అర్థముంది. కీర్తన చేయబడినది కనుక (గూయతే కీర్త్యతే గౌరః) గౌరవర్ణమని పేరు వచ్చిందట. ఎరుపు, పసుపు అను అర్థాలు కూడా గౌర శబ్దానికి ఉన్నాయి. పొందబడునది, ఎరుగబడునది గౌరము.

6. **శలన్తి సుఖేన గచ్ఛంత్యత్ర శుల్కః –** శల ఆశు గమనే. దేనినిచ్చుటచేత సుఖంగా పోవుదురో దానిని శుల్కము అంటారు. పెళ్లిళ్లలో ఈ శుల్కానికి కట్నమని పేరు. శివపార్వతుల వివాహములో వరశుల్కము లేదా వరవిక్రయము లేదు. కన్యాశుల్కము లేదు. (వధువును గ్రహించుటకు ఇచ్చు ధనము – the price that a bridegroom pays to a girl's father to get her in marriage) ఈ రెండింటిని “ఉభయ శుల్కము” అని నారాయణరావు గారు ఈ నాందీ పద్యంలో పేర్కొన్నారు. తద్వారా తన వరవిక్రయకథాంశమును ప్రస్తావించారు. ఉభయశుల్కము లేని శివపార్వతుల వివాహము ఆధునిక సమాజాన్ని కూడా వరవిక్రయాల భయసమాజంగా కాక, శుభములతో కూడిన అభయసమాజంగా తీర్చిదిద్దాలని కవి ఆకాంక్ష. మనం కూడా అలాగే ప్రార్థిద్దాం. ❁

## 37

పెరుమాళ్ల వీర్రాజు (1927) **“కామకళ”** నాటకము లోని మొదటిపద్యము.

> **గంగకు గౌరికిన్ సవతి కయ్యము నిత్యము దీర్పలేక యా**
> **గంగను శీర్షమందునిడి గౌరికి నర్ధశరీరమిచ్చి మే**
> **ల్బంగరు బొమ్మలౌ సతుల లాలనజేయుచు సౌఖ్యమొందు న**
> **య్యంగజ మర్దనుండు మిము నాదరమొప్పగ నేలుగావుతన్.**

**ప్రతిపదార్థ తాత్పర్యములు :**

గంగ, గౌరి అను తోడి పెండ్లాములమధ్య ప్రతి రోజూ – నేనెక్కువంటే – నేనెక్కువని తగాదా. (సవతి కయ్యము). ఆ తగాదా తీర్చలేక శివుడు గంగాదేవిని తలమీద పెట్టాడు. పార్వతీదేవికి సగము శరీరమిచ్చాడు. ఒకరిని ఎక్కువ మరొకరిని తక్కువ చేయలేదు. ఆ గంగా గౌరులు శుభము ప్రసాదించే (= మేలు) అందమైన స్త్రీలు.(= బంగరు బొమ్మలు). ఆ భార్యలను బుజ్జగిస్తూ (= లాలిస్తూ) సుఖాన్ని పొందుతుండే ఆ మన్మథుని

మర్దించిన శివుడు (= అంగజ మర్దనుండు) మీ అందరిని ఆదరముతో రక్షించుగాక! (= ఏలు గావుతన్).

**విశేషములు :**

1. నీతి బోధకమైన ఆరంకముల నాటకము కామకళ. ఈ నాటకము మొదటి పుటలోనే కవి ఈ సులభమైన పద్యములో ఇతివృత్తము వివరించాడు.

ముదముతోడను బతిగొల్చు ముదితలెల్ల
కామకళ బోలి ముక్తిని గాంత్రు గాక!
హేమకళ బోలి వర్తించు హీనమతులు
కష్టపడుగాక నిలయందె కనులు బోయి -

2. మంత్రశాస్త్రంలో క్లీం అనే అక్షరం కామకళాబీజం (క, ల, ఈ, ం). **కామకళారూపా** – అని అమ్మవారి నామాలలో ఒకటి. కామేశ్వరుని కళయొక్క రూపమైన తల్లికి నమస్కారము అని దీని అర్థము. ఇందులో నాల్గవదైన బిందువుతో కూడిన నాదము అయ్యవారు. ఆ నాదరూపము అమ్మవారు. ఈ రూపమే కామకళారూపము. (నా లలితాసహస్రనామ వివరణనుండి) కామకళ అను పేరుకు అంత విశిష్టత ఉంది.

3. ఈ గంగా గౌరీ సంవాద వర్ణనలు ఎప్పటినుంచో మన సాహిత్యంలో ఉన్నాయి. "అర్ఘ్యమివ్వటానికి అర్ధనారీశ్వరుడు, గంగను చేతిలోకి తీసుకొన్నాడు. అసూయతో ఎరుపెక్కిన గౌరీదేవి మోము దోసిటిలో కమలమై ప్రతిబింబించింది. ఆ దోసిటిలోని జలాలకు నమస్కారము చేస్తానని గాథాసప్తశతిలో గంగకు, గౌరికి పడదని వర్ణన ఉంది.

4. పార్వతి – "నేనెవర్నో తెలుసా, పరమశివుడి అర్ధాంగిని, భాగేశ్వరిని!. గంగ – "బాగా తెలుసు. కట్టుకున్న అమాయకుణ్ణి సగం తినేసిన పరమపాతకివి". పార్వతి – "జారిపడిన భ్రష్టురాలివి నువ్వు!". గంగ – హాలాహలం తాపాన్ని చల్లార్చిన దానిని నేను. అందుకే శివుడు మెచ్చి నన్ను తలమీద పెట్టుకొన్నాడు. నేను ఇష్టురాలినో, భ్రష్టురాలినో లోకానికి తెలుసు!" ఇలా జానపద గేయాల్లో గంగకి గౌరికి మధ్య సంవాదాలు ఉన్నాయి.

5. శివకేశవులకు లక్ష్మీపార్వతులకు గంగాగౌరీలకు మధ్య భేదంలేదు.

6. శంకరాచార్యులవారు గంగానది అష్టకంలో

> మాతర్జాహ్నవి! శంభుసంగమిళితే మౌళౌ నిధాయాంజలిం
> త్వత్తీరే వపుషోఽవసానసమయే నారాయణాంఘ్రిద్వయం ।
> సానందం స్మరతో భవిష్యతి మమ ప్రాణప్రయాణోత్సవే
> భూయాద్భక్తిరవిచ్యుతా హరిహరాద్వైతాత్మికా శాశ్వతీ ॥ అన్నారు.

"గంగమ్మ! నేనొక్కటే కోరుకుంటాను – నా శరీరం పడిపోయే ముందు నేను నీ ఒడ్డున నిలబడి నీ ప్రవాహము వంక చూస్తుండాలి. నీ ప్రవాహము వంక చూస్తూ నా మనసులో నారాయణుడి పాదాలు స్మరించాలి" అన్నారు. "శివుడి పాదాలు" అని శంకరులు అనలేదు. నారాయణుని పాదాలు అన్నారు. శివునికి, నారాయణునికి తేడాలేదు. అందుకే శంకరులు శివునికి బదులు, నారాయణుడు అన్నారు.

7. ఆత్మసాక్షాత్కరం కలిగితే స్త్రీ పురుష భేదం పోతుంది. దానికి సంకేతంగా శివుడు అర్ధనారీశ్వరుడని వర్ణన.

8. కుండలిని సహస్రారం ఛేదించుకుని కపాలభేదనం అయిన తరువాత **స్వచ్ఛమైన పరమాత్మజ్ఞానం** చిచ్చుబుడ్డిలోని కాంతిముత్యాల్లా బయటికి వెదజల్లబడుతుందని పెద్దలు చెప్పారు. ఈ జ్ఞానప్రబోధమే శివుని శిరస్సు నుండి గంగ ఎగిసి పడుతున్న దృశ్యంగా సంకేతించారు.

9. మరి ఇంత లోతైన అర్థాలున్నప్పుడు ఈ గంగా గౌరీ సంవాదాలు – పామర సంభాషణలు కవులు ఎందుకు ఎందుకు వ్రాసారు? యోగస్థాయిలోకి వెళ్లలేని సామాన్యుల కోసం దేవతలను కవులు మానవీకరించారు. దేవుళ్లు మనలాంటి వాళ్లే అనుకొంటే సామాన్యులకి సహానుభూతి పెరుగుతుంది. తద్వార ఆ దేవతామూర్తుల స్మరణము ఏదో రకంగా జరుగుతుంది. అందుకే మన కష్టనష్టాలు, రాగద్వేషాలు, తగాదాలు దేవతామూర్తులకి అంటగట్టి వాళ్లందరిని మన నిత్యజీవితంలో కవులు కలిపారు.

10. మూలమైనది ఒకే ఒక్క రంగు అని తెలిసేటంతవరకు – ఆ రంగులోనుంచి పుట్టిన రకరకాల రంగులు చూసి ఆనందిస్తుంటాం.



**38**

భట్టనారాయణుని **వేణీసంహారనాటకము**లోని నాందీశ్లోకము.

**శ్లో॥ దృష్టస్సప్రేమ దేవ్యా కిమిదమితి భయాత్ సంభ్రమాచ్చాసురీభిః**
**శాంతాంతస్తత్త్వసారైస్సకరుణమృషిభిర్విష్ణునా సస్మితమ్ ।**
**అకృష్యాస్త్రం సగర్వైరుపశమితవధూసంభ్రమైర్దైత్యవీరై**
**స్సానందం దేవతాభిర్మయపురదహనే ధూర్జటిః పాతు యుష్మాన్ ॥ (3)**

**ప్రతిపదార్థము :** మయపురదహనే = మయునిచే నిర్మితములైన మూడులోకములను కాల్చు సమయములో; దేవ్యా = పార్వతీదేవితో; సప్రేమ = ప్రేమతో; దృష్టః = చూడబడినవాడు; అసురీభిః = రాక్షసస్త్రీలచేత; ఇదమ్ + కిమ్ + ఇతి = ఇదేమిటి అను; భయాత్ సంభ్రమాత్ + చ = భయము మరియూ ఆశ్చర్యమువల్ల; దృష్టః = చూడబడినవాడు; శాంత + అంతః + తత్త్వసారైః = శాంతించిన అంతరంగ స్వభావమను ధనము కలవారయిన; ఋషిభిః = మునులచేత; సకరుణమ్ = జాలిగా; దృష్టః = చూడబడినవాడు; విష్ణునా = విష్ణుమూర్తి చేత; సస్మితమ్ = చిరునవ్వుతో; దృష్టః = చూడబడినవాడు; అకృష్యాస్త్రం సగర్వైరుపశమితవధూసంభ్రమైః దైత్యవీరైః = రాక్షసవీరులచేత; అస్త్రమ్ + ఆకృష్య = ధనుస్సు ఎక్కుపెట్టి; దృష్టః = చూడబడినవాడు; దేవతాభిః = దేవతలచేత; స + ఆనందమ్ = ఆనందముతో; దృష్టః = చూడబడినవాడు అయిన; ధూర్జటిః = శివుడు; యుష్మాన్ = మిమ్ములను; పాతు = రక్షించుగాక!

**తాత్పర్యము :** మయుడు నిర్మించిన మూడులోకాలను కాల్చు సమయములో పార్వతీదేవితో ప్రేమతో చూడబడినవాడు, రాక్షసస్త్రీలచేత ఇదేమిటి అను భయము మరియూ ఆశ్చర్యమువల్ల చూడబడినవాడు, శాంతించిన అంతరంగస్వభావమను ధనము కలవారయిన మునులచేత జాలిగా చూడబడినవాడు, విష్ణుమూర్తిచేత చిరునవ్వుతో చూడబడినవాడు, రాక్షసవీరులచేత ధనుస్సు ఎక్కుపెట్టి చూడబడినవాడు, దేవతలచేత ఆనందముతో చూడబడినవాడు అయిన శివుడు మిమ్ములను రక్షించుగాక!

**విశేషములు :**

1. ఈ శ్లోకము స్రగ్ధర వృత్తమునకు బంధించినది. మ,ర,భ,య,న,న,య,య,య అనే గణాలు వరుసగా వస్తాయి. మొదటి అక్షరానికి ఎనిమిదవ, పదిహేనవ అక్షరాలతో యతి మైత్రి.

2. ఇది యేమంచు భవాని ప్రేమను, భయోద్వృత్తిన్ నిశాటాంగనల్
త్రిదశుల్ మోదమునం దపోధనులు జాలిన్, నవ్వున్వెన్నుడు
న్మదలీలం దనుజుల్ గనన్ మయపురోద్యద్దాహవేళం జయా
స్పదమస్త్రంబరి వోయు ధూర్జటి యజస్రంబున్ మిముం బ్రోచుతన్.

అని వడ్డాది సుబ్బారాయ కవి (1854-1939) దీనిని అనువదించారు. పద్యము మొదట్లో ఉన్న "ఇది ఏమంచు" పదబంధాన్ని "భయోద్వ ృత్తిన్ నిశాటాంగనల్" అనుదానికి కలుపుకోవాలి.

3. వేణీ సంహారం అంటే - జుట్టు ముడుచుట. (gathering loose hair and tying up into a braided knot). భట్ట నారాయణుడు ఏడవ శతాబ్దికవిగా చెబుతారు. **"వేణీసంహార నాటకం"** వీరరస ప్రధానమైనది.

4. భీముడు దుశ్శాసనుని రొమ్ముపగిల్చి, నెత్తురు త్రావి, ఆ నెత్తురు చేతులతో ద్రౌపది తలవెంట్రుకలను ముడివేసిన. వేణీసంహారనాటకం మహాభారతములోని ఇతివృత్తంతో ఉంది. ఇందులో ఆరు అంకాలున్నాయి. నాటకంలో హాస్యం పండించే విదూషకపాత్ర లేకుండా రాశాడు భట్టు.

5. కమలాక్షుడికీ, తారకాక్షుడికీ, విద్యున్మాలికీ బ్రహ్మ మెచ్చి ఇచ్చిన మూడు నగరాలు కలసి త్రిపురం. శివునికి త్రిపుర సంహారమప్పుడు రథము - భూమి, చక్రాలు - సూర్యచంద్రులు, గుఱ్ఱాలు - వేదాలు, చాపము - మేరువు, నారి - శేషుడు, బాణం - విష్ణువు. మూడులోకాలను కాల్చే సమయములో శివున్ని ఎవరెవరు ఎలా చూసారు - అనేది ఈ శ్లోకం వివరిస్తుంది. పార్వతీదేవి శివుణ్ణి ప్రేమతో చూసిందట. త్రిపురాసురులను కార్తిక పౌర్ణమి రోజునే శివుడు సంహరించాడు. త్రిపురాసురులను సంహరించి మూడులోకాలను కాల్చిన శివునికి దిష్టి తగలకుండా ఉండటం కోసం పార్వతీదేవి జ్వాలాతోరణోత్సవం నిర్వహించిందట. భర్తకి దిష్టి తీసే సమయంలో భార్య చూపు ప్రేమగానే ఉంటుంది. అదే భట్టనారాయణుడు వర్ణించాడు. బంగారం, వెండి, రాగి తో చేసిన మూడునగరాలు ఆకాశంలో తిరుగుతూ వేయి సంవత్సరాలకొకసారి కలుసుకుంటూ ఉంటాయి. అలా కలుసుకున్న సమయంలో ఒకే బాణంతో ఎవరు మూడింటిని ధ్వంసం చేయగలరో వాడివల్ల మాత్రమే తమ భర్తలకు మరణమని త్రిపురాసురుల భార్యలకు తెలుసు. ఈ శివుడికి ఈ విషయము ఎలా తెలిసిందా అనే ఆశ్చర్యము, అతని పరాక్రమాన్ని చూసి భయము రెండు రాక్షసస్త్రీలకు కలిగాయి. అందుకే వాళ్ల చూపుల్లో **భయమూ, ఆశ్చర్యము.**

6. మునులు జాలిగా చూసారట శివుడిని. ఎటువంటి మునులు? శాంతించిన అంతరంగ స్వభావమను ధనముకలవారు. అంటే వాళ్లలో ఎటువంటి భావాలు లేవు. నిర్వికార నిశ్చల చిత్తులు. అయినా – అటువంటి మునులకు జాలి కలిగింది. అయ్యో! శివునికి ఈ కష్టము వచ్చిందేమిటి? హాయిగా కైలాసంలో ఉండవలసిన మా స్వామి చేత ఈ రాక్షసులు యుద్ధం చేయిస్తున్నారు. ఈ త్రిపురాలు మండుతుంటే – ఆ సెగ – మా స్వామికి తగులుతోంది. అని మునులకు బాధ కలిగింది. భక్తిలో బాధ కలిసింది. ఆ భక్తితో కూడిన ప్రేమలోనుంచి వచ్చిన జాలి అది.

7. విష్ణుమూర్తి చిరునవ్వుతో చూసాడట శివుణ్ణి. "మనిద్దరం ఉండగా ఈ ప్రపంచాన్ని ఏ దుష్టుడూ ఏమి చేయలేడు. మరణానికి నిర్ణయింపబడిన సమయములో మార్పు ఉండవచ్చు కాని దుష్టత్వానికి మరణం ఖాయం. దాని పరిపాలన ఎక్కువ కాలముండదు. అవును కదా! యోగము – బాణరూపంలో ప్రయోగము బాగుంది" ఈ భావాలతో విష్ణువు నవ్వుతూ శివుణ్ణి చూసాడు.

8. త్రిపురాసురులు చచ్చిపోయినప్పటికీ వారి అభిమానులైన రాక్షసవీరులు ఇంకా కొంతమంది మిగిలి ఉన్నారు. చింత చచ్చినా పులుపు చావదన్నట్లుగా వాళ్ళు ధనుస్సు ఎక్కుపెట్టి ఇంకా యుద్ధం చేయటానికి శివుణ్ణి చూస్తున్నారు.

9. తారకాసురుడు చనిపోయినందుకు తమ మీద పగబట్టిన రాక్షసులు అంతమయ్యారని దేవతలు ఆనందంతో శివుణ్ణి చూసారు.

10. భట్టనారాయణుడి గొప్ప కవితాచాతురి ఈ నాందీశ్లోకంలోని **"ధూర్జటి"** అనే పద ప్రయోగంలో ఉంది. **ధూః భారభూతా జటిః జటా యస్యేతి ధూర్జటిః** – భారమైన జడలు కలవాడు ధూర్జటి. జటాజూటంలో ఉన్నది గంగమ్మ. జడలపై కిరీటంగా ఉన్నది చంద్రరేఖ. గంగ, చంద్రుడు రెండూ చల్లదనం కలిగినవి. జరుగుతున్నది వేడి కలిగిన దహన కార్యక్రమము. దానిని చేసినవాడు చల్లదనానికి నెలవైన ధూర్జటి. ఆయన దుష్టత్వాన్ని కాల్చివేస్తాడు కాని, సహజంగా ఆయన భక్తులపాలిటి చల్లనివాడు అనేది వ్యంగ్యార్థము. ఇక్కడ ప్రకరాంతరము చేత వ్యంగ్యార్థము వస్తోంది కనుక పర్యాయోక్తి అలంకారము.

11. నాన్దీలోని ఈ ధూర్జటి అనే పదము – దుశ్శాసనుని పరాభవము చేత విరబోసుకొన్న ద్రౌపది కురులను, జ్ఞప్తికి తెస్తోంది.

12. శివుడిని రకరకాలుగా భట్టనారాయణుడు సందర్శించారని వ్రాసాడు. కవి ప్రతిభ కూడా రకరకాలుగా సమున్నతంగా విమర్శకలోకంలో వాఖ్యానించబడింది. ❁

## 39

త్రివిక్రమభట్టు **నలచమ్పువు** కావ్యములోని నాందీ శ్లోకము.

**జయతి గిరిసుతాయాః కామసంతాపవాహి**
**న్యురసి రసనిషేకశ్చాన్దనశ్చన్ద్రమౌళిః ।**
**తదను చ విజయన్తే కీర్తిభాజాం కవీనా -**
**మసకృదమృతబిన్దుస్యందినో వాగ్విలాసాః ॥**

**ప్రతిపదార్థము :** గిరిసుతాయాః = పార్వతీదేవియొక్క; కామ సంతాపవాహిని = మన్మథ బాధను వహిస్తున్న; ఉరసి = వక్షస్థలమునందు; చాన్దనః = మలయజ సంబంధమైన; రసనిషేకః = రసాభిషేకరూపములో; చన్ద్రమౌళిః = ఇందుశేఖరుడు; జయతి = సర్వోత్కృష్ట డగుచున్నాడు; తదను చ = ఆ వెనుక; కీర్తిభాజామ్ = యశశ్శాలుల యొక్క; (కీర్తిం భజంతే – కీర్తి భాజామ్) కవీనామ్ = కవులయొక్క; అసకృత్ = మాటి మాటికి; అమృతబిన్దుస్యందినః = పీయూష లవములను వర్షించెడి అటువంటి; వాగ్విలాసాః = వాణీ విభ్రమములు; విజయన్తే = మహిమాన్వితములగుచున్నవి.

**తాత్పర్యము :** పార్వతీదేవి తన కామసంతప్తమైన వక్షస్థలమునందు చల్లదనముకొరకు రాసుకొన్న చందన రసరూపములో – రసస్వరూపుడైన పరమశివుడు ప్రకాశిస్తున్నాడు. సర్వోత్కృష్టుడగుచున్నాడు. ఆ వెనుక కీర్తిశాలులైన కవులయొక్క అమృతమయములైన వాక్కుల విలాసములు మహిమాన్వితములగుచున్నవి.

**విశేషములు :**

1. నలచమ్పువుకి ఇంకొక పేరు దమయన్తి కథ.

2. ఈ శ్లోకములో మాలిని వృత్తముంది. మాలిని వృత్తానికి న–న–మ–య–య గణాలు. 9 వ అక్షరం యతి.

3. **చమ్పయతి యోజయతి గద్య పద్యే ఇతి చమ్పూః –** గద్య పద్యములు కలిసిన రచన చంపువు.

4. ఈ నాన్దిలోని "గిరి" అను పదముతో నలుని దమయంతి తండ్రయిన భీముడు

సంకేతించబడ్డాడు. చన్ద్ర శబ్దము ద్వారా దమయంతి తాపము అను అంధకారము తొలగగలదని సూచితమైనది.

5. శివుడు సకలమంగళములకు, రసములకు మూలము కాబట్టి ఆయన జయము మొదట చెప్పబడినది.

6. రసవాచ్యుడైన శివప్రశస్తి తరువాత, రసాభివ్యక్తికి కారణభూతులైన వ్యాస, వాల్మీకాది కవిశ్రేష్ఠుల కవిత్వము ప్రస్తుతింపబడింది.

7. ఈ శ్లోకములో రసనిషేకము మొదలగు చోట్ల – చందనరసానికి, శివునికి (ఉపమానానికి, ఉపమేయానికి) అభేదము ఉన్నందువలన రూపకాలంకారము.

8. ప్రసిద్ధమైన నలదమయంతుల కథను నలచంపువుగా రాసిన త్రివిక్రమభట్టుది పదవ శతాబ్ది. తండ్రి దేవా(నేమా)దిత్యుడు.

9. నలచమ్పువు మనకి ఏడు ఆశ్వాసాలతో అసంపూర్తిగా లభిస్తోంది. దీనికి ఒక కథ చెబుతారు. త్రివిక్రమభట్టు తండ్రి నేమాదిత్యుడు రాజుగారి ఆస్థానంలో పండితుడు. చిన్నప్పుడు త్రివిక్రమభట్టు చదువుకోకుండా బలాదూరు తిరుగుళ్ళు తిరుగుతూ ఉండేవాడు ఒకసారి. తండ్రి ఊళ్లో లేనప్పుడు రాజుగారి ఆస్థానానికి ఒక పండితుడు వాదించుట కొరకు వచ్చాడు. రాజు ఇంటికి కబురు చేస్తే తండ్రి పరువు నిలబెట్టాలని త్రివిక్రమభట్టు సరస్వతీదేవిని ప్రార్థించాడు. అయితే అతని తండ్రి తిరిగి వచ్చేదాకా తానూ త్రివిక్రమభట్టు నాలుక మీద ఉంటానని, ఆ తరువాత వెళ్లిపోతానని సరస్వతి చెప్పింది. సరస్వతి అనుగ్రహంతో పండితుడిని భట్టు ఓడించాడు. ఆ తరువాత ఇంటికి వచ్చి ఈ "నల చంపువు" రాసాడు. అయితే సరిగ్గా. ఏడవ ఉచ్చ్వాసం పూర్తి అయ్యేసరికి తండ్రి తిరిగి వచ్చాడు. మాటప్రకారం సరస్వతిభట్టు నాలుక మీద నుంచి వెళ్లిపోయింది. అందుకే కవి తన కావ్యాన్ని పూర్తి చేయలేకపోయాడని ఒక కథ ఉంది.

10. ప్రతి ఆశ్వాసానికి ఉచ్ఛ్వాసము అని పేరును పెట్టుకొన్న నలచమ్పువు కూడా సాహిత్యానికి ఊపిరినిచ్చిన గ్రంథాలలో ఒకటి. ❀

## 40

శ్రీ శార్ఙ్గదేవుడు రచించిన **సంగీతరత్నాకరము**లోని మొదటి శ్లోకము.

**శ్లో॥ బ్రహ్మగ్రన్థిజమారుతానుగతినా చిత్తేన హృత్పంకజే**
**సూరీణామనురంజకః శృతిపదం యోఽయం స్వయం రాజతే ।**

**యస్మాద్గ్రామవిభాగవర్ణరచనాలంకారజాతిక్రమో**
**వందే నాదతనుం తముద్ధర జగద్గీతం ముదే శంకరమ్ ॥**

**ప్రతిపదార్థ తాత్పర్యాలు :** సూక్ష్మమయిన నాదం మూలాధారంలోని బ్రహ్మగ్రంథిలో ప్రాణము మరియు అగ్నుల ప్రేరణతో పుడుతుంది. (= బ్రహ్మగ్రన్థిజమారుతం అనుగతినా). ఏదయితే ఉన్నదో (యః) – ఆ నాదం (అయం) పండితులను సంతోషింప చేస్తోంది. (= సూరీణామ్ + అనురంజకః). ఈ నాదమే సంగీతానికి, వేదానికి ఉత్పత్తి స్థానమైన ఓంకారము. (= శృతిపదం). ఈ నాదమే స్వరాలుగా మారి స్వయంగా ప్రకాశిస్తోంది. (= అయం స్వయం రాజతే). ఏ నాదమయమైన సంగీతంనుండి (= యస్మాత్) గ్రామము, వర్ణము, రచన, అలంకారము, జాతి, క్రమముగా కలుగుతున్నాయో (= గ్రామ వర్ణ రచనాలంకార జాతి క్రమః) అటువంటి నాదమే పరబ్రహ్మం. ఈ విధంగా అధికమయిన (= ఉద్ధరమ్) ప్రపంచముచే (= జగతా) స్తుతింపబడు (= గీతం) ఆ పరబ్రహ్మమూర్తియైన శివునికి నిరతిశయ సుఖప్రాప్తి కొరకు (= ముదే) నమస్కరించుచున్నాను (= వందే).

**విశేషాంశములు :**

1. శరీరంలోని ఆత్మ మనస్సును, మనస్సు వహ్నిని, వహ్ని వాయువును ప్రేరేపించినప్పుడు వాయువు బ్రహ్మ గ్రంథియగు మూలాధారం నుంచి ఊర్ధ్వ ముఖంగా నాభి, హృదయం, కంఠం, శిరస్సు, ముఖం చేరి కలిగించే ధ్వనిని 'నాదం' అంటారు.

2. "నాదతనుమనిశం" అని త్యాగరాజస్వామిని గుర్తుకు తెచ్చే ఈ శ్లోకాన్ని సంగీత రత్నాకరంలో దేవగిరిని పాలించిన యాదవరాజుల ఆస్థానవిద్వాంసుడయిన శార్ఙ్గదేవుడు (1210 – 1247) రచించాడు.

3. సంగీతరత్నాకరానికి **"సప్తాధ్యాయి"** అని ఇంకోపేరుకూడా ఉంది. స్వరగతాధ్యాయము రాగవివేకాధ్యాయము, ప్రకీర్ణకాధ్యాయము, ప్రబంధాధ్యాయము, తాళాధ్యాయము, వాద్యాధ్యాయము, నర్తనాధ్యాయము అని వరుసగా 7 అధ్యాయాలు ఇందులో ఉన్నాయి.

4. ఈశ్లోకవృత్తము శార్దూలవిక్రీడితము.

5. ఈ శ్లోకములోని గ్రామాది పదములు సంగీతశాస్త్రానికి సంబంధించినవి. గ్రామము అనగా షడ్జాదిస్వరము (A scale in music – గ్రామత్రయము the three tones, treble, tenor and base).

6. గాన కారణమైన ఉచ్చారణము వర్ణము. ఇవి నాలుగురకాలు – 1. స్థాయి, 2. ఆరోహి, 3. అవరోహి, 4. సంచారి.

7. సరిగమాది వర్ణసందర్భము అలంకారము.

8. "తదిరి న" అని సంగీతం పాడేవాళ్లు తరుచుగా పాడుతుంటారు. "తదితరానాం – అనే పదానికి వికృతి – "తదిరి న". దానికంటే ఇతరమైనది లేదు. నాదము కన్న ఇతరమైనది లేదు "అని చర్ల గణపతిశాస్త్రిగారు "తదిరి న" పదాన్ని చమత్కారభరితంగా వివరించారు. ఆ నాద గొప్పతనమే ఈ శార్ఙ్గదేవుని నాందీ శ్లోకము.

9. అనేక నాడులు కూడిన పరిస్థితిని "చక్రం" అంటారు. వెన్నుపూసలో ఉండే సూక్ష్మ స్థానాలు ఇవి. వీటిని గురువుద్వారా జాగృతం చేయగలగాలి. అవి వరుసగా ఇవి.

**1. మూలాధారచక్రం :** మలరంధ్రానికి సమీప భాగంలో ఉన్న ఇది నాలుగురేకులుగల తామరపూవాకారంలో ఉంటుంది.

**2. స్వాధిష్ఠాన చక్రం :** ఇది జననేంద్రియం వెనుక భాగంలో ఆరురేకుల పద్మాకారంలో ఉంటుంది.

**3. మణిపూరక చక్రం :** బొడ్డునకు మూలంలో పదిరేకుల పద్మాకారంలో ఉంటుంది.

**4. అనాహత చక్రం :** ఇది హృదయం వెనుకభాగంలో పన్నెండు రేకుల తామరపూవు ఆకారంలో ఉంటుంది.

**5. విశుద్ధచక్రం :** ఇది కంఠముయొక్క ముడిలో ఉంటుంది.

**6. ఆజ్ఞాచక్రం :** ఇది రెండు కనుబొమ్మల మధ్యలో భ్రుకుటి స్థానంలో రెండు దళాలు గల పద్మాకారంగా ఉంటుంది.

**7. సహస్రారం :** ఇది కపాలం పై భాగంలో మనం మాడు అని పిలిచే చోట వేయిరేకుల పద్మాకారంలో ఉంటుంది.

ప్రాచీనకాలంలో ప్రతిపదార్థాలకు పూర్తిగా అందక, ఎవరికి వారికి వారివారి అనుభవాలకు మాత్రమే సంపూర్ణంగా అవగతమయ్యే కొన్ని విశిష్ట శ్లోకాలు రచించారు. వాటిలో శార్ఙ్గదేవుని ఈ నాందీశ్లోకము కూడా ఒకటి. యోగాభ్యాసపరులకు మాత్రమే సంపూర్ణంగా ఈ నాదమయ శ్లోకము అర్థమవుతుంది. 

## 41

నందికేశ్వరుడు రచించిన **అభినయదర్పణము**లోని మొదటిశ్లోకము.



**శ్లో॥ ఆంగికం భువనం యస్య -**
**వాచికం సర్వవాఙ్మయమ్ ।**
**ఆహార్యం చన్ద్రతారాది -**
**తం వందే సాత్త్వికం శివమ్ ॥**

**ప్రతిపదార్థము :** భువనమ్ = ఈ లోకము; యస్య = ఏ శివునియొక్క; ఆంగికమ్ = అంగాభినయనమో; సర్వవాఙ్మయమ్ = సమస్త సాహిత్యము; యస్య = ఏ శివునియొక్క; వాచికమ్ = వాక్కుయొక్క రూపమో; చన్ద్ర తార + ఆది = చంద్రుడు, నక్షత్రములు మొదలైనవి; యస్య = ఏ శివునియొక్క; ఆహార్యమ్ = ఆహార్యాభినయమో; తం సాత్త్వికం శివమ్ = అటువంటి సత్వప్రధానుడైన శివునికి; వందే = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** ఈ లోకము ఏ శివునియొక్క అంగాభినయనమో, సమస్త సాహిత్యము ఏ శివునియొక్క వాక్కుయొక్క రూపమో చంద్రుడు, నక్షత్రములు మొదలైనవి ఏ శివునియొక్క ఆహార్యాభినయమో, అటువంటి సత్వప్రధానుడైన (సాత్వికాభినయ రూపి) శివునికి నమస్కరించుచున్నాను.

**విశేషములు :**

1. "కల్యాణాచలవాసాయ కరుణారససిన్ధవే/ నమోఽస్తు నందికేశాయ/ నాట్యశాస్త్రార్థ దాయినే" (కైలాసాచలనివాసియును, దయాసముద్రుడు, నాట్యశాస్త్ర అర్థములను ప్రసాదించినవాడు అయిన నందికేశ్వరునికి నమస్కారము) అని నందికేశ్వరుడు కొనియాడబడ్డాడు.

2. ఆంగికము, సాత్త్వికము, ఆహార్యము, వాచికము - అనునవి నాలుగు రకముల అభినయములు. నాలుగు రకాల అభినయములలో ఆంగికము ఒకటి. అంగేన **నిర్వృత్తమ్** - అంగ + ఠక్. (తద్ధిత ప్రత్యయము) హస్తాదులచే చేయు అభినయము అభినయము ఆంగికము, కన్బొమలు కదలించుట, హస్తములు కదిలించుట ఇవన్నీ ఆంగికము. **ఆంగికం భువనం యస్య** - శివుని చేతుల పాదాల కదలిక ఈ సమస్తవిశ్వము.

3. **వాచః అస్మిన్ సన్తీతి వాచికమ్** - వాక్కులు దేనియందు ఉంటాయో అది వాచికము.

(వచ పరిభాషణే) శివునివాక్కులు వేదము మొదలుకొని ప్రతివారు మాట్లాడే మాటల వరకూ, సమస్త వాఙ్మయములోనూ ఉంది.

4. హారాది భూషణములచే కలుగు అభినయవిశేషము **ఆహార్యము**. బుద్ధిని ఉపయోగించి చేయునది ఆహార్యమని శ్రీమదగ్నిమహాపురాణములో ఉంది. (**ఆహార్యో బుద్ధ్యారంభ ప్రవృత్తయః**. నలభైరెండవ అధ్యాయము – రెండవ శ్లోకము) శివునియొక్క ఆహార్యమే ఈ చంద్ర, సూర్య నక్షత్రాది గ్రహములు.

5. **సత్త్వేన నిర్వృత్తం సాత్వికం** – సత్వముచేత పుట్టింపబడినది సాత్వికము. సాత్విక గుణములు వేరు (1. అహింస, 2. ఆస్తేయం, 3. సత్యం, 4. శౌచం, 5. బ్రహ్మచర్యం, 6. ఇంద్రియనిగ్రహం, 7. అక్రోధం, 8. అనసూయ.) సాత్వికభావాలు వేరు. **"స్తంభ ప్రళయరోమాంచస్స్వేదో వైవర్ణ్య వేపథూ, అశ్రువైస్వర్యమిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః"** – స్తంభ ప్రళయములు మొదలైన ఎనిమిదింటిని సాత్వికభావాలు అంటారు. ఇతరుల సుఖము, దుఃఖము మొదలైన భావాలను చూసి వానిని భావించే సమయంలో మనస్సులో కలిగే భావాలతో కూడిన అభినయము సాత్వికాభినయము. ఇది కలవాడు పరమశివుడు.

6. ఈ 'అభినయదర్పణం' "The Mirror of Gesture" అను పేరుతో ఆంగ్లంలోకి అనువదించబడింది. ఇది 1917లో 'కేంబ్రిడ్జ్ – హార్వర్డ్ యూనివర్శిటీ ప్రెస్' వారిచే ప్రచురించబడింది. దీని రచయిత ఆనంద కుమారస్వామికి దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి సహాయం ఉంది.

7. భరతుని నాట్యశాస్త్రానికి పూర్వమే నందికేశ్వరుడు **అభినయదర్పణం** అనే ఉత్కృష్ట శాస్త్ర గ్రంథాన్ని రచించాడనీ, దానిని అనుసరించే ధాన్యకటకం, భట్టిప్రోలు, ఘంటసాల, గోలి, జగ్గయ్యపేట, నాగార్జునకొండ మొదలైన స్థూపాలలో నాట్యశిల్పం చెక్కారనీ ఒక వాదం ఉంది. కాగా నందికేశ్వరుడు తెలుగు నాట జన్మించిన ఋషి అని పిండితార్థం.

8. ఆంగికము భువనము – మొదలైనచోట్ల రూపకాలంకారము. ఉపమేయానికి (భువనము) ఉపమానము యొక్క రంగు – (ఉపమానత్వము) – ఆంగికత్వము కలిగినది కనుక **రూపకాలంకారము**.

9. ఈ శ్లోకము అనుష్టుప్ చందస్సులో ఉంది. ప్రతి పాదములోను – 5వ అక్షరము లఘువు, 6వ అక్షరము గురువు, 7వ అక్షరము – 1, 3 పాదములలో గురువును, 2, 4 పాదములలో లఘువు.

10. సత్యమే ఆచారముగా కలిగినది సత్యాచారసభ అని చెబుతూ – నందికేశ్వరుడు సభ అలా సత్యంతో ఉండాలని అభినయదర్పణంలో ఆశించాడు. ఆధునిక కాలంలో కూడా నృత్యసభలతో సహ అన్ని సభలు ఇలా ఉంటే ఎంత బాగుంటుంది!? ❁

**42**

రుద్రభట్టు రచించిన **శృంగారతిలకము** లోని మొదటి శ్లోకము.

**శ్లో॥ శృంగారీ గిరిజాననే సకరుణో రత్యాం ప్రవీరః స్మరే**
**బీభత్సోఽ స్థిభిరుత్ఫణీ చ భయకృన్మూర్త్యాద్భుతస్తుంగయా ।**
**రౌద్రో దక్ష విమర్దనే చ హసకృన్నగ్నః ప్రశాంతిశ్చిరా –**
**దిత్థం సర్వరసాశ్రయః పశుపతిర్భూయాత్సతాం భూతయే ॥**

**ప్రతిపదార్థ తాత్పర్యాలు :**

శృంగారీ గిరిజాననే – గిరిజ + ఆననే, శృంగారీ – **శృంగం ప్రాధాన్యమియర్తీతి శృంగారః** – ప్రాధాన్యము పొందునది కనుక శృంగారమన్నారు. శృంగారము కలవాడు శృంగారి. పార్వతీదేవి మోము చూసేటప్పుడు శివునిలో శృంగారరసము కనబడుతోంది. సకరుణో రత్యామ్ – రత్యామ్, సకరుణో – దీనిచేత జనులు తనను ఆధీనము చేసుకొంటారు కనుక కరుణ అని పేరు వచ్చింది. తనమూడో కంటితో రతిదేవి భర్త మన్మథుడు బూడిదయ్యాడు. ఆ స్థితిలో విలపిస్తున్న రతీదేవిని చూసినప్పుడు శివునిలో కరుణరసము పెల్లుబుకుతోంది. ప్రవీరః స్మరే – స్మరే ప్రవీరః – ఉత్సాహము చేత వృద్ధి పొందుతుంది కనుక వీరమన్నారు. మన్మథుని విషయములో శివునికి వీరరసము కనబడుతోంది. బీభత్సోఽ స్థిభిః – అస్థిభిః బీభత్సః – బీభత్స అంటే నింద. అది కలిగినది బీభత్సము. ఎముకల దండను దాల్చుటచేత శివునిలో బీభత్సరసము నెలకొంది. ఉత్ఫణీ చ భయకృత్ – పడగెత్తిన పాములను ధరించి ఉండుట చేత భయము కొల్పుచూ భయానకరసము శివుడు కలిగి ఉన్నాడు. మూర్త్యాద్భుతస్తుంగయా –మూర్తి + అద్భుతః + తుంగయా – అత్ అనేది ఆశ్చర్యార్థకమయిన అవ్యయము. ఆ ఆశ్చర్యానికి ఉత్పత్తి స్థానము కనుక అద్భుతమన్నారు. పొడవైన మూర్తి కావటం వలన – చూసేవారికి ఆయనలో అద్భుతరస స్పృహ కలుగుతోంది. రౌద్రో దక్షవిమర్దనే చ – దక్షవిమర్దనే చ రౌద్రో – రుద్రుడు అధిదేవతగా కలిగినది రౌద్ర రసము. దక్షయజ్ఞాన్ని నాశనము చేసే సందర్భంలో దక్షుని బాగా మర్దించే సమయంలో శివునిలో రౌద్రరసము ఉట్టిపడుతోంది.

హాసకృన్నగ్నః – హసకృత్ + నగ్నః – హసే హసనే – జనులను నవ్వించునది కనుక హాస్యమన్నారు. దిగంబరుడు కావటము చేత హాస్యరసాన్ని కూడా శివుడు కల్పిస్తున్నాడు. ప్రశాంతిశ్చిరాత్ – ప్రశాంతిః + చిరాత్ – చాలాకాలమునుండి ఆయనదగ్గర భక్తులను అనుగ్రహించే శాంతరసము ఉన్నది. ఇత్థం సర్వరసాశ్రయః పశుపతిః – ఈ విధముగా అన్ని రసాలకు ఆశ్రయుడైన పశుపతి శివుడు. భూయాత్ సతాం భూతయే – సతాం భూతయే భూయాత్ – మంచివారికి ఐశ్వర్యములిచ్చుగాక!

**విశేషములు :**

1. శృంగారము మూడు రకాలు 1. వాగాత్మకము, 2. నేపథ్యాత్మకము, 3. క్రియాత్మకము. "శృంగారం త్రివిధం విద్యాత్ వాఙ్నేపథ్య క్రియాత్మకమ్" (భరతనాట్యశాస్త్రము 6–77) ఈ శ్లోకములోనిది క్రియాత్మకము.

2. ఉత్ అనేది ఒక ఉపసర్గ. ఇది పక్కన చేరి ధాత్వర్థాన్ని మారుస్తుంది. ఒక్కోసారి వ్యర్థంగా ఉంటుంది. 1. ఉచ్చయము = ఇచట "ఉత్" అనునది ధాత్వర్థమును సమూహము అను అర్థముగా మార్చినది; 2. ఉచ్చారణము = ఇచట ధాత్వర్థమును పలుకుట అను అర్థముగా మార్చినది; 3. ఉచ్ఛిష్టము = ఇచట ధాత్వర్థమును ఎంగిలి అను అర్థమునకు మార్చినది; 4. ఉజ్జీవము = ఇక్కడ "ఉత్" వ్యర్థప్రయోగము. జీవము అంటే జీవనము. ఉజ్జీవము అన్నా జీవనమే; 5. ఉల్లాసము = ఇచట ధాత్వర్థమును సంతోషమను అర్థమునకు మార్చినది; ఇవే కాకుండా ఉత్ అంటే ప్రకాశము అనే అర్థంలో వాడతారు. ఈ శ్లోకంలో **ఉత్ఫణీ** అని కవి వాడాడు. ఫణి అంటే ఫణము (పడగ కలది). సర్పము. ప్రకాశించే పాము అని ఫలితార్థము.

3. రుద్రభట్టు శ్లోకము చదివిన సాహితీపరులకు ఆదిశంకరులు సౌందర్యలహరిలో చేసిన శ్లోకం వెంటనే గుర్తుకు వస్తుంది.

శివే శృంగారార్ద్రా – తదిరజనే కుత్సనపరా
సరోషా గంగాయాం – గిరిశచరితే విస్మయవతీ।
హరాహిభ్యో భీతా –సరసిరుహసౌభాగ్యజననీ
సఖీషు స్మేరా తే మయి – జనని దృష్టిస్సకరుణా ॥

తల్లీ! నీ దృష్టి నవరసభరితమై ఉన్నది. శివునియందు మిక్కిలి శృంగార రసము, శివేతరశత్రువులయందు బీభత్సరసము, గంగాదేవిని చూచునపుడు రోషరసము, నీ

నాథుని చరిత్రలందు విస్మయరసము, స్వామి పాముల దండలు చూచునపుడు భయరసము, యెఱ్ఱకలువల కాంతితో నీ కనులలో వీరరసము, నీ చెలికత్తెలతో (లక్ష్మి, సరస్వతులు) మందహాసరసము, నా వంటి దీనులను చూచునపుడు కరుణరసము ఈ విధముగా ఎనిమిది రసములు ఒప్పారుచున్నవి, తొమ్మిదవ రసమైన శాంతరసమునకు లోటేమియూ లేదు – అది నీ రూపలావణ్యజన్యసహజరసమే కదా!

4. అన్నమయ్య కూడా నవరసములను స్వామివారిలో వర్ణించాడు.

అవధరించఁగదయ్య అన్నిరసములు నీవు
తివురుచునబ్బెనిదె తేనెమోవిరసము,

చ. 1: చెలియచక్కఁదనాన శృంగారరసము
వెలయ బొమజంకెనల వీరరసము
కలయు రతికాంక్షలను కరుణారసము
అలరు మైపులకలను అద్భుతరసంబు

చ. 2: తరుణి సరసములను తగు హాస్యరసము
పరుషంపువిరహన భయరసంబు
బెరయు నిబ్బరములను బీభత్సరసము
గరిమ మరుయుద్ధాన ఘనరౌద్రరసము

చ. 3: వనిత ఆనందముల వడిశాంతరసము
ననుపుమంతనములను నవరసములు
యెనలేని శ్రీవేంకటేశ నీతోఁ గూడి
దిన దిన వినోదాల తిరమాయ రసము

(రేకు: 0172–1సంపుటం: 07–423)

5. రుద్రటుడు, రుద్ర, రుద్రభట్ట, భట్టరుద్ర – ఇన్ని పేర్లు ఒకనివే.

6. కాళిదాసు పేరు మీద ఇంకొక **శృంగారతిలకము** లోకంలో ప్రసిద్ధి పొందింది.

7. ఈ శ్లోకంలోని వృత్తము శార్దూలవిక్రీడీతము.

8. ఈ శ్లోకంలో ఉల్లేఖాలంకారముంది. ఒకే వస్తువును రకరకాలుగా ఉల్లేఖిస్తే అది ఉల్లేఖాలంకారము. ఒకడే శివుడు రకరకాల రసాలకు నెలవుగా వర్ణించబడ్డాడు కనుక ఉల్లేఖాలంకారము.

9. రుద్రటుని శృంగారతిలకములో మూడు పరిచ్ఛేదాలున్నాయి.

10. **త్రిపుర వధాదేవ...** అంటూ రుద్రటుడు తన శృంగార తిలకమును రుద్ర స్తుతితో ముగించాడు.



## 43

త్రిపాఠి శ్రీశివరామకవి రచించిన **నక్షత్రమాల** లోని మొదటి శ్లోకము.



**శ్లో॥ ధరాత్మజారమ్యముఖారవిన్ద -**
**మరందరోలంబ ఉదారకీర్తిః ।**
**శేషాఖ్యసంయోగవిశేషశోభో**
**దేవో ముదే వోఽస్తు శివః స రామః ॥**

**ప్రతిపదార్థము :** (ఈ శ్లోకములోని పదాలు శివునికి, రామునికి ఇద్దరికీ అన్వయిస్తాయి.) **ధరాత్మజా** - ధర + ఆత్మజా = ధర శబ్దానికి రెండు అర్థాలున్నాయి. పర్వతము అనే అర్థంలో ధరతి భువం ధరః = ధృఞ్ ధరణే = భూమి అనే అర్థంలో ధరతి విశ్వం ధరా - విశ్వమును ధరించునది. తనవలన పుట్టినది ఆత్మజ. మొదటి అర్థములో ధరాత్మజ అంటే పర్వతానికి కుమార్తె - పార్వతి, రెండవ అర్థములో ధరాత్మజా అంటే భూమికి కుమార్తె సీత అని చెప్పుకోవాలి.

**రమ్యముఖ + అరవిన్ద** - అందమయిన ముఖమనే తామరపువ్వులోని (రెండు పక్షములలోనూ ఒకటే అర్థము). అరాన్ కేసరాన్ విందతీతి అరవిందం- విద్ లాభే- కేసరములను పొందియుండునది.

**మరందరోలంబః + ఉదార కీర్తిః** - పూదేనెను తాగే తుమ్మెదయి గొప్ప కీర్తిని కలిగినవాడు. రౌతీతి రోలంబః - రు శబ్దే- మ్రోయునది కనుక తుమ్మెదకి రోలంబమని పేరు.

**శేషాఖ్యసంయోగవిశేషశోభః దేవః** - శేషుడనే పాముయొక్క కూడిక చేత - అలంకారము చేత - విశేషమైన కాంతికల దేవుడు (శివుడు). ఆదిశేషుని స్వరూపమైన లక్ష్మణునితో కూడియున్న దేవుడు (రాముడు).

**శివః స రామః** - ఆ శివుడు, ఆ రాముడు; **ముదే వోఽస్తు** - ముదే + వః + అస్తు - సంతోషము మీకు కలిగించుగాక !

**తాత్పర్యము :** పర్వతానికి కుమార్తె అయిన పార్వతి అందమయిన ముఖమనే తామరపువ్వు లోని పూదేనెను తాగే తుమ్మెదయి, శేషుడనే పామును దాల్చి, గొప్ప కీర్తిని కలిగిన శివుడు మీకు ఆనందాన్ని కలిగించుగాక!

భూమికి కుమార్తె అయిన సీత ముఖమనే తామరపువ్వు లోని పూదేనెను తాగే తుమ్మెదయి, ఆది శేషుని స్వరూపమైన లక్ష్మణునితో కూడియున్న రాముడు మీకు ఆనందాన్ని కలిగించుగాక!

**విశేషాలు :**

1. పదం, క్రమం, సంహితలుగా వేదాధ్యయనం చేయడం త్రిపాఠం. అలా చేసినవాడు త్రిపాఠి. అటువంటి త్రిపాఠివంశానికి చెందినవారు త్రిపాఠి శ్రీశివరామకవి.

2. ప్రకృతము, అప్రకృతమూ రెండూ కీర్తింపబడితే అది **ప్రకృతాప్రకృతశ్లేష.** ఈ శ్లోకములో ప్రకృతమైన శివుడు, అప్రకృతమైన రాముడు ఇద్దరూ వర్ణింపబడ్డారు కనుక ఇది ప్రకృతాప్రకృతశ్లేష.

3. ఉదారకీర్తిరుద్దామవైభవావర్ణరూపిణీ – అను అమ్మవారి నామములలో ఉదారకీర్తి అను నామము ఈ శ్లోకములో శివ, రాములపరంగా ప్రయోగింపబడింది.

4. వాసుదేవ ఇతి వామదేవ ఇత్యస్తి కల్పకమహీరుహ ద్వయమ్ ।
యద్యపీహ సుమభేదసంభవః నాస్త్యథాపి ఫలభేదసంభవః ॥

వాసుదేవుడు, వామదేవుడు అని రెండు కల్పవృక్షాలు ఉన్నాయి. ఆ రెండింటిలోనూ సుమ భేదమేకాని ఫలభేదము లేదు. (వాసుదేవ, వామదేవ లో రెండవ అక్షరమే తేడా. వాసుదేవ లో “సు” ఉంది. వామదేవ లో “మ” రెండవ అక్షరం. సుమ భేదమే కాని, ఆ రాముడు, శివుడు భక్తులకు ఇచ్చే అనుగ్రహఫలాలలో తేడాలేదు. ఇద్దరూ ఒకరే) ఈ వాసుదేవ వామదేవ శ్లోక పాదులోనుంచి పుట్టినదే ఈ త్రిపాఠి గారి శ్లోకం.



## 44

శ్రీ పుణ్యానందమునీంద్ర **“కామకలావిలాసము”**లోని మొదటి శ్లోకము.

**శ్లో॥ సకలభువనోదయస్థితిలయమయలీలావినోదనోద్యుక్తః ।**
**అంతర్లీనవిమర్శః పాతు మహేశః ప్రకాశమాత్రతనుః ॥**

**ప్రతిపదార్థము :** సకల = అన్ని; భువనోదయ = భువన + ఉదయ = లోకములయొక్క సృష్టి (భవతి అస్మిన్నితి భువనమ్ – దేనియందు సర్వము కలుగునో అది భువనము.); స్థితి = ఉనికి (తిష్ఠంత్యస్యామితి స్థితిః – దీనియందు స్థిరులై ఉంటారు); లయమయ = నాశనములతో కూడిన; లీలావినోదనోద్యుక్తః = లీలావినోదన + ఉద్యుక్తః = లీలావినోదముతో ఎప్పుడూ సిద్ధముగా ఉండువాడు; అంతర్లీన = కలిసిపోయిన (వ్యు. అంతర్ + లీ సంశ్లేషే) + క్త – సత్వమ్. (కృ.ప్ర.); విమర్శః = విమర్శనా తత్వము కలవాడు (విమర్శరూపిణియైన శక్తిని కలిగినవాడు); ప్రకాశ మాత్ర తనుః = ఎప్పుడూ ప్రకాశిస్తూ ఉండే శరీరము కలవాడయిన; మహేశః = మహేశుడు; పాతు = రక్షించుగాక!

**తాత్పర్యము :** పదే పదే సృష్టి, స్థితి, లయకార్యములందు జాగరూకత కలిగినవాడు. శక్తి (విమర్శ) తనయందు కలవాడు, ఎప్పుడూ ప్రకాశిస్తూ ఉండేవాడయిన మహేశ్వరుడు మిమ్మలిని రక్షించుగాక!

**విశేషాలు :**

1. శ్రీవిద్యకు సంబంధించిన ముఖ్యమైన గ్రంథాలలో ఒకటి శ్రీ కామకలావిలాసము.

2. శ్రీచక్రంలోని ఒక్కొక్క భాగం త్రిపురసుందరియొక్క సూచికగా భావిస్తారు. బయటి నుండి లోపలికి వెళ్ళే మార్గంలో శ్రీచక్ర భాగాలు – ఇవి

మూడు సమాంతర రేఖలతో కూడుకుని ఉన్న చతురస్రాకారము – త్రైలోక్య మోహనం; పదహారు రేకులు గల వృత్తము – సర్వ ఆశా పరిపూరకము; ఎనిమిది రేకులు గల వృత్తము – సర్వ సంక్షోభనము; పద్నాలుగు చిన్న త్రిభుజాలు – సర్వ సౌభాగ్యదాయకము; పది చిన్న త్రిభుజాలు – సర్వ అర్థసాధకాలు; పది చిన్న త్రిభుజాలు – సర్వ రక్షకాలు; ఎనిమిది చిన్న త్రిభుజాలు – సర్వ రోగహరకాలు; మధ్యనున్న ఒక త్రిభుజం – సర్వ సిద్ధిప్రదము; బిందువు – సర్వ ఆనందమయి.

3. వివిధ పరిమాణాలలో ఉన్న ఈ తొమ్మిది త్రిభుజాలు, ఒకదానితో ఒకటి కలుస్తాయి. వీటి మధ్యలో మానవుని కంటికి అందనంతగా అత్యున్నతస్థానం కలిగి అనంతమైన కేంద్రంలో బిందువురూపంలో శక్తి ఉంటుంది. ఈ కేంద్రము నుండే సమస్త విశ్వము వ్యాపిస్తుంది. ఈ త్రికోణాల చుట్టూ ముందు సృష్టిని సూచించే ఎనిమిది రేకులు గల వృత్తము, దాని తర్వాత పునరుత్పత్తిని సూచించే పదహారు రేకులు గల వృత్తములు ఉంటాయి. వీటి చుట్టూ నాలుగు దిశలలో పవిత్ర స్థలానికి ద్వారాలు ఉంటాయి.

4. బిందువు అంతరాలలో **"కామకళ"** నిగూఢమై ఉంటుంది. ( కుయ్పర్ కే Understanding India : The Culture of India)

5. ఆ కామకలావిస్తృతిని చర్చించేదే ఈ కామకలావిలాసము.

6. శ్రీచక్రంలోని విమర్శ బిందువుకు సంబంధించిన స్వరూపంగా అమ్మవారిని విమర్శ రూపిణీ (501) అని లలితా సహస్రనామం పేర్కొంది. ఆ విమర్శ రూపిణిని కలిగినవానిగా మహేశ్వరుని ఈ నాంది శ్లోకంలో కవి నిరూపించారు. ❁

## 45

భట్ట నారాయణుని **"స్తవచింతామణి"**లోని మొదటి శ్లోకము.

**శ్లో॥ సుగిరా చిత్తహారిణ్యా – పశ్యన్త్యా దృశ్యమానయా ।**
**జయత్యుల్లాసితానన్ద – మహిమా పరమేశ్వరః ॥**

**ప్రతిపదార్థము :** సుగిరా = చక్కటి వాక్కులతో; చిత్తహారిణ్యా = చిత్తలాలనముతో (కుండలినీసాధనలో షట్ చక్రాలలో ప్రతి ఒక్కదాని వద్ద క్రమపద్ధతిలో చిత్తాన్ని నిలిపి ధ్యానం చేయడం.); పశ్యన్త్యా = మౌనంగా చేసే ధ్యానంతో; దృశ్యమానయా = కనబడుచున్న; ఉల్లాసితానన్ద = ఉల్లాసిత + ఆనన్ద మహిమా = సంతోషింపచేయబడిన ఆనందపు గొప్పతనము కలిగిన; పరమ + ఈశ్వరః జయతి = చిదాత్మరూపుడైన ఈశ్వరుడు జయించుచున్నాడు.

**తాత్పర్యము :** చక్కటి వాక్కులతో, చిత్త లాలనముతో, మౌనంగా చేసే ధ్యానంతో, కనబడుతున్న సంతోషింపచేయబడిన ఆనందపు గొప్పతనము కలిగిన, చిదాత్మరూపుడైన ఈశ్వరుడు జయింపబడుగాక! (ఈశ్వరుడు మౌనధ్యానములో దర్శనమిస్తాడని భావము)

**విశేషాలు :**

1. భట్ట నారాయణుని **స్తవచింతామణి** (wishing jewel of praise) మొత్తం 120 శ్లోకాలు. ప్రకాశ, విమర్శ స్వరూపాలుగా శివపార్వతులను ఇందులో కవి పొగిడాడు.

2. శబ్ద శక్తి 'పర', 'పశ్యంతి', 'మధ్యమ', 'వైఖరి' అనే నాలుగు రకాలు. బయటికి మనం మంత్రాలు గట్టిగా చదువుతామే అది **వైఖరి**. పెదవులు కదుపుతూ నెమ్మదిగా చదివే పూజ మంత్రాలు అలాంటిది **మధ్యమ**. మౌనంగా మనసులో చేసే ధ్యానం **పశ్యంతి**. వీటన్నిటికి అతీతమైన స్థితిలో ఉండే శబ్దశక్తి **పరా**.

3. ఈ స్తవచింతామణి గ్రంథముపేరు చిరకాలప్రసిద్ధమైనది. శ్రీమాత నివాసం చింతామణి గృహం. ఆ అమ్మ మణిద్వీపంలో ఎలా అలరారుతోంది అనే విషయాన్ని కళ్లకు కట్టినట్లు వర్ణించి చెప్పే కథ దేవీభాగవతంలో ఉంది. “చిన్తామణి ర్జయతి సోమగిరి ...” అను శ్రీకృష్ణకర్ణామృతం శ్లోకం ప్రసిద్ధమైనది.

4. జాగ్రత్, స్వప్న, సుషుప్తులలో ఉన్నప్పుడు చిత్తానికి వేర్వేరు పేర్లు ఉన్నాయి. జాగ్రత్ స్థితిలో చిత్తాన్ని **“ఘోరం”** అనీ, స్వప్నావస్థలో **“శాంతం”** అనీ, సుషుప్తిలో **“మూఢం”** అనీ అంటారు.

5. 1.విక్షిప్తత. 2. గతాయాత, 3. సంశ్లిష్టత, 4. సులీనతా అనేవి చిత్తభేదాలు. ఈ శ్లోకంలో నాలుగవ చిత్తస్థితి వర్ణించబడింది.

6. మనస్సు చేసే పనులని (మనోధర్మం) సామాన్యార్థం. చిత్తవృత్తిని నిరోధించడమే యోగమని చెప్పిన యోగదర్శనం చిత్తవృత్తులు అంటే ఏమిటో చెప్పింది. చిత్తవృత్తులు ఐదు. 1. ప్రమాణం, 2. విపర్యయం, 3. వికల్పం, 4. నిద్ర, 5. స్మృతి. మొదటిదైన ప్రమాణం త్రివిధాలు. ప్రత్యక్షం, అనుమానం, ఆప్తవాక్యం/ఆగమం). రెండవదైన విపర్యయం అంటే మిథ్యాజ్ఞానం. లేని వస్తువును గురించి చెప్పి జ్ఞానం కలిగించడం మూడవదైన వికల్పం విశిష్టత. ఉదాహరణకు కుందేటి కొమ్ము. (కుందేలుకి కొమ్ము ఉండదు గదా!) మెలకువతోనూ ఉండక, కలలు కంటూనూ ఉండని స్థితి నాలుగవదైన నిద్ర. జ్ఞాపకం చేసుకుని జ్ఞానం కలిగించుకోవడం స్మృతి. ఇది ఐదవ చిత్తవృత్తి. తనకు తెలిసిన ఒక వ్యక్తిని జ్ఞప్తికి తెచ్చుకుని ‘నీవు ఫలానా కదూ!’ అని పలకరించినప్పుడు ఉండే చిత్తవృత్తి ఇది. **అభ్యాసం చేత, వైరాగ్యభావన చేత చిత్తవృత్తిని నిరోధించడం సాధ్యమని శాస్త్రవాక్కు.** (యోగదర్శనం)

7. ఈ శ్లోకము అనుష్టుప్ చందస్సులో ఉంది. ప్రతి పాదములోను – 5వ అక్షరము లఘువు, 6వ అక్షరము గురువు. 7వ అక్షరము – 1, 3 పాదములలో గురువును, 2, 4 పాదములలో లఘువు.

8. ఈశ్వరుడు జయింపబడుగాక – అంటే సామాన్య మానవులమైన మన మనస్సు స్వామి ధ్యానంలో సులీనమై ప్రపంచవృత్తులను జయించాలని అంతరార్థం. ❁

## 46

కాళ్లకూరి నారాయణరావుగారి **మధుసేవ** లోని మొదటి పద్యము.

**గౌరవమాయువున్ సిరిసుఖంబును దెల్వియు రూపడంచి, పై**
**వారికి హేయ బుద్ధి తమవారికిన్ వ్యాకులమున్ ఘటించి ని**
**స్సారుల జేయు దుర్వ్యసన సంతతి పాల్పడకుండ మా సభా**
**స్తారుల నీశ్వరుండు సతతంబును సత్కృపగాచుగావుతన్.**

**ప్రతిపదార్థము :** మా సభాస్తారులన్ = మా నాటకమును చూచుటకు వచ్చిన సభ యందుండు ధర్మజ్ఞులను; గౌరవము = గొప్పతనము; ఆయువున్ = జీవితకాలము, ఆయుస్సు (వ్యు. ఇణ్ + గతౌ – ఇ + ఉసిః. (ఔణా.) గడచిపోవునది; సిరి = సంపద; సుఖంబును = అశుభాలను పోగొట్టేది, ఇంద్రియాలను తృప్తిపరిచేది సుఖము – అటువంటి సుఖమును; తెల్వియు = జ్ఞానములయొక్క; రూపడంచి = రూపు + అడంచి = ఆకారాన్ని పోగొట్టి; పైవారికి = ఇతరులకి "వచ్చుటకేమిగాని పయివారలు చూచిన." (శ్రవణానందం–2–7) హేయ బుద్ధి = విడువదగిన రోతకలిగించే బుద్ధిని; తమవారికిన్ = తమకు సంబంధించిన వారికి; వ్యాకులమున్ = కలతనొందించుటను; ఘటించి = చేసి; నిస్సారుల జేయు = నిస్సారులన్ + చేయు = సారము లేకుండా చేయు; దుర్వ్యసన సంతతి = చెడ్డ అలవాట్ల వరుస; పాల్పడకుండ = వశము కాకుండా; ఈశ్వరుండు = పరమాత్మయయిన శివుడు (వ్యు. ఈశ = ఐశ్వర్యే – అనువిష్టేచ – ఈశ్ + వరచ్. (కృ.ప్ర.)) సతతంబును = ఎల్లప్పుఁడూ; సత్కృపగాచు గావుతన్ = సత్కృపన్ + కాచున్ + కావుతన్ = చక్కటి దయతో రక్షించుగాక!

**తాత్పర్యము :** మద్యము తాగుటవలన ఆయుస్సు, సంపద, సుఖము, జ్ఞానము నశిస్తాయి. తనవారికి, ఇతరులకి మద్యము తాగేవాని మీద తాగుబోతు అని రోత బుద్ధి వస్తుంది. తమకు సంబంధించిన వారికి "అయ్యో! తాగి తాగి వీడేమవుతాడో!" అని బాధ వస్తుంది. జీవితములో సారము లేకుండా చేసే ఆ చెడ్డ అలవాట్ల పాలు కాకుండా – పరమాత్మ యయిన శివుడు – మా నాటకమును చూచుటకు వచ్చిన సభ యందుండు ధర్మజ్ఞులను ఎప్పుడూ దయతో రక్షించుగాక!

**విశేషములు :**

1. 1926 లో కాళ్లకూరి నారాయణరావుగారి **మధుసేవ** నాటకం అచ్చయింది.

2. ఈ నాటకపు ముందుమాటలో నారాయణరావు గారు పుస్తకము పూర్తిగా చదువకుండా విమర్శలు చేయవద్దని చెబుతూ "కలములను కాగితాలు పాడుచేయవ"ద్దని ముల్లు పువ్వుతో కొట్టారు.

3. 'ఒరే దుర్మార్గుల్లారా, సమాజపు రక్తాన్ని జలగల్లాగా పీలుస్తున్న మీరా నాకు నీతులు చెప్పేవారు? మీకు మనిషి రక్తం అంటే ఇష్టం. నాకు అంత ఆశ లేదు. ద్రాక్షఫలరక్తంతో నేను సరిపెట్టుకుంటాను. మీరు రక్తపిశాచాలు. నేను మీలాంటి కసాయిని కాను.' అని మధుపానాన్ని చమత్కారంగా సమర్థించుకొనే ఉమర్ ఖయ్యాములు లేకపోలేదు కాని **మద్యపానము వ్యక్తికి, సమాజానికి అనర్థదాయకము**. అందులో అనుమానము లేదు.

4. "మధుసేవ"లో కాళ్ళకూరి నారాయణరావుగారు ఒక త్రాగుబోతు దినచర్యను సీసపద్యంలో ఇలా వివరిస్తూ ఆంగ్లపదాలతో వ్యంగ్యపు కొరడా ఝుళిపించారు. ఆ పద్యమిది.

"మార్నింగు (morning) కాగానె మంచము లీవింగు(leaving)
మొగము వాషింగు (washing) చక్కగ సిటింగు (sitting)
కార్కు (cork) రిమూవింగు(removing) గ్లాసులు ఫిల్లింగు (filling)
గడగడ డ్రింకింగు (Drinking) గ్రంబులింగు (Grumbling)
భార్యతో ఫైటింగు (Fighting) బయటకు మార్చింగు (Marching)
క్లబ్బును రీచింగు (Reaching) గాంబులింగు (Gambling)
విత్తము లూజింగు (Losing) చిత్తము రేవింగు (Raving)
వెంటనే డ్రింకింగు (Drinking) వేవరింగు (Wavering)
మరల మరల రిపీటింగు (repeating) మట్టరింగు (Muttering)
బసకు స్టార్టింగు (Starting) జేబులు ప్లండరింగు!! (Plundering)
దారి పొడవునా డాన్సింగు (Dancing) థండరింగు (Thundering)
సారె సారెకు రోలింగు (Rolling) స్లంబరింగు (Slumbering)"

5. లోకంలో సారవంతమైనది జ్ఞానము. ఆ జ్ఞానము ఇచ్చేవాడు పరమశివుడు. అందుకే నిస్సారులైన (జ్ఞానశూన్యులైన) వ్యసనపరుల జాబితాలలో ప్రజలను చేర్చవద్దని కాళ్లకూరి వారు జ్ఞానదాయకుడైన శివుని ఈ నాందీపద్యములో వేడుకొన్నారు. తన నాటక ఇతివృత్తమయిన నిస్సారంగా జీవితాన్నిచేసే మధుసేవను నాందీలో వ్యంగ్యంగా నిస్సార పదంతో కవి ప్రస్తావించారు.

6. శివునికి చేయవలసిన సేవ మధువుకి వద్దని రచయిత భావన. అది నెరవేరాలని మూడుపువ్వులు ఆరుకాయలుగా విస్తరిస్తున్న ఈ "మందుల వాతావరణం"లో కోరుకోవటం అత్యాశ ఏమో కాని తప్పు లేదు. శివుడు లయకారుడు. ❁

**47**

పుచ్చావేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి **"సంగీతమార్తాండము"**(తాళాధ్యాయము) లోని మొదటి శ్లోకము.

**శ్లో॥ నానామార్గైర్లయో యత్ర - యతీనాం స్యాత్కళానిధౌ ।**
**తం దక్షిణం శివం నౌమి - చిత్తవృత్తిమయం ధ్రువమ్ ॥**

**ప్రతిపదార్థము :** నానామార్గైః = అనేక మార్గములతో (అనేక మార్గములు కలవానికి); కళానిధౌ = కళలకు నిధియైన వానియందు (కళలకు నిధియైనవానికి); లయో యత్ర యతీనాం స్యాత్ = యత్ర యతీనాం లయః స్యాత్ = ఎవనియందు యతులకు చిత్తలయమగునో; తం దక్షిణమ్ = అటువంటి దక్షిణామూర్తి స్వరూపునకు; చిత్తవృత్తిమయమ్ = చిత్త వ్యాపార స్వరూపునకు (మనస్సుయొక్క ఆలోచనలకు తన దయతో ఒక ఆకృతి కల్పించువానికి); ధ్రువమ్ = శాశ్వతునికి; శివం నౌమి = శివునికి నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** అనేకమార్గములు కలవానికి, కళలకు నిధియైనవానికి, యతులకు చిత్తలయము కలిగించు అనగా మోక్షము అనుగ్రహించు దక్షిణామూర్తిస్వరూపునకు, చిత్తవ్యాపారస్వరూపునకు, శాశ్వతునికి, శివునికి నమస్కరించుచున్నాను.

**విశేషాలు :**

1. **నానామార్గైః**

నానా అనేది సంస్కృత అవ్యయము. అనేకము అని అర్థము. 1. చతురశ్రము, 2. త్ర్యశ్రము, 3. మిశ్రము, 4. ఖండము, 5. సంకీర్ణము. అని అయిదు తాళములను పంచమార్గ తాళములు అంటారు. ఈ గ్రంథము తాళాలకు సంబంధించిది కనుక నాందీశ్లోకములో ఈ మార్గశబ్దాన్ని కవి తీసుకువచ్చాడు.

2. దేనిచేత పదార్థాన్ని వెతుకుతారో అది మార్గము. మృగయంతే గవేషయంత్యనేన మార్గః. **మృగ అన్వేషణే.**

3. మోక్షప్రాప్తికి 1. జ్ఞానమార్గము, 2. కర్మమార్గము, 3. ఉపాసనామార్గము అని మూడుమార్గాలు ఉన్నాయి. **"మార్గస్త్రయో మే విఖ్యాతా మోక్షప్రాప్తౌ నగాధిప"** (దేవీభాగవతము 7-37-2)

4. ఇవి కాకుండా గురుశిష్యుల పరంగా పంచమార్గాలు చెప్పారు.

**కపిమార్గము :** తమ తల్లి ఎక్కడకి పోయినా - కోతి పిల్లలు పట్టుకున్న విధంగా, గురువుని శిష్యులు వదలకుండా ఉండాలి.

**విహంగమార్గము :** పక్షి గ్రుడ్లను పెట్టి తన రెక్కలచే మూసి ఉంచుట వల్ల గుడ్లు పిల్లలైనట్లుగా గురువు శిష్యులను వృద్ధిలోనికి తీసుకువస్తాడు.

**మార్జాలమార్గము :** పిల్లి తన పిల్లలను నోట కరచుకొని అన్నిచోట్లకు తీసుకొని పోతుంది. అలాగే గురువు తనవెంట శిష్యులను వెంటబెట్టుకొని వృద్ధిలోకి తీసుకొనివచ్చుట.

**మీనమార్గము :** చేప గ్రుడ్లనుపెట్టి వాటివైపు అలా చూస్తుంటుంది. క్రమంగా అవి చేపలవుతాయి. అలాగే గురువు శిష్యుని దర్శించి అనుగ్రహిస్తాడు.

**కూర్మమార్గము :** తాబేలు ఒక చోటున గ్రుడ్లు పెడుతుంది. ఇంకొక చోటికి పోయి వాటిని తలచుకొంటే అవి వృద్ధిలోకి వస్తాయి. గురువు అలా శిష్యులను తలచుకొని అభివృద్ధిలోకి తెస్తాడు.

5. శివుడు గురువు. మనము శిష్యులమని కాసేపు అనుకొందాం. మనం వినయంతో మనసు పెడితే ఆయన ఈ పంచమార్గాలలో ఏదో ఒక మార్గంలో మనలిని కరుణించకుండా ఉంటాడా!? తప్పక కరుణిస్తాడని కవి భావం.

6. కళానిధిః = **కళానాం నిధిః** - కళానిధిః - కళలకి ఉనికి పట్టు - కళానిధి. కళానిధి అనే పదము చంద్రుని పరంగా ప్రసిద్ధి. కాని నటరాజమూర్తి అయిన శివుడు కూడా సకల కళలకు నిధి.

7. దక్షిణామూర్తి = పరమశివుని జ్ఞానబోధక అవతారం దక్షిణామూర్తి. **చిత్రం వట తరోర్మూలే ...** శ్లోక ప్రసిద్ధుడు దక్షిణామూర్తి. తమిళనాడులోని మైలదుత్తురైలోని దక్షిణామూర్తి దేవాలయం ప్రసిద్ధి కలిగినది.

8. **నడిచే దేవుడు శ్రీ కంచిస్వామి** తన బోధలలో ఈ దక్షిణామూర్తి ముద్రను ఇలా వివరించారు. "బొటనవ్రేలిని అంగుష్ఠమని అంటారు. హృదయ మధ్యంలో

అంగుష్ఠమాత్రుడై యీశ్వరుడుంటాడు. అందరి హృదయాలలోనూ అంగుష్ఠమాత్ర పరిమాణంతో పరమేశ్వరుడున్నాడని ఉపనిషత్తులు చెబుతాయి. హృదయముందున్నా ఆకాశం ఉన్నది. అది హృదయాకాశం. బయటిది అఖండాకాశం. ఈలోపల వున్న వస్తువే బయట సైతం అఖండంగా వ్యాపించి ఉంది. లోపల అది అంగుష్ఠమంత ఉంటుంది. అంగుష్ఠం లోపలి వస్తువును చూపుతుంది, అంగుష్ఠానికి ప్రక్కన ఉన్నది చూపుడు వేలు. అది దేన్ని చూపుతుంది? “స్వామి ఎచ్చట’? “అదిగో అచ్చట!’ అని ఆ వ్రేలు చూపుతుంది. చాలా దూరము నందున్న వస్తువును సూచించే వేలు ఇది. “లోపలి వస్తువొకటి, బయటి వస్తువొకటి’ అని రెండు వస్తువులు లేవు. రెండు రకాలు లేవు. అన్నీ ఒకటే అన్న స్వానుభవాన్ని అంగుష్ఠ తర్జనీ సంయోగంచే బొటనవ్రేలు చూపుడు వ్రేళ్ళకలయికచే దక్షిణామూర్తి చూపుతున్నారు. అద్వైతానుభవం చూపిస్తూ చిన్ముద్రతో ఉపదేశం చేసే శ్రీదక్షిణామూర్తి దర్శనమాత్రాన మాయపొర తొలగి ఆనందాద్వైత జ్ఞానసముద్రంలో మనంగూడా కలసిపోతాం.

ముగింపు : గీత, వాద్య నృత్యములు దేనితో ప్రకాశిస్తాయో అది తాళము. తాళములోని తకారానికి శివుడు, లకారానికి శక్తి అధిదేవతలు.అంటే శివశక్తుల కలయిక తాళము. సర్వం శివమయం జగత్. ❁

## 48

మలయరాజ **శివస్తుతి** లోనిమొదటి శ్లోకము.

**శ్లో॥ యో న ధియామధిగమ్య – స్తస్య కుతో సంభవో గిరామ్ ।**
**యుక్తేః స్తౌమి తథాపి భవన్తం – మనోరథో యాత్యభూమిమపి ॥**

**ప్రతిపదార్థము :** యో = యః = ఎవడు; న ధియామధిగమ్యః = ధియామ్, అధిగమ్య, న = బుద్ధికి చేరుటకు గమ్యుడు కాడో; తస్య = అట్టివానికి; గిరాం యుక్తేః = వాక్కులను ఉపయోగించుటలో; కుతో సంభవో = కుతః సంభవః = ఎక్కడ అవకాశము ఉంది?; తథాపి = తథా + అపి = అయినప్పటికి; భవన్తమ్ = నిన్ను (శివుని); స్తౌమి = స్తుతించుచున్నాను (స్తోమ శ్లాఘాయామ్); మనోరథో = మనోరథః = మనస్సు అనెడి రథము; యాతి + అభూమిమ్ + అపి = అభూమిమ్ + అపి + యాతి = భూమి కానిదానిని కూడా చేరును.

**తాత్పర్యము :** ఓ శివా! నువ్వు ఆలోచనకు, బుద్ధికి అందని వాడివి. మాటలు బుద్ధిని

అనుసరించి ఉంటాయి కదా. బుద్ధికి అందని నిన్ను ఆ వాక్కులతో ఎలా పొగిడేది? దానికి అవకాశము ఎక్కడుంది? అయినప్పటికి నిన్ను పొగుడుతున్నాను. ఎందుకంటే మనస్సు అను రథము భూమి కానిదానిని కూడా చేరును కదా!

**విశేషాలు :**

1. మలయరాజు అసలు పేరు **మల్లికార్జునుడు**. (క్రీ.శ.1150)

2. ధియా : ధీ యొక్క తృతీయావిభక్తి ధియా. ధ్యాయంతి అనయేతి ధీః. ధ్యై చింతాయాం. దేని చేత ధ్యానము చేయుదురో అది బుద్ధి.

2. 1. శుశ్రూష, 2. శ్రవణం, 3. గ్రహణం, 4. ధారణ, 5. ఊహ, 6. అపోహ, 7. అర్థజ్ఞానం, 8. తత్త్వజ్ఞానం. ఇవి బుద్ధి ధర్మాలు. కిరాతార్జునీయములో భారవి ఈ ధియా పదాన్ని రమణీయముగా ప్రయోగించాడు.

"అపనేయముదేతుమిచ్ఛతా తిమిరం రోషమయం **ధియా** పురః ।
అవిభిద్య నిశాకృతం తమః ప్రభయా నాంశుమతాప్యుదీయతే ॥ (02-36)

(గొప్పతనాన్ని కోరుకొనేవాడు మొదట క్రోధమనెడి చీకటిని / అజ్ఞానాన్ని బుద్ధిచేత తొలగించుకోవాలి. సూర్యుడు మొదటగా రాత్రిచేత చేయబడిన చీకటిని తన కాంతిచేత తొలగించుకొని ఉదయిస్తాడు.)

4. మలయరాజు కూడా భారవి స్థాయిలో **"ధియా"**ను ప్రయోగించాడు. శివధ్యానానికి సంబంధించిన భావంలో ధ్యానము అను అర్థము వచ్చే ధీ శబ్దాన్ని ప్రయోగించుట ప్రశంసనీయము.

5. యతో వచో నివర్తంతే అప్రాప్య మనసా సహ ।
ఆనందం యస్య వై విద్వాన్న బిభేతి కుతశ్చన ॥
(శివమహాపురాణము, తృతీయోధ్యాయము, నైమిషోపాఖ్యానము- 1 వ శ్లోకము)

పరమేశ్వరుని చేరుకొన (వర్ణించ) లేక వాక్కులు మనస్సుతో సహా వెనుదిరుగు చున్నవి. ఆనందస్వరూపుడగు పరమేశ్వరుని తెలుసుకున్న జ్ఞాని దేనివలనైననూ భయపడడు అని బ్రహ్మ చెప్పాడు.

6. ఈ శివమహాపురాణ భావానికి తన శ్లోకంలో ఇంకొక మెట్టుకట్టాడు మలయరాజు. "బుద్ధికి అందని నిన్ను ఆ వాక్కులతో ఎలా పొగిడేది? దానికి అవకాశము ఎక్కడుంది?

అయినప్పటికి నిన్ను పొగుడుతున్నాను. అన్నాడు కవి. ఈ ధైర్యము కవికి **“యతో మనస్తతో భావో యతో భావోస్తతో రసః.”** అనే మాటలనుంచి వచ్చింది. మనసు ఉన్నచోటనే భావము. భావము ఉన్నట్లైతే రసోత్పత్తి. **“రసో వై సః”**. భగవానుడు రస స్వరూపి.

7. **మనోరథము :** కోరికను మనోరథము అంటారు. **భ్రామకత్వేన మనసో రథ అవ స్థితత్వాత్ మనోరథః** – కోరిక భ్రమింపచేస్తుంది. అందువలన మనస్సుకు అది రథము వంటిది. **మన ఏవ రథో యస్య స మనోరథః.** మనస్సే రథముగా కలిగినది కాబట్టి కోరికను మనోరథము అంటారు.

8. మాములు రథాలు భూమి మీద మాత్రమే నడవగలవు. కాని మనస్సు అను రథము భూమి కానిదాని మీద నడుస్తుంది. ఎందుకంటే దానికి అడ్డులేదు. శివా! నిన్ను పొగడాలంటే మాటలకు ఒక దారి ఉండాలి. కాని నువ్వు మాటలకు అందనివాడివి. కనుక దారి లేదు. కాని నిన్ను పొగుడుతాను. రథము నడవాలంటే ఒక భూమి మీద ఒక దారి ఉండాలి. కాని మనోరథ ప్రయాణానికి దారి అవసరంలేదు. ఎక్కడికయినా వెళ్లిపోతుంది. **అద్భుతమైన అర్థాన్తరన్యాసాలంకారం**. ఇక్కడ సామాన్యవాక్యము విశేష వాక్యముచేత సమర్థించబడింది. 

## 49

విశ్వనాథ (సెప్టెంబర్ 10, 1895 – అక్టోబరు 18, 1976) వారి **నర్తనశాల** లోని మొదటి పద్యము.

**ఆర్తత్రాణపరాయణత్వమున హైమాంబు ప్రవాహోభమై**
**ధూర్తప్రాణహరత్వనిష్ఠమెయి నుద్భూతార్చిషంబై జగత్**
**కర్తృత్వాదుల కేకకారణమునై కామాగ్ని కుండంబునౌ**
**తార్తీయాకము శైవలోచనము సంధానించు నైశ్వర్యముల్.**

**ప్రతిపదార్థము :** ఆర్త = దుఃఖమునొందినవారిని; త్రాణ = రక్షించు; పరాయణత్వమున = అత్యంతాసక్తిలో; హైమాంబు ప్రవాహోభమై = హైమ + అంబు + ప్రవాహ = మంచునీటి ప్రవాహముతో; ఆభమై = సమానమై (ఇది సమాసోత్తరపదముగానుండి ‘సదృశము’ అను నర్థము నిచ్చును.); ధూర్త = మోసకారుల; ప్రాణహరత్వ = ప్రాణములను హరించు; నిష్ఠ = నిర్వహణము; మెయిన్ = తో; ఉద్భూతార్చిషంబై =

ఉద్భూత + అర్చిషంబై = పుట్టిన నిప్పై; (అర్చి = అగ్నిజ్వాల; అర్చ పూజాయామ్ – అర్చింపబడునది) జగత్కర్తృత్వాదులకు = ప్రపంచ కర్తృత్వము, స్థితి, లయము మొదలైన వాటికి; ఏకకారణమునై = ఒకే కారణమై; కామాగ్ని కుండంబునౌ = కామ + అగ్నికుండంబున్ + ఔ = కోరికలను అగ్నిని ఆరాధించుటకై యేర్పచిన కుండమయి (గోయి.); తార్తీయాకము = మూడవదయిన; శైవలోచనము = శివుని కన్ను; (లోచ్యతే అనేనేతి లోచనం. లోచృ దర్శనే) ఐశ్వర్యముల్ = 1. ఐశ్వర్యము, 2. ధైర్యముమొదలయిన షడ్విధ–ఐశ్వర్యములను, 1. దాసీజనము, 2. భృత్యులు మొదలయిన అష్ట – ఐశ్వర్యములను; సంధానించున్ = కూర్చు(చేర్చు)గాత!

**తాత్పర్యము :** శివుని మూడవ కన్ను దుఃఖమునొందిన వారిని రక్షించు అత్యంతాసక్తిలో మంచునీటి ప్రవాహముతో సమానమైనది. అంటే బాధలలో ఉన్నవారికి చల్లదనాన్ని కలిగిస్తుంది. శివుని మూడవ కన్ను మోసకారుల ప్రాణములను హరించుటలో నిప్పులాంటిది. అంటే దుర్మార్గులను కాల్చి బూడిద చేస్తుంది. శివుని మూడవ కన్ను ప్రపంచ కర్తృత్వము, స్థితి, లయము మొదలైన వాటికి ఒకే కారణమైనది. అనగా సృష్టి, స్థితి, లయము – మూడింటిని ఆ శివుని కన్ను నిర్వహిస్తుందని భావము. కోరికలను అగ్నిని ఆరాధించుటకై యేర్పచిన కుండమయి, ఆ శివుని కన్ను ఐశ్వర్యములను కూర్చుగాత!

**విశేషాలు :**

1. **షడ్విధ–ఐశ్వర్యములు :** 1. ఐశ్వర్యము, 2. ధైర్యము, 3. కీర్తి, 4. తేజస్సు, 5. జ్ఞానము, 6. వైరాగ్యము.

2. **అష్ట–ఐశ్వర్యములు :** 1. దాసీజనము, 2. భృత్యులు, 3. పుత్రులు, 4. మిత్రులు, 5. బంధువులు, 6. వాహనము, 7. ధనము, 8. ధాన్యము.

3. ఈ నాందీ పద్యములో "ఆర్తత్రాణపరాయణత్వము" అనుచోట – సుధేష్ణ ప్రస్తావన ఉంది. ద్రౌపదికి ఆశ్రయమిచ్చిన ఔదార్యమామెది. "ధూర్తప్రాణహరత్వనిష్ఠ"లో పాండవులు, జగత్కర్తృత్వాదుల కేకకారణము లో – నర్తనశాల, కామాగ్ని కుండంబు ద్వారా – కీచకుడు సూచింపబడ్డారు. కుండమనే పదానికి వంట కుండ అను అర్థము కూడా ఉన్నది కాబట్టి వంటవాడయిన భీముడు కూడా సూచింపబడ్డాడు.

4. ఈ నాటక వృక్షానికి అందమైన ఆకులు భాష. పాత్రలు కొమ్మలు, కవిత్వము

పుష్పాలు, ధ్వని సౌరభము అని అడవి బాపిరాజుగారు చెప్పారు. ఇందులో అతిశయోక్తి లేదు.

5. ప్రాచీన లాక్షణిక సంప్రదాయానుసారం కీచకవధను చూపకబోగా , కనీసం వాచ్యంగా కూడా చెప్పకపోవటం ఒక విచిత్రమైన సన్నివేశంగా ఆచార్య హరి శివకుమార్ విశ్లేషించారు. (ఆత్మజ్యోతి డిసెంబర్ 2015 సంచిక 59, 60 పే.)

6. ఈ పద్యంలో శివుని కన్ను రకరకాలుగా పోల్చబడింది కనుక ఉల్లేఖాలంకారము.

7. **నృతీ గాత్ర విక్షేపణే** – నర్తించుట నృత్యము. శాల్యతే శాలా. శాల శ్లాఘాయాం. కొనియాడబడునది శాల. నర్తించుట చేత కొనియాడబడునది నర్తనశాల. దీనిని అచ్చుతెలుగులో చెప్పాలంటే **ఆటపాక**.

8. ఈ నర్తనశాల నాటకం నర్తనశాల సినిమాకు స్ఫూర్తి అంటారు. విశ్వనాథ నాటకమే కాదు – విశ్వనాథే అందరికి స్ఫూర్తి.



## 50

మల్హణకవి **శివస్తోత్రము**లోని మొదటి శ్లోకము.



**శ్లో॥ కాంతా కచ ప్రచయ పుష్ప సుగంధి గంధ**
**లుబ్ధ భ్రమద్భ్రమర కర్బుర కంధరాయ ।**
**గంధర్వ యక్ష సుర సిద్ధ కిరీట కోటి**
**సంఘట్ట ఘృష్ట చరణాయ నమః శివాయ ॥**

**ప్రతిపదార్థము :** కాంతా = కోరదగిన యువతియైన పార్వతీదేవి; (కామ్యత ఇతి కాంతా. కము కాంతౌ. కోరబడునది); కచ = వెంట్రుకల (కచ్యతే కచః కచబంధనే– ముడువబడునది); ప్రచయ = సమూహములోని; పుష్ప = పూవుల (పుష్పతీతి పుష్పం. పుష్ప వికసనే. వికసించునది); సుగంధి = ఇంపైనవాసనలతో కలిసిన; (శోభనః గన్ధః అస్యేతి సుగన్ధిః మంచిగంధము కలిగినది) గంధ = విషయములకు (గంధ్యతే హింస్యతే అభిలష్యతే వా అనేనేతి గంధః – గంధ అర్దనే – దేనిచేత పీడింపబడుదురో, అభిలషింపబడుదురో అది గంధము); లుబ్ధ = ఆశ కలిగినవై (లుభ్యతి కాంక్షతీతి లుబ్ధః – లుభ గార్ధ్యే. ఆశించుట); భ్రమత్ = తిరుగుచున్న; భ్రమర = తుమ్మెదల చేత; (భ్రమతీతి భ్రమరః భ్రము అనవస్థానే – తిరుగుచుండునది); కర్బుర = అనేక రంగులు కలిగిన (కీర్యంతే నానా వర్ణా అత్రేతి కర్బురః); కంధరాయ = కంఠము కలిగినవాని

కొరకు (కం శిరోధారయతి కంధరా. శిరస్సును ధరించునది. ధృ ధారణే); గంధర్వ = గంధర్వులు, (సౌరభం గన్ధం అర్వన్తి గన్ధర్వాః – సువాసనను పొందువారు); యక్ష = యక్షులు (యక్ష్యంతే పూజ్యంతే యక్షాః – పూజింపబడువారు); సుర = దేవతలు (సుష్ఠు రాజంత ఇతి సురాః బాగా ప్రకాశించువారు. రాజృ దీప్తౌ); సిద్ధ = సిద్ధులు మొదలైనవారి (అణిమాది సిద్ధిర్యేషామస్తీతి సిద్ధాః – అణిమాది సిద్ధి కలవారు); కిరీట = కిరీటములయొక్క (కీర్యతే లలాటోపరి క్షిప్యత ఇతి కిరీటం. కౄ విక్షేపణే – నొసటి మీద పెట్టబడినది కనుక కిరీటము); కోటి = అంచులచే; సంఘట్ట = రాపిడి చేత; ఘృష్ట = నలుగుచున్న; చరణాయ = పాదములు కలవాని కొరకు (చరత్యనేన చరణః – చరగతి భక్షణయోః దీనిచేత సంచరింతురు); **నమః శివాయ** = శివాయ నమః = శివుని కొరకు; (శివం కల్యాణం తద్యోగాద్వా – శివమనగా శుభము. దానితో కూడిన వాడూ శివుడు) నమః = నమస్కారము.

**తాత్పర్యము :** పలురంగులు కలిగిన కంఠము కలిగిన శివునికి నమస్కారము. ఆయన మెడ సహజంగా తెలుపురంగు కలది. ప్రియురాలయిన పార్వతీదేవి కొప్పులోని సువాసనా భరితమైన పూవులకోసం భ్రమిస్తున్న తుమ్మెదల నల్లని కాంతి కూడా ఆమె లో కలిసియున్న – అర్ధనారీశ్వరుడైన – శివుని కంఠముపై పడింది. ఇన్ని రకాల రంగులు కలిగిన కంఠము కలిగిన శివునికి నమస్కారము. నలుగుతున్న పాదములు కల శివునికొరకు నమస్కారము. గంధర్వులు, యక్షులు, దేవతలు శివునికి నమస్కారము పెట్టడానికి వంగినప్పుడు. వాళ్ల కిరీటాల అంచులచేత నలుగుతున్న పాదములు కల శివునికొరకు నమస్కారము.

**విశేషాలు :**

1. మల్హణకవి శివధ్యానములోనుంచి వచ్చిన **శివస్తుతి** ఇది.

2. శివుడు, ఆయన జటాజూటము, అమ్మవారి కొప్పు, అందులోని పుష్పపు వాసనలు, ఆయన తెల్లని మెడ, అందులో నల్లని మచ్చ, స్వామి పాదాలు, దేవతల కిరీటాలు కాలి వేళ్ళ చివర్లను తగలడం ఇవన్నీ చక్కగా మనకళ్ళకి కట్టినట్లుగా కవి ఇందులో వర్ణించాడు.

3. ఈ శ్లోకం **వసంతతిలక** వృత్తానికి సంబంధించినది. (తభజజగగ)

4. "కాంతా కచ ప్రచయ పుష్ప సుగంధి గంధ / లుబ్ధ భ్రమద్భ్రమర కర్బుర కంధరాయ" అని చదివేటప్పుడు తుమ్మెదల ఝుంకారం, "సంఘట్ట ఘృష్ట చరణాయ" అని చదివేటప్పుడు కిరీటాల రాపిడులు మనచెవికి వినబడతాయి. 

**51**

కల్హణుని **అర్ధనారీశ్వరస్తోత్రము**లోని మొదటి శ్లోకము.

**శ్లో॥ భాలం వహ్నిశిఖాంకితం దధదధి శ్రోత్రం వహన్సంభృత -**
**క్రీడత్కుండలి జృంభితం జలధిజచ్ఛాయాచ్ఛకంఠచ్ఛవిః ।**
**వక్షో బిభ్రదహీనకంచుకచితం బద్ధాంగనార్ధస్య వో**
**భాగః పుంగవలక్ష్మణోऽస్తు యశసే వామోऽథవా దక్షిణః ॥**

**ప్రతిపదార్థ తాత్పర్యాలు :**

**భాలం వహ్నిశిఖాంకితమ్**

అర్ధనారీశ్వర స్వరూపములోని ఫాలము (నుదురు) లోని సగము కుంకుమపువ్వుగా ఎంచబడినది. (పార్వతి)

అర్ధనారీశ్వర స్వరూపములోని ఫాలము (నుదురు) లోని సగము మూడవ కంటిలోని అగ్ని కీలలకు అంకితమయినది. (శివుడు)

**దధ దధి శ్రోత్రం వహన్సంభృతక్రీడత్కుండలి జృంభితమ్**

దధి శ్రోత్రమ్ = తెల్లని చెవి; సంభృత = చక్కగా భరించబడిన; క్రీడత్ = ఆడుచున్న; కుండలి = పోగును; వహన్ = వహించుచూ; జృంభితమ్ = వికాసాన్ని; దధ = కలిగియున్నది.

అర్ధనారీశ్వర స్వరూపములోని ఎడమగా ఉన్న తెల్లని చెవి – పోగును కలిగి వికాసాన్ని కలిగి ఉన్నది. (పార్వతి)

అర్ధనారీశ్వర స్వరూపములో కుడిగా ఉన్న తెల్లని చెవి – పామును కలిగి వికాసాన్ని కలిగి ఉన్నది. (శివుడు)

**జలధిజచ్ఛాయాచ్ఛకంఠచ్ఛవిః**

అర్ధనారీశ్వర స్వరూపములోని ఎడమగా ఉన్న కంఠపు కాంతి సముద్రమునుంచి పుట్టిన లక్ష్మీదేవి ఛాయతో మెరిసిపోతోంది. (పార్వతి)

అర్ధనారీశ్వర స్వరూపములోని కుడిగా ఉన్న కంఠపు కాంతి సముద్రమునుంచి పుట్టిన నీటితో తయారయిన మేఘపు ఛాయతో (నల్లగా) మెరిసిపోతోంది. (శివుడు)

**వక్షో బిభ్రదహీనకంచుకచితమ్**

అర్ధనారీశ్వర స్వరూపములోని ఎడమగా ఉన్న వక్షస్థలములో తక్కువ కాని 1. రాగ కంచుకము, 2. నియతి కంచుకము, 3. కాల కంచుకము, 4. విద్యా కంచుకము, 5. కళా కంచుకములు తిరుగాడుతూ మిశ్రమమై , ఒకే కంచుకమై (రవికయయి) వ్యాపిస్తోంది. (పార్వతి)

అర్ధనారీశ్వర స్వరూపములోని కుడిగా ఉన్న వక్షస్థలములో ఏ మాత్రం తక్కువ కాని పాముయొక్క కుబుసాలు తిరుగాడుతూ ఒకే కంచుకంగా కవచంగా, గజచర్మంగా వ్యాపిస్తోంది. (శివుడు)

**బద్ధాంగనార్ధస్య**

ఈ విధంగా అంగనతో కట్టబడిన అర్ధ భాగము

వామోఽథవా దక్షిణః భాగః

ఎడమ భాగము లేదా కుడి భాగము (వామః = ఎడమ; అథవా = అట్లుకాదేని, దక్షిణః = కుడి వైపు)

వః పుంగవలక్ష్మణోఽస్తు యశసే

వః = మీ; యశసే = కీర్తి యందు; భాగః = భాగ్యము; పుంగవ = శ్రేష్ఠతల; లక్ష్మణః + అస్తు = గుర్తు ఉంచుగాక!

శివుని అర్ధనారీశ్వర తత్త్వము మీకు భోగ భాగ్యాలు అనుగ్రహించు గాక! అని భావము.

**భాషా విశేషాలు**

**వహ్ని**

వహతి ప్రాపయతి హవ్యమితి వహ్నిః వహ ప్రాపణే– హవ్యమును దేవతలకు చేర్చువాడు

దధ –Who has or possesses.E. **धा** to have, **श** aff. (Wilson Sanskrit-English Dictionary (2nd Ed. 1832)

**दधिकर्ण** 'milk-ear' , m. N. of a serpent-demon ( Monier William's Sanskrit-English Dictionary, 2 nd Ed. 1899)

కుండలి = కుండలాకారం వపురస్యేతి కుండలీ. కుండలాకారమైన శరీరము కలది

కంచుకః – కంచతే బధ్యతే అనేనేతి కంచుకః కచి దీప్తి బంధనయోః – కుబుసము చేత సర్ప శరీరము బంధింపబడును కనుక పాము కుబుసమునకు కంచుకము అని పేరు. కంచుకమునకు బొందళము (బొంత + దళము) – కుబుసమువలె మేనికి మఱువైన చొక్కాయ అను మరొక అర్థము కూడా అమరకోశము చెప్పింది.

సదా మొదలైన వానికివలె అథవాకు కూడా తెలుగులో ప్రయోగము గలదు.

**ఇతర విశేషాలు**

**నమః శివాభ్యాం ...** చాంపేయగౌరార్ధశరీరకాయై కర్పూరగౌరార్ధశరీరకాయ ధమిల్ల కాయై చ జటాధరాయ నమశ్శివాయై చ నమశ్శివాయ

(కరిగించిన బంగారము వంటి శరీర ఛాయతో, అందమైన జడ కలిగిన దేవికి, వెలుగుతున్న కర్పూరం వంటి శరీర ఛాయ, జటాజూటము కలిగిన దేవునకు – అర్ధనారీశ్వర రూపములో ఉన్న ఆ పార్వతీపరమేశ్వరులకు నా నమస్సులు) ఇటువంటి అర్ధనారీశ్వర స్తోత్రాలు ప్రసిద్ధాలు. ఆ బాట లోదే కశ్మీర పండితుడు కల్హణుడు రచించిన ఈ అర్ధనారీశ్వర స్తోత్రం.

కావ్యమాల 14 భాగములో మొదటగా దీనిని ప్రచురించారు. 

**52**

తిరుపతి వేంకటకవుల **"పాండవోద్యోగవిజయము"**లోని మొదటి పద్యము.

**కరము మనోహరంబు లతికర్ణములాశ్రితవత్సలంబులుం**
**బరపుర త్రిపురభేదకంబులునుమాసదపాంగనివాస భూములు**
**ద్ధురకృపభావుకంబులు విధూత పితామహమస్తకంబులౌ**
**హరిహరనాథులోచనములైదిటికిన్విజయంబు గావుతన్.**

**ప్రతిపదార్థము :** కరము = అత్యంతము; మనోహరంబులు = మనస్సును హరించునవి, అందమయినవి; అతికర్ణములు = చెవులను దాటి పోయినవి (విశాలములు); ఆశ్రిత = అశ్రితుల, సేవితుల యెడల; వత్సలంబులున్ = దయకలిగినవి; పరపుర = శత్రువులైన రాక్షసులచే నిర్మింపబడిన; త్రిపుర = మూడు నగరములను; భేదకంబులున్ = నశింపచేసినవి; ఉమాసదపాంగనివాస భూములు = ఉమా + సత్ + అపాంగ నివాస భూములు = పార్వతీదేవియొక్క పావనమైన కడకంటి చూపులలో నివాస భూములు

కలవి; (హరిహరనాథునిలోని హరపరమయిన అర్థము) మాసదపాంగనివాస భూములు = లక్ష్మీదేవియొక్క పావనమైన కడకంటి చూపులలో నివాస భూములు కలవి; (హరిహర నాథునిలోని హరి పరమయిన అర్థము) పద్యము చదువుకొనేటప్పుడు శివునిపరంగా భేదకంబులున్ + ఉమాసదపాంగనివాస భూములు అని విడదీసుకోవాలి. విష్ణువు పరంగా భేదకంబులును + మాసదపాంగనివాస భూములు అని విడదీసుకోవాలి.

ఉద్ధుర = తొలగించిన బరువు కల; కృప = కనికరమును; భావుకంబులు = ఆస్వాదించు లక్షణము కలిగినవి; విధూత = కదిలింపబడిన, విడువబడిన; పితామహ మస్తకంబులౌ = బ్రహ్మ తలలు కలిగినవి అయినఛ హరిహరనాథు = శివ-విష్ణు రూపాత్మకుఁడగు భగవంతుని; లోచనముల్ = కన్నులు; అయిదిటికిన్ = అయిదింటికి (అయిదుగురయిన పాండవులకు) విజయంబు గావుతన్ = విజయమిచ్చుగాక!

**తాత్పర్యము :**

శివ-విష్ణు రూపాత్మకుఁడయిన హరిహరనాథుని కన్నులు పాండవుయిదుగురికి విజయాన్ని ఇవ్వాలని ఈ పద్యభావము. ఆ కన్నులు ఎలాంటివో మూడు పాదాలలో కవులు వర్ణించారు. ఆ హరిహరనాథుని కన్నులు బాగా మనస్సును హరించేవి. అందమయినవి; విశాలమయినవి. అశ్రితుల, సేవితుల యెడల దయకలిగినవి. శత్రువులైన రాక్షసులచే నిర్మింపబడిన త్రిపురములు కలిసినప్పుడు నశింపచేసినవి. పార్వతీలక్ష్ముల పావనమైన కడకంటి చూపులలో నివాస భూములు కలవి. బాధలలో ఉన్నవారి కష్టాల బరువును తొలగించి, భక్తులు పొగడే తమ కనికరమును ప్రేమతో ఆస్వాదించు లక్షణము కలిగినవి; బ్రహ్మ తలలను కదిలించినవి. (శివుడు ఒక బ్రహ్మ శిరమును ఖండించగా అప్పటినుంచి బ్రహ్మకు నాలుగు తలలు ఏర్పడ్డాయి. దానినే విధూత పితామహమస్తకంబులు అన్నారు కవులు) అటువంటి శివ-విష్ణు రూపాత్మకుఁడగు భగవంతుని కన్నులు **పాండవవిజయము** కలిగించుగాక!

**భాషావిశేషాలు :** ఆశీరర్థమునందు తద్ధర్మార్థక్రియలకు - (మూడు కాలములను బోధించు క్రియాపదములకు-) అనుసరించి వచ్చు పదమును తద్ధర్మము అంటారు. ఈ పద్యంలో ఇచ్చు(ను) అనునది తద్ధర్మము. పాండవులకు హరిహరనాథుడు ఇచ్చు విజయము మూడు కాలములకు సంబంధించినది.

**విశేషేన జయః - విజయః - జి జయే** - బాగా గెలుచుట విజయము

**లోచ్యతే అనేనేతి లోచనం – లోచృ దర్శనే** – దేని చేత చూడబడునో అది లోచనము. నేత్రయోరన్తౌ అపాంగావిత్యుచ్యతే – రెండు కన్నుల చివరలను అపాంగములంటారు.

**విశేషాలు :**

1. దివాకర్ల తిరుపతి శాస్త్రి (1872–1919) మరియు చెళ్లపిళ్ల వేంకట శాస్త్రి (1870–1950) – ఈ ఇద్దరు కవులు తిరుపతివేంకటకవులు. వీరిద్దరూ జంటకవులుగా తెలుగు సాహిత్యంలో ప్రసిద్ధులు.

2. వీరు పాండవకథాప్రధానంగా ఆరు నాటకాలను రచించారు. మొట్టమొదట పాండవవిజయము అనే పెద్ద నాటకాన్ని రచించి "సరస్వతి" అను పత్రికలో ప్రచురించారు. ఈ నాటకాన్ని తిరుపతి శాస్త్రి గారు రచించారు. ఈ నాటకం దాదాపు ఆరు గంటలకు పైగా నిడివి ఉన్నది.

3. ఆ తరువాత వేంకట శాస్త్రి గారు తాను ఇంకొన్ని అంకాలు రాసి పాండవవిజయము, ఉద్యోగవిజయము అని రెండు నాటకాలుగా విభజించారు. భారతము మొత్తం నాటకాలుగా వ్రాయాలనే ఆలోచనతో భారత కథను పాండవాశ్వమేధం (1903), పాండవ ప్రవాసం (1907), పాండవ జననం (1908), పాండవ రాజసూయం అనే నాటకాలుగా వీరు రచించారు.

4. ఒక మదించిన ఏనుగు తామరలు నిండిన కొలనులోకి వెళ్ళి తొండంతో కమలముల తూళ్ళను పట్టుకుని ఆ పద్మాలని విసరి చెల్లాచెదరుచేసి, నలిపి పడవేసినట్లుగా. అలాగే ఈ మదించిన అర్జునుడనే ఏనుగు కౌరవులు అనే శతపత్రకమలాలను చిందరవందర చేసి పడేస్తాడని తిక్కన భారతములోని విరాటపర్వములో భీముడు ధర్మరాజుతో అంటాడు. (ప్రథమ. 56పద్యము) ఈ భావము బాగా నచ్చిన తిరుపతివేంకటకవులు ఈ పద్యానికి అందమైన మెట్టును దుర్యోధనుడు మడుగులో దాక్కున్న సందర్భములో కల్పించారు.

5. ఆరని లోతునీటికొలనక్కడఁ బూచిన తమ్మికిన్ విధి
ప్రేరణ రాలిపోయినవి రేకులు తొంబదితొమ్మి దిప్పుడా
నీరజమందు దా మిగులునే యొకరేకటు లయ్యెనే నలం
కారము లౌనె యా కొలను గాని సరోజము గాని భూమికిన్.

అని అందమైన పద్యము పాండవ విజయములో ఉంది. తొంబది తొమ్మిది రేకులు ఊడిపోయాయి, ఒక్క రేకు మిగిలింది – ఎంత అందమైన భావన! తమ ఈ నాందీ

పద్యములో "భావుకంబులు" అని ఆస్వాదింపచేయు లక్షణము తమ నాటకములో ఉంటుందని చెప్పక చెప్పారు. దీనికి ఉదాహరణముగ "ఆరని లోతు...." వంటి పద్యాలెన్నో పాండవవిజయములో ఉన్నాయి.

6. కమలాక్షుడికీ, తారకాక్షుడికీ, విద్యున్మాలికీ బ్రహ్మ మెచ్చి ఇచ్చిన మూడు నగరాలు కలసి త్రిపురం. త్రిపురాలు ఆకాశంలో తిరుగుతూ వేయి సంవత్సరాలకొకసారి కలుసుకుంటూ ఉంటాయి. అలా కలుసుకున్న సమయంలో ఒకే బాణంతో ఎవరు మూడింటిని ధ్వంసం చేయగలరో, వారివల్ల మాత్రమే త్రిపురాసురులకి మరణం. శివుడు ఆ పురాలను ఒకే బాణంతో అవి కలిసినప్పుడు దహించాడు. దీనినే ఈ పద్యంలో తిరుపతివేంకటకవులు "పరపుర భేదకంబులు" అన్నారు.

7. ఈ పద్యములో హరిహరనాథుని కన్నులు లక్ష్మీదేవియొక్క పావనమైన కడకంటి చూపులలో నివాస భూములు కలవి అని చెప్పినప్పుడు పరిణామాలంకారము ఉన్నది. ఉపమానము ఉపమేయ తాదాత్మ్యమును పొంది క్రియతో కూడి ఉంటే అది పరిణామాలంకారము. ఇందులో నివాస భూములుగా కళ్ళు పరిణామము చెందాయి. ఉమాపార్వతులు హరిహరనాథుని అంత తాదాత్మ్యముతో చూస్తున్నారని చెప్పటానికి ఈ అలంకారాన్ని కవులు కల్పించారు. అలాగే కన్నులను రకరకాలుగా వర్ణించటం వల్ల ఉల్లేఖాలంకారము కూడా ఈ నాందీపద్యంలో ఉంది.

8. ఈ నాందీ పద్యంలో పాండవ కథకు సంబంధించిన "కర్ణ" "కృప" "భూములు" పదాలు అలవోకగా కుదిరాయి.

9. ఇప్పుడు లేదు కాని పూర్వం వర్షము పడని సందర్భములలో పాండవులపేర ఐదు బొమ్మలు పెట్టి పొంగలి పొంగించే ఆచారము ఉండేది. దానినే పాండవ పొంగలి అనేవారు. ఈ నాందీ పద్యము కూడా హరిహరనాథుని (శ్రీకృష్ణునకు హరిహరనాథునకు అభేదము) దయను పొందిన పాండవుల వర్ణనతో నాలుకను కదిలించే పదాల పొంగలి.

## 53

బలిజేపల్లి లక్ష్మీకాంతకవి **సత్యహరిశ్చంద్రీయము**లోని మొదటి పద్యము.

**ననవిల్తుండు చలంబునన్ బయిబయి న్మాతంగకన్యా విలో**
**కన సమ్మోహన బాణ మేసినను, నక్షత్రేశుడా మీద జి**
**క్కని రేయెండల గుప్పుచున్నను, దదేక ధ్యాన విన్యస్త చిం**
**తనమై మాని రాజశేఖరు తపోనైశ్చల్యమేలున్ మమున్.**

**ప్రతిపదార్థము :** ననవిల్తుండు = పూవులు బాణములుగా కలిగిన మన్మథుడు; చలంబునన్ = వణుకుతో, చలించుచూ; పయిన్ + పయిన్ = పైపై; మాతంగ కన్యా = పార్వతీదేవి; విలోకన = చూపు అనెడి; సమ్మోహన బాణ మేసినను = సమ్మోహన బాణము + ఏసినను = మోహము కలిగించు బాణము ప్రయోగించినను; నక్షత్ర + ఈశుడు = నక్షత్రములకు ప్రభువయిన చంద్రుడు; ఆ మీద = తర్వాత; చిక్కని రేయెండలన్ + కుప్పుచున్నను = చిక్కనైన వెన్నెలలను కురిపించుచున్నప్పటికి; తదేక ధ్యాన విన్యస్త చింతనమై = తత్ + ఏక ధ్యాన విన్యస్త చింతనమై = స్థిరముగా ఒకటే విధముగా ధ్యానమునందు ఉంచబడిన ఆలోచనతో; మాని రాజశేఖరు = మారనటువంటి చంద్రశేఖరుడైన శివుని; తపోనైశ్చల్యమేలున్ మమున్ = తపః నైశ్చల్యము + ఏలున్ + మమున్ = తపస్సునందలి స్థిరత్వము మమ్ములను పాలించుగాత!

**తాత్పర్యము :** ఒకపక్క పూవులు బాణములుగా కలిగిన మన్మథుడు వణుకుతో (శివుడు ఏమన్నా చేస్తాడేమోనని భయము లోలోపల కలిగి) పార్వతీదేవి చూపు అనెడి సమ్మోహన బాణము ప్రయోగిస్తున్నాడు. ఇంకొక పక్క నక్షత్రములకు ప్రభువయిన చంద్రుడు చిక్కనైన వెన్నెలలను కురిపిస్తున్నాడు. అయినప్పటికీ చలించి పోకుండా చెదరని ధ్యానము కలిగిన శివుని స్థిరత్వము మమ్ములను పాలించుగాత!

**భాషా విశేషాలు :**

పంచ–బాణములు : (అ.) 1. అరవిందము, 2. అశోకము, 3. చూతము, 4. నవమల్లిక, 5. నీలోత్పలము.

**"అరవిందమశోకం చ చూతం చ నవమల్లికా, నీలోత్పలం చ పంచైతే పంచబాణస్య సాయకాః"** (అమరకోశము)

(ఆ.) (మన్మథుని బాణములు) 1. సమ్మోహనము, 2. ఉన్మాదము, 3. శోషణము, 4. తాపనము, 5. స్తంభవము.

**"సమ్మోహనోన్మాదనే చ శోషణస్తాపనస్తథా, స్తంభనశ్చేతి కామస్య పంచబాణాః ప్రకీర్తితాః"**

**విశేషాలు :**

1. బలిజేపల్లి లక్ష్మీకాంతకవి (డిసెంబరు 23, 1881 – జూన్ 30, 1953) రచించిన నాటకాలలో సత్యహరిశ్చంద్రీయము చాలా ప్రసిద్ధి పొందింది.

2. మాయామేయ జగంబె నిత్యమని సంభావించి మోహంబునన్
నా యిల్లాలని నా కుమారుడని ప్రాణంబుండు నందాక నెం
తో యల్లాడిన యీ శరీర మిపుడిందున్ గట్టెలన్ గాలుచో
నా యిల్లాలును రాదు పుత్రుడును తోడై రాదు తప్పింపగన్.

మొదలైన 'సత్యహరిశ్చంద్రీయం' నాటకంలోని పద్యాలు, సంభాషణలు చాలా మందికి కంఠస్థాలు.

3. దర్బారు సీను, అడవి సీను, వారణాసి సీను, కాటి సీను – ఇలా ఆ నాటకంలోని అంకాలను ప్రజలు చెప్పుకొనేవారు.

4. "బలిజేపల్లి ఆ రోజుల్లో నాటకాలకు రాసిన 'మాయామేయజగంబె నిత్యమని సంభావించి' వంటి పద్యాలు తిరుపతివేంకటకవుల పద్యాలతో పోటీ పడ్డాయి. ఆయన సినీరంగానికి వచ్చి వాహినీ స్టూడియోలో మట్టినేల మీద కూర్చొని పాట డిక్టేట్ చేస్తుంటే వ్రాయసగాళ్లు రాసుకోవడం జరిగేది. అలా కె.వి.రెడ్డిగారు రాసుకుంటుంటే స్వయంగా చూశాను నేను" అని వేటూరి సుందరరామమూర్తి ఒక వ్యాసంలో వ్రాసారు. కవులకి ఆ రోజుల్లో ఇచ్చిన గౌరవాలు అవి.

5. **"మాతంగకన్యాం మనసా స్మరామి"** అను శ్లోకపాదం మనందరికి చిరపరిచితమైనదే. మాతంగకన్య అంటే లలితా పరాభట్టారికా స్వరూపం కొలువు తీరినప్పుడు మహా మంత్రిగా కుడిపక్కన ఉండే తల్లి. శాక్తేయంలో బుద్ధికి, విద్యకి ఆమెను సేవిస్తారు. ఆమెను పూజించడం ద్వారా అనితరసాధ్యమైన సాహిత్యము, తెలివి, జ్ఞానసముపార్జన వస్తాయి. అమ్మకు మంత్రిణికి భేదములేదు కాబట్టి, బలిజేపల్లి వారు ఈ నాందీ పద్యములో పార్వతి అను అర్థములో మాతంగకన్య అను పదాన్ని వాడారు.

6. సత్యహరిశ్చంద్ర నాటకంలో విశ్వామిత్రుడు మాతంగ కన్యలను వివాహము చేసుకోమంటాడు. అందుకు హరిశ్చంద్రుడు వినయంగా నిరాకరిస్తాడు. నాటకంలోని ఈ మాతంగ కన్యలను (మతంగ మహాముని కుమార్తెలు) ఈ నాందీ పద్యములోని మాతంగ కన్య పదము గుర్తు చేస్తోంది.

7. జంధ్యాల పాపయ్య శాస్త్రి గారు మాతంగకన్య అను పదాన్ని ఇలా సున్నితంగా శ్రీ టివియస్ శాస్త్రి గారికి వివరించారు. "అభినవపోతన శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారిని కలసి, నా సందేహాన్ని ఇలా అడిగాను – గురువు గారూ! 'మాతంగకన్య' అంటే

అర్థం ఏమిటి? కాళిదాసు మహాకవి 'మాతంగకన్యను' అలా మనసారా స్మరించటానికి కారణం ఏమిటని? అని సూటిగా అడిగాను. శ్రీ పాపయ్య శాస్త్రి గారు సౌమ్యులు. వారు చెప్పే విధానం చాలా బాగుంటుంది. వారు ఇలా చెప్పారు – 'మాతంగ కన్య' అంటే అర్థం విడమరచి చెబుతాను. జాగ్రత్తగా విను! మాత అంటే తల్లి అనే అర్థం అందరికీ తెలిసినదే! 'అంగ' అంటే శరీర భాగం. కన్య అంటే పవిత్రమైనది అని అర్థం. మొత్తం కలిపి అర్థం చెప్పాలంటే, మాతకు అంగాలు ఎలా ఉండాలో అలా ఉన్న కన్య కూడా మాతే! కుర్రవాడివి కనుక నీకు ఇంకా అర్థం అయేటట్లుగా చెబుతాను విను! కొంతమంది చిన్న వయసులో ఉన్న స్త్రీలను చూస్తే మనకు తల్లి అనే భావన కలుగుతుంది. షష్టి పూర్తి జరిగిన కొంతమందిని చూసినా ఆ భావం కలగదు. దానికి కారణం వారి వేషాలంకరణే! – అలా వారు చెప్పినది నాకు అర్థం అయింది. (టీవీయస్. శాస్త్రి. గోతెలుగు.కామ్ ఆగస్ట్ 23, 2013)

8. చల్లపల్లి రాజావారి సాయంతో 1922లో గుంటూరు లో బలిజేపల్లి చంద్రికా ముద్రణాలయం స్థాపించారు. ఉప్పుసత్యాగ్రహం లో పాల్గొని జైలుశిక్ష అనుభవిస్తున్న కాలంలో సత్యహరిశ్చంద్రీయ నాటకం రచించారు.

9. చలించే పరిస్థితులు ఉన్నప్పటికీ శివుడు ఏవిధంగా చలించలేదో, హరిశ్చంద్రుడు ఆ విధంగా చలించలేదు అనే విషయం నాంది పద్యములోని శివవర్ణన ద్వార బలిజేపల్లి పేర్కొన్నారు. ❁

## 54

నన్నయ **మహాభారతము**లోని మొదటి శ్లోకము.

**శ్లో॥ శ్రీవాణిగిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే**
**లోకానాం స్థితిమావహన్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్ ।**
**తే వేదత్రయమూర్తయస్త్రిపురుషాస్సంపూజితా వస్సురై**
**ర్భూయాసుః పురుషోత్తమామ్బుజభవశ్రీకన్ధరాశ్శ్రేయసే ॥**

**ప్రతిపదార్థము :** యే = ఏ విష్ణు బ్రహ్మ శంకరులు; శ్రీవాణిగిరిజాః = లక్ష్మీ సరస్వతీ పార్వతులను; చిరాయ = చిరకాలం నుండి; వక్షోముఖాంగేషు = రొమ్మునందూ, ముఖమునందూ దేహమునందూ; దధతః = ధరిస్తున్నవారై; స్త్రీపుంసయోగోద్భవామ్ = స్త్రీ పురుషుల సంయోగం వలన పుట్టిన; లోకానామ్ = లోకాలయొక్క; స్థితిమ్ =

సుస్థిరత్వాన్ని; అవిహతామ్ = అవిచ్ఛిన్నమైన దానినిగా; ఆవహన్తి = చేస్తున్నారో; తే వేదత్రయమూర్తయః = మూడు వేదాల రూపం కలవారున్నూ; సురైః = దేవతలచేత; సంపూజితాః = పూజింపబడిన వారయిన; తే = ఆ; పురుషోత్తమామ్బుజభవశ్రీకన్ధరాః = ఆ విష్ణు బ్రహ్మ శంకరులను; త్రిపురుషాః = త్రిమూర్తులు; వః = మీకు; శ్రేయసే = శ్రేయస్సును కలిగించేవారుగా; భూయాసుః = అగుదురు గాక.

**తాత్పర్యము :** విష్ణు బ్రహ్మ శంకరులు, లక్ష్మీ సరస్వతీ పార్వతులను చాలాకాలం నుండి రొమ్మునందూ, ముఖమునందూ, దేహమునందూ ధరిస్తున్నారు. స్త్రీ పురుషుల సంయోగం వలన పుట్టిన లోకాలయొక్క స్థిరత్వాన్ని తెగిపోకుండా చేస్తున్నారు. ఆ ముగ్గురు మూడు వేదాల రూపం కలవారు. దేవతలచేత పూజింపబడినవారు. ఆ త్రిమూర్తులు మీకు మేలు కలిగించెదరు గాక!

**విశేషాలు :**

1. నన్నయ్య వ్రాసిన ఈ నాందీ శ్లోకంలో శివుడిని శ్రీకంధరుడు అన్నాడు. కాలకూటమను మహావిషమును భరించుటవలన కలిగిన నల్లని శోభ కంఠమందు కలవాడు అని శ్రీకంధర శబ్దానికి అర్థము. శివుడు విషమును స్వీకరించినది లోక మంగళము కొరకు. కనుక "శ్రీకంధర" పదము కూడా ఈ శ్లోకములో మంగళవాచకమే.

2. విష ప్రభావం కారణంగా పుట్టిన వేడిని తట్టుకోవడం కోసం శివుడు గంగను చంద్రుడిని తలపై పెట్టుకున్నాడని కవుల చమత్కారవర్ణనలు. శ్రీకాకుళం జిల్లా 'పాతపట్నం' లో శివుని గంగమ్మ ఆరు నెలలపాటూ కనిపించి మాయమవుతుంటుంది. ఇక్కడి ఆలయంలో స్వామివారిని దగ్గర నుంచి దర్శించటం జనవరి నుంచి జులై మధ్యలోనే సాధ్యమవుతుంది. ఎందుకంటే ఆ తరువాత ఆరు నెలలపాటు గర్భాలయంలోని శివలింగం నీటిలోనే వుంటుంది. ఆ నీరు ఎలా వస్తోందో ఎవరూ చెప్పలేకపోతున్నారు. నీరు దానంతట అదే ఊరుతూ వుంటుంది. అలా వచ్చిన నీటిని ఇక్కడ తీర్థంగా ఇస్తారు. ఆరు నెలలు అయిపోయిన తరువాత నీరంతా కనబడకుండా పోతుంది. అంతకు ముందు నీళ్లు ఉన్నట్లు ఆనవాళ్లు కూడా ఉండవు. మహిమ గల ఆ శ్రీకంధరుడు భక్తితో ప్రార్థిస్తే మేలు ఎందుకు చేయడు?! తప్పక చేస్తాడు.

3. నన్నయ (నారాయణ), తిక్కన (కవిబ్రహ్మ), ఎర్రనలు (శంభుదాసుడు) పురుషోత్తమాంబుజభవశ్రీకంధరులు (విష్ణువు, బ్రహ్మ, శివుడు) అవుతున్నారని విశ్వనాథ సత్యనారాయణ గారు ప్రతిపాదించారు.

4. స్త్రీ పురుషుల సంయోగం వలన పుట్టిన లోకాల యొక్క స్థిరత్వాన్ని తెగిపోకుండా చేస్తున్నారని ఈ నాందీ శ్లోకంలో చెప్పటం వల్ల భారతంలో వేద సమ్మతమైన గృహస్థధర్మం ప్రధాన ప్రతిపాద్యాంశం అని శ్రీ దివాకర్ల వేంకటావధాని అభిప్రాయపడ్డారు. (తితిదే. మహా. 02పే). ❀

## 55

గౌరన (15వ శతాబ్ది) **నవనాథచరిత్ర**లోని నాంది.

**శ్రీసర్వమంగళాంచితవామభాగు – భాసురభక్తానుపాలనోద్యోగు**
**బరమయోగీంద్రహృత్పద్మషట్చరణు – నురు జూటాగ్రయుత శీత కిరణు**
**నిగమామంత సంస్తుత్యనిత్య స్వరూపు – ధగధగిత ప్రభాతత మేరు చాపు**
**వనజాత మిత్ర పావక చంద్ర నేత్రు – ఘనతర దురిత సాగరయానపాత్రు**
**లీలాతిసముపలాలిత మహాసేను – శైలారి ముఖదేవ సంసేవ్యమాను**
**గజచర్మవసనునంగజ మదగ్రసను – నజగవీ సంస్తుత్యు నజగవ హస్తు**
**నగరాజనిలయుబన్నగరాజవలయు – మృగశాబకరు మహామృగకులముఖరు**
**సారసామృత ఘనసార నీహార – హార కైరవ సుధా హీర కాసార**
**సారసాహిత గంధసారాబ్జతార – తారకాకల్పకాంతారగోక్షీర**
**రుచిరాంగు మల్లికార్జున మహాదేవు – నచలిత భక్తి మదాత్మలో నిలిపి**

**ప్రతిపదార్థ తాత్పర్యములు :** శ్రీసర్వమంగళాంచిత వామభాగు = కాంతితో కూడిన ఎప్పుడూ శుభములనిచ్చు పార్వతీదేవితో కూడిన ఎడమ భాగము కలవాడు (శివుని ఎడమ భాగములో పార్వతీదేవి ఉన్నదని భావము); భాసుర భక్తానుపాలనోద్యోగు = ప్రకాశించువాడు, భక్తులను రక్షించు (= అనుపాలన) ప్రయత్నము కలవాడు; పరమయోగీంద్ర హృత్పద్మ షట్చరణు = శ్రేష్ఠులైన యోగీంద్రుల సిద్ధుల హృదయములనెడి పద్మములలో తుమ్మెద వలె తిరుగువాడు; ఉరు జూటాగ్రయుత శీత కిరణు = గొప్పదైన జడముడిలో కూడుకొన్న చంద్రుడు కలవాడు (శివుని జడలపై చంద్రుడున్నాడని భావము); నిగమాంతసంస్తుత్య నిత్యస్వరూపు = వేదముల చివరలైన ఉపనిషత్తులచే కొనియాడబడిన వాడు, శాశ్వతమైన స్వరూపము కలవాడు; ధగధగిత ప్రభాతత మేరు చాపు = ధగధగమని మెరయు కాంతులతో విస్తరించిన మేరుపర్వతము ధనుస్సుగా కలవాడు (తను = విస్తారే – ఆ + తన్ + క్త. కృ.ప్ర.); వనజాత మిత్ర పావక చంద్ర నేత్రు = కమలములకు మిత్రుడైన సూర్యుడు, అగ్ని, చంద్రుడు కన్నులుగా కలవాడు;

ఘనతర దురిత సాగరయాన పాత్రు = గొప్పదయిన పాపము అనెడి సముద్రమును దాటించు ఓడవంటివాడు (యాన పాత్రు); లీలాతిసముపలాలిత మహాసేను = లీలచేత బాగా లాలించబడిన మహాసేనుడు కలవాడు, ( మహాసేనుని శివుడు రక్షించాడని భావము); శైలారి ముఖదేవ సంసేవ్యమాను = పర్వతములకు శత్రువయిన ఇంద్రుడు, అగ్ని మొదలయిన దేవతల చేత సేవింపదగినవాడు; గజచర్మవసనునంగజ మదగ్రసను = ఏనుగు చర్మము ధరించినవాడు, మన్మథుని మదమును హరించినవాడు; అజగవీ సంస్తుత్యు నజగవ హస్తు = విష్ణువు చే స్తుతింపదగినవాడు, పినాకము చేతియందు కలవాడు (అజగ + వ. (త.ప్ర.) విష్ణువు శరముగాఁ గలది); నగరాజ నిలయుబన్నగరాజవలయు = కైలాసము నిలయముగా కలవాడు, పాములరాజులను కడియములుగా కలిగినవాడు; మృగశాబకరు మహామృగకుల ముఖరు = చిన్న జింకపిల్లను చేతియందు కలిగినవాడు, గొప్పదయిన జంతు సమూహములలో మ్రోగు సింహగర్జన కలవాడు (ముఖరు) – శివుడు సింహ సదృశుడని భావము; సారసామృత ఘనసార నీహార = తెల్లతామర, అమృతము, కర్పూరము, మంచు; హార కైరవ సుధా హీర కాసార = ముత్యాల హారము, తెల్లకలువ, వజ్రము, తెల్లని సరస్సు; సారసాహిత గంధసారాబ్జతార = తామరలకు శత్రువయిన చంద్రుడు, చందనము, శంఖము, నక్షత్రము; తారకాకల్పకాంతారగోక్షీర = తరింపచేయునది, శాశ్వతముగా ఉండునది, తెలుపు కలిసిన పచ్చచెరకు, ఆవు పాలవలె ఉండు; రుచిరాంగు మల్లికార్జున మహాదేవు = ప్రకాశించు అవయవములు కలిగిన మల్లికార్జునుని; అచలిత భక్తి మదాత్మలో నిలిపి = స్థిరమైన భక్తితో నా హృదయములో నిలుపుకొంటాను.

**విశేషాలు :**

1. పార్వతీదేవిని వామాంగముగా – ఎడమభాగంగా కలిగినవాడు శివుడు. **"ఓం శివ వామాంగవాసిన్యై నమః"** అని అమ్మవారికి ఒక నామము. శివమహాపురాణములో అర్జునుడు శివుణ్ణి ప్రార్థిస్తూ **"నమస్తేఽస్తు వామాంగగిరిజాయ చ"** (ఎడమ భాగమునందు పార్వతిని ధరించినవాడు) అంటాడు. (శివ మహా పురాణము41 వ అధ్యాయము 36 వ శ్లోకము) వామభాగు అని దీనినే గౌరన వర్ణించాడు.

2. శ్లో॥ **కరలగ్నమృగః కరీన్ద్రభంగో**
**ఘనశార్దూలవిఖణ్డనోఽస్తజన్తుః ।**
**గిరిశో విశదాకృతిశ్చ చేతః**
**కుహరే పంచ ముఖోఽస్తి మే కుతో భీః ॥ 44**

అని శివానందలహరిలో ఈశ్వరుని కుడిచేతిలో జింకపిల్ల ఉన్నదని చెప్పారు. జింక స్వభావం వలె, మనుష్యుని మనస్సు కూడ అతిచంచలం. కాని శివుని చేతిలో చంచలమైన హరిణం మాత్రం చేష్టుడిగి చాంచల్యరహితమై యీశ్వరుని కనుల అందంలో మునిగిపోయి ఆనందిస్తుంది. శివుని ఆశ్రయిస్తే చాంచల్యం పోతుందని ఈశ్వరుని కుడిచేతిలో జింకపిల్ల చెబుతోంది. దానినే **"మృగ శాబకరు"** అని గౌరన ఈ నాందీలో వర్ణించాడు.

3. శ్రీశైలం క్షేత్రాన్ని గురించి ద్వాదశ జ్యోతిర్లింగస్తోత్రంలో ఆదిశంకరులవారు స్తుతించిన ఒక శ్లోకం ఇది.

> శ్రీశైలశృంగే వివిధప్రసంగే – శేషాద్రిశృంగే చ సదా వసంతమ్ ।
> తమర్జునం మల్లికపూర్వమేనం – నమామి సంసారసముద్రసేతుమ్ ॥

4. 'శ్రీశైల శృంగే' అంటే శ్రీశైలం శృంగంలో మల్లిక పూర్వంగా మల్లికార్జున నామధేయముతో పరమేశ్వరుడు లింగరూపంగా వసిస్తున్నాడు. "వివిధ ప్రసంగే–" ఏది కావలసినా శ్రీశైలంలో దొరుకుతుందని అభిప్రాయం. "శ్రీశైలశృంగే వివిధప్రసంగే శేషాద్రిశృంగే చ – సదా వసంతం" ఈ శ్రీశైలంలో ఉండే మల్లికార్జునుడే శేషాద్రి శృంగానగూడా ఉన్నాడని భావం.

5. మల్లికాలత, అర్జున వృక్షం – యివి రెండూ కలిసి ఏకరూపంగా అర్ధనారీశ్వర రూపంగా ఉన్నాయి, ఒకలతకి అవలంబనంగా వృక్షం, లతకు అవలంబనంగా వృక్షం కావాలి. వృక్షానికి లత చుట్టుకోకపోతే అలంకారంలేదు. అందుచేత మల్లిక, అర్జునం – ఒక లత, వృక్షం – రెండూ కలసినట్టు "తమర్జునం మల్లికపూర్వమేనం" – అని చెప్పబడ్డది. (జగద్గురు బోధలు ఎనిమిదవ భాగము)

6. ఆదిశంకరులు ఒక క్షేత్రానికి ప్రాధాన్యము ఇస్తూ చెప్పడం తక్కువ. కాని శివానందలహరిలో **"మల్లికార్జునమహాలింగం శివాలింగితం"** – "సాక్షాన్మదీయే మనో రాజీవే భ్రమరాధిపో విహరతాం శ్రీశైలవాసీ విభుః" అని రెండుచోట్ల మల్లికార్జున మహాలింగాన్ని శ్రీశైలశబ్దాన్ని వాడారు అన్నారు. ఆదిశంకరుల భావాన్నే స్వీకరిస్తూ గౌరన" పరమయోగీంద్ర హృత్పద్మ షట్చరణ" అన్నాడు.

7. మీననాథుడు, సారంగధరుడు, చౌరంగి, గోరక్షసిద్ధుడు, మేఘనాథసిద్ధుడు, విరూపాక్ష నాథుడు, నాగార్జున సిద్ధుడు, ఖణికాఖ్య సిద్ధుడు, వ్యాళిసిద్ధుడు, – ఈ తొమ్మిదిమంది శైవసిద్ధులు ఈ నవనాథచరిత్రలో అయిదు ఆశ్వాసాలలో వర్ణించబడ్డారు.

8. ఈ నవనాథుల పేర్లలో చాలా తేడాలు వస్తున్నాయి. 1. సత్యనాథుడు, 2. సతోకనాథుడు, 3. ఆదినాథుడు, 4. అనాదినాథుడు, 5. అకుళితనాథుడు, 6. మాతంగనాథుడు, 7. మత్స్యేంద్రనాథుడు, 8. ఘటియంత్రనాథుడు, 9. గోరక్షనాథుడు శైవసిద్ధులని కొంతమంది అంటున్నారు.

9. నేను ఉద్యోగము చేసిన నిజామాబాద్ జిల్లా ఆర్మూర్లో నవనాథుల సిద్ధుల గుట్ట ఉంది. గోరఖనాథ్, జాలంధర్‌నాథ్, చరపట్‌నాథ్, ఆడ్‌భంగనాథ్, కానిఫనాథ్, మచ్ఛేందర్‌నాథ్, చౌరంగినాథ్, రేవణనాథ్ అని విగ్రహాల కింద నవనాథుల పేర్లు వ్రాసారు. ఆర్మూర్ (ఆరు + మూడు = ఆర్మూర్) అంటే 9 అనీ, అది నవనాథ సిద్ధులను తెలుపుతుందని చెబుతారు. ఈ నవనాథులు నారాయణాంశ కలవారిగా (వైష్ణవసిద్ధులు) ఇక్కడ ప్రసిద్ధి. గౌరన నవనాథచరిత్రలో నవనాథులు శివాంశ కలిగినవారు (శైవసిద్ధులు).

10. ఈ నవనాథచరిత్ర **ద్విపదఛందస్సు**లో ఉంది. ద్విపదలో రెండు పాదాలు ఉంటాయి (అందుకే దీనిని ద్విపద అంటారు). ప్రతిపాదములో మూడు ఇంద్ర గణాలు, ఒక సూర్య గణము ఉంటుంది. మూడవ గణం యొక్క మొదటి అక్షరం యతి. ప్రాస ఉన్న ద్విపదను సామాన్య ద్విపద అంటారు. అదే ప్రాస లేకుండా ద్విపద వ్రాస్తే దానిని మంజరీ ద్విపద అంటారు. నవనాథ చరిత్ర సామాన్య ద్విపదలో ఉంది. ❀

## 56

మారన (1295 – 1326) **మార్కండేయపురాణము**లోని శివస్తుతి.

**కరుణాసాంద్రపయఃప్రపూర్ణమును రంగద్దోస్తరంగంబు ప్ర**
**స్ఫురదాకల్పభుజంగ మాంబుచరమున్ శుంభజ్జటావిద్రుమో**
**త్కరము న్గాంతి సుధోదయంబునగు నుద్యచ్ఛంకరాకారవా**
**ర్ధి రమా వర్ధను జేయుగాత సుగుణున్ శ్రీ గన్నసైన్యాధిపున్.**

**ప్రతిపదార్థము :** కరుణా = దయ; సాంద్ర = దట్టమైన; పయః ప్రపూర్ణమును = నీటి ప్రవాహము కలది; రంగత్ = ఆనందము కలిగిన; దోః తరంగంబు = చేతులనెడి తరంగములు కలది; ప్రస్ఫురత్ = బాగాతళతళమని మెరిసే; ఆకల్ప = ఆలంకార భరితమైన; భుజంగము = పాములు; అంబు చరమున్ = నీటిలో చరించు చేపలు మొదలైనవి కలది; శుంభత్ = ప్రకాశించే; జటా = జడలుకట్టిన వెంట్రుకలను; విద్రుమ

+ ఉత్కరమున్ = పగడముల సమూహములు కలది; కాంతి సుధ + ఉదయంబున్ + అగున్ = కోరికలనెడి అమృతము ఉదయింపచేయు; ఉద్యత్ = పైకి లేచుచున్న; శంకర + ఆకారవార్ధి = శివుడను ఆకారములో ఉన్న సముద్రము; సుగుణున్ = మంచి గుణములు కలిగిన; శ్రీ గన్నసైన్యాధిపున్ = ప్రతాపరుద్రసేనాని శ్రీ గన్నయ్యను; రమా వర్ధను జేయుగాత = సంపదలు పెరిగినవానిగా చేయుగాత!

**తాత్పర్యము :** పరమశివుని ఒక దయాసముద్రముగా పోల్చి, ఆ సముద్రము తన కృతి భర్తయైన ప్రతాపరుద్రసేనాని శ్రీ గన్నయ్యను కాపాడాలని కవి ఇందులో కోరుకొంటున్నాడు. సముద్రము నీటి ప్రవాహము కలది; పరమశివ సముద్రము దయా నీటి ప్రవాహము కలది; సముద్రము తరంగములు కలది. శివసముద్రము భక్తులకు వరములిచ్చుటలో ఆనందము కలిగిన చేతులనెడి తరంగములు కలది. సముద్రము బాగా తళతళమని మెరిసే అలంకారభరితమైనపాములు నీటిలో చరించు చేపలు మొదలైనవి కలది. శంకరుడను సముద్రముకూడా బాగా తళతళమని మెరిసే అలంకార భరితమైన పాములు కలది; అంబుచరము (గంగ) కలది. సముద్రము పగడముల సమూహములు కలది. శివ సముద్రము ప్రకాశించే జడలుకట్టిన వెంట్రుకలను పగడముల సమూహములు కలది; సముద్రము కాంతి కలిగిన అమృతపు ఉదయానికి కారణమైనది. శివసముద్రము కోరికలనెడి అమృతము ఉదయింపచేయునది ( భక్తుల కోరికలు శివుడు నెరవేరుస్తాడని భావము); సముద్రము అలలతో పైకి లేస్తుంటుంది. శివుడను ఆకారములో ఉన్న సముద్రముకూడా తాండవమాడుతూ నృత్యములో పైకి లేస్తుంటుంది. అటువంటి శివుడను ఆకారములో ఉన్న సముద్రము మంచిగుణములు కలిగిన ప్రతాపరుద్రసేనాని అయిన శ్రీ గన్నయ్యకు (గన్నమనాయకునికి) సంపదలు ఇచ్చుగాత!

**విశేషాలు :**

1. ఈ పద్యములో సమస్త వస్తు విషయ సావయవ రూపకము ఉన్నది. అవయవి, దాని అవయవాలు సమగ్రముగా రూపకాలంకారములో చెబితే అది సమస్త వస్తు విషయ సావయవ రూపకము.

2. ఈ పద్యములో సముద్రము అవయవి. దాని సమస్త అవయవములు తరంగములు, పాములు, పగడములు శివునిలో ఆరోపింపబడినవి.

3. సముద్రము క్షీరసాగరమథన సమయములో లక్ష్మీదేవికి పుట్టుకను ఇచ్చింది కాబట్టి సముద్రుడు లక్ష్మికి తండ్రి. ఆమెకు ఆనందాన్ని పెంచువాడు. (తండ్రిని చూస్తే కుమార్తెకు ఆనందము పెరుగుట సహజమే కదా!) స్వయంగా లక్ష్మీశోభకలిగిన శివుడను సముద్రము కూడా కృతి భర్తను రమావర్ధనుని చేయుమనుటలో ఎంతో ఔచిత్యము ఉంది.

4. కాకతీయ ప్రభువైన ప్రతాపరుద్రుని సేనాని గన్నమనాయకుడు తరువాత ఢిల్లీ సైన్యాలకు పట్టుబడి, అక్కడ మహమ్మదీయ మతానికి మార్చబడి మాలిక్ మక్బూల్ గా మళ్ళీ ఓరుగల్లును పాలించాడని చెబుతారు. (నేలటూరి వెంకటరమణయ్య 1939 ఫిబ్రవరి భారతి పత్రిక).

5. తిక్కన శిష్యుడైన మారన రాసిన "మార్కండేయపురాణం" తెలుగులో అనువదింపబడిన మొదటి పురాణం. బసవపురాణం, నృసింహపురాణం అనే పేర్లతో ఉన్న వాటికి పురాణ లక్షణాలు అతకవు. అందువల్ల ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం మారన మార్కండేయ పురాణాన్ని **ప్రథమాంధ్రమహాపురాణం**గా నిర్ణయించారు.

6. మార్కండేయ పురాణమును జైమినికి ధర్మపక్షులు చెబుతాయి. పెద్దన మనుచరిత్రకి ఈ పురాణమే ఆధారం.



**57**

భోజుని **శృంగారప్రకాశము**లోని మొదటి శ్లోకము.

**శ్లో॥ అచ్ఛిన్నమేఖలమలబ్ధదృఢోపగూఢ -**
**మప్రాప్తచుంబనమవీక్షితవక్త్రకాంతిః ।**
**కాంతావిమిశ్రవపుషః కృతవిప్రలంభ -**
**సంభోగసఖ్యమివ పాతు వపుః పురారేః ॥**

**ప్రతిపదార్థ తాత్పర్యములు :**

ఏది రక్షిస్తుంది?

చక్కని రూపము, శరీరము (వపుః - ఉప్యతే ప్రాక్కర్మభిరిరితి వపుః - టు వప్ బీజ సంతానే - పూర్వకర్మలచేత పుట్టింపబడునది.)

ఎవరి శరీరము?

రాక్షసనిర్మితమైన మూడుపురాలను ధ్వంసం చేసిన శివుని యొక్క శరీరము (పురారేః)

ఆ శరీరము ఎటువంటిది?

ప్రియురాలైన పార్వతీదేవితో కలిసిన శరీరము (కాంతావిమిశ్రవపుషః)

ఆ అర్ధనారీశ్వర శరీర విశిష్టత ఏమిటి?

చీల్చబడని, ఎడతెగని వడ్డాణము కలది (అచ్ఛిన్నమేఖలము) సంభోగసుఖములో వడ్డాణము తెగే అవకాశము ఉంటుంది. కాని ఇక్కడ ఆ అవకాశము లేదని చెప్పటానికి అచ్ఛిన్నమేఖలమని కవి చెప్పాడు.

పొందబడని, అలభ్యమైన గట్టిదయిన కౌగిలి కలది (అలబ్ధదృఢోపగూఢమ్)

పొందబడని ముద్దు కలది (అప్రాప్తచుంబనమ్)

చూడబడని ముఖకాంతి కలది (అవీక్షితవక్త్రకాంతిః)

చేయబడిన విరహము, శృంగారానుభవముల స్నేహము కలది (కృత విప్రలంభ సంభోగ సఖ్యమివ) విరహానికి, శారీరకసుఖానికి స్నేహముచేసినట్లు ఆ అర్ధనారీశ్వర స్వరూప మున్నదని భావము).

**విశేషములు :**

1. రాజ్యకాంక్షతో తన పినతండ్రి ముంజుడు చిన్నతనములోనే తనను చంపించబోగా భోజుడు ఇలా అన్నాడు.

ఓ రాజా! కృతయుగానికి అలంకారమైన మాంధాత చక్రవర్తి వెళ్ళిపోయాడు. సముద్రమునకు వంతెన నిర్మించిన మహాపురుషుడు రావణసంహారకుడు శ్రీరామచంద్రుడు మాత్రం ఉన్నాడా! ఇక ధర్మరాజు మొదలైన ఎందరెందరో చక్రవర్తులు స్వర్గానికి వెళ్ళిపోయారు. వీరిలో ఏ ఒక్కరితోనూ యీ వసుమతి – ఈ భూమి కూడ వెళ్ళలేదు గాని నీతో మాత్రం తప్పకుండా వచ్చేటట్లున్నది!"

"మాంధాతా చ మహీపతిః కృతయుగాలంకారభూతో గతః
సేతుర్యేన మహోదధౌ విరచితః క్వాఽసౌ దశాస్యాంతకః ।
అన్యే చాఽపి యుధిష్ఠిరప్రభృతయో యాతా దివం భూపతే –
నైకేనాఽపి సమంగతా వసుమతీ నూనం త్వయా యాస్యతి ॥"

2. చిన్నతనంలోనే ఇంత అద్భుతమైన వ్యంగ్యవైభవము కలిగిన శ్లోకము రచించిన సరస్వతీ అవతారముగా భావించే భోజుడు పెద్దవాడయిన తర్వాత రచించిన **శృంగారప్రకాశము** అను ఆలంకారిక శాస్త్రగ్రంథములోని మొదటి నాందీ శ్లోకము **అచ్ఛిన్నమేఖలమ్... అనునది.**

3. విప్రలంభములు (విరహాలు నాలుగు) 1. పూర్వరాగము, 2. మానవిప్రలంభము, 3. ప్రవాస విప్రలంభము, 4. కరుణ విప్రలంబము.

**"సచ పూర్వరాగ మాన ప్రవాస కరుణాత్మకశ్చతుర్ధా స్యాత్"** (సాహిత్యదర్పణము 3–234) విరహదశ దాటిన తరువాత సంభోగము – లేదా – సంభోగము తర్వాత మరలా విరహము – ఇలా ఒకదాని తర్వాత ఒకటి ఉంటాయి కాని, రెండూ ఒకేచోట ఒకే శరీరములో స్నేహము చేస్తున్నాయని చెప్పుట ఈ శ్లోకంలోని అద్భుతమైన ఊహ.

4. ఈ శ్లోకము వసంతతిలకవృత్తానికి సంబంధించినది. (తభజజగగ). ❁

**58**

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారి **శివతాండవనందినాందిలోని** మొదటిశ్లోకము.

శ్లో॥ **అర్ధేందూత్ఫుల్లకేశం స్మితరుచిపటలీదంశితం గౌరవర్ణం**
**తార్తీయీకం వహంతం నయనమహికులప్రత్నభూషావితానమ్ ।**
**నృత్తారంభాఽట్టహాసప్రవిచలితకకుప్చక్రమానందకందం**
**తం వందే నీలకంఠం త్రిదశపతిశిరశ్చుంబిపాదాఽబ్జపీఠమ్ ॥**

**ప్రతిపదార్థము :** అర్ధేందూత్ఫుల్లకేశమ్ = అర్ధ + ఇందు + ఉత్ఫుల్లకేశమ్ = అర్ధచంద్రునిచే వికసించిన కేశములు కలవాడు; స్మితరుచిపటలీ = చిఱునగవుయొక్క కాంతి సమూహముతో; దంశితమ్ = కవచితమైన; గౌరవర్ణమ్ = తెలుపును మించిన ఎఱ్ఱని రంగు కేశములందు, తెల్లనిరంగు శరీరమందు కలవాడు; తార్తీయీకమ్ = మూడవది అయిన; వహంతం నయనమ్ = నయనమ్ వహంతమ్ = కన్నును వహించువాడు; అహికుల = సర్పకుల; ప్రత్న = పురాతనమైన; భూషా = అలంకారముల; వితానమ్ = సమూహము కలవాడు; నృత్త = అభినయ వర్జితమై, గాత్ర విక్షేపము మాత్రమే కలిగినది నృత్తము; ఆరంభ = ప్రారంభములో; అట్టహాస = ధ్వనితో కూడిన పెద్ద నవ్వుతో (.వ్య. అట్టః హాసః. (కర్మ.స.)); ప్రవిచలిత = బాగా సంచలించిన; కకుప్చక్రమ్ = దిక్కుల చక్రము కలవాడు; ఆనందకందమ్ = ఆనందపు గడ్డ; నీలకంఠమ్

= నల్లని కంఠము కలవానిని; త్రిదశపతి = ఇంద్రుని (వ్యు. దేవతల అధిపతి.); శిరః = తలచే (వంగిన సందర్భములో); చుంబి = ముద్దుపెట్టుకొను; పాదాబ్జపీఠమ్ = పాద + అబ్జపీఠమ్ = పాదములనెడి పద్మాసనము కలవానిని; తమ్ = అతనిని – (ఆ శివునికి); వందే = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** శివుడు తనతలపై ఉన్న అర్ధచంద్రునిచే ప్రకాశించు కేశములు కలవాడు. తన చిఱునగవులయొక్క కాంతి సమూహము – కవచముగా ధరించినవాడు. కేశములందు తెలుపును మించిన ఎఱ్ఱని రంగు, శరీరమందు తెల్లనిరంగు కలవాడు. మూడవ కన్ను కలవాడు. పురాతనమైన సర్పముల అలంకారములు కలవాడు. నటన లేకుండా, శరీర కదలిక మాత్రమే కలిగిన నృత్తపు ప్రారంభములో ధ్వనితో కూడిన పెద్ద నవ్వు శివుడు నవ్వాడు. ఆ నవ్వుతో దిక్కులన్నీ బాగా కదిలిపోయాయి. శివుడు ఆనందపునిలయము. నల్లని కంఠము కలవాడు. ఇంద్రునిచే నమస్కరింపబడిన పాదములు కలవాడు. అటువంటి శివునికి నమస్కరించుచున్నాను.

**విశేషాలు :**

1. **"సరస్వతీపుత్ర"** శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారి (మార్చి 28, 1914 – సెప్టెంబర్ 1, 1990) శివతాండవములోని నందినాందిలోని మొదటిశ్లోకమిది.

2. పొద్దుటూరులో ఉన్న అగస్తేశ్వర ఆలయానికి ప్రతిరోజు వెళ్లి, ప్రదక్షిణలు చేసి రగడ ఛందస్సులో పుట్టపర్తి రచించిన అపూర్వ కావ్యం శివతాండవం. "దైవంతో పాటు నాకు మానవుడు కూడా కావాలి" అన్న విశిష్టుడు పుట్టపర్తి.

3. "…….అగస్త్యేశ్వరునుపాసించి, అద్దేవుని కృపాకటాక్షమునకు పాత్రులై శివతాండవమును, నంది నాందిని, శివాలాస్యమును, విజయా ప్రార్థనమును ఓజోగుణాన్వితముగా, కర్ణరసాయనముగా అభివర్ణించి చదువువారికి, వినువారికి తాదాత్మ్యానుభవము కలిగించునట్లు ఉత్తమకావ్యసృష్టి కావించియున్నారు" అని శివతాండవముపై తన అభిప్రాయాన్ని శ్రీ నేదునూరి శ్రీకృష్ణమూర్తి గారు వ్రాసారు. ఇవి అక్షరసత్యములు.

4. "పన్నెండేళ్ళ వయసులోనే పెనుగొండ లక్ష్మి ని **'ఘనగిరినివాసిని'** గా ఆవిష్కరించారు బాలనారాయణులు! (1943 సం॥ మద్రాసు విశ్వవిద్యాలయం వారు, విద్వాన్ పరీక్షకు పాఠ్యగ్రంథంగా ఈ ఖండకావ్యాన్ని పెట్టారు). ఇదే కావ్యం పుట్టపర్తి వారు మళ్ళీ ఎప్పుడో

విద్వాన్ పరీక్షకు కూర్చున్నప్పుడు పాఠ్యగ్రంథంగా వుండడం – ఆ పరీక్షలో ఒకే ఒక్క ప్రశ్నకు మూడు గంటలూ వెచ్చించి నారాయణాచార్యులవారు ఆ యేటిపరీక్షలో అనుత్తీర్ణులవడం – ఇప్పటికీ 'కథ' గా నిలిచిపోయిన మరో వాస్తవం! 1972 జనవరి, 25 అర్ధరాత్రి 'పద్మశ్రీ' వచ్చిందన్న టెలిగ్రామ్ నేను అందుకుని ఆనందంగా అయ్యగారికి శుభాకాంక్షలు తెలిపితే చిరాకుపడి 'ఇప్పుడిప్పుడే నిద్రపడుతోంది' ఈ వార్త పొద్దునే చెబితే పోయేదిగా తొందరేముంది? అని నన్ను కసురుకుని అటు తిరిగి పడుకోవడం మరో కథ. (పుట్టపర్తి వారి కుమార్తె డా॥ పుట్టపర్తి నాగపద్మినిగారు "మా నాన్నగారు" శీర్షికలో వ్రాసిన వ్యాసము నుండి – ఆధారం. తెలుగువన్. కాం) పుట్టపర్తి వారి విశిష్ట వ్యక్తిత్వానికి ఈ వాక్యాలు దర్పణాలు.

5. పుట్టపర్తివారి శివతాండవం గురించి ఎంత చెప్పినా– ఇంకా ఇది చెప్పలేకపోయానే అని ఆ విషయం బాధిస్తుంది. శివతాండవము శివ కావ్యాల వీథిలో శివునికి కట్టిన గుడి. ఏ యుగంలో అయినా సహృదయులు దాని చుట్టూ ప్రదక్షిణలు చేయవలసినదే. తప్పదు. ❁

## 59

కూచిమంచి తిమ్మకవి **"నీలాసుందరిపరిణయం"** లోమొదటి పద్యము.

> **శ్రీలకు దానకంబగుచు, జెన్నలరారెడి వెండికొండపై**
> **మేలికడాని డాల్ హొయలు మీరెడి జాబిలి ఱాల మేడలో**
> **వేలుపురేడు నల్వయును వెన్నుడు కొల్వగ మంచుకొండ రా**
> **చూలిని కూడి వేడుకల చొక్కెడు లే నెలతాల్పు గొల్చెదన్.**

**ప్రతిపదార్థము :** శ్రీలకు = ఐశ్వర్యాలకు; తానకంబు + అగుచు = స్థానమై; చెన్ను + అలరారెడి = అందముతో ఒప్పు; వెండికొండపై = కైలాసముపై; మేలి = మేలిమి బంగారపు; కడాని = బంగారపు; డాల్ హొయలు = కాంతుల విలాసములు; మీరెడి = అతిక్రమించు; జాబిలి ఱాల మేడలో = చంద్ర కాంత శిలల మేడలో; వేలుపురేడు = ఇంద్రుడు; నల్వయును = బ్రహ్మ; వెన్నుడు = విష్ణుమూర్తి; కొల్వగ = కొలుచుచుండగా; మంచుకొండ రాచూలిని = హిమవంతుడను రాజు కూతురయిన పార్వతీదేవితో; కూడి = కలిసి; వేడుకల = సంతోషాలలో; చొక్కెడు = పరవశత్వము పొందు; లే నెల తాల్పు = లేత + నెలతాల్పు = కోమలమయిన (అర్ధ) చంద్రుని తలపై ధరించిన శివుని; కొల్చెదన్ = సేవించెదను.

**తాత్పర్యము :** కైలాసపర్వతము ఐశ్వర్యాలకు నిలయము. అటువంటి కైలాసములో మేలిమి బంగారపు కాంతుల విలాసములను తిరస్కరించే చంద్రకాంతశిలల మేడ ఉంది. (మేలిమి బంగారపు కాంతుల విలాసములకంటె చంద్ర కాంత శిలల కాంతులు గొప్పవని భావము). అక్కడ ఇంద్రుడు, బ్రహ్మ, విష్ణుమూర్తి కొలుచుచుండగా, పార్వతీదేవితో కలిసి సంతోషాలలో పరవశత్వము పొందుచున్న కోమలమయిన (అర్ధ) చంద్రుని తలపై ధరించిన శివుని నేను సేవించెదను.

**విశేషాలు :**

1. నీల కుంభకుడను వాని కూతురు. రుక్మిణీపరిణయ విధానములోనే ఈ నీలాసుందరి పరిణయములో బ్రాహ్మణ సందేశాలు నాయికానాయకుల మధ్య నడుస్తాయి.

2. కాలనేమి అను రాక్షసుని పుత్రులు ఏడుగురు ఆబోతులుగా పుడతారు. వారిని శ్రీకృష్ణుఁడు చంపి, కుంభకుని కూఁతురైన నీలను పెండ్లియాడుట ఈ నీలాసుందరి పరిణయ కథ.

3. కోసల దేశాధిపతి అయిన నగ్నజితుడి కుమార్తె నాగ్నజితి. అమెను పెండ్లి చేసుకోవటానికి కూడా ఏడు ఎద్దులను కృష్ణుడు సులభంగా లొంగదీసుకున్నట్లు ఇంకొక కథనం ఉంది. శ్రీకృష్ణుడి ఎనమండుగురు భార్యలను అష్టమహిషులని చెబుతారు. వారు: 1. రుక్మిణి, 2. జాంబవతి, 3. సత్యభామ, 4. కాళింది, 5. నాగ్నజితి, 6. మిత్రవింద, 7. భద్ర, 8. లక్షణ. ఇందులో నీలాదేవి లేక పోవటం గమనార్హం.

4. ఈ నాందీ పద్యములో శ్రీ అనే అక్షరము తప్పించి మిగతావన్ని అచ్చతెలుగు పదాలే.

5. శ్రీ బదులు సిరి అనే పదాన్ని ఉంచి సరిగ్గా ఈ పద్యానికి ప్రతిబింబంగా కూచిమంచి తిమ్మకవి అచ్చ తెలుగు రామాయణములో ఇంకొక పద్యం వ్రాసాడు. ఆ పద్య విశేషాలు మరొకసారి ప్రత్యేకంగా ముచ్చటించుకొందాం.

5. ఈ కావ్యంలో శివుని వర్ణన చేసిన ఈ ఆట వెలదిపద్యం అచ్చతెలుగు పదాల అందాలతో ఆటలాడుకొంది.

మత్తగిల్లు సత్తు గిత్త తత్తడినెక్కి
మిత్తి మొత్తి సత్తి నత్తిబత్తి
పత్తిరిడిన బుత్తిముత్తులు రెండును
నొత్తి గుత్తకట్టుచుండు రేడు

(రేడు = రాజయిన శివుడు; మత్తగిల్లు = పొగరెక్కు; సత్తు గిత్త = సత్తువు కలిగిన ఎద్దు అను; తత్తడిన్ ఎక్కి = వాహనమెక్కి; మిత్తి = మృత్యువు; మొత్తి = నశింపచేసి; సత్తి = శక్తి (పార్వతిదేవి); నత్తి = హత్తుకొని; బత్తి = భక్తితో; పత్తిరిడిన = పత్తినిగాని ఇస్తే; బుత్తిముత్తులురెండును = భుక్తి, ముక్తులు రెండును; ఒత్తి = బలముగా నొక్కి; గుత్తకట్టుచుండు = మొత్తముగా వెలచేయు;)

7. తెలుగు వాళ్లమయిన మనం అచ్చుతెలుగును చదివి అర్థం చేసుకోలేని స్థితిలో ఉన్నాం. అందుకే కూచిమంచి తిమ్మకవిలాంటి ఆధునిక కవులు అచ్చుతెలుగులో కావ్యాలు వ్రాసే సాహసం చేయటం లేదు. ❁

## 60

శ్రీనాథుని **హరవిలాసము**లో నాందీ పద్యము.

**మామిడి మోక కింద నిగమ త్రితయార్థ సమృద్ధి పార్వతీ**
**దేవికుచంబులం బదను తీర్పని కస్తురి ముద్రగా జగ**
**జ్జీవన కారణంబయిన శ్రీనిధి కంచి పురీశ్వరుండు మా**
**దేవయ సెట్టి నందనుని దిప్పు గృతార్థుని జేయుగావుతన్.**

**ప్రతిపదార్థము :** మామిడి మోక కింద = మామిడి మొక్క (చెట్టు) కింద వెలసిన; నిగమ త్రితయార్థ సమృద్ధి = నిగమ త్రిత్రయ + అర్థ సమృద్ధి = ఋక్కులు, యజుస్సులు, సామములు అను మూడు విధములైన వేదార్థములయొక్క మిక్కిలి సంపద; పార్వతీదేవికుచంబులన్ = పార్వతీదేవి స్తనములపై; పదను తీర్పని కస్తురి ముద్రగా = వాడి చేయని కస్తురి ముద్రయైన వాడు; జగజ్జీవన కారణంబయిన = ప్రపంచ జీవనమునకు కారణమయిన; శ్రీనిధి = సంపదలకు నిధివంటివాడు అయిన; కంచిపురీశ్వరుండు = కంచిపురి + ఈశ్వరుండు = కంచిలో వెలసిన ఏకాంబరేశ్వరుడు (ఏకామ్రేశ్వరుడు); మా దేవయ సెట్టి నందనుని = మా దేవయ సెట్టి కుమారుడైన; తిప్పున్ = అవచి తిప్పయ సెట్టిని; కృతార్థుని జేయుగావుతన్ = కృత + అర్థునిన్ + చేయున్ + కావుతన్ = తలచినపని నెరవేర్చుకొనినవానిగ చేసి రక్షించుగాత!

**తాత్పర్యము :** కంచిలోని మామిడిచెట్టు కింద ఏకాంబరేశ్వరునిగా (ఏకామ్రేశ్వరుడు) వెలసిన పరమశివుడు ఋక్కులు, యజుస్సులు, సామములు అను మూడు విధములైన వేదార్థముల సంపద. (ఆయనను ఆశ్రయిస్తే ఆ వేదార్థములు తెలుస్తాయని భావము).

పార్వతీదేవి స్తనములపై వాడి చేయని కస్తురి ముద్ర (అచ్చు), ప్రపంచ జీవనమునకు కారణమయిన సంపదలకు నిధి; అటువంటి కంచిలో వెలసిన ఏకాంబరేశ్వరుడు (ఏకామ్రేశ్వరుడు) మా దేవయ సెట్టి కుమారుడైన అవచి తిప్పయ సెట్టిని తలచినపని నెరవేర్చుకొనినవానిగ చేసి రక్షించుగాత!

**విశేషములు :**

1. జ్ఞానప్రదాలైన వేదాలు అనంతాలు. ఋగ్, యజుర్, సామ, అథర్వ వేదమని నాలుగు విధములు. కానీ విషయవిభాగమును బట్టి చూస్తే అవి మూడు. ఋక్కులు, యజుస్సులు, సామములు అని మూడు విధములు. వానిని త్రయి అంటారు. **"త్రయీ వై విద్యా ఋచో యాజుంషి సామాని"** అని శతపథ బ్రాహ్మణం.

2. పంచభూతలింగక్షేత్రములలో కంచిలో ఉన్న శివలింగం పృథ్వీలింగం.

**1. అన్నామలైశ్వరుడు - అరుణాచలము అగ్ని లింగం**
**2. జంబుకేశ్వరుడు- తిరువనైకావల్ లేదా జంబుకేశ్వరం - జల లింగం**
**3. చిదంబరేశ్వరుడు - చిదంబరం - ఆకాశ లింగం**
**4. ఏకాంబరేశ్వరుడు - కంచి - పృథ్వీ లింగం**
**5. కాళహస్తేశ్వరుడు - శ్రీకాళహస్తి - వాయు లింగం**

3. నిజానికి ఏకాంబరేశ్వరాలయం కాదు ఏకామ్రేశ్వర దేవాలయం. ఏకామ్రేశ్వరస్వామి అంటే మామిడిచెట్టు కింద వెలసిన స్వామి అని అర్థం. ఈ దేవాలయంలో ఉన్న 3,500 సంవత్సరాల వయస్సు కల మామిడి వృక్షంలోని నాలుగు కొమ్మలు నాలుగు రకాల రుచిగల పళ్ళు కాచేవి. సంతానం లేని దంపతులు ఆ పండుని సేవిస్తే సంతానం కలుగుతుందని భక్తుల నమ్మిక. ఇప్పుడు ఈ మామిడి వృక్షం లేదు. దాని కాండం అద్దాల పెట్టెలో ఉంది.

4. హరవిలాసాన్ని అంకితం తీసుకొన్న అవచి తిప్పయ సెట్టి వంశీకులు మహాదాతలు. అవచి తిప్పయ సుగంధ వ్యాపారమున ప్రసిద్ధి పొంది బాగా డబ్బు సంపాదించినవాడు. అందుకే కస్తూరి ముద్రతో ఈ పద్యంలో శివుని కవి పోల్చాడు.

5. హరవిలాసములో ఏడు ఆశ్వాసాలు ఉన్నాయి. 1, 2, ఆశ్వాసములలో చిరుతొండ నంబికథ, మూడవ ఆశ్వాసము నుంచి ఆరవ ఆశ్వాసము వరకు శివపార్వతుల కల్యాణగాథ ఉన్నది. ఏడవ ఆశ్వాసములో కిరాతార్జునీయము ఉన్నది.

6. "తిప్పు" అనే పదప్రయోగము అవచి తిప్పయ సెట్టికి, శ్రీనాథునికి మధ్య సాన్నిహిత్యాన్ని తెలియచేస్తోంది. కవిత్వాన్ని మధురమైన భావాలతో మనస్సులలో తిప్పగలిగిన కవి సార్వభౌముడు ఏమన్నా చెల్లుతుంది. ❁

## 61

ధూర్జటి **శ్రీకాళహస్తీశ్వరశతకము** లోనిది ఈ పద్యము.

**శ్రీవిద్యుత్కలితాజవంజవ మహాజీమూత పాపాంబు ధా**
**రా వేగంబున మన్మనోబ్జ సముదీర్ణత్వంబుఁ గోల్పోయితిన్**
**దేవా! నీ కరుణా శరత్సమయమింతే చాలు చిద్భావనా**
**సేవం దామర తంపరై మనియెదన్ శ్రీకాళహస్తీశ్వరా!**

**ప్రతిపదార్థము :** శ్రీవిద్యుత్కలిత = సిరిసంపదల మెరుపుతీగలతో కూడిన; ఆజవంజవ = జననమరణాలతో కూడిన ఈ సంసారపు; మహాజీమూత = దట్టమైన నల్లటి కారుమేఘాల చేత; పాపా + అంబుధారావేగంబున = పాపములనే నీటి ధారల వేగముతో; మన్మనోబ్జ = మత్ + మనోబ్జ = నా మనస్సనెడు తామరపువ్వుయొక్క; సముదీర్ణత్వంబు = గొప్పతనమును, వికాసమును; కోల్పోయితిన్ = పోగొట్టుకొంటిని; దేవా! = పరమేశ్వరా!; నీ కరుణాశరత్సమయము = నీ దయ అనెడి శరత్కాలము; ఇంతే చాలు = కొంతయినా చాలు; చిద్భావనాసేవన్ = చిత్ + భావనాసేవన్ = ఆత్మధ్యానమనెడు నీ సేవతో; తామర తంపరై = నామనస్సను కమలాన్ని అభివృద్ధి చేసుకొని (వికసింప చేసుకొని); మనియెదన్ = జీవించెదను శ్రీకాళహస్తీశ్వరా!

**తాత్పర్యము :** శ్రీకాళహస్తి క్షేత్రములో అవతరించిన ఈశ్వరా! నా మనస్సనెడు తామర పువ్వు సిరిసంపదల మెరుపుతీగలతో కూడిన, జననమరణాలతో కూడిన ఈ సంసారపు దట్టమైన నల్లటి కారుమేఘాల చేత, పాపములనే నీటి ధారల వేగముతో వికాసమును కోల్పోయింది. పరమేశ్వరా! నీ దయ అనెడి శరత్కాలము కొంతయినా చాలు. ఆత్మధ్యాన మనెడు నీ సేవతో – శరత్కాలములోని తేటతో చెరువులు తేట పడినట్లుగా, నామనస్సను కమలాన్ని వికసింపచేసుకొని జీవిస్తాను. నా మీద దయ చూపించు.

**విశేషాలు :**

1. సాలెపురుగు (శ్రీ), పాము (కాళ), ఏనుగు (హస్తి), కన్నప్ప, వేశ్య కన్యలు, యాదవ రాజు, మొదలయినవారి కథలు ఈ కాళహస్తి పేరు వినగానే గుర్తుకు వస్తాయి.

2. శ్రీ ఆదిశంకరులవారు ఈ ఈ క్షేత్రమును సందర్శించి అమ్మవారి ఎదుట శ్రీచక్ర ప్రతిస్థాపన చేసారు.

3. **పాతాళగణపతి** ఉత్తరాభిముఖంగాను, **జ్ఞానప్రసూనాంబ** తూర్పు ముఖంగా, **కాళహస్తీశ్వరుడు** పశ్చిమ ముఖంగాను, **దక్షిణామూర్తి** దక్షిణ ముఖంగా ఈ ఆలయంలో ఉన్నారు.

4. కాళహస్తిలోని శివలింగం వాయులింగంగా ప్రసిద్ధి (మిగిలిన నాలుగు లింగాలు 1. కంచి ఏకామ్రేశ్వరు పృథ్వీలింగము, 2. శ్రీరంగం వద్ద జంబుకేశ్వరుని జలలింగము, 3. అరుణాచలంలో తేజోలింగము, 4. చిదంబరంలో ఆకాశలింగము).

5. స్వామి వాయులింగమనుటకు గుర్తుగా గర్భగుడిలోని కుడివైపున ఉన్న రెండు దీపాలు ఎప్పుడూ చలిస్తూ ఉంటాయని చెబుతుంటారు.

6. ప్రధానంగా జీవుని ఆర్తి ప్రవహించిన శతకం **శ్రీకాళహస్తీశ్వరశతకం**.

7. సంపద అనెడి మెరుపు అనుచోట రూపకాలంకారము. మెరుపు ఎప్పుడు వస్తుందో ఎప్పుడు పోతుందో చెప్పలేము. సంపద కూడా అంతే.

8. కార్తికమాసము శరత్కాలము. శివునికి ఇష్టమయిన కార్తికాన్ని శరత్సమయము ద్వారా గుర్తుచేసి, తనమనస్సుకు కూడా వికాసము కలిగించమని కోరిన కవి ప్రతిభ ప్రశంసనీయ మైనది. పాపాలనే వానాకాలంలో నామనస్సనే పువ్వు వాడిపోయింది. వెన్నెల కాలమయిన దయా శరత్తులో మనస్సును వికసింపచేయమనుట అద్భుతమైన ఊహ.

9. అద్వైత వేదాంత పరిభాషలో **"ఆజవంజవ"** పదాన్ని వాడతారు. జీవుని వదలకుండా అంటి పెట్టుకొని అతని చేత కర్మఫలాన్ని అనుభవింపచేసేది ఆజవంజవము (సంసారము)

10. **"సముదీర్ణ"** చాలా అందమైన కవి ప్రయోగాలకు నోచుకొన్న పదం. సముదీర్ణ చంద్రహాస కళా వినోదముల్ (అనిరుద్ధచరిత్రము కనుపర్తి అబ్బయామాత్యుఁడు) గర్జంతి మేఘాః సముదీర్ణ నాదాః (వాల్మీకి. కిష్కింధా. 28వస - 20వ శ్లో). వాల్మీకి వర్షర్తు వర్ణనలో వాడిన "సముదీర్ణ" పదాన్ని ధూర్జటికూడా వర్షర్తువువలన మనస్సు వికాసము కోల్పోయిన సందర్భములో వాడుట గమనార్హం. ❁

## 62

రాజానక కుంతకుడు రచించిన **వక్రోక్తిజీవితము**లోని నాందీశ్లోకం



**శ్లో॥ జగత్త్రితయవైచిత్ర్య**
**చిత్ర కర్మ విధాయినమ్ ।**
**శివం శక్తిపరిస్పన్ద**
**మాత్రోపకరణం నమః ॥**

**ప్రతిపదార్థము :** జగత్త్రితయ = మూడు లోకముల; వైచిత్ర్య చిత్ర కర్మ = వైచిత్ర్యమనెడు చిత్రకర్మను; విధాయినమ్ = రచించిన; శక్తి పరిస్పన్ద మాత్రోపకరణమ్ = తనలో ఉన్న శక్తి కదలికను సాధనముగా గ్రహించి; శివమ్ = శివుని(కి); నమః = నమస్కారము

**తాత్పర్యము :** తనలో ఉన్న శక్తి కదలికను సాధనముగా గ్రహించి మూడు లోకములయొక్క సృష్టి అనెడు విచిత్ర కర్మను చేయు శివునకు నమస్కారము.

**విశేషాలు :**

1. రాజానక కుంతకుడు (క్రీ.శ 950–1050) తాను వ్రాయ బోయే వక్రోక్తి జీవితమునకు తగిన నాందీ శ్లోకాన్ని రచించాడు.

2. ఉక్తి వైచిత్రి వక్రోక్తి

3. శివుడు ఈ సృష్టిని చేస్తాడు అని చెబితే ఉక్తి. మామూలు మాట. తనలో ఉన్న శక్తి కదలికను సాధనముగా గ్రహించి – శివుడు ఈ సృష్టిని చేస్తాడు అని చెప్పబడింది కనుక ఉక్తి వైచిత్రి. ఈ ఉక్తి వైచిత్రి లో శ్లేష ఉంది.

4. శక్తి – అంటే బలము అని మాత్రమే కాదు – పార్వతి అను రెండవ అర్థము కూడా వస్తోంది.

5. పదాలను విరవకుండానే, కొత్తగా పదాన్ని జోడించకుండానే ఉన్న పదాలతో రెండవ అర్థాన్ని జోడించటం ఇక్కడ మొదటి వైచిత్రి.

6. నిజానికి పార్వతీ శివులు వేరు కారు. యథార్థముగావేరు కాని వారిని భౌతికముగా వేరుగా చూపించుట రెండవ వైచిత్రి.

7. ఈ శ్లోకము అనుష్టుప్ చందస్సులో ఉంది.

ప్రతి పాదములోను – 5వ అక్షరము లఘువు, 6వ అక్షరము గురువు,
7వ అక్షరము – 1, 3 పాదములలో గురువును, 2, 4 పాదములలో లఘువు. ❁

## 63

కూచిమంచి తిమ్మకవి **అచ్చ తెలుగు రామాయణము**లోని మొదటి పద్యం.

**సిరులకు మన్కియై హొయలు చెన్నలరారెడు వెండికొండపై**
**నరుదుగ వేల్పుఱేడు మరునయ్యయు నల్వయు గొల్వ జల్వడా**
**ల్దొర రతనంపుటుప్పరిగలో వలిగుబ్బలి రాచ కూతు దా**
**నిరవుగ గూడి ముజ్జగములేలెడు లేనెలదాల్పు గొల్చెదన్.**

**ప్రతిపదార్థము :** సిరులకు = ఐశ్వర్యాలకు; మన్కి + ఐ = స్థానమై; హొయలు = విలాసములు; చెన్ను + అలరారెడి = అందముతో ఒప్పు; వెండికొండపై = కైలాసముపై; అరుదుగ = అపురూపముగా; వేల్పుఱేడు = ఇంద్రుడు; మరుని + అయ్యయు = మన్మథుని తండ్రి అయిన విష్ణుమూర్తి; నల్వయు = బ్రహ్మను; కొల్వన్ = కొలుచు చుండగా; చల్వడాల్ దొర = మంచి చలువరాళ్ల కాంతితో కూడిన దొర – హిమాలయపు; రతనంపు టుప్పరిగలో = రతనము + ఉప్పరిగలో = రతనాల మేడలోఉన్న; వలిగుబ్బలిరాచ కూతు = హిమవంతుని కూతురు పార్వతి; తాన్ = తాను; ఇరవుగ గూడి = ఇరవుగన్ + కూడి = స్థిరముగా కలిసి; ముజ్జగములేలెడు = ముజ్జగముల్ + ఏలెడు = మూడు లోకములు పాలించు; లే నెల తాల్పు = లేత + నెలతాల్పు = కోమలమయిన (అర్ధ) చంద్రుని తలపై ధరించిన శివుని; కొల్చెదన్ = సేవించెదను.

**తాత్పర్యము :** కైలాసము ఐశ్వర్యాలకు అందాలకు నిలయము. అటువంటి కైలాసములో ఇంద్రుడు, విష్ణుమూర్తి, బ్రహ్మ శివుని అపురూపంగా కొలుస్తూ ఉంటారు. అక్కడ పార్వతియు తాను స్థిరముగా కలిసి (అర్ధనారీశ్వరమూర్తియై) మూడు లోకములు శివుడు పాలిస్తుంటాడు. అటువంటి అర్ధచంద్రుని తలపై కలిగిన శివుని సేవించెదను.

**విశేషాలు :**

1. అచ్చతెలుగు రామాయణములోని ఆరు కాండలలో సుమారు 13 వందల పద్యాలకు పైగా ఉన్నాయి.

2. సంస్కృత సమము కాని భాష అచ్చతెలుగు అంటారు. ఈ భాషలో ప్రాకృత సమాలు, తద్భవాలు, దేశ్యాలు ఉంటాయి.

3. ఈ అచ్చతెలుగు రామాయణంలో అహల్య తన కథను తానే రాముడికి చెప్పు కొంటుంది. నీలుడు కొండరాళ్లు వేస్తే తేలతాయని సముద్రుడు ఉపాయం చెబుతాడు. ఇలా వాల్మీకంలోని లేని కొన్ని విషయాలు ఈ అచ్చతెలుగు రామాయణంలో ఉన్నాయి.

4. 1) అచ్చతెలుగు రామాయణంలోని భాషా విశేషాలను డా॥ కే.వి. సుందరాచార్యుల వారు. 2) డా॥ మొవ్వ వృషాద్రిపతిగారు ప్రతిపదార్థ తాత్పర్య విశేషాలతో 5 సంపుటాలుగా వెలవరించారు.

5. ఇంద్రుడు, విష్ణుమూర్తి, బ్రహ్మ శివుని అపురూపంగా కొలుస్తుంటారని నాందీ పద్యంలో ఉంది. అపూర్వము, ప్రాణప్రదముగా కొలుస్తుంటారని భావం. రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులులో రాముని – లక్ష్మణ భరత శత్రుఘ్నులు అపురూపంగా కొలుస్తుంటారనే కథాంశం నాందిలో వ్యంగ్యంగా చెప్పబడింది.

6. "పగలు సేయుచు వేడిమి మిగుల జగము
గ్రాచు జమునబ్బ మున్నీట గలిసె ననియొ
తొగ వెలందుక నగియె నమ్మగువ పెంపు
గని సయింపక తమ్మి మొగంబు మొగిచె."

పగటిని చేస్తూ, ఆ క్రమంలోనే; వేడిమితో జగత్తునంతా ఇబ్బందికి లోను చేసే యముని తండ్రి సూర్యుడు సముద్రములోనికి కలిసిపోయాడుగదా – అని కలువపూవు అనే అమ్మాయి నవ్వింది. (కలువ వికసించిందనే విషయాన్ని ఎంతో అందంగా కవి చెప్పాడు. ఆ కలువ ముఖం పెద్దదవడం (వికసించడం) చూసి; ఓర్చుకోలేక తామరపూవు అనే అమ్మాయి మొగం ముడుచుకుంది.

సూర్యోదయంలో వికసించే తామర సూర్యాస్తమయంలో ముడుచుకొంటుంది. చంద్రోదయంలో వికసించే కలువ, చంద్రాస్తమయంలో ముడుచుకొంటుంది. ఈ కవి సమయాల వర్ణనలను అందంగా అచ్చతెలుగు పదాల కస్తురితో గుబాళింపచేసిన తిమ్మకవిని అభినందించకుండా తెలుగువాడు ఉండలేదు. 

## 64

తెనాలి రామకృష్ణుని (క్రీ.శ. 1495.) **పాండురంగమాహాత్మ్యము**లోని అవతారిక పద్యం.

**ఈ చిగురాకు నీప్రసవ మీపువుఁ దేనియ యెంత యొప్పెడిన్**
**జూచితిరే యటంచుఁ దనచుట్టు శుకాదులుఁ గొల్వగాఁ గప**

**ర్ధోచిత చంద్ర గాంగజలమైన శివాహ్వయకల్పశాఖి వే**
**దాచలమంత్రి కీర్తి కలశాబ్ధిని వెన్నెలమాడ్కిఁ జూచుతన్.**

**ప్రతిపదార్థము :** ఈ చిగురాకు = చిగురు + ఆకు = ఈ లేతదయిన ఆకు; ఈ ప్రసవము = ఈ పువ్వు (షూ ప్రాణి ప్రసవే – పుట్టునది కనుక పువ్వుకు ప్రసవమని పేరు); పువుఁ దేనియ = మకరందము; ఎంత యొప్పెడిన్ = ఎంత + ఒప్పెడిన్ = ఎంత ప్రకాశిస్తున్నాయో; చూచితిరే యటంచున్ = చూచితిరే + అటంచున్ = చూసారా అన్నట్లుగా; తనచుట్టు = తన చుట్టు; శుకాదులుఁ గొల్వగాఁ = శుక + ఆదులున్ + కొల్వగా = శుకుడు మొదలైన మహర్షులు కొలువగా; కపర్ధోచితము = జడముడికి తగినది; చంద్ర = చంద్రుడు; గాంగజలమైన = గాంగజలము + ఐన = 1. గంగయందు పుట్టినది. 2. గంగకు సంబంధించిన; శివాహ్వయకల్పశాఖి = శివ + ఆహ్వయకల్పశాఖి = శివుడను పేరు కలిగిన కల్పవృక్షము; వేదాచల మంత్రి = విరూరి వేదాద్రి మంత్రి; కీర్తి = కీర్తి అను; కలశాబ్ధిని = కలశ + అబ్ధిని = పాలసముద్రమును; వెన్నెలమాడ్కిన్ = వెన్నెల విధముగా; చూచుతన్ = చూచుగాక!

**తాత్పర్యము :** శివుని జుత్తు – చివురాకు; నెత్తిపైన ఉన్న చంద్రుడు – పువ్వు; గంగ – పూలతేనె; ఈ లేతదయిన ఆకు, ఈ పువ్వు, ఈ మకరందము ఎంత ప్రకాశిస్తున్నాయో చూసారా అని తన చుట్టు ఉన్న శుకుడు మొదలైన మహర్షులు కొలువగా శివుడను కల్పవృక్షము భక్తులకు చెబుతోంది. శివుడను పేరు కలిగిన ఆ కల్పవృక్షము వేదాద్రి మంత్రి కీర్తి అను పాలసముద్రమును వెన్నెల విధముగాచూచుగాక! (సముద్రాన్ని వెన్నెల పొంగించినట్లుగా, వేదాద్రిమంత్రి కీర్తి అను పాలసముద్రమును శివుడను వెన్నెల ఇతోధికముగా పొంగించాలని, ఇంకా పేరు ప్రఖ్యాతులు ఇవ్వాలనిభావము.)

**విశేషాలు :**

1. ముక్కు తిమ్మన 'పారిజాతాపహరణము'; అల్లసాని 'మనుచరిత్రము'; శ్రీకృష్ణదేవరాయల 'ఆముక్తమాల్యద'; తెనాలి రామకృష్ణుఁని 'పాండురంగ మాహాత్మ్యము'; రామరాజభూషణుని 'వసుచరిత్రము' – ఈ ఐదు గ్రంథాలను తెలుగులో **పంచమహాకావ్యాలం**టారు. అందులోని పాండురంగమాహాత్మ్యపు అవతారికలో శివుని స్తుతించే పద్యమిది.

2. ఈ వేదాద్రిమంత్రి పొత్తపినాటి చోడ ప్రభువైన పెద్దసంగభూపాలుని వద్ద వ్రాయసకాడు. (లేఖరి, లేఖకుఁడు వాడుకలో రాయసకాఁడంటారు).

3. ఈ మహాకవి అసలు పేరు **గార్లపాటి రామలింగయ్య** అంటారు.

4. కలశాబ్ధి పేరు రావటానికి రెండు కారణాలు చెబుతారు. విశ్వకర్మ సముద్రంలో పుట్టిన అమృతాన్ని పోయటానికి ఒక కలశాన్ని సృష్టించాడు. ఆ కలశానికి సంబంధించింది కాబట్టి పాలసముద్రాన్ని కలశాబ్ధి అంటారు. అమృతకలశం వెలువడిన సముద్రం కాబట్టి పాలసముద్రానికి కలశాబ్ధి అనిపేరు.

5. ఈ పద్యంలో చిగురాకుతో జుట్టుముడి పోలిక – మృదుత్వము వరకు మాత్రమే పరిగణించాలి. కవులు అలానే పోలుస్తుంటారు. "చిగురాకుల ఊయలలో ఇల మరచిన ఓ చిలుకా... మధురాశలు పలికేవో... నా మనసును చిలికేవో" అని ఆధునిక గీత రచయితలు కూడా అన్నారు. చిగురాకులతో ఊయెల ఎలా అని అనకూడదు. అందంగా చిగురాకు కదిలినట్లుగా, మనస్సు కూడా కదులుతోంది అని చెప్పటం వరకు మాత్రమే కవి తాపత్రయం.

6. **"ముక్తాలంకృతసర్వాంగమిన్దుగంగాధరం హరమ్, ధ్యాయేత్కల్పతరోర్మూలే సమాసీనం సహోమయా"**. ముత్యములచే అలంకరింపబడిన సర్వావయములను కలిగినవాడు, చంద్రుని గంగను ధరించినవాడును, ఉమతో కలిసి కల్పవృక్షము క్రింద కూర్చున్న శివుని ధ్యానిస్తున్నానని ఒక ప్రాచీన కవి చెప్పాడు. ఇక్కడ కల్పవృక్షము కింద శివుని కూర్చోబెట్టాడు తెనాలి రామకృష్ణుడు. శివుడినే కల్పవృక్షము చేసాడు. కవులు అపర బ్రహ్మలు. ఏ భావాన్నయినా సృష్టించగలరు.

7. కురులను పోలుస్తూ **"మొలక చీకటి జలజల రాల్పగా రాదె"** అని అద్భుతంగా పలికిన తెనాలి వాని వాణి చాలాచోట్ల జలజలా పూవులు రాలుతున్న అనుభూతిని కలిగిస్తుంది.



## 65

శ్రీసదాశివ బ్రహ్మేంద్రులవారి శ్రీ **శివమానసికపూజాస్తుతి**లోని మొదటి శ్లోకం.



**శ్లో॥ అనుచితమపలపితం మే**
**త్వయి నను శంభో! తదాగసః శాన్త్యై ।**
**అర్చాం కథమపి విహితా –**
**మఙ్గీకురు సర్వమఙ్గలోపేత ॥**

**ప్రతిపదార్థము :** నను = ఓయి (నిశ్చయము, ప్రశ్న, అంగీకారము, సమాధానము, పిలుపులో 'నను' అను అవ్యయము వాడబడును. ఇక్కడ శివుని పిలుపులో 'నను' వాడబడినది); శంభో! =శంకరా!; త్వయి = నీయెడ, మే = నాయొక్క (నాచేత); అనుచితమ్ = తగనిది (వ్యు. న + ఉచితమ్. (న.త.); అపలపితమ్ = మఱుగుపఱచి చెప్పబడినది, కప్పిపుచ్చి చెప్పబడినది; తత్ + ఆగసః = ఆ పాపము యొక్క (అగకుటిలాయాం గతౌ – కుటిలముగా పొందునది కనుక పాపానికి ఆగము అని పేరు.); శాన్త్యై = శాంతి కొరకు (పరిహారమునకై); సర్వమంగళ + ఉపేత =సర్వ శుభములను ఇచ్చు పార్వతితో కూడిన స్వామీ!; కథమపి = ఎట్టులైనను కష్టపడి ఏదో విధముగా; విహితామ్ = విధింపబడిన (ఆచరింపబడిన); అర్చామ్ = పూజను; అఙ్గీకురు = స్వీకరింపుము.

**తాత్పర్యము :** స్వామీ! శివా! నేను నా జీవితప్రయాణములో ఇంతవరకు నీగురించి తగని మాటలే మాట్లాడి పాపాన్ని మూటగట్టుకొన్నాను. అన్ని శుభాలను ఇచ్చే పార్వతితో కలిసిన శివా! ఇదుగో! ఆ అనుచిత భాషణ పాపపరిహారానికి నా బుద్ధికి తోచినట్లుగా (దానిని శాస్త్రము ఒప్పుకోకపోవచ్చు) నీకు పూజ చేయాలనుకొంటున్నాను. నేను చేసే ఈ పూజను స్వీకరించు.

**విశేషాలు :**

1. **ధ్యానము – ఆవాహనము** మొదలైన ఉపచారములు సాధారణులయెడల చెల్లుతాయి. ప్రపంచమంతా నిండిన శివునికి, ఆ స్వామికి ఇటువంటి లౌకికక్రియలు చేస్తూ, ఆయనను ఆహ్వానించుట అనుచితమైనది. ఒకచోట ఉన్నవానిని "అయ్యా! ఇక్కడికి రా!" అని లేనిచోటకు పిలుచుట ఉచితమైనది. కాని అంతటా నిండియున్న వానిని "ఇక్కడికి రా!" అని ఆహ్వానించుటలో ఔచిత్యమేమున్నది? అందుకే తన మనస్సులో స్వామిని నిలుపుకొని పూజ చేయబోతున్నానని సదాశివబ్రహ్మేన్ద్రులు ఈ శ్లోకంలో చెప్పారు.

2. "బ్రహ్మతత్త్వ ప్రకాశిక", (బ్రహ్మసూత్రాలపై వ్యాఖ్యానం), "యోగసుధాకరం", (పతంజలి సూత్రాలకు వ్యాఖ్యానం), "సిద్ధాంతవల్లి" (కేసరవల్లి అప్పయ్యదీక్షితుల సిద్ధాంతాలకు సంగ్రహరూపాలు) ద్వాదశోపషత్తులపై వ్యాఖ్యానాలు, 'నవ మణిమాల', ఆత్మానుసంధానం, స్వప్నోదితం, స్వానుభూతి ప్రకాశిక, **ఆత్మవిద్యావిలాసం** మొదలైన ఎన్నో సంస్కృత గ్రంథాలు సదాశివబ్రహ్మేంద్రులు రచించారు. పిబరే రామరసం,

ఖేలతి మమహృదయే, భజరే రఘువీరం, స్మరవారం వారం, గాయతి వనమాలి, మానస సంచరరే, ఖేలతి బ్రహ్మాండే వంటి **ఆణిముత్యాలైన కీర్తనలను** రచించారు.

3. వీరు తమిళదేశంలో జన్మించారు. కాలం పద్దెనిమిదవ శతాబ్దంగా భావిస్తున్నారు. వీరి జన్మనామం శివరామకృష్ణుడు. కావేరీ తీరంలోని "తిరువిశవల్లూరు" అనే షాహాజీపురంలో జన్మించారు. తండ్రి మోక్షం సోమసుందరం అవధాని. తల్లి పేరు పార్వతి.

4. సంన్యాసాశ్రమము స్వీకరించక మునుపు స్వామికి ఒకసారి విపరీతంగా ఆకలి అయి అత్తగారింట్లోని వంటగది వద్దకు వెళ్ళి బయట నిలబడి "తినడానికి ఏదుంటే అది పెట్టండి" అన్నాడట. అప్పుడు వారి అత్తగారు "దయచేసి కొద్దిసేపు వేచి ఉండండి. లోనికి రావద్దు. బయటనే ఉండండి" అన్నదట. "లోనికి రావద్దు. బయటనే ఉండు" అన్న మాటలు స్వామిలో అనుకోని మార్పును వెంటనే తీసుకుని వచ్చాయి. "గృహస్థాశ్రమం లోపలికి రావద్దు. బయటనే ఉండి జ్ఞానాన్ని పొందు" అని స్వామివారు అర్థం చేసుకున్నారు. అప్పటినుంచే సదాశివబ్రహ్మేంద్రులు సంన్యాసిగా మారారు.

5. "ఓ శివా! అంతటా నీవే వ్యాపించి ఉన్నావు. నిన్ను నేను ఎలా పూజించగలను? ఆకాశమే నీ వస్త్రాలైనప్పుడు నీకు నేను ఏ వస్త్రం ఇవ్వగలను?" అంటూ ఈ శివమానసిక పూజావిధిలో ఒక అద్భుతమయిన భావం ఉంది. ఇలా ఈ పుస్తకములోని శ్లోకాలు శివుని గొప్పతనాన్ని ప్రతిపాదిస్తుంటాయి. దేవుని పూజ మూడుమెట్లుగా సాగుతుంటుందని పెద్దలు చెప్పారు.

శిలావిగ్రహాలలో దేవుని భావాన్ని నిలిపి, ధ్యాన – ఆవాహనాదులైన ఉపచారములతో పూజ చేయుట **మొదటిమెట్టు**. ఇవే ఉపచారాలను ప్రత్యక్షముగా కాకుండా – మనస్సు కల్పించిన ద్రవ్యాలతో – తన మనసులో నిలిచిన భగవంతుని పూజించుట **రెండవ మెట్టు**. తెఱ తొలగిపోయి – ఆత్మాభిన్నముగా స్వామి అనుభవమునకు అందినపుడు – ఆశ్చర్యపడి "విశ్వమయుడైన పరమేశుని ధ్యానించుట ఎట్లు సాధ్యము? అంతటను నిండియున్నవానిని ఆహ్వానించుటెట్లు? నేనింతవరకు ఉపచారముపేర భగవదపచారమునే సాగించితి"నని చింతించి చింతించి, పరమేశుని అద్వయస్థితిలో సుప్రతిష్ఠితుడై మౌనము పొందుట **మూడవమెట్టు**. మొదటి రెండు మెట్లలో వచ్చిన కీర్తనలు, స్తోత్రాలు, గ్రంథాలు ఎక్కువ. మూడవ మెట్టులో వచ్చిన సదాశివబ్రహ్మేంద్రుల **మానసికపూజ** వంటి గ్రంథాలు తక్కువ. 

## 66

పింగళి సూరన **రాఘవపాండవీయము**లోని మొదటి పద్యం.

**శ్రీతో బుట్టి సుధా మధుద్రవముతో జెన్నొందు పుష్పంబు శో**
**భాతారుణ్యమెలర్పగా ముడుచు పంపాహేమకూటాశ్రయ**
**ఖ్యాత బ్రహ్మము ప్రోచుగావుత విరూపాక్షాహ్వయం బాకువీ**
**టీతిమ్మప్రభువేంకటాద్రి హృదయాటీకంబు లోకంబులన్.**

**ప్రతిపదార్థము :** శ్రీతోన్ = లక్ష్మితోడ; పుట్టి = జన్మించి; సుధా = అమృతమనెడి; మధు = పూవుల తేనె యొక్క; ద్రవముతోన్ = తడితో; చెన్నొందు = చెన్ను + ఒందు = ప్రకాశించు; పుష్పంబు = పువ్వును; శోభాతారుణ్యమెలర్పగా ముడుచు = జడలలో ధరించినట్టి (బాలచంద్రుని శిరములో ధరించిన); పంపా = పంపా సరస్సు తీరమందున్న; హేమకూటాశ్రయ = హేమకూట + ఆశ్రయ = హేమకూటపర్వతమనే ఉనికిలో; ఖ్యాత = పేరు పొందిన; బ్రహ్మము = శివబ్రహ్మము; ఆకువీటీతిమ్మప్రభు = ఆకువీడను పట్టణమునకు ప్రభువయిన తిమ్మరాజు కుమారుడయిన; వేంకటాద్రి = పెదవేంకటాద్రి ప్రభువు యొక్క; హృదయాటీకంబు = హృదయ + ఆటీకంబు = హృదయమునందు వర్తించునది; విరూపాక్షాహ్వయంబు = విరూపాక్ష + ఆహ్వయంబు = విరూపాక్ష నామము కలది; లోకంబులన్ = జనసమూహములను; ప్రోచుగావుత = రక్షించుగాత!

**తాత్పర్యము :** లక్ష్మీదేవితో జన్మించి, అమృతమనెడి పూవుల తేనె యొక్క తడితో ప్రకాశించు, పువ్వును – బాలచంద్రుని – జడలలో ధరించినట్టి వాడు, పంపా సరస్సు తీరములో హేమకూటపర్వతములో పేరుపొందినవాడయిన ఆకువీడను పట్టణమునకు ప్రభువయిన తిమ్మరాజు కుమారుడయిన పెదవేంకటాద్రి ప్రభువు యొక్క హృదయము నందు వర్తించు విరూపాక్షనామముకల శివబ్రహ్మము జన సమూహములను రక్షించుగాత!

**విశేషాలు :**

1. క్రీ.శ.1560లో కర్నూలు జిల్లా నంద్యాల తాలూకాలో కానాల గ్రామంలో **పింగళి సూరన** జన్మించాడు.

2. **రాఘవపాండవీయం** నాలుగు అశ్వాసాలు గల ద్వ్యర్థి కావ్యం. ద్వ్యర్థి కావ్యమంటే రెండు అర్థములు గల కావ్యం. ఈ కావ్యంలో రామాయణ, భారత అర్థాలు ఒకే పద్యంలో

అన్వయించి చెప్పబడ్డాయి. సూరన ఒక కావ్యప్రణాళిక సిద్ధం చేసుకున్నాడు. ఒక పద్యంలో ఇలా అన్నాడు.

3. ఒక కథ వినియెడు తరి వే
రొక కథపై దృష్టి యిడిన నొక యర్థము తో
పక పోవు గాన నేకా
ర్థ కావ్య మెట్లట్ల వినగదగు నొకటొకటిన్. (రాఘవపాండవీయం 1-18)

ఒక కథ వినువేళ, వేరొక కథపై దృష్టి పెడితే ఒక అర్థము కూడా సరిగా స్ఫురించదు. కనుక ఒక అర్థము గల కావ్యము ఏ రకంగా చదువుతామో ఆ ప్రకారంగా ముందు ఒక అర్థముతో కావ్యము చదవాలి. తరువాత రెండవ అర్థముతో కావ్యము చదవాలి. వినాలి.

4. ఈ కావ్యాన్ని ఆకువీడు పెదవేంకటాద్రి ప్రేరణచే విరుపాక్షిదేవునికి సూరన అంకితం చేశారు.

5. రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింపంగ శక్యంబుగా
కుండుందద్గతి కావ్యమెల్లనగునే నోహూయనం జేయదేపాండిత్యంబున
నందునుం తెనుగు కబ్బంబద్భుతం బంద్రు ద
క్షుండెవ్వాడిల రామభారత కథల్ జోడింప భాషాకృతిన్ (11వ పద్యము)

అని కృతిభర్త సూరనని పొగిడాడు. రెండు అర్థాలతో ఒక్క పద్యము వ్రాయటమే కష్టం. అలాంటిది మొత్తం కావ్యం వ్రాసిన నువ్వు గొప్పవాడివని సూరనకి పొగడ్త. ఇది అతిశయోక్తి కాదు. **సహజోక్తి.**

6. తన శ్లేష నిర్మాణ ప్రణాళికను సూరన ఆంధ్రభాషాసంస్కృతాభి భాషాశ్లేష పద్యంలో ఇలా పేర్కొన్నారు. (1-17వ పద్యం). 1. ఒక అర్థంలో ఆంధ్రభాషా పదాలుగా మరో అర్థంలో సంస్కృతభాషా పదాలుగా సమన్వయం. దీన్ని ఆంధ్రభాషా సంస్కృతాభిభాషాశ్లేష అంటారు. 2. శబ్దాలు శ్లేషించి రెండు కథలు రావటం. ఇది ఆంధ్ర శబ్దశ్లేష కావొచ్చు, సంస్కృత శబ్దశ్లేష కావొచ్చు. (సభంగ శ్లేష). 3. నానార్థాలున్న శబ్దాల శ్లేష. (అభంగశ్లేష) 4. ఒక పదానికున్న ముఖ్యార్థం, గౌణార్థం (అముఖ్యమైన అర్థం) అనేవాటితో సమన్వయించటం పదము యొక్క ఒకే అర్థాన్ని వేరువేరుగా అన్వయించటం. శబ్దాల అన్వయం విభేదించటం.

7. **ఏనుంగని కరమరయక - పూనితి గాకిట్టియెడల పొసగునె యేయన్**
**కానమె కాలనియమగతి - తో నావేట మునియుగము ద్రుంగించె తుదన్.**
(01-137)

దశరథుడు మునిబాలుడు చనిపోయిన తరువాత బాధపడుతున్నాడు. ఏనుంగు, అని, కరము, అరయక = ఏనుగని బాగా తెలుసుకోకుండా, పూనితిగాక = సిద్ధపడ్డాను (రామాయణార్థం). పాండురాజు మునిదంపతులను అడవి మృగాలనుకొని చంపి విచార పడుతున్నాడు. ఏనున్, కని, కరము, అరయక = నావంటివాడు ప్రత్యక్షముగా చూచి (భారతార్థం).

ఇక్కడ "ఏనుంగని కరమరయక" అను చోట సభంగశ్లేష తెలుగులో ఉంది. "కానమె కాల నియమగతి" అనుచోటరామాయణార్థంలో "కాల" అను సంస్కృతశబ్దం, భారతార్థంలో "కాన మెకాలు" (అడవి జంతువులు) అనే తెలుగు శబ్దం ప్రయోగంతో ఉభయభాషాశ్లేష.

8. నాందీపద్యములో శివబ్రహ్మము రక్షించుగాత అని సూరన్న అన్నాడు. సూరన్న రచించిన రాఘవపాండవీయము వంటి గ్రంథాలు- "తెలుగు భాషకే ప్రత్యేకమైన అపూర్వ శ్లేష వైభవాలతో - ఎక్కువమందిచేత చదివింపబడి చిరకాలము మనుగాత" అని మనము కూడా గొంతు కలుపుదాం. ❀

## 67

కేదారభట్టు **వృత్తరత్నాకరము**లోని మొదటి శ్లోకం.

**శ్లో॥ సుఖసన్తానసిద్ధ్యర్థం**
**నత్వా బ్రహ్మాచ్యుతార్చితమ్ ।**
**గౌరీవినాయకోపేతం**
**శంకరం లోకశంకరమ్ ॥**



**ప్రతిపదార్థము :** బ్రహ్మ = పరమేశ్వరుడు, ఆది విద్వాంసుడు; అచ్యుత = విష్ణువులచే; అర్చితమ్ = పూజింపబడిన; గౌరీవినాయకోపేతమ్ = గౌరీ వినాయక + ఉపేతమ్ = పార్వతీ, వినాయక సహితుడయిన; లోక = లోకమునకు (భక్త లోకమునకు); శంకరమ్ = సుఖము కలిగించు; శంకరమ్ = శివుని; సుఖ = శాస్త్రార్థ విషయక వృద్ధి ప్రసాద జనితమయిన ప్రమోద విశేషముకొరకు (ఆత్యంతిక మోక్ష లక్షణముకొరకు); సన్తాన

= పరంపరా అవిచ్ఛిన్న ప్రవాహము యొక్క (పుత్ర పౌత్రాదులు); సిద్ధ్యర్థమ్ = సిద్ధి కొరకు (లాభప్రాప్తికొరకు, అణిమాదుల సిద్ధి కొరకు); నత్వా = నమస్కరించెదను.

**తాత్పర్యము :** బ్రహ్మవిష్ణువులచే పూజింపబడినవాడు, పార్వతీ, వినాయకసహితుడు లోకమునకు (భక్తలోకమునకు) సుఖము కలిగించువాడు అయిన శివునికి, సుఖ సంతానలాభప్రాప్తికొరకు నమస్కరించెదను.

**భాషా విశేషాలు :**

1. బ్రహ్మ – వ్యు. ప్రజలను వృద్ధి బొందించువాడు. (నవబ్రహ్మలు – భృగువు, పులస్త్యుడు, పులహుడు, అంగిరసుడు, అత్రి, క్రతువు, దక్షుడు, వసిష్ఠుడు, మరీచి.) భట్ట భాస్కర రుద్రాధ్యాయ భాష్యం ప్రకారం **ఓమ్, స్వాహా, స్వధా, వషట్, నమః** అనే ఐదూ బ్రహ్మ నామాలు. ఆత్మభువు, సుర జ్యేష్ఠుడు, హిరణ్యగర్భుడు, అబ్జయోని, వేధ, స్వయంభువు మొదలైన చాలా పేర్లు బ్రహ్మకు ఉన్నాయి.

2. అచ్యుతుడు – విష్ణువు. వ్యు. తన పదవి నుండి జారనివాఁడు. నాశము లేనివాఁడు. వ్యు. న + చ్యుతః. (న.త.)

3. **అర్చితమ్ – అర్చ్యత ఇత్యర్చితం. అర్చ పూజాయాం**. పూజింపబడే దేవతాదుల పేళ్లు

4. **లోకః – లోకము. లోక్యతే సర్వమస్మిన్నితి లోకః – లోకృదర్శనే** – సర్వము దీనియందు కానబడును.

5. సుఖమ్ – సంతోషము. **సుష్ఠు ఖనత్యశుభమితి సుఖం**– అశుభాన్ని పోగొట్టునది. శోభనాని ఖాని ఇంద్రియాణ్యస్మిన్నితి వా సుఖం– ఇంద్రియములనాప్యాయనము చేయునది.

6. సంతానము – (అ.) 1. కూపము, 2. తటాకము, 3. ఉద్యానము, 4. మండపము, 5. జలశాల, 6. సద్ధర్మాచరణము, 7. పుత్రుడు. **“కూపస్తటాకముద్యానం మండపం చ ప్రపా తథా, సద్ధర్మకరణం పుత్రః సంతానం సప్తధోచ్యతే”** (ఆ.) 1. తటాకప్రతిష్ఠ, 2. ధననిక్షేపము, 3. అగ్రహారప్రతిష్ఠ, 4. దేవాలయప్రతిష్ఠ, 5. వనప్రతిష్ఠ, 6. ప్రబంధ నిర్మాణము, 7. సత్రప్రతిష్ఠ. **“తటాకో ధననిక్షేపో బ్రహ్మస్థాపనమేవ చ వనం శివాలయః కావ్యం సుపుత్రః స్వర్గదా నృణామ్ ముక్తిదాః సప్తసంతానాః”**

7. సంతానము – **సమ్యక్తనోతి వాంఛితమితి సంతానః** – లెస్సగా అభీష్టమును ఇచ్చునది (దేవ వృక్షము)

8. సిద్ధి – ఈడేరుట, నెరవేరడము. వాంఛితప్రాప్తి, అణిమాదులు చేకూరడము. ఇష్టసిద్ధి, అభీష్టసిద్ధి, మనోరథసిద్ధి the gratification of a wish. క్రియాసిద్ధి the completion of a deed. మంత్రసిద్ధి a charm taking effect. కాయసిద్ధి the state of being invulnerable. సిద్ధిరస్తు let (him) be happy, be it successful. (బ్రౌణ్య తెలుగు–ఇంగ్లీష్ నిఘంటువు 1903) దైవికము (ఉత్తమము), 2. మానుషము (సామాన్యము). (నాట్యము జయప్రదమగుట సిద్ధి) **"దైవికీ మానుషీ చైవ సిద్ధిః స్యాద్ద్వివిధా మతా"** (భరతనాట్యశాస్త్రము)

**విశేషాలు :**

1. పదమూడవ శతాబ్దికి చెందిన కేదారభట్టు అనే వైయాకరణి సంస్కృతఛందస్సుపై 'వృత్తరత్నాకరం' అనే గ్రంథం వ్రాసాడు.

2. ఇందులో మొత్తం ఆరు అధ్యాయాలు ఉన్నాయి. మూలగ్రంథము లక్ష్య లక్షణ రూపము. రత్నప్రభాటీకతో ఈ పుస్తకం నాకు అంతర్జాలంలో లభించింది.

3. ఈ గ్రంథంపైన ఇరవైకి పైగా వ్యాఖ్యాన గ్రంథాలు ఉన్నాయట.

4. ఈ శ్లోకము అనుష్టుప్ చందస్సులో ఉంది. 

## 68

శ్రీహర్షుని **ప్రియదర్శిక**లోని రెండవ శ్లోకం.

**శ్లో॥ కైలాసాద్రావుదస్తే పరిచలతి గణేషూల్లసత్కౌతుకేషు**
**క్రోడం మాతుః కుమారే విశతి విషముచి ప్రేక్షమాణే సరోషమ్ ।**
**పాదావష్టంభసీదద్వపుషి దశముఖే యాతి పాతాళమూలం**
**క్రుద్ధోఽప్యాశ్లిష్టమూర్తిర్భయఘనముమయా పాతు తుష్టశ్శివో వః ॥**

**ప్రతిపదార్థము :** కైలాసాద్రావుదస్తే పరిచలతి – ఉదస్తే, కైలాస + అద్రౌ, పరిచలతి (సతి) : ఉదస్తే = రావణునిచేత ఎత్తబడిన; కైలాస + అద్రౌ = కైలాసమను పర్వతము; పరిచలతి (సతి) = తూలిపోతుండగా; గణేషూల్లసత్కౌతుకేషు – గణేషు +ఉల్లసత్, కౌతుకేషు (సత్సు) : గణేషు = ప్రమథగణాలు (శివకింకరులు); ఉల్లసత్ = ఉప్పొంగుచున్న;

కౌతుకేషు = కుతూహలము కలవారు అగుచుండగా; క్రోడం మాతుః కుమారే విశతి– కుమారే మాతుః క్రోడం విశతి : కుమారే = కుమారస్వామి (శిశువు కనుక భయముతో); మాతుః = తల్లి యొక్క; క్రోడమ్ = రొమ్మును; విశతి = చొచ్చుచుండగా; విషముచి ప్రేక్షమాణే సరోషమ్ : విషముచి = పాము (విష = విషమును, ముక్ = వదులునది) సరోషమ్ = రోషముతో; ప్రేక్షమాణే (సతి) = చూచుచుండగా; పాదావష్టంభ సీదద్వపుషి: పాద = శివుని పాదముయొక్క; అవష్టంభ = అదుముట చేత; సీదత్ = కుంగిపోతున్న; వపుషి = శరీరము కలవాడయిన; దశముఖే యాతి పాతాళమూలమ్ : దశముఖే = పది తలలు కలిగిన రావణాసురుడు; పాతాళమూలం యాతి (సతి) = పాతాళముయొక్క అడుగు భాగమునకు పోవుచుండగా, రావణుడు పాతాళమునకు పోవుచుండగా; క్రుద్ధః అపి = రావణుని దుష్టత్వానికి శివుడు కోపగించిన వాడయినప్పటికీ; ఆశ్లిష్టమూర్తి భయఘనమ్, ఉమాయా : ఉమయా = పార్వతిదేవి చేత; భయ = భయముచేత; ఘనమ్ = గట్టిగా; ఆశ్లిష్టమూర్తిః (సన్) = కౌగిలించుకొనబడిన శరీరము కలవాడయి; తుష్టః శివః = సంతోషించిన శివుడు; వః పాతు = మిమ్ములను రక్షించుగాక!

**తాత్పర్యము :** రావణుడు కైలాసమను పర్వతమును ఎత్తాడు. అప్పుడు ఆ కైలాసము తూలిపోతుండగా – ప్రమథగణాలు (శివకింకరులు) ఏమి జరుగుతోందని కుతూహలము కలవారు అయ్యారు. కుమారస్వామి శిశువు కనుక భయముతో తల్లి పార్వతీదేవి యొక్క రొమ్మును అంటుకు పోయాడు; రావణుడు చేసిన పనికి పాము రోషముతో చూసింది. ఆ సమయంలో శివుడు తన పాదాన్ని అదిమాడు. అప్పుడు రావణుని చేతులు కొండ కింద ఇరుకుకొని, కొండతో సహ పది తలలు కలిగిన రావణాసురుడు పాతాళముయొక్క అడుగు భాగము వరకు కుంగిపోయాడు. రావణుని దుష్టత్వానికి (కైలాసపర్వతాన్ని ఎత్తుట దుష్టచేష్ట) శివుడు కోపగించుకొన్నాడు. అయినా పార్వతీదేవి భయముచేత తనను గట్టిగా కౌగిలించుకోవటం వల్ల సంతోషించాడు. అలా సంతోషించిన శివుడు మిమ్ములను రక్షించుగాక!

**విశేషాలు :**

1. సాధారణంగా నాందీలో ఒకటే శ్లోకం ఉంటుంది. కాని పదమనగా శ్లోక పాదమని కొంతమంది ఆలంకారికులు చెప్పారు. ఎనిమిది పాదాలు – అంటే రెండు శ్లోకాలను కలిపి నాందీగా లెక్కించే ఆచారముంది. ఈ రెండు శ్లోకాలు కలిపిన నాందిని **అష్టపద నాంది** అంటారు. ఈ లెక్కప్రకారం ఈ ప్రియదర్శిక నాటకములో మొదటి రెండు శ్లోకాలు నాందీ శ్లోకములుగా పెద్దలు లెక్కించారు.

2. పరమేశ్వరుడు రావణుని దండించి పార్వతీదేవిని గ్రహించినట్లు, వత్సరాజు, వింధ్య కేతు రాజులను కూల్చి ప్రియదర్శికను పొందుతాడనే కథాంశము ఈ నాందీ శ్లోకములో ఉందని పెద్దలు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి గారు చెప్పారు.

3. ఈ శ్లోకం స్రగ్ధర అనే వృత్తములో రచింపబడింది. మ,ర,భ,న,య,య,య అనే గణాలు వరుసగా వస్తాయి. మొదటి అక్షరానికి ఎనిమిదవ, పదిహేనవ అక్షరాలతో యతి మైత్రి.

4. గుప్తుల పతనము తర్వాత ఉత్తర భారతదేశంలో ఏర్పడిన స్వతంత్ర రాజ్యాలలో 'స్థానేశ్వరం' ఒకటి. ఈ రాజ్యాన్ని పుష్యభూతి వంశం పాలించేది. వీరిలో ప్రసిద్ధి చెందినవాడు **హర్షవర్ధనుడు.** (క్రీ.శ. 606–647) ఇతడినే హర్షుడు అని కూడా అంటారు.

5. హర్షుని కాలంలో రాజభాష సంస్కృతం.

6. హర్షుని ఆస్థానంలో **బాణుడు** (హర్షచరిత్ర 'కాదంబరి') **మయూరుడు** (సూర్యశతకం), మాతంగుడు, దివాకరుడు అనే కవులు కూడా ఉండేవారు.

7. అక్షరాలను చాలా అందంగా రాసే నైపుణ్యం ఉన్న రాజుగా హర్షుని చెబుతారు. అక్షరాలతో పాటు అతని భావాలు కూడా అందమయినవి అనటానికి ఈ శ్లోకమే సాక్ష్యం.



## 69

శ్రీ శంకర భగవత్పాదుల **అమరుకశతకం** లోని రెండవ నాందీశ్లోకం.

**శ్లో॥ క్షిప్తో హస్తావలగ్నః ప్రసభమభిహతోఽప్యాదదానోఽంశుకాన్తం**
**గృహ్ణన్ కేశేష్వపాస్తశ్చరణనిపతితో నేక్షితః సమ్భ్రమేణ ।**
**ఆలిఙ్గన్ యోఽవధూతస్త్రిపురయువతిభిః సాశ్రునేత్రోత్పలాభిః**
**కామీ వాఽఽర్ద్రాపరాధః స దహతు దురితం శామ్భవో వః శరాగ్నిః ॥**

**ప్రతిపదార్థము :** సాశ్రునేత్రోత్పలాభిః = స + అశ్రు + నేత్ర + ఉత్పలాభిః = కలువపూల వంటి కన్నులలో నీరు కారుచుండగా; త్రిపురయువతిభిః = త్రిపురుడను రాక్షసుని భార్యల చేత; క్షిప్తః = తోసివేయబడినవాడై; హస్త + అవలగ్నః = చేతిని అంటుకొన్నదై; ప్రసభమ్ = వేగముగా; అభిహతః + అపి = కొట్టబడినదైనప్పటికీ; అంశుకాంతమ్ = కొంగును; ఆదదానః = లాగువాడై; కేశేషు = వెంట్రుకలలో; గృహ్ణన్ = పట్టుకొంటూ;

అపాస్తః = తొలగింపబడినవాడై; చరణనిపతితః = కాళ్ల మీద పడి; న + ఈక్షితః = చూడబడనివాడై; సంభ్రమేణ = ఆశ్చర్యముతో; ఆలింగన్ = కౌగిలించుచు; అవధూతః = తొలగింపబడినవాడై; ఆర్ద్ర + అపరాధః = తడిసిన అపరాధము చేసిన; కామీ + ఇవ = కాముకునిలా ఉన్న; సః శాంభవః = ఆ శివునికి సంబంధించిన; శరాగ్నిః = బాణములనెడి అగ్ని; దురితమ్ = పాపమును; దహతు = కాల్చుగాక!

**తాత్పర్యము :** త్రిపురాసురుల పై శివుడు బాణప్రయోగము చేసాడు. ఆ బాణములనుంచి పుట్టిన అగ్నిని – శంకర భగవత్పాదులు మోసగాడయిన శఠుడను ఒక శృంగార నాయకునితో పోలుస్తున్నారు. త్రిపురుడను రాక్షసుని భార్యలు మీద పడుతున్న శంకరుని బాణములనెడి అగ్నిని దూరముగా తోసివేయాలని చూస్తున్నారు. అది ఎలా ఉందంటే – కలువపూలవంటి కన్నులలో నీరు కారుచుండగా మీద పడుతున్న నాయకుడిని, నాయిక త్రోసివేస్తున్నట్లు ఉంది. అగ్ని నాయికల చేతులను అంటుకోవటానికి ప్రయత్నిస్తోంది. అది ఎలా ఉందంటే – నాయకుడు వాళ్ల చేతులను అంటుకోవటానికి ప్రయత్నించినట్లుంది. అగ్నిని గట్టిగా కొట్టినప్పటికీ – నాయికల కొంగును లాగుతోంది. అది ఎలా ఉందంటే – వేగముగా నాయకుడిని కొట్టినప్పటికీ ఆ నాయకుడు వాళ్ల కొంగును లాగినట్లుంది. శివుని బాణముల అగ్ని నాయికల కేశములను పట్టుకొంటోంది. దానిని వాళ్లు తొలగిస్తున్నారు. అది అది ఎలా ఉందంటే – వాళ్ల కొప్పును నాయకుడు పట్టుకొనబోగా తొలగించినట్లుంది. అగ్ని నాయికల కాళ్ల మీద అంటుకొంది. వాళ్లు చూడలేదు. తొలగించారు. అది ఎలా ఉందంటే – కాళ్ల మీద పడి శృంగార నాయకుడు బతిమిలాడినా – వాళ్లు పట్టించుకోనట్లుంది. నాయకుడిని త్రోసేసారు. తడిసిన అపరాధము చేసిన (క్షణకాలము క్రితమే అపరాధము చేసిన) కాముకునిలా ఉన్న ఆ శివునికి సంబంధించిన బాణములనెడి అగ్ని పాపమును కాల్చుగాక !

**విశేషాలు :**

1. శంకరాచార్యులవారు మండనమిశ్రునితో వేదాంతవివాదం చేసి గెలిచే సమయంలో మండనమిశ్రుని సతీమణి (సరస్వతీదేవి) శృంగారశాస్త్రవిషయాలలో ప్రశ్నించడం మొదలుపెట్టినదట. యోగి అయిన శంకరులు శంకరాచార్యులవారు సందిగ్ధంలో నూరురోజుల వాయిదా తీసుకొని, తన యోగవిద్యాప్రభావముతో అప్పుడే మరణించిన కాశ్మీరరాజు అమరు అనే అతని భౌతికకాయంలో ప్రవేశించారట. నూరురాత్రులు అమరు రాజుగారి కొలువులో స్త్రీలనుండి శృంగారకళని నేర్చుకొన్నారట. తిరిగి తన

శరీరంలో ప్రవేశించి మండనమిశ్రుని భార్యతో వివాదంచేసి విజయం సాధించారట. ఆ నూరు రాత్రులలో ఆయన అనుభవాల సంకలనమే సంకలనమే అమరుకశతకమట. అందులోని రెండవ శ్లోకమిది.

3. ఈ శ్లోకంలో శ్లేషాలంకారముంది.

4. వృత్తము స్రగ్ధర. మ,ర,భ,న,య,య,య అనే గణాలు వరుసగా వస్తాయి. మొదటి అక్షరానికి ఎనిమిదవ, పదిహేనవ అక్షరాలతో యతి మైత్రి.

5. త్రిపురములనగా స్థూల, సూక్ష్మ, కారణ శరీరములని అర్థము. శివుడు మూడుసార్లు త్రిపురాసుర సంహారము గావించినట్లు చెప్పెదరు. మొదట శివానుగ్రహమువలన శారీరక రోగాలు నశించి దేహశుద్ధి కావాలి. తరువాత కామక్రోధాదులు నశించి మానస శుద్ధి కావాలి. తరువాత కారణశరీరాన్ని ఆవరించిన తమస్సు నశించాలి. ఇదే త్రిపురాసురసంహారము.

6. బ్రహ్మశ్రీ దోర్బల విశ్వనాథశర్మగారి మనసిజవ్యాఖ్యానంతో అమరుక శతకాన్ని తెనాలి సాధన గ్రంధమండలి తరపున పెద్దలు శ్రీ రావి మోహనరావు గారు 1996 లో ప్రచురించారు.

7. శృంగారము, వైరాగ్యము అను ఒడ్డుల మధ్య ప్రవహించే నది పూర్వుల జీవితం. ఆ జీవితానికి ప్రతిబింబం వారి సాహిత్యం. అందుకే శృంగారవైరాగ్యాలు ప్రాచీన సాహిత్యంలో చాలామటుకు కలిసే ఉంటాయి.

8. అద్వైతసిద్ధాన్త ప్రతిపాదక గ్రంథం–అమరుకశతకం. "కాన్తే తల్పముపాగతే..." ❀

## 70

విశ్వనాథ **"ధన్యకైలాసము"** నాటకములోని మొదటి పద్యము.



**శ్రీ కైలాస నగాంతద**
**రీ కందర గాయమాన ప్రేమరస రవా**
**స్తోకజయగీతికా ఘం**
**టాకలనము దిక్కులంతటన్ జిగురించున్.**

**ప్రతిపదార్థ భావాలు :**

ఓయి పాఠకుడా! ఎక్కడ చిగురించాలని కవి కోరుకొంటున్నాడు?

**దిక్కులంతటన్** – అన్ని దిక్కులలోను చిగురించాలని కవి కోరుకొంటున్నాడు.

ఎన్ని దిక్కులు?

1. తూర్పు, 2. పడమర, 3. ఉత్తరము, 4. దక్షిణము, 5. ఐశాని, 6. నైర్రుతి, 7. వాయవ్యము, 8. ఆగ్నేయము, 9. ఊర్ధ్వదిశ, 10. అధోదిశ ఇంద్రుడు, వరుణుడు, కుబేరుడు, యముడు, శివుడు, నిర్రుతి, వాయువు, అగ్ని, బ్రహ్మ, శేషుడు – వీరు క్రమముగా ఈ పదిదిశలకు అధిపతులు.

ఈ దిక్కులలో ఏది చిగురించాలని కవి కోరిక?

**ఘంటాకలనము** – (ఘంట + ఆకలనము) గంటల యొక్క సమూహము దిక్కులలో చిగురించాలని కవి కోరిక. అంటే అనేక గంటల చప్పుడు దిక్కులలో మోగాలని భావం.

ఏ గంటల చప్పుడు మోగాలని కవి వర్ణన?

**"అస్తోకజయగీతికాఘంటాకలనము"** మోగాలని కవివర్ణన. స్తోకము అంటే అల్పము. స్తోకముకానిది అస్తోకము. తక్కువకాని జయగీతాలతో కూడిన గంటల చప్పుడు మోగాలని కవి భావన.

ఎటువంటి జయగీతికలు?

**శ్రీ కైలాస నగాంతదరీ కందర గాయమాన ప్రేమరస రవాల**తో కూడిన జయ గీతికలు. శ్రీ కైలాసపర్వతము లోపల ఉండే గుహలలో, బిలములలో పాడబడుచున్న ప్రేమరసము నకు సంబంధించిన ధ్వనులతో కూడిన జయగీతాలు.

మొత్తము మీద ఈ పద్యానికి భావం చెప్పండి?

శ్రీ కైలాసపర్వతము లోపల ఉండే గుహలలో, బిలములలో పాడబడుచున్న ప్రేమరసము నకు సంబంధించిన ధ్వనులతో కూడిన జయగీతాలతో కూడిన గంటల చప్పుడు అన్ని దిక్కులలోను మోగాలి.

శ్రీ కైలాస పర్వతములో ఉండే పార్వతీ పరమేశ్వరులు ఒకరిపై ఒకరు చక్కటి ప్రేమ కలిగినవారు. వారు మాట్లాడుకొనే మాటల్లో ప్రేమరసము ప్రవహిస్తోంది. ఆ మాటల చప్పుళ్లు లోకానికి సంబంధించిన జయగీతికలు. ఆ జయగీతాలు కైలాసపర్వతములోని గుహలలో ప్రతిధ్వనిస్తున్నాయి. ఆ జయగీతాలతో కూడిన గంటల చప్పుడు అన్ని దిక్కులలోను మోగాలని కవి కోరిక.

**విశేషాలు :**

1. 1937 లో మొదటిసారిగా ప్రచురింపబడిన ఆరంకముల నాటకము **ధన్యకైలాసము**.

2. దీనిని అయ్యదేవర కాళేశ్వరరావుగారికి విశ్వనాథ అంకితమిచ్చారు.

3. అద్వైతసిద్ధాంతానికి పట్టాభిషేకము చేసిన నాటకము ధన్యకైలాసము

4. ఇందులోని పాత్రల పేర్లు భోగేశ్వరుడు, భిక్షుకుడు, చిత్రలత మొదలయినవారు. విశ్వనాథ తన వైరాగ్యప్రబోధాత్మకమయిన నాటకానికి అనుగుణంగా పాత్రల పేర్లు పెట్టారు.

5. కైలాసమును తన భ్రూమధ్యమున ఒక పాత్ర ఈ నాటకములో దర్శించి ధన్యుడవుతాడు. అదే ధన్య కైలాసము.

6. నాటకము చివరలో భోగేశ్వరుడు అనే వాడు భిక్షువు కొరకు వెతుకుతాడు. "ఏడీ! భిక్షువు లేడు. లేకపోవుట యేమి? నేనే భిక్షువును. నేనే పరమాత్మను. నేనే ఆనంద భారతిని. **శివోహం శివోహం**" అని పలుకుతాడు. దీనితో నాటకం పూర్తవుతుంది.

7. "మనోబుద్ధ్యహంకారచిత్తాని నాహం – న కర్ణం న జిహ్వా న చ ఘ్రాణనేత్రే ।
న చ వ్యోమ భూమిర్న తేజో న వాయుః – చిదానందరూపశ్శివోఽహం శివోఽహమ్॥

(నేను మనసునూ కాను, బుద్ధినీ కాను, అహంకారమునూ కాను, చిత్తమునూ కాను, నేను కర్ణములనూ కాను, నేను జిహ్వనూ కాను, నేను వాసన చూసే నాసికనూ కాను, నేను చూసే కన్నును కాను. నేను ఆకాశమునూ కాను, నేను భూమినీ కాను నేను తేజస్సునూ కాను, నేను వాయువునూ కాను, చిదానందరూపి శివుడిని నేను. శివుడిని నేను) అను శంకరభగవత్పాదుల నిర్వాణషట్కపుధ్వనులు ఈ నాటకమంతటా ఉన్నాయి. ఆ చప్పుళ్లే నాందీ పద్యములో కూడా ప్రస్తావించబడ్డాయి. ❀

**71**

విశ్వనాథ మధ్యాక్కరలు – శ్రీగిరిశతకము.

**శ్రీనీరధి నిషంగ! భక్త జనతతి శ్రేయోనుషంగ!**
**మానాథ శరసంగ! ప్రౌఢ వృషభరాణ్మాద్యత్తురంగ!**
**క్ష్మానూతన శతాంగ! సంగతోష్ణీష సౌరాంబుభంగ!**
**శూలాభిషంగ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ!**

**ప్రతిపదార్థ – తాత్పర్యాలు :** శ్రీనీరధి నిషంగ = త్రిపురాసుర సంహార సమయములో క్షీర సముద్రము అమ్ములపొదిగా కలిగినవాడా!; భక్త జనతతి = భక్తజన సమూహపు; శ్రేయోనుషంగ = శ్రేయస్సుతో సంబంధము కలవాడా! (భక్తజనులకు శ్రేయస్సు కలిగించు వాడా !); మానాథ శరసంగ = త్రిపురాసుర సంహార సమయములో విష్ణుమూర్తిని బాణముగా కలిగినవాడా!; ప్రౌఢ వృషభరాణ్మాద్యత్తురంగ! = ప్రౌఢ వృషభరాట్ + మాద్యత్ + తురంగ = గంభీరమయిన నందీశ్వరుడనెడి పరవశించెడి వాహనము కలిగినవాడా! (నందీశ్వరుని వాహనముగా కలిగినావాడా); క్ష్మానూతన శతాంగ! = త్రిపురాసురసంహార సమయములో భూమిని కొత్తదయిన రథముగా ఉపయోగించిన వాడా!; సంగతోష్ణీష సౌరాంబు భంగ; శూలాభిషంగ! = త్రిశూలమునందు ఆసక్తి కలిగినవాడా!; శ్రీశైల మల్లికార్జున మహాలింగ! = శ్రీశైల క్షేత్రంలో వెలసిన మల్లికార్జునుడను పేరు కలిగిన మహాలింగ స్వరూపుడా! నీకు నమస్కారము.

**విశేషాలు :**

1. **శ్రీశైల మల్లికార్జున మహాలింగ** – ద్వాదశ జ్యోతిర్లింగాలలో రెండవది ఆంధ్ర దేశం లోని శ్రీశైలంలోని మల్లికార్జునుడు. శ్రీశైలం భూమికి నాభిస్థానం. భారతీయుల నిత్య పూజావిధానం లో సంకల్పం చెప్పేటప్పుడు "శ్రీశైలస్య ఈశాన్యప్రదేశే" అని మనం చెప్పు కొంటాం. మనలాగే అందరు కూడా. శ్రీశైలానికి ఏ దిక్కున వున్నవారు, ఆ దిక్కు పేరు చెప్పి పూజించటం అలవాటు. అంతటి గొప్పతనం పొందిన క్షేత్రం. దక్షిణ కైలాసం గా శ్రీశైలం ప్రసిద్ధి చెందింది. ఇక్కడ మల్లికార్జున మహాలింగాన్ని, యాత్రికులు, కాళ్ళు కూడా కడుక్కోకుండా సరాసరి గుడిలోకి వెళ్లి స్వయంగా లింగాన్ని తాకి, శిరస్సును లింగానికి ఆనించి పూజించి అభిషేకం చేసుకుంటారు. దీన్ని **"ధూళి దర్శనం"** అంటారు. ఇలా ఇంకెక్కడా వుండదు. మల్లికార్జున ఆలయంలోని గర్భాలయంలోని లింగం చాలా చిన్నది. అందుకే ''మూర్తి చిన్నది, కీర్తి గొప్పది'' అనే సామెత వచ్చింది. కళ్యాణమండపానికి చుట్టూ వున్న నాగావళి తోటలో శివభక్తురాలు "చంద్రావతి" మల్లికార్జునస్వామికి మల్లెమాల వేస్తున్న దృశ్యం కనబడుతుంది. అర్జునచెట్టుకు తెల్ల దిరిసెన చెట్టుకు మల్లె తీగలు అల్లుకొని ఆ మల్లికార్జునస్వామి లింగం పైన మల్లెపూలు అభిషేకంగా పడేవట. అందుకీ స్వామికి "మల్లిక – అర్జునుడు అంటే మల్లికార్జునుడు" అనే పేరు వచ్చింది.

2. **ప్రౌఢ వృషభరాణ్మాద్యత్తురంగ!** – శ్రీశైలంలో వీర మండపానికి ముందు నంది

మండపం వుంది. దీనినే బసవన్న మండపం అంటారు. కన్నడం లో బసవన్నను **"చెన్నుకళ్ళు బసవన్న"** అంటారు. చెన్నుకళ్ళు బసవన్న క్రమక్రమంగా "సెనగల బసవన్న" అయ్యాడు. ఈ బసవన్నకు సెనగలు ఇష్టం.

3. **క్ష్మానూతన శతాంగ** – త్రిపురాసుర సంహారంలో భూదేవిని రథంగా చేసుకొన్నాడు శివుడు. అలాగే నాలుగు వేదాలు గుర్రాలు, మేరుపర్వతం ధనుస్సు, ఆదిశేషుడు అల్లె త్రాడు, క్షీరసాగరం అమ్ముల పొది, విష్ణుమూర్తిని బాణము గా చేసుకొన్నాడు. వాటికి సంబంధించిన విశేషణాలు క్ష్మానూతన శతాంగ, మానాథ శరాసంగ, శ్రీనీరధి నిషంగ మొదలయిన సంబోధనల్లో విశ్వనాథ పేర్కొన్నారు.

4. **శూలాభిషంగ** – శూలము గురించి తుమ్మపూడి కోటేశ్వరరావుగారు ప్రస్తావించిన ఒక విచిత్రమయిన కథ ఆసక్తిగా ఉంటుంది. అవతవకరాజు పంచమహాపాతక పట్టణాధిపతి. ఆ నగరంలో ఒకడిల్లు కట్టుకోవడానికి మట్టిగోడలు పెట్టుకొంటే వానకది కరిగిపోయింది. వాడు రాజు దగ్గర మొరపెట్టుకొన్నాడు. 'ఎవరా దొంగ?' అని రాజు అడిగితే తెలివితక్కువ మంత్రులు 'మబ్బు' అన్నారు. రాజు శిక్షించమంటే తలార్లు అన్నారు. మబ్బుకు కారణం 'పొగ' అని. రాజు 'అయితే దాని తల నరకండి' అని అన్నాడు. మంత్రి అన్నాడు 'ఆ పొగకు కారణం కుమ్మరి' అని కుమ్మరిని పట్టుకోగా వాడన్నాడు 'నేను ఫలానావారి పెండ్లికోసం అరివేణికుండలు కావాలంటే ఆవం పెట్టాను. కనుక పెండ్లికొడుకును కొరత వేయండి' అన్నాడు. రాజు అలాగే శిక్ష ఖాయం చేసినాడు. తలారులు పెండ్లికొడుకును కొరతకు తీసుకొనిపోగా వాడన్నాడట 'అయ్యా! ఈ కొరత చేసే శూలం లావుగా ఉంది. నేనేమో సన్నగా ఉన్నాను. ఈ శిక్ష న్యాయం కాదు కదా!' అంటే తలార్లు రాజు దగ్గరకు పోయి విన్నవించారట. 'అయితే ఒక లావుపాటి మనిషిని పట్టుకొని కొరతవేయండి! ఈ మాత్రం తెలియదా! మాటిమాటికి రావద్దు. ఇక ఇదే ఆజ్ఞ' అన్నాడు. తలార్లు ఒక స్థూలకాయుడైన సెట్టిని పట్టుకొని కొరతవేసినారు. (ఈ కథ వేదంవారు వ్రాసింది అని ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావుగారు తమ ఆముక్తమాల్యదా వ్యాఖ్యానంలో తెలిపినారు. పుట 433)

4. సంగతోష్ణీష సౌరాంబు భంగ – ఈ సంబోధనలో శివుని ఉష్ణీషము, అవమానము ప్రస్తావించబడ్డాయి. గుంటూరుజిల్లా అమృతలూరులో శ్రీ అమృతేశ్వరాలయంలో ఆవు యజమాని దుడ్డుకర్రతో కొట్టటం వలన తగిలిన దెబ్బలు శివలింగం పై గుంటలుగా కనిపిస్తాయి. అభిషేకజలం వీటిలో నిలిచి పోతుంది. ఈ భంగాన్ని (అవమానాన్ని) ఈ

సమాసంలో విశ్వనాథ పేర్కొన్నారా? చిత్తూరు జిల్లా, ఏర్పేడు మండలానికి చెందిన గుడిమల్లం అను గ్రామములో తలపాగా ధరించిన శివుని విగ్రహం ఉంది. ఈ తలపాగాను విశ్వనాథ ఈ సమాసంలో ప్రస్తావించారా?

5. **మధ్యాక్కర** – విశ్వనాథవారు రచించిన మధ్యాక్కరలకి కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు (1965) ఇచ్చింది. మధ్యాక్కర లక్షణాలు. నాలుగుపాదాలు ఉంటాయి. పాదానికి రెండు ఇంద్రగణాలు, ఒక సూర్యగణము మళ్ళీ రెండు ఇంద్రగణాలు, ఒక సూర్యగణము ఉంటాయి. నాల్గవ గణము మొదటి అక్షరం యతిస్థానం.

ఇది కర్ణాటధరాధృతిస్థిరభుజా హేవాక లబ్ధేభరా
డుదయోర్వీధర తత్పితృవ్య కృత నవ్యోపాయ**నోష్ణీష** ర
త్నదృగంచత్పద కృష్ణరాయ వసుధాధ్యక్షోదితాముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యముల నాద్యంబై మహిం బొల్పగున్.

అను ఆముక్తమాల్యద మొదటి ఆశ్వాసాంత పద్యంలో ఉష్ణీషము గురించి ఒక చిత్రమయిన ప్రస్తావన ఉంది. గజపతి ప్రతాపరుద్రుడి పినతండ్రి ఐన ప్రహరేశ్వర పాత్రుని కిరీటాన్ని రాయలు తొక్కి ఆయన తలను తొక్కుతాననే తన ప్రతిజ్ఞ నెరవేర్చుకున్నాడు. ఆ కిరీటానికి పొదిగిన రత్నాల చూపులతో ఒప్పారుతున్నాయట రాయల పాదాలు. కిరీటానికి పొదగబడిన రత్నాలే ఆ ప్రహరేశ్వరుని కన్నులు. రత్నకాంతులు ఆ ఓడిన వాని చూపుల్లాగా ఉన్నాయని ఇక్కడ ధ్వని. ఈ మధ్యాక్కరలో విశ్వనాథ **"సంగతోష్ణీష సౌరాంబు భంగ"** అను సంబోధనలో కూడా అవమాన వృత్తాంతమేదైనా ప్రస్తావించదలుచుకొన్నారా? **"సంగతోష్ణీష సౌరాంబు భంగ"** అంటే గంగానదీ తరంగాలను తలపాగాలో కూడుకొన్న వాడా! అని అర్థం. 

## 72

కాళిదాసు **చిద్గగనచంద్రికలోని** నాందీ శ్లోకం.

**శ్లో॥ స్థూలం సూక్ష్మం పరం చ త్రివిధమిహ జగద్యత్ప్రథావేశసిద్ధ్యా**
**యుక్తం సత్తా యదీయా స్ఫురతి చ పరతః స్వప్రథైకస్వభావా ।**
**భా మూర్తిం యం విమర్శక్రియమనుపతితా లక్ష్యతే లోకవృత్తిః**
**సన్మార్గాలోకనాయ వ్యపనయతు స వః తామసీం వృత్తిమీశః ॥**

**ప్రతిపదార్థము :** ఇహ = ఇక్కడ; స్థూలం సూక్ష్మం పరం చ = 1. స్థూల ప్రపంచము, 2. సూక్ష్మ ప్రపంచము, 3. కారణ ప్రపంచము అను; త్రివిధమ్ = మూడు రకాల;

జగద్యత్రప్రథావేశ సిద్ధ్యా - జగత్ + ప్రథ + ఆవేశసిద్ధ్యా - జగత్ = ప్రపంచములను; ప్రథా = ప్రసిద్ధిచే; ఆవేశసిద్ధ్యా = ఆవేశముతో కూడిన సిద్ధిచే; సత్తా = ఉనికి, శక్తి; యుక్తమ్ = కూడుకొన్నదయి; యదీయా స్ఫురతి = ఎవరికి సంబంధించినదో వారికి (అనగా ఆరకంగా ఆలోచించగలిగినవారికి) ఈశ్వరుడను కాలశక్తి స్ఫురించుచున్నది; పరతః = మరియూ; స్వ = తనయొక్క; ప్రథా + ఏక స్వభావా = మూడు గుణముల విస్తార స్వభావము కలది; యం భా మూర్తిమ్ = ప్రకాశించు మూర్తి ఎవరికి కలదో ఆమూర్తిని; విమర్శ క్రియమ్ = విమర్శ క్రియచే; అనుపతితా = వెంబడించుచున్నది (ఒకదాని వెంట ఒకటి పడుచున్నది); లక్ష్యతే = చూడబడుచున్నది; లోకవృత్తిః = లోకముయొక్క వృత్తాంతము; సన్మార్గాలోకనాయ = సత్ + మార్గ + ఆలోకనాయ = సత్యమైన ఆలోకనమును (చూపును) మనకు ఇచ్చుట కొరకు (ఇచ్చి); తామసీం వృత్తిమ్ = తామసబుద్ధిని; సః ఈశః = ఆ పరమేశ్వరుడు; వః = మీకు (మీలో); వ్యపనయతు = తొలగించుగాక!

**తాత్పర్యము :** 1. స్థూల ప్రపంచము, 2. సూక్ష్మ ప్రపంచము, 3. కారణ ప్రపంచము అను మూడు రకాల ప్రపంచములలోను ఈశ్వరుడను కాలశక్తి భక్తిపరులకు స్ఫురించుచున్నది. ఈశ్వరశక్తి మూడు గుణముల విస్తార స్వభావము కలది. ఈశ్వర శక్తి ప్రకాశించు విమర్శ క్రియచే చూడబడుచున్నది; లోకముయొక్క వృత్తాంతమును సత్యదృష్టితో చూచుట కొరకు తామసబుద్ధిని ఆ పరమేశ్వరుడు మీలో తొలగించుగాక!

**విశేషాలు :**

1. **"య దన్తరేణ యన్న సంభవతి తస్య తదర్థత్వం తదపేక్షకమ్"** అని ఒక సంస్కృత న్యాయము. ఏది లేకపోతే ఏ కార్యము జరగదో ఆ కార్యమున కది కారణమవుతుంది. ఉదా - అగ్నిహోత్రము లేకపోతే దహనక్రియ జరగదు. అలాగే శివుడు లేకపోతే జీవుని మూడు రకాల ప్రపంచాలకు (శరీరాలకు) ఉనికి లేదు. అందుకే 1. స్థూల ప్రపంచము, 2. సూక్ష్మ ప్రపంచము, 3. కారణ ప్రపంచము అను మూడు రకాల ప్రపంచములలోను ఈశ్వరుడను కాలశక్తి భక్తిపరులకు స్ఫురించుచున్నదని ఈ శ్లోకంలో భావించబడింది.

2. ప్రపంచమునే ఆధ్యాత్మిక పరిభాషలో శరీరము అని కూడా అంటారు.

3. ఈ స్థూలశరీరము లోపల సూక్ష్మశరీరం, దానిలోపల కారణశరీరం, దానిలోపల మహాకారణశరీరం వున్నాయి అని అన్నారు.

4. ఈ స్థూలశరీరానికే జననము, మరణము, ధర్మములు, మానావమానములు ఉంటాయి. బాల్యము మొదలయిన అవస్థలు వర్ణాశ్రమ ధర్మాలు, యమ, నియమములు దీనికే ఉంటాయి.

5. వాక్కు మొదలైన కర్మేంద్రియాలు, శ్రవణము మొదలైన జ్ఞానేంద్రియాలు, ప్రాణ వాయువు మొదలైన వాయువులు ఆకాశము మొదలైన పంచభూతాలు, నాలుగు అంతః కరణాలు, అవిద్య, కామము, కర్మ (క్రియ) – ఇవన్నీ కలిపితే సూక్ష్మశరీరము.

6. కారణశరీరము అవ్యక్తమయినది. దీనిలో త్రిగుణాలు ఉన్నాయి. ఇదియే ఆత్మయొక్క కారణశరీరము. సుషుప్తి దీని అవిభక్త దశ. (వివేకచూడామణి)

7. వీటిలో స్థూలశరీరం మాత్రం నశిస్తుంది. తక్కిన రెండు శరీరాలు కర్మఫలితాల ననుభవించడానికి మరో జన్మను పొందుతాయి.

8. ఈ **చిద్గగనచంద్రిక** నాలుగు భాగములుగా విభజింపబడినది. ఒక్కొక్క భాగమునకు విమర్శ అని పేరు. అందుకే ఈ నాందీ శ్లోకములో కూడా విమర్శ క్రియ ప్రస్తావించ బడినది. శివతత్త్వము, ప్రకాశవిమర్శ తత్త్వము – ఇలా అనేక అంశాలు ఇందులో ప్రస్తావించబడ్డాయి. శ్రీ దోర్బలవారి వ్యాఖ్యానంతో పుస్తకరూపం సంతరించుకొన్నది.

9. చిద్గగనచంద్రికను తాంత్రికగ్రంథంగా చెబుతారు.

10. విశ్వనాథ ఈ చిద్గగనచంద్రికనే చిద్గగనప్రాలేయాంశువు (జ్ఞానమనే ఆకాశములో చంద్రుడు) అన్నారు. కాళిదాసు వెన్నెల (చంద్రిక) అంటే విశ్వనాథ అదే శివుడిని చంద్రుడు అన్నారు. **"శ్రీ మంగళాంబికాం చిద్గగనచంద్రికాం – చింతయేఽహం సదాశివ నాయికామ్"** అని ముత్తుస్వామి దీక్షితారు శక్తిని **చిద్గగనచంద్రిక** అన్నారు.

11. అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా! సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిః సా పార్థ తామసీ (భగవద్గీత). అధర్మమును ధర్మముగాను, అలాగే ఇతర విషయములను దానికి విపరీతముగను భావించు బుద్ధిని తామసబుద్ధి అంటారు. ఈ తామసబుద్ధిని మనలో తొలగించమనే కాళిదాసు ప్రార్థనతో మనం కూడా గొంతు కలిపి శివుడిని వేడుకొందాం.



## 73

సింహభూపాలుడు రచించిన **రసార్ణవసుధాకరము**లోని నాందీ శ్లోకం.



**శ్లో॥ శృంగారవీరసౌహార్దం**
**మౌగ్ధ్యవైయాత్యసౌరభమ్ ।**
**లాస్యతాండవసౌజన్యం**
**దాంపత్యం తద్ భజామహే ॥**

**ప్రతిపదార్థము :** శృంగార వీర సౌహార్దమ్ = శృంగారము, వీరరసముల స్నేహ భావము (= సౌహార్దము) కలిగినది; మౌగ్ధ్య = అందము, పరవశత్వముల; వైయాత్య = దిట్ట తనము, ధైర్యములచే; సౌరభమ్ = పరిమళించునది; లాస్య తాండవ సౌజన్యమ్ = సుకుమారమైన ఉద్ధతమైన నృత్యముల మంచితనము కలిగినది; దాంపత్యం తద్ భజామహే – తద్ దాంపత్యం భజామహే = అటువంటి శివపార్వతుల అర్ధనారీశ్వర భార్యాభర్తృభావమును, అనుకూలదాంపత్యమును (harmony in a family, mutual affection) సేవించెదము.

**తాత్పర్యము :** శివపార్వతుల అర్ధనారీశ్వర దాంపత్యము శృంగారము, వీరరసముల కలయిక కలిగినది. అందము ధైర్యముల పరిమళము కలిగినది. సుకుమారమైన ఉద్ధతమైన నృత్యముల మంచితనము కలిగినది. అటువంటి శివపార్వతుల దాంపత్యమును సేవించెదము.

**విశేషాలు :** ఈ శ్లోకములో శృంగారము, అందము, సుకుమార నృత్యము **(లాస్యము) పార్వతికి** సంబంధించినవి. వీరము, ధైర్యము, ఉద్ధతమైన నృత్యము **(తాండవము) శివునికి** సంబంధించినవి. త్యాగము లేని ధనములా, రసము లేని వాక్కు ప్రకాశించదు. రాగము నుండి శృంగారము, ఉత్సాహము నుండి వీరము, పుడతాయి. **శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానక బీభత్స అద్భుత శాంతములను తొమ్మిది రసములు.** వీటిలో శృంగార, వీరములకు పొత్తు అసహజము. కాని శివపార్వతుల అర్ధనారీశ్వర దాంపత్యములో అది సహజముగా కవి వర్ణించాడు.

ఇక్కడ ఇంకో మాట. శృంగార రౌద్ర వీర బీభత్సములను నాల్గు రసములు సహజాలని శ్రీమదగ్నిమహాపురాణములో ఉంది. (మూడువందల ముప్పదితొమ్మిదవ అధ్యాయము 09 వ శ్లోకం).

శ్లో ॥ ........................................
శృంగార హాస్యకరుణా రౌద్రవీరభయానకాః

శ్లో॥ బీభత్సాద్భుతశాంతాఖ్యాః స్వభావాచ్చతురో రసాః ।
లక్ష్మీరివ వినా త్యాగాన్న వాణీ భాతి నీరసా ॥ 9

శృంగార హాస్య కరుణ రౌద్ర భయానక బీభత్స అద్భుత శాంతములు తొమ్మిది రసములు. నాలుగు రసములు సహజములు. త్యాగములేని ధనము వలె, రసములేని వాక్కు ప్రకాశించదు.

1. సంభోగశృంగారము (కలిసియున్న నాయికా నాయకుల శృంగారము), 2. విప్రలంభ శృంగారము (వియోగముననున్న నాయికా నాయకుల శృంగారము). అని శృంగారము రెండు రకములుగా సాహిత్యదర్పణము చెప్పింది. ("విప్రలంభోఽథ సంభోగ ఇత్యేష ద్వివిధో మతః" సాహిత్యదర్పణము 3-186)

1. వాగాత్మకము, 2. నేపథ్యాత్మకము, 3. క్రియాత్మకము. అని శృంగారాన్ని భరతుని నాట్యశాస్త్రము మూడు రకాలుగా చెప్పింది. ("శృంగారం త్రివిధం విద్యాత్ వాఙ్నేపథ్య క్రియాత్మకమ్" భరతనాట్యశాస్త్రము 6-77). "శృంగం ప్రాధాన్యమియర్తీతి శృంగారః" ప్రాధాన్యము పొందునది శృంగారమని అమరము శృంగార శబ్దాన్ని నిర్వచించింది. వీరయంత్యనేన వీరః - శూర వీర విక్రాన్తౌ - దేని చేత విక్రమింతురో అది వీరము. అందము, ధైర్యముల పరిమళము అని అద్భుతమైన ప్రయోగము ఈ శ్లోకంలో సింగ భూపాలుడు చేసాడు. పరిమల్యతే ధార్యత ఇతి పరిమళః పరిమళ శబ్దః సమ్మర్దోత్పన్నే జన మనోహరే గన్ధే వర్తతే - మెదుపుటవలనను రాయిడివలన పుట్టిన చక్కని వాసన, సురతమున నలఁగిన మేనుపూఁత లోనగువానివలన పుట్టిన వాసన. ఈ అర్థ నేపథ్యంలో సింగభూపాలుడు వాడిన పరిమళ పదగంధాస్వాదన మనోహరముగా ఉంటుంది. రసార్ణవ సుధాకరములో మూడు విలాసాలు (అధ్యాయములు) ఉన్నాయి. కాళిదాస, భవభూతి, శ్రీహర్ష, రాజశేఖరులు మొదలైన మహాకవులు రచించిన నాటకములలోని మనోహరమైన శ్లోకాలు ఇందులో సందర్భానుగుణంగా పేర్కొనబడ్డాయి.

రాచకొండ రాజు సర్వజ్ఞ సింగభూపాలుడు. రాచకొండ పట్టణం సాహిత్యానికి, సంగీతానికి, నాట్యశాస్త్ర రంగానికి పెట్టింది పేరు. వీరి కాలంలో సంస్కృతభాషకు ఎంతో విలువ లభించింది. రాచకొండ రాజు సర్వజ్ఞ సింగభూపాలుడు సంగీత, సాహిత్య

కళావిశారదుడు మంచి రసికుడు, బహు గ్రంథకర్త. కవిసార్వభౌముడు శ్రీనాథుడు రాచకొండను దర్శించాడు. భాస్కరరామాయణ శేషాన్ని పూరించిన అయ్యచార్యుడు రాచకొండ రాజ్యానికి చెందినవారేనట. ఈయన కుమారుడే హరిశ్చంద్రచరిత్రను రచించిన గౌరన. ఇప్పుడు నల్గొండ జిల్లా, నారాయణపూర్ మండలానికి చెందిన గ్రామము రాచకొండ, నల్గొండ నుండి 64 కి.మీ దూరంలో ఉంది. ❁

## 74

కందుకూరు రుద్రకవి **నిరంకుశోపాఖ్యానము**లోని మొదటి పద్యము.

> **శ్రీ భాషారమణీ విమృష్ట పద రాజీవోత్తమాంగార్చ్యుడా**
> **ర్యా భామాపరిణేత సర్వజగదారాధ్యుండు మూర్తి త్రయీ**
> **శోభా కందము కందుకూరి నగరీ సోమేశ్వరస్వామి లో**
> **కాభీష్టంబులొసంగు గాత గరుణాయత్తైకచిత్తంబునన్.**

**ప్రతిపదార్థము :** శ్రీ భాషారమణీ = శ్రీ సరస్వతీ దేవిచే; విమృష్ట = ఒత్తబడిన; పద రాజీవోత్తమాంగార్చ్యుడు = పద రాజీవ + ఉత్తమాంగ + అర్చ్యుడు = పద పద్మములతో నాలుగు శిరస్సులు కల బ్రహ్మచే పూజ్యుడు; ఆర్యా భామా = పార్వతీదేవియొక్క; పరిణేత = భర్త; సర్వజగదారాధ్యుండు = సర్వలోకములచే పూజింపదగినవాడు; మూర్తి త్రయీ శోభా కందము = త్రిమూర్తుల ప్రకాశమునకు గడ్డ; కందుకూరి నగరీ = కందుకూరు నగరములో వెలసిన; సోమేశ్వరస్వామి = పరమశివుడు (చంద్రునిచే కొలువబడిన ఈశ్వరుడు); కరుణాయత్తైక చిత్తంబునన్ = కరుణ + ఆయత్త + ఏక చిత్తంబునన్ = దయ చేత సిద్ధము కాబడిన ఏకాభిప్రాయముకల (సమాధానముగల) మనస్సుతో; లోకాభీష్టంబు లొసంగు గాత = లోక + అభీష్టములు + ఒసగుగాత = లోకములోని వారి కోర్కెలు తీర్చుగాక!

**తాత్పర్యము :** కందుకూరులో వెలసిన శ్రీ సోమేశ్వరస్వామి – శ్రీ సరస్వతీ దేవిచే ఒత్తబడిన పదపద్మములు కలిగి, నాలుగు తలలు కలిగిన బ్రహ్మచే పూజ్యుడు, పార్వతీదేవి యొక్క భర్త, సర్వలోకములచే పూజింపదగినవాడు, త్రిమూర్తులప్రకాశమునకు మూలకందము వంటివాడు. అటువంటి కందుకూరు నగరములో వెలసిన పరమశివుడు దయచేత సిద్ధము కాబడిన ఏకాభిప్రాయముకల (సమాధానముగల) మనస్సుతో లోకములోని వారి కోర్కెలు తీర్చుగాక!

**విశేషాలు :**

1. కందుకూరి రుద్రకవి (1480–1560.) తెలుగులో లభ్యమౌతున్న మొట్టమొదటి యక్షగానపు కర్తగా ప్రసిద్ధి పొందాడు. రుద్రకవికి మంచి పేరు అతని **"జనార్దనాష్టకం"** తీసుకువచ్చింది.

> **సిరులు మించిన పసిమిబంగరు జిలుగుదుప్పటి జారగాఁ**
> **జరణపద్మముమీఁద, దేహము చంద్రకాంతులు దేరఁగా**
> **మురువుచూపుచు వచ్చినావో మోహనాకృతి మీరఁగా**
> **గరుడవాహన! దనుజమర్దన! కందుకూరి జనార్దనా!**

ఇది స్వాధీనపతిక గురించి రుద్రకవి జనార్దనాష్టకంలో వ్రాసిన పద్యం. జనార్దనాష్టకంలో ఒక్కో పదం కిర్మీరం (నానావర్ణములు కలిసిన వన్నె)

2. నిరంకుశోపాఖ్యానం నాలుగు ఆశ్వాసాల ప్రబంధకావ్యం.

3. అడ్డులేని ప్రవర్తన కలవాడు నిరంకుశుడు. నిరంకుశుడు తల్లితండ్రుల మాట వినకుండా విలాసాలకు అలవాటు పడతాడు. చివరకు దైవానుగ్రహంతో మంచివా డవుతాడు. నిరంకుశోపాఖ్యానాన్ని కందుకూరులోని సోమేశ్వరస్వామికి కవి అంకితమిచ్చాడు.

4. రుద్రకవి తెలియని రోజుల్లో కృష్ణదేవరాయలకు ఒకరోజు అతనికి ఎదురయ్యాట్ట. "ఈ రోజు పొద్దునే నువ్వు నాకు ఎదురయ్యావు. నాకూ, ఈ రాజ్యానికి ఏమరిష్టం రాబోతోందో! నీకు మరణశిక్ష విధిస్తున్నాను" అని రాయలు అంటే రుద్రకవి నవ్వాడట. "మహారాజా! నా వల్ల మీకు ఏ అశుభం కలుగుతుందో నాకు తెలీదు కాని, ఈ రోజు పొద్దున్నే మిమ్మలిని చూడటం వల్ల నాకు మరణమే వస్తోంది" అని ధైర్యంగా చెప్పాడట. అంటే తన వల్ల రాయలకు అశుభము కాదని, రాయల దర్శనమే అశుభమని చెప్పాడు. కృష్ణదేవరాయల ఆస్థానంలో రుద్రకవి ఉన్నాడని చెబుతారు కాని అందుకు సరియైన ఆధారాలు లేవు.

5. ఈ నిరంకుశుడు శివునితో జూదమాడి గెలిచినవాడు. ఇంద్రుడు వరము కోరుకొమ్మంటే రంభను అడిగిన ధైర్యవంతుడు. "నీకు తప్పించి ఇతరులకు ఇది సాధ్యమా?'' అని తల్లిదండ్రులచే పొగిడించుకొన్న ఘనుడు నిరంకుశుడు. (నిరంకుశోపాఖ్యానము– చతుర్థాశ్వాసము 130 వ పద్యము)

6. "అత్తవారిచ్చిన యపరంజీ ఘంటీలు సంశయింపక వేగ జదువ పెట్టె" నిరంకుశోపాఖ్యానము- ద్వితీయాశ్వాసము 116 వ పద్యము). మొదలైన పద్యము చదువుతుంటే చింతామణి పద్యాలు గుర్తుకు వస్తాయి. (అత్తవారిచ్చిన అంటు మామిడి తోట). రుద్రకవి పద్యాలు ప్రభావవంతమయినవి.

7. ఈ నాందీ పద్యంలో వాడిన ఆర్యా, ఆర్య అను రెండు పదములు సమానార్థకములే. (వ్యు. ఋ గతౌ - ఋ + ణ్యత్.) పూజ్యురాలు, వృత్తభేదము, అత్త, నటుఁడు భార్యను బిల్చుటకై వాడెడు పేరు, పార్వతి అని నానార్థాలు ఉన్నాయి. వీటిలో సందర్భానుగుణంగా ఇక్కడ పార్వతి అను అర్థాన్ని స్వీకరించబడినది. ❀

## 75

అభినవగుప్తుని **భైరవస్తోత్రము**లో మొదటి శ్లోకము.

**శ్లో॥ వ్యాప్తచరాచరభావవిశేషం చిన్మయమేకమనన్తమనాదిమ్ ।**
**భైరవనాథమనాథశరణ్యం త్వన్మయచితయా హృది వన్దే ॥**

**ప్రతిపదార్థము :** చరాచర = కదిలేవాటితో, కదలని వాటితో కూడిన; భావవిశేషమ్ = భావాల విశేషాలతో కలిగిన; చిన్మయమ్ = చిత్ + మయమ్ = జ్ఞానరూపిగా; వ్యాప్త = వ్యాపించిన; ఏకమ్ = ఒక్కడైన (అద్వితీయుడైన); అనన్తమ్ = అనంతుడైన (అంతము లేని); అనాదిమ్ = మొదలులేని; అనాథశరణ్యమ్ = అనాథలకు దిక్కైన; భైరవనాథమ్ = భైరవనాథుని; త్వన్మయచితయా = త్వత్ + మయచితయా = నీతోకూడిన మనస్సుతో; హృది = హృదయములో; వన్దే = నమస్కరిస్తున్నాను.

**తాత్పర్యము :** భైరవనాథుడైన శివుడు కదిలేవాటితో, కదలని వాటితో, భావాల విశేషాలతో జ్ఞానరూపిగా ప్రపంచములలో వ్యాపించినవాడు. అద్వితీయుడైనవాడు. అనంతుడు. మొదలు, తుది లేనివాడు. అనాథలకు దిక్కైన వాడు. అటువంటి భైరవనాథునికి అతనితో కూడిన మనస్సుతో హృదయములో నమస్కరిస్తున్నాను.

**విశేషాలు :**

**కాశీక్షేత్రనివాసం చ కాలభైరవదర్శనమ్**
**ప్రయాగే మాధవం దృష్ట్వా ఏకబిల్వం శివార్పణమ్!**

ఈశ్వరుని అవతార విశేషము భైరవుడు. **"భక్షణాత్, రక్షణాత్, వమనాత్,**

**భైరవః"** అని వ్యుత్పత్తి. అనగా సృష్టి స్థితి సంహారకర్తయైన ఈశ్వరుడు అని భైరవపదానికి అర్థం. భయానకరసము కలిగినవాడు **భైరవుడు** అని ఇంకొక అర్థం.

**అసితాంగో రురుశ్చండః క్రోధ ఉన్మత్త ఏవచ ।**
**కపాలీ భీషణశ్చైవ సంహారశ్చాష్టభైరవాః ॥**

భైరవుడు ఎనిమిది రకాలు. కాలభైరవుడు, అసితాంగభైరవుడు, సంహార భైరవుడు, రురు భైరవుడు, క్రోధ భైరవుడు, కపాల భైరవుడు, రుద్ర భైరవుడు మరియు ఉన్మత్త భైరవుడు.

ఆదిశంకరాచార్యులవారు కాలభైరవాష్టకాన్ని రచించారు, ఇది జగత్ప్రసిద్ధమైనది.

**దేవరాజసేవ్యమానపావనాంఘ్రిపంకజం**
**వ్యాళయజ్ఞసూత్రమిందుశేఖరం కృపాకరమ్ ।**
**నారదాది యోగిబృందవందితం దిగంబరం**
**కాశికాపురాధినాథకాలభైరవం భజే! ॥**

కాలభైరవుడ్ని నేపాల్ ప్రాంతాల్లో, హిమాలయాల్లో ఎంతగానో పూజిస్తారు. ఖాట్మండు నగరమధ్యంలో వున్న కాలభైరవమూర్తి చాలా దశాబ్దాలు నేపాల్ సుప్రీంకోర్టుగా పరిగణించేవారు. ఈ భైరవస్తోత్ర రచయిత అభినవగుప్తుడు పదవ శతాబ్దంలో కాశ్మీరదేశంలో నివసించినట్లు ఆధారాలున్నాయి. "కాశ్మీర శంకరాచార్య" అని ఆయనకి బిరుదు. స్త్రీలకు కూడా సాధనామార్గంలో సమానస్థానాన్ని ఇచ్చిన మహనీయునిగా అయనను వర్ణిస్తారు. శంభునాథుని పత్ని (తన గురుపత్ని) నుంచి అభినవగుప్తుడు శక్తిపాతాన్ని పొందాడట. శైవాద్వైతాన్నీ తంత్రమార్గాన్నీ అప్పటి వరకూ ఉన్న సాధనా మార్గాలనూ సమన్వయము చేస్తూ **"తంత్రాలోక"** మనే అద్భుత గ్రంథాన్ని ఈయన రచించాడు. భౌరవస్తోత్రం తెలుగులో వ్యాఖ్యానంతో వెలువడినది.

తన అంత్యదశలో అభినవగుప్తుడు తన 1200 మంది శిష్యులతో కలిసి భైరవ గుహ దగ్గరికి వెళ్లాడు. (ఇప్పుడిది కాశ్మీర్ లోని బీరహ్ పట్టణములో భద్ర కాళీతీర్థ క్షేత్రమనే పేరుతో ఉంది) అభినవగుప్తుడు ఒక్కడే గుహలోకి వెళుతూ ఈ భైరవ స్తోత్రాన్ని చదివాడట. అదే అభినవగుప్తుడు ఆఖరుసారిగా కనిపించిన సన్నివేశము. ఈ భైరవ స్తోత్రము సిద్ధి ప్రదమని చాలామంది నమ్ముతారు. ధ్వన్యాలోకమని ఆనందవర్ధనుడు వ్రాస్తే దానికి లోచనమనే పేరుతో అభినవగుప్తుడు వ్యాఖ్య వ్రాసాడు. ఆలోకము అంటే

చూపు. లోచనము అంటే కన్ను. కన్నులేనిది చూపులేదు. వ్యాఖ్యానానికి అభినవగుప్తునిలా చక్కటి పేరు పెట్టినవారు లేక పోలేదు కాని అరుదు.

శ్రీరామరక్షలా (గట్టి రక్షణము) – **"భైరవరక్ష"** అని ఒక ప్రయోగముంది. భైరవరక్ష అన్నా, శ్రీరామరక్ష అన్నా ఒకటే. తీపి పదార్థాలు వేరయినా తీపి ఒకటే. ❁

## 76

జగద్ధారభట్ట **"స్తుతికుసుమాంజలి"** లో మొదటి శ్లోకము.

**శ్లో॥ హ్లాదవద్భిరమలైరనర్గలైర్జీవనైరఘహరైర్నవైరియమ్ ।**
**స్వామినః క్లమశమక్షమైః క్షణం, మనరోద్ధుమర్హతి సరస్వతీ ॥**

**ప్రతిపదార్థము :** హ్లాదవద్భిః = పరమానందదాయకములై; అమలైః = నిర్మలమై; అనర్గలైః = అడ్డులేనివి అయిన; అఘహరైః = పాపములను హరించునట్టి; క్లమ = శ్రమము; శమ = అంతరింద్రియ నిగ్రహం. (అంటే, మనస్సులోకి సుఖం, భోగం మొదలైన ఆలోచనలు రాకుండా చేయడం); క్షమైః = ఓర్పులుగల; జీవనైః = జలములచేత; క్షణమ్ = క్షణకాలము పాటు; మనః = మనస్సును; రోద్ధుమర్హతి = రోద్ధుమ్ + అర్హతి = ఆపుటకు సరస్వతీ నదీజలములు సమర్థమగును. (అలా నా వాక్కులను సరస్వతి); నవైః = స్తోత్రములచే; హ్లాద వద్భిః = పరమ ఆనంద దాయకములై; అమలైః = నిర్మలమై; అనర్గలైః = అడ్డులేనివి అయి; అఘహరైః = పాపములను హరించునట్టి; క్లమ = శ్రమము; శమ = అంతరింద్రియ నిగ్రహం; క్షమైః = ఓర్పులు గల; జీవనైః = జీవనవిధానములు కలిగించి; ఇయమ్ స్వామినః = ఈ సదాశివుని మనస్సులో; క్షణమ్ = క్షణకాలము పాటు; రోద్ధుమర్హతి = రోద్ధుమ్ + అర్హతి = ఆపుటకు సమర్థమగును;

**తాత్పర్యము :** ఒక్కసారి సరస్వతీనదీజలాలలో స్నానంచేస్తే, అవి శ్రమను దూరము చేస్తాయి. అంతరింద్రియ నిగ్రహం, ఓర్పులను ఇస్తాయి. పరమ ఆనందదాయకములై అవి పాపాలను హరించి, క్షణకాలము పాటు శాంతిని (నిశ్చలస్థితి) మనస్సుకు కలిగిస్తాయి.

అలాగే జగద్ధారుడను పేరు గల సరస్వతి (కవి వాక్కు), "అప్రయుక్తము" మొదలయిన పదిహేడు దోషాలను, "అపార్థము" మొదలయిన పద్దెనిమిది అర్థ దోషాలను హరిస్తుంది. సహృదయ కవిలోకానికి పరమ ఆనందదాయకమవుతుంది, గంగా తరంగాలవలె అడ్డులేని గతితో, ఈ సంసారమను మరుస్థలిలో తిరుగాడి బాధపడువారికి

శివభక్తిరూపకమయిన ఆత్మజ్ఞానాన్ని ఇచ్చి పరమ తృప్తిని కలిగిస్తాయి. క్షణకాలముపాటు పరమశివుని మనస్సులో నిలుపుటకు జగద్ధారుడను పేరుగల కవి వాక్కు సమర్థమగును. (జగద్ధారుడను పేరుగల వాక్కులు పరమశివుని క్షణకాలముపాటు మనస్సులో వశము చేయుటకు సమర్థములు అని భావము).

**విశేషాలు :**

1. ఈ శ్లోకంలో ఉపమాలంకారము ప్రత్యక్షంగా లేదు కాని శబ్దశక్తి ద్వార ఉపమ ధ్వనిస్తోంది.

2. ఈ శ్లోకంలోని మొదటి పదము "హ్లాద" ఆనంద దాయకమైన శబ్దము.

3. మమ్మటాచార్యుడు కూడా తన కావ్యప్రకాశములో కూడా సరస్వతీదేవిని ప్రార్థిస్తూ **"హ్లాదైకమయీ"** అని ప్రయోగించాడు.

4. పదదోషములు 17 : అప్రయుక్తము, అపుష్టార్థము, అసమర్థము, నిరర్థకము, నేయార్థము, చ్యుతసంస్కారము, సందిగ్ధము, అప్రయోజకము, క్లిష్టము, గూఢార్థకము, గ్రామ్యము మొ.వి.

5. అర్థ దోషాలు 18 : అపార్థము, వ్యర్థము, ఏకార్థము, సంశయము, అపక్రమము, భిన్నము, అతిమాత్రము, పరుషము, విరసము, హీనోపమము, అధికోపమము, అప్రసిద్ధోపమము, హేతుశూన్యము, నిరలంకృతి, అశ్లీలము, విరుద్ధము, సహచరము (ఇది విచార్యము), చ్యుతము (ఇది విచార్యము). (18) (వీనినే అర్థగతములందురు)

6. ఈ శ్లోకంలో సరస్వతీ మొదలయిన పదాలలో శ్లేషాలంకారముంది.

7. శ్లేషకు సంబంధించి కాదంబరి రచించిన బాణ భట్టు కథ సుప్రసిద్ధమైనది. బాణభట్టు విలాసపురుషుడు. అతను ఒకసారి రాజుగారి ఆస్థానానికి వెళ్లాడు. అక్కడ ఉన్న కవిపండితులు రాజువైపు చూసి 'అదిగో భుజంగుడు వచ్చా'డని చెప్పారట. భుజంగం అంటే పాము, వేశ్యాలంపటుడు అని అర్థాలు.

బాణుడు. **'కా మే భుజంగతా'** అన్నాడు. ఈ వాక్యంలో నాలుగు రకాల అర్థాలు వస్తాయి.

కా – ఎక్కడ, 'మే' – నాయందు, 'భుజంగతా' – కాముక లక్షణం. 'ఆ విట లక్షణం నాలో ఎక్కడ ఉన్నది?! నన్ను పట్టుకుని విటునితో పోలుస్తారేమిటి!'.

'కామే' – కాముకుడిలో, 'భుజంగతా' – ఆ భుజంగత్వం – తిరుగుబోతు తనం ఉంటుంది కాని నాలో కాదు.

'కా మే భుజం గతా' కా – ఎవరు, 'మే' – నా, 'భుజం – భుజాన్ని గతా – అనుసరించి లేరు కదా' ఎవ్వరూ లేరు ఒక్కడనే వచ్చాను కదా!

'కా' – ఎవరయితే ఆ స్త్రీ ఉన్నదో ఆమె (సరస్వతి) 'మే' – నా యొక్క, 'భుజం' – భుజాన్ని. 'గతా' – అనుసరించి వచ్చినది కదా. నేను మాములు కవిని కాదు. సరస్వతి నన్ను అనుసరించి వస్తుంది. ఇలా నాలుగు అర్థాలు వచ్చేటట్లు మాట్లాడటం శ్లేషవల్లే సాధ్యమవుతుంది. శ్లేషలోని ఆ అందాన్ని సరస్వతీపదంలో జగద్ధారుడు ఉపయోగించు కొన్నాడు.

8. స్తుతి కుసుమాంజలి'లో మొత్తం ముప్పై తొమ్మిది అధ్యాయాలు ఉన్నాయి.

9. వాసవదత్త, వేణీసంహారము మొదలయిన నాటకాలకు కూడా జగద్ధారుడు వ్యాఖ్యాతగా ప్రసిద్ధి.

10. సరస్వతీనది మిగిలిన నదుల ఔన్నత్యమునూ, గొప్పతనాన్ని కనుమరుగు చేస్తుందని వేదాలలో ప్రసిద్ధి. ఇస్రో అందించిన ఉపగ్రహ ఛాయాచిత్రాల ఆధారంగా సరస్వతీ నది హిమాలయాల్లో పుట్టి హర్యానా, రాజస్థాన్, గుజరాత్ రాష్ట్రాల గుండా ప్రవహించి కచ్ సింధుశాఖ (రాన్ ఆఫ్ కఛ్) వద్ద అరేబియా సముద్రంలో కలుస్తుంది (వికిపీడియా సౌజన్యము).

11. **సరః ప్రసరణం సర్వత్ర అస్తీతి సరస్వతీ** – అంతటా వ్యాపించి ఉండేది సరస్వతి. ఆ సరస్వతి గొప్పతనాన్ని శివపరంగా మనోహరంగా చెప్పిన కవి అభినందనీయుడు.

## 77

రాజానక జయద్రథుడు రచించిన **'హరచరితచింతామణి'** కావ్యములో మొదటి శ్లోకము.

**శ్లో॥ నానాప్రకారసంసార –**
**ప్రకాశన విశారదః ।**
**క్రీడన్విచిత్రైరాకారై –**
**ర్జయత్యేకో మహేశ్వరః ॥**



**ప్రతిపదార్థము :** ఏకః = ఒక్కడయిన; మహేశ్వరః = పరమేశ్వరుడు; నానాప్రకార =

అనేక విధములుగా ఉన్న; సంసార = లోకములను; ప్రకాశన = ప్రకాశింపచేయుటలో; విశారదః = నేర్పరి; క్రీడన్ = ఆ లోకములలో క్రీడించుచూ; చిత్రైరాకారైః = చిత్రములైన ఆకారములతో; జయతి = జయించుచున్నాడు.

**తాత్పర్యము :** ఒక్కడయిన పరమేశ్వరుడు అనేక విధములుగా ఉన్న లోకములను ప్రకాశింపచేయుటలో నేర్పరి. ఆ లోకములలో క్రీడించుచూ చిత్రములైన ఆకారములతో ( ఈ లోకంలో ఉన్న రూపాలన్నీ శివునివే అని భావం) జయించుచున్నాడు.

**విశేషాలు :**

1. ఒక్కడయిన పరమేశ్వరుడు అనేక విధములుగా ఉన్న లోకములను ప్రకాశింప చేయుటలో నేర్పరి అని జయద్రథుని వాక్యం. అనేకులు అనేక లోకాలను సృష్టించటంలో గొప్పతనం లేదు. ఒక్కడు అనేక విధములుగా ఉన్న లోకములను ప్రకాశింపచేసాడని చెప్పుటలో కవి ప్రతిభ ఉంది.

2. ఒక్కడు అనేకులు చేసే పనిని ఎలా చేస్తాడు? అని విరోధము. ఆ ఒక్కడు పరమాత్ముడు కనుక ఆయనకు సాధ్యమే అను అర్థముచే విరోధము పరహరించబడుచున్నాడు కాబట్టి **విరోధాభాసాలంకారము**

3. **ఏకమేవాఽద్వితీయమ్** (ఛాందోగ్యోపనిషత్ 6.2.1) ‘పరమాత్మ తత్త్వము ఒక్కటే; తనకు భిన్నముగా రెండవది లేదు అను ఉపనిషద్వాక్యము కవి ప్రయోగించిన ఏకః పదమును సమర్థించుచున్నది.

4. పుట్టుక, ఎదుగుదల, వార్ధక్యం, దుఃఖం, మరణం, తిరిగి పుట్టడం అనే చక్రం అలా ఎప్పటికీ తిరుగుతుండటమే సంసారం. పుట్టడం, గిట్టడం, బంధాలను, అనుబంధాలను వదలక, కష్టాల లంపటంలో కూరుకొనిపోవడం అనే సంఘటనల నుంచి బయటపడటం సంసారమోక్షం. సంసారమునకు ప్రపంచమని ఇంకొక పేరు. ఈ రెండు అర్థములలోను ఈ శ్లోకమున సంసారపదము వాడబడినది.

5. **విశిష్టా శారదా అస్యేతి విశారదః** – అధికమైన సరస్వతి కలవాడు విశారదుడు. లోకములను ప్రకాశింపచేయువర్ణనలో స్థితికారునిగా శివుడు వర్ణించబడ్డాడు.

6. కుండకి కుమ్మరి నిమిత్త కారణం. అట్లాగే విశ్వానికి దేవుడు. యిక్కడ కార్యకారణ సంబంధమే పనిచేసింది. ఇదంతా దేవుని క్రీడ. అందుకే క్రీడాశబ్దము శ్లోకంలో ప్రయోగించబడింది.

7. ఉత్తమం సహజావస్థా ద్వితీయం ధ్యానధారణా ।
తృతీయా ప్రతిమా పూజా హోమయాత్రా చతుర్థికా ॥ – శివపురాణం

8. ఆ లీలావినోదమూర్తి అయిన భగవంతుని తనలో ప్రత్యక్షం (ఆత్మదర్శనం) చేసుకోవడం ఉత్తమమయిన మొదటి పద్ధతి. ఆయనను గురించిన జ్ఞానము, ధారణ రెండవ పద్ధతి. మూడవది స్వామి విగ్రహాలను పూజించడం. నాలుగవది తీర్థయాత్రలను చూడటం. భగవంతుని తనలో ప్రత్యక్షం (ఆత్మదర్శనం) చేసుకోవడమనే ఉత్తమమయిన మొదటి పద్ధతిలో ఈ శ్లోకం ప్రయాణం చేసింది. ఆ స్వామి లీలావినోదాన్ని అనుభవించిన మనస్సు భౌతికప్రపంచములో చిత్రమయిన అకారములతో ఉన్న స్వామిని తనలో దర్శింపచేసుకోవటానికి ప్రయత్నించింది.

9. కావ్యమాల పరంపర (సిరీస్) లో భాగంగా 61 వ ప్రచురణ ఈ **హరచరితచింతామణి**.

10. శివునికి సంబంధించిన దక్షయజ్ఞము, శివరాత్రి ... ఇలాంటి వన్నీ ఈ కావ్యంలో ఉన్నాయి. దురదృష్టవశాత్తు 32 విభాగాలు మాత్రమే ప్రచురింపబడ్డాయి. ఆ తరువాత గ్రంథభాగాలు తమకు లభించలేదని ప్రచురణకర్తలు వ్రాసారు.

11. 32 వ విభాగంలో

**భోక్తా వ్యక్తముపైతి హన్త శతధా భోగ్యం చ నానావిధమ్ ।**
**భోగ్యం భోక్తరి లీయతే యది తతో భోక్తుః స్ఫుటత్వం భవేత్ ॥**

అని ఒక శ్లోకముంది. అనుభవించువాడు (శివుడు) ప్రకాశించుచున్నాడు. అనుభవింపదగినది (లోకము) నానావిధములుగా ఉంది. అనుభవింపదగినది, అనుభవించే వానిలో కలిస్తే – (ప్రళయ కాలములో) – అనుభవించే వాని స్పష్టత్వము బాగా కనబడుతుంది. అనుభవించేవాడు, అనుభవింపబడేది ఒకటే అనే అద్వైతము చక్కగా ప్రతిపాదింపబడింది.

12. తనగ్రంథంలోని విభాగాలకు "ప్రకాశము" అని కవి పేరు పెట్టుకొన్నాడు. నాందీలోని ప్రకాశ శబ్దం ద్వారా కవి విభాగ నామ సూచన చేసాడు. ❀

## 78

సంకుపాల నృసింహకవి **కవికర్ణరసాయనము** లోని శివస్తుతి.

**ముకుటాగ్రస్థిత చంద్ర చంద్రిక సదా ముంపం బ్రభావంబెఱుం**
**గక శశ్వత్పరిరంభణావితత సౌఖ్య స్నిగ్ధుడై జాయబా**
**యక లీలాపరుడైన శంకరుడు నిత్య ప్రీతి సంధించుతన్**
**సకలాహ్లాదముగా మదీయకృతికిన్శబ్దార్థదాంపత్యమున్.**

**ప్రతిపదార్థము :** ముకుటాగ్రస్థిత = ముకుట + అగ్రస్థిత = కిరీటము యొక్క చివర ఉన్న; చంద్ర చంద్రిక = చంద్రుని యొక్క వెన్నెల; సదా = ఎప్పుడూ; ముంపన్ = ముంచగా; ప్రభావంబెఱుంగక = ప్రభావంబు + ఎఱుంగక = ప్రభావము చూపబడుటను తెలియక; శశ్వత్ = మఱల, మాటిమాటికి; పరిరంభణావితత = పరిరంభణ + ఆవితత = ఆలింగనముచే విస్తరించిన; సౌఖ్య స్నిగ్ధుడై = సుఖముచేత స్నేహముగలవాడై (సౌఖ్యము మూడు రకాలు: 1. ఆంగికము, 2. వాచికము, 3. మానసికము); జాయబాయక = జాయన్ + పాయక = భార్యను విడువక; లీలాపరుడైన = లీలాపరుడు + అయిన = శృంగారచేష్టలలో నిమగ్నుడయిన; శంకరుడు = పరమశివుడు; నిత్యప్రీతి = నిత్య సంతోషాన్ని; మదీయ కృతికిన్ = నా ఈ గ్రంథమునకు; సకలాహ్లాదముగా = సకల + ఆహ్లాదముగా = సర్వవిషయములలో సంతోషమునిచ్చి; శబ్దార్థ దాంపత్యమున్ = శబ్ద + అర్థ దాంపత్యమున్ = శబ్దము, అర్థముయొక్క ద్వంద్వ భావమును; సంధించుతన్ = కూర్చుత.

**తాత్పర్యము :** కిరీటము యొక్క చివర ఉన్న చంద్రుని యొక్క వెన్నెల ఆ శివుని ఎప్పుడూ ముంచివేస్తోంది. తనలో శృంగారభావాలకు కారణము ఆ వెన్నెల ప్రభావము అనే విషయాన్ని శంకరుడు గమనించలేదు. భార్యను విడువక శృంగారచేష్టలలో నిమగ్నుడయ్యాడు శంకరుడు. అలా మాటిమాటికి శబ్దము, అర్థముల్లా కలిసిపోయిన ఆ శివపార్వతులు – తన కావ్యములో కూడా చక్కటి శబ్దార్థ సమ్మేళనము, ఆహ్లాదకరముగా ఇవ్వాలని సంకుసాల నృసింహకవి కోరుతున్నాడు.

**విశేషాలు :**

1. మాంధాతృ రావణుల మధ్య యుద్ధము జరుగుతుంటే శివుడు వచ్చి యుద్ధాన్ని మాన్పిస్తాడు ఈ కావ్యంలో. కావ్యంలో ప్రస్తావించిన శివుని నాందీ పద్యాలలో తలుచుకొన్నాడు కవి.

2. వరద నీరు విపరీతంగా వచ్చి ఒక ప్రదేశాన్ని కప్పివేయటం ముంపు. (inundation) వెన్నెల అలా శివుడిని కప్పివేస్తుందని కవి చెప్పటం అందమయిన ఊహ.

3. సంకుపాల నృసింహకవి కవికర్ణరసాయనమునకు ఇంకొక పేరు మాంధాతృ చరిత్రము.

4. రాయల అశ్రయము దొరకక పద్యాలు అమ్ముకొన్న ప్రాచీనకవిగా ఇతనిని చెబుతారు. కృష్ణదేవరాయల కూతురైన మోహనాంగి

ఒత్తుకొనివచ్చుకటికుచోద్వృత్తి జూచి
తరుణితనుమధ్యమెచటికో తలగి పోయె
నుండె నేనియు గనబడకున్నె యహహా!
యుద్ధతులమధ్యమున బేదకుండ దరమె?

(కవికర్ణరసాయనము మూడవ ఆశ్వాసము 26వ పద్యము)

అను పద్యాన్ని తండ్రిగారి దగ్గర చదివినట్లుగా సాహిత్యంలో ప్రసిద్ధి.

5. ఒత్తుకొనివచ్చు... పద్యం చిత్రకారులు మాంధాతకు విమలాంగి అను కథానాయికను వర్ణించిన సందర్భంలో వస్తుంది. యతిని శృంగారిగా చేసే పద్యాలలో ఇది ఒకటి.

6. కవికర్ణరసాయనము పంచమాశ్వాసములో వసిష్ఠుడు, మాంధాతకు చేసిన ఉపదేశములో వైరాగ్య వర్ణనలు విన్న తర్వాత విటుడు యతి అవుతాడు. ఒక పద్యము ఉదాహరిస్తాను. 05-106

ఎవ్వండ? నెందుండి యెచటికేమిటికి నే, బద్ధుడనైతి నే బంధనమున?
గారణం బెయ్యది? కాదు కారణమెద్ది? యెద్ది కారణజన్య? మేది కాదు
ధర్మ మేదేది? యధర్మంబు నేదిప్పు? డెందు వర్తించెద? నెందు నిలువ
నేది కృత్య? మకృత్యమెయ్యది? గుణసంవిశిష్ట మెయ్యది? దోషజుష్టమెద్ది?
యను వివేకంబు లేక ప్రాయమున గ్రొవ్వి, పశువువోలె శిశ్నోదర పరుడు నరుడు
సంచరించుచు నజ్ఞాన సంభవంబు, నధికతరమైన దుఃఖముననుభవించు

ఈ పద్యములో "కొవ్వి", "పశువువోలె శిశ్నోదర పరుడు నరుడు" అను పద బంధాలు కలుక్కుమనిపించి, ఆలోచింపచేస్తాయి.

7. ఈ కావ్యంలో యవనాశ్వుడు తన కొడుకు మాంధాతకు రాజనీతిని బోధించే సందర్భంలో చెప్పిన ఈ పద్యం నాకు చాలా ఇష్టమైనది. (02-08)

**కా కేమి తన్ను దిట్టెనె? కోకిల తన కేమి ధనము కో కొమ్మనెనే?**
**లోకము పగయగు బరుసని/వాకున జుట్టమగు మధురవాక్యమువలనన్**

8. లోకము పరుషవాక్కులచేత శత్రువవుతుంది. మధురమయిన వాక్యములచేత చుట్టమవుతుంది. నాందీపద్యముకూడా ఈ మధుర గుణముతో నిండి ఉంది. శబ్దము, అర్థముల్లా కలిసిపోయిన ఆ శివపార్వతులు– తన కావ్యములో కూడా చక్కటి శబ్దార్థ సమ్మేళనము, ఆహ్లాదకరముగా ఇవ్వాలని కోరుకోవటంలో ఎంతో ఔచిత్యముంది. ❁

## 79

వినుకొండ వల్లభరాయని **క్రీడాభిరామము** లోని శివస్తుతి.

**అంబుర సీమ దారలు జటాటవి మల్లెవిరుల్ భుజాంతరా**
**ళంబు నహార్య సంత తులిలాస్థలి బువ్వుల వర్షముల్ ప్రసూ**
**నంబులు సత్కృతాంజలిననందగి మౌక్తికతుల్యమౌళి గం**
**గాంబుకణంబులుట్టిపడ నాడెడు శంభుడు మిమ్ము బ్రోవుతన్.**

**ప్రతిపదార్థము :** అంబుర సీమన్ = ఆకాశ ప్రదేశములోని; తారలు = నక్షత్రములు; జటాటవి = శివుని జడలు కట్టిన వెంట్రుకలనెడి అడవిలో; మల్లెవిరుల్ = మల్లెపూలు; అహార్య = హరింపనశక్యమైన; సంతతులిలాస్థలిన్ = ఎప్పుడూ చలించుచుండే స్థలమయిన; భుజాంతరాళంబు = శివుని వక్షస్థలములో; పువ్వుల వర్షముల్ = పువ్వుల వానలు; ప్రసూనంబులు = పూలు; సత్కృతాంజలిన్ = సత్కృత + అంజలిన్ = సత్కరింపబడిన దోసిలి (నమస్కారము); అనందగి = అనన్ + తగి = అనుటకు తగినదైన; మౌక్తిక తుల్య = ముత్యములతో సమానములైన; మౌళి = శివుని కొప్పుపై (కిరీటముపై); గంగాంబుకణంబుల్ = గంగ + అంబుకనంబుల్ = గంగానది జలములు; ఉట్టి పడన్ = స్పష్టముగా తోచుచుండగా; ఆడెడు = తాండవనృత్యము ఆడు; శంభుడు = శివుడు; మిమ్ము బ్రోవుతన్ = మిమ్మలని రక్షించుగాక!

**తాత్పర్యము :** శివుడు అంతెత్తున తాండవ నృత్యము చేస్తున్న సమయములో ఎగసి పడుతున్నప్పుడు ఆ గంగానది జలములు ఆకాశములోని నక్షత్రములు అవుతున్నాయి. శివుని జడలు కట్టిన వెంట్రుకలనెడి అడవిలో మల్లెపూలులా ఆ గంగానది జలములు మెరుస్తున్నాయి. శివునివక్షస్థలముపై ఆ గంగానది జలములు పువ్వుల వానలు అవుతున్నాయి. వేదము చదువునప్పుడు శిష్యుఁడు భక్తితో పట్టు దోసిలిలా (బ్రహ్మాంజలి)

ఆ గంగానది జలములు ఉన్నాయి. ముత్యములతో సమానములైన గంగానది జలములు కొప్పుపై (కిరీటముపై) స్పష్టముగా తోచుచుండగా తాండవనృత్యము ఆడు శివుడు మిమ్మలిని రక్షించుగాక!

**విశేషాలు :**

1. క్రీడాభిరామ కావ్యకర్త శ్రీనాథుడని, వినుకొండ వల్లభరాయడని భిన్నాభిప్రాయా లున్నాయి. మానవల్లి రామకృష్ణ కవి గారు క్రీడాభిరామం వినుకొండ వల్లభామాత్యునిదిగా పరిగణించారు. క్రీడాభిరామమునకు నాందీ పద్యము లేదు కాబట్టి అధర్వణుడు వ్రాసిన భారతవిరాటపర్వములోని ఆదిపద్యాన్ని ఈ క్రీడాభిరామకావ్యానికి నాందీ పద్యంగా స్వీకరించారు.

2. క్రీడాభిరామములో కాకతీయ ప్రతాపరుద్రుని కాలములో ఓరుగంటిపట్టణము యొక్క వైభవమును, తద్వాస్తవ్యుల స్థితిగతులును వర్ణింపబడియున్నవి. (డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య, తెలుగు సంస్కృతి (తెలుగు విజ్ఞాన సర్వస్వము – మూడవ సంపుటము) మొత్తం 245 పద్యగద్యలతో చంపూ పద్ధతిలో చేయబడిన రచన. కాకతీయుల ఓరుగల్లు నగరం, కోట, అందులో ప్రజల వేషభాషలూ, ఆహారాలూ, అలవాట్లూ ఇందులో వర్ణించబడ్డాయి. కథానాయకులనదగిన గోవింద మంచనశర్మ, అతని అనుచరుడు అనదగిన టిట్టిభశెట్టి... వీరిరువురు నడిచే మార్గంలో చేయబడిన వర్ణనలే క్రీడాభిరామం.

3. ఆ మంత్రిశేఖరుండు రావిపాటి త్రిపురాంతకదేవుండను కవీశ్వరుం డొనరించిన ప్రేమాభిరామ నాటకంబు ననుసరించి క్రీడాభిరామం బను రూపకంబు తెనుంగుబాస రచియించినవాఁడు. అను క్రీడాభిరామ (.33) వచనము అనుసరించి క్రీడాభిరామము ప్రేమాభిరామమును అనుసరించి వ్రాయబడినది. ప్రేమము అంటే – **"ఇ" శబ్దవాచ్యో మదనో మాతి యత్ర ప్రకర్షతః/ తత్ప్రేమ త దధిష్ఠానం రతిర్యూనోః పరస్పరమ్"** అని శారదాతనయుడు భావప్రకాశికలో ఒక నిర్వచనము చేసాడు. ఆ లెక్క ప్రకారం ప్రేమము అంటే "ప్ర = అత్యుత్కర్షతో; ఇ = మన్మథుడు; మ = అతిశయంతో శోభిల్లే తావు" అని అర్థము వస్తుంది. ప్రస్తుతం ఈ ప్రేమాభిరామ కావ్యము దొరుకుట లేదు.

4. "గణన కెక్కిన దశరూపకముల యందు/వివిధ రసభావ భావన వీథి లెస్స" అని క్రీడాభిరామ కావ్యంలో ఉంది. ఈ కావ్యము వీథి రూపకానికి చెందింది. 1. నాటకము, 2. ప్రకరణము, 3. భాణము, 4. ప్రహసనము, 5. డిమము, 6. వ్యాయోగము, 7.

సమవాకారము, 8. **వీథి,** 9. అంకము, 10. ఈహామృగము. అనునవి దశరూపకములు

**నాటకం సప్రకరణం భాణః ప్రహసనం డిమః ।**

**వ్యాయోగ సమవాకారౌ వీథ్యంకేహామృగా దశ ॥** (ద.రూ. 1-8) వీథి' నాటకాన్ని ఆధునిక కాలంలోనూ వాడుతున్నారు.

5. ఆచార్య వెల్చేరు నారాయణరావు 2002లో డేవిడ్ షూల్మన్ గారితో కలిసి క్రీడాభిరామానికి *A Lover's Guide to Warangal* అని అనువాదం చేసారు.

6. క్రీడాభిరామములో ఇతరగ్రంథాలలోని అనేక శ్లోకాల అనువాదాలు ఉన్నాయి. ఉదాహరణకి "మాఘమాసంబు పులి వలె మలయుచుండఁ/ బచ్చడం బమ్ముకొన్నాఁడు పసరమునకు/ ముదిత చన్నులు పొగలేని ముర్మురములు/ చలికి నొగోయ కేలుండు సైరికుండు" అను పద్యం క్రీడాభిరామంలో ఉంది. ఈ పద్యం గాథా సప్తశతిలోనిది.

7. బుర్రకథలు ఆ కాలంలో బాగా ప్రచారంలో వున్నాయని "క్రీడాభిరామము"లోని క్రింది పద్యంవలన తెలుస్తున్నది.

ద్రుత తాళంబున వీరగుంభి తకధుం ధుం ధుం కిటాత్కార సం
గతి వాయింపుచు నాంతరాళికయతి గ్రామాభిరామంబుగా
యతి గూడం ద్విపద ప్రబంధమున వీరానీకముంబాడెనొ
క్కతి ప్రత్యక్షరముం గుమారకులు ఫీట్కారంబునదూలఁగన్.

వీరచరిత్రమును ఒకసుందరి బుర్ర కథగా పాడుచున్నది. బుర్రకథ చెప్పు వారి చేతులలో కుంచమును బోలిన యొక సాధనముంది. దానిమధ్యలో నొకత్రాడు ఉంది. దాని నిటునటు లాగుట వలన ధుం ధుం మ్మనుశబ్దము వస్తోంది. దానితో తాళానుగుణంగా పాడుచు, నడుమ నడుమ వచనములను చెబుతూ బుర్రకథలను కొంతమంది చెబుతున్నారట.

**8. తెలుగదేల యన్న దేశమ్ము తెలుగేను**
**తెలుగు నాయకుండ తెలుగొకండ**
**ఎల్ల నృపులు గొల్వ ఎరుగవా బాసాడి**
**దేశభాషలందు తెలుగు లెస్స.**

అను రాయల పద్యానికి మూలమైన పద్యము క్రీడాభిరామములో దొరుకుతుంది.

9. జనని సంస్కృతంబు సకల భాషలకును
దేశభాషలందు తెలుగు లెస్స
జగతి తల్లి కంటె సౌభాగ్య సంపద
మెచ్చుటాడుబిడ్డ మేలు కాదె.

అన్ని భాషలకు తల్లి సంస్కృతమే కావచ్చు కాని. కానీ దేశభాషలందు తెలుగు ఉన్నతమైనది. తల్లిని మించిన సౌభాగ్య సంపద కల్గిన బిడ్డ ఎంతో గొప్పది కదా.

10. ఆనాటి శృంగార పురుషుల వర్ణన ఇది

గన్నేరుఁబూచాయ గరమొప్పు నీర్కావి
మడుగు ధోవతి పింజె విడిచి కట్టి,
గొజ్జంగి పూనీరు గులికి మేదించిన
గంగ మట్టి లలాటకమున దీర్చి,
వల చేత బంగారు జలపోసనము తోడ
బ్రన్నని పట్టు తోరము ధరించి,
జరిగొన్న వెలి పట్టు జన్నిదంబులలుంగ
నంటులు వాయంగ నత వైచి,
తళుకు చెంగావి కోకయు, వలుదశిఖయు,
జిగురు బొమ్మంచు పెదవులు, చిన్ని నగవు,
నందమొందంగ వచ్చె గోవిందశర్మ!
మాధవుని పట్టి, యొసపరి మన్మథుండు;

గోవిందశర్మ లేత పసుపు రంగు గల కొంచెం మెరుపుకలిగిన (నీర్కావి) ధోవతిని గోచీబిగించి కట్టాడు. గులాబీల నీటితో గంగమట్టి తడిపి దానిని నుదుట మీద పెట్టాడు. కుడిచేతిలో జలకలశం పట్టుకున్నాడు. ఆ కుడిచేతికి పట్టుదారాన్నికట్టాడు. అయన యజ్ఞోపవీతములు జరీవలె మెరుస్తున్న తెల్లని పట్టుతో తయారు చేయబడ్డాయి. వాటి ముడులు చిక్కులుదీసి మెడలో వేసుకొన్నాడు. తళుకులీనే మనోహరమైన ఎరుపు రంగు కల ఉత్తరీయము వేసుకొన్నాడు. ఆయనది పెద్ద పిలక, చిగురుటాకులను వెక్కిరించు మెత్తని పెదవులు ఆయనవి. పెదవులమీద పారిపోని చిరునగవు.

11. ధర్మదార మోగించే పద్దతి ఆ కాలంలో ఉండేది.

మంచన! వింటివో వినవొ? మన్మథుఁడేక శిలాపురంబులో,
చంచల నేత్రలం బతుల శయ్యలపై రతికేళి రాత్రి, పో
రించి, ప్రభాతకాలము పరిస్ఫుట మైనను , ధర్మదార వ
పట్టించుచు నున్నవాఁ డదె! కుటీగత కుక్కుట కంఠ కాహళిన్.

ఒరేయ్ మంచనా! విన్నావా! ఈ ఏకశిలా నగరంలో మన్మథుడు ధర్మదారను కోడికూత రూపములో మోగిస్తున్నాడురా! అని గోవిందశర్మ అన్నాడు. సమయాన్ని తెలపటానికి, ధర్మాలను ఆచరించటానికి కాకతీయులు ఆనాడు గంటలు మోగించేవారనే ఆచారము మనకు ఈ కావ్యము ద్వారా తెలుస్తుంది.

12. ముసుగుఁ బెట్టిన నేమి? ముత్యాల కమ్మల
క్రొమ్మించు లీలలు కులుక రించె;
మోము వంచిన నేమి? మొలక నవ్వుల కాంతి
చెక్కుటద్దములపై జీరు లాడె;
జూడకుండిన నేమి? సొబగు రెప్పలమించి
తేట వాల్మెరుగులు దిచ్చరించెఁ;
జాటుజేసిన నేమి? చకవాకులఁ బోలు
పాలిండ్ల మెగులు బయట పడియె;

సిగ్గు నటియించి, మావేడ్క చిన్నబుచ్చి
యేల యిటు పిసాళించెద? దిదేమి సిద్ధి
కాము సామ్రాజ్య పట్టంబుగట్టి, నన్ను
కౌగిలింపంగ గదవె! యో కరణ కాంత!

– ఇలాంటి పద్యాలు క్రీడాభిరామములో చాలా ఉన్నాయి. ఆనాటి రసిక జీవనానికి దర్పణాలు ఈ పద్యాలు.

13. కప్పుర భోగి వంటకము, కమ్మని గోధుమ పిండివంటలున్,
గుప్పెడు పంచదారయును, గ్రొత్తగ గాచిన యాలనే ర్పెస
పప్పును, కొమ్ము నల్లనఁటి పండ్లును, నాలుగు నైదు నంజులున్,
లప్పల తోడఉగ్రొంబెరుగు ,లక్ష్మణ వజల యింట రూక కున్.

పూటకూటింట దొరికే ఆనాటి భోజనము ఇది. కప్పుర భోగి బియ్యముతో

వండిన తెల్లని సన్న అన్నము. గోధుమతో చేసిన పిండి వంటలు. గుప్పెడంత పంచదార, అప్పుడే కాచిన ఆవునేయి, పెసర పప్పు, నల్లటి కొమ్మరచిపండ్లు, నాలుగైదు పచ్చళ్ళు, మట్టి ముంతలలో కాచి తోడుబెట్టిన కమ్మని పెరుగు, ఇదీ ఆనాడు కాకతీయుల కాలములో ఒకరూకకు దొరికే భోజనము.

14. నాందీ పద్యములోని గంగాజలాల కాంతులు ఈ క్రీడాభిరామములో చాలాచోట్ల ప్రసరించాయి. ❀

## 80

అప్పయదీక్షితుల **కువలయానందము**లోని నాందీ శ్లోకము.

**శ్లో॥ పరస్పరతపస్సంపత్ఫలాయితపరస్పరౌ ।**
**ప్రపంచమాతాపితరౌ ప్రాంచౌ జాయాపతీ స్తుమః ॥**

**ప్రతిపదార్థము :** పరస్పర = ఒకరికొకరు; తపస్సంపత్ఫలాయిత పరస్పరౌ = తపః + సంపత్ + ఫలాయితపరస్పరౌ = తపస్సు అను ఐశ్వర్యముచేత పరస్పర ఫలితము పొందినవారు; ప్రపంచ = ప్రపంచములకు; మాతాపితరౌ = తల్లిదండ్రులు; ప్రాంచౌ = ప్రాచీనమయిన; జాయాపతీ = ఆ ఆలుమగలను; స్తుమః = పొగిడెదము.

**భావము :** ప్రపంచములకు తల్లిదండ్రులయిన, ఆదిదంపతులయిన, ఒకరి తపస్సుకు ఇంకొకరు ఫలమయిన పార్వతీపరమేశ్వరులను, పొగిడెదము.

**విశేషాలు :**

1. మన్మథుని శివుడు భస్మం చేసిన తరువాత పార్వతీదేవి తాను కోరుకున్న భర్త దొరకనందుకు బాధపడి, సర్వ కోర్కెల సాధనకు తపస్సే ప్రధాన సాధనమని భావించింది. తల్లిదండ్రుల అనుమతి తీసుకొని వెయ్యేళ్ళపాటు తీవ్ర తపమాచరించింది. బ్రహ్మచారి వేషంలో శివుడు వచ్చి పార్వతి తపస్సు యొక్క గొప్పతనాన్ని లోకానికి చెప్పాలనుకొన్నాడు. పార్వతీదేవి చెలికత్తెలతో ఆశ్రమ పరిసరాలలో ఉన్న మడుగులో కావాలని జారి పడ్డాడు. చెలికత్తెలు కొందరు మడుగు ఒడ్డుకువచ్చి ఆయనను పైకిలాగటానికి ప్రయత్నం చేస్తూ తమ చేతులను చాచారు. బ్రహ్మచారి పార్వతి రావాలన్నాడు. పార్వతి వచ్చి ఎడమచేతిని చాచి రక్షించ బోయింది. రక్షించదలచుకుంటే పవిత్రమైన కుడిచేతిని మాత్రమే ఇచ్చి రక్షించమని బ్రహ్మచారి నియమం పెట్టాడు. వెంటనే తన కుడిచేతిని (వివాహ యోగ్యమైనది) బ్రహ్మచారి చేతికి అందించి ఆయనను పైకిలాగి రక్షించింది. తన

కుడిచేతిని శివునికి కాకుండా ఇతరులకు తాకించినందుకు ప్రతిఫలంగా యోగాగ్నిలో పార్వతి దగ్ధం కావటానికి నిశ్చయించుకొనబోగా శివుడు మాటలలో పెట్టి ఆవిడని ఆ ప్రయత్నం నుంచి విరమింపచేస్తాడు. ఆ తరువాత శివపార్వతుల కల్యాణం. (స్కంధ పురాణం ఇరవై అయిదో అధ్యాయంలో శ్రీమహాదేవ వైవాహికోత్సవం) ఇది పార్వతి తపస్సుకు శివుడు లభించిన విధానమును తెలిపే కథ.

2. కాళిదాసు కుమారసంభవంలో శివుడు పార్వతితో ఇలా అంటాడు. "నీ తపస్సు చేత కొనబడిన వాడినయ్యాను" (తవాస్మి దాసః క్రీతస్తపోభిః పంచమసర్గ - 86 శ్లోకం) అప్పయదీక్షితులు "పార్వతి తపస్సుకు ఫలము శివుడు" అన్నాడు మన నాందీ శ్లోకంలో. రెండు వాక్యాలు ఒకటేనా? పార్వతీదేవికి శివుడు తపస్సువలన లభించాడు. ఈరెండు వాక్యాల ఫలితాంశము ఇదే. కాని చెప్పే విధానములో తేడా ఉంది.

3. తపస్సు యొక్క గొప్పతనాన్ని తెలియ చేస్తూ మహాభారతం అశ్వమేధ పర్వంలో ఈ శ్లోకాలున్నాయి. తపసశ్చానుపూర్వ్యేణ ఫలమూలాశినస్తథా । త్రైలోక్యం తపసా సిద్ధాః పశ్యంతీహ సమాహితాః ॥ 14-51-15; ఔషధాన్యగదాదీని నానావిద్యాశ్చ సర్వశః । తపసైవ ప్రసిద్ధ్యంతి తపోమూలం హి సాధనమ్ ॥ 14-51-16; యద్దురాపం దురాంనాయం దురాధర్షం దురన్వయం । తత్సర్వం తపసా సాధ్యం తపో హి దురతిక్రమమ్ ॥ 14-51-17; సురాపో బ్రహ్మహా స్తేనో భ్రూణహాగురుతల్పగః । తపసైవ సుతప్తేన ముచ్యంతే కిల్బిషాత్తతః ॥ 14-51-18; మనుష్యాః పితరో దేవాః పశవో మృగపక్షిణః । యాని చాన్యాని భూతాని చరాణి స్థావరాణి చ ॥ 14-51-19; తపఃపరాయణా నిత్యం సిద్ధ్యంతే తపసా సదా । తథైవ తపసా దేవా మహాభాగా దివం గతాః ॥ 14-51-20.

4. తపస్సు వల్ల ఏదైనా సాధించవచ్చు. తపస్సుకు సాధ్యము కానిది లేదు అని వాటి అర్థం.

5. శివుడు తపస్సు చేసిన వారికి కోరిన కోర్కెలు ఇచ్చేవాడు. అయినా ఆయన కూడా హిమాలయాలలో తపస్సు చేసాడు. "కేనాపి కామేన తపశ్చచార" (కుమారసంభవం 01-57) ఏదో కోరికతో శివుడు తపస్సు చేసాడని కాళిదాసు అన్నాడు. ఆ కోరికేమిటో చెప్పలేదు. పార్వతిని వివాహము చేసుకొనుటయే ఆ కోరిక అని అప్పయదీక్షితుల వారు వివరించారు. అందుకే మనవాళ్లు మహానుభావులు వ్రాసిన ఒక పుస్తకంలోని చిక్కుముడి ఇంకో పుస్తకంలో విడుతుందంటారు.

6. శివయ్య పార్వతమ్మ కోసం తపస్సు చేసి ఫలితం పొందాడు. పార్వతి శివుని కోసం తపస్సు చేసి ఫలితం పొందిందని దీక్షితుల వారంటే" కాముకులందు మేసగము కాంతకునిచ్చెను శంకరుండె ని/ష్కాముకులలోన పంచశర శాసకుకన్న పరుండు గల్గడు" (ఏనుగు లక్ష్మణ కవి వైరాగ్య శతకము) అని ఏనుగు లక్ష్మణకవి కితాబు. కాముకులలో తన శరీరములో సగము కాంతకు ఇచ్చిన శివునికంటె గొప్పవాడు లేడు. అలాగే నిష్కాముకులలో మన్మథుని శాసించిన శివునికంటె గొప్పవాడు లేదు.

7. **అయ్య "శివ". అమ్మ "శివా"**. అమ్మలో ఆ దీర్ఘము ఎందుకంటె వాత్సల్యము అధికముగా ఉండటం చేత అని పెద్దలు అన్నారు.

8. శివతత్త్వము వ్యాఖ్యానాలకు అందనిది. అనుభూతికి మాత్రమే అందేది. దానిని అప్పయదీక్షితులు వంటి వారు మాత్రమే ఇటువంటి నాందీ శ్లోకాలలో వర్ణించగలరు.

## 81

**శివగీత** లోని నాందీ శ్లోకము

**శ్లో॥ అథాతః సంప్రవక్ష్యామి**
**శుద్ధం కైవల్యముక్తిదమ్ ।**
**అనుగ్రహాన్మహేశస్య**
**భవదుఃఖస్య భేషజమ్ ॥**



**ప్రతిపదార్థము :** అథ = అటుపిమ్మట; అతః = ఇకనుంచి; శుద్ధమ్ = పరిశుద్ధమైన; కైవల్య = కైవల్య రూపమయిన; ముక్తిదమ్ = మోక్షమును ఇచ్చు; భవ దుఃఖస్య = సంసార సంబంధ దుఃఖమునకు; భేషజమ్ = ఔషధమైన; మహేశస్య = ఈశ్వరునియొక్క; అనుగ్రహాత్ = అనుగ్రహమువల్ల; సంప్రవక్ష్యామి = చెబుతాను.

**తాత్పర్యము :** అటుపిమ్మట ఇకనుంచి పరిశుద్ధమైన కైవల్యరూపమయిన మోక్షమును ఇచ్చు సంసార సంబంధ దుఃఖమునకు ఔషధమైన ఈశ్వరునియొక్క అనుగ్రహమువల్ల ఈ శివగీత చెబుతాను.

**విశేషాలు :**

1. శ్రీకారంతో పుస్తకం ప్రారంభించడం శుభప్రదమని భావించడం తెలిసిన సంగతే.

2. "అథ" శబ్దం కూడా అటువంటిదే అని పండితుల భావన.

3. ప్రస్థానత్రయంలో (ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రాలు) ఒకటైన బ్రహ్మ సూత్రాలలో మొదటి సూత్రం అథ శబ్దంతో ప్రారంభమవుతుంది. (అథాతో బ్రహ్మ జిజ్ఞాసా)

4. పూర్వము దండకారణ్యములో శివుడు – రామునికి ఈ శివగీతను చెప్పాడు. ఈ శివగీతకు ఇంకొక పేరు శివరాఘవసంవాదము. మొత్తం 16 అధ్యాయాలు.

5. పద్మపురాణములోని ఉత్తరఖండంలో ఈ శివగీత ఉంది.

6. భిషజ్యతి భిషక్. భిష జ్ చికిత్సాయాం. చికిత్స చేయు వైద్యుడిని "భిషక్" అంటారు. దేనిచేత చికిత్స చేస్తారో అది భేషజము. (ఔషధము). అయితే వంచన, డంబాచారము – ఇలాంటి అర్థాలలో "భేషజ" పదము ఆధునిక కాలములో వాడుతున్నారు.

7. కైవల్యము, ముక్తి – ఈ రెండూ మోక్షముయొక్క పేర్లయినప్పటికీ రెండింటిలో కొంచెం అర్థ భేదముంది.

8. శరీరేంద్రియముల వలన ఆత్మ విడువబడుట ముక్తి. ఆత్మను సంసారబంధము వలన విడిపించునది ముక్తి.

9. శరీరేంద్రియములతో విడువబడిన ఆత్మ అద్వితీయమై ఉండుట కైవల్యం. అందుకే **"కైవల్యముక్తిదమ్"** అను పదద్వయ ప్రయోగము ఈ శ్లోకములో జరిగింది. ముక్తి వలన శోక విముక్తి జరుగుతుంది. కైవల్యమువల్ల ఆనంద ప్రాప్తి జరుగుతుంది. శోక విముక్తి, ఆనందప్రాప్తి **శివగీత** చదువుట వలన లభిస్తాయని ఫలితాంశం.

10. 1. నిత్యానిత్య వివేకము, 2. వైరాగ్యము, 3. శమాదిషట్కము, 4. ముముక్షత్వము మొదలైనవి సంసార సంబంధ దుఃఖమును పోగొడతాయి.

11. "ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా
మహాభయకృతత్రాణపరాణామేవ జాయతే"

ఈశ్వరానుగ్రహము ఉంటేనే కాని అద్వైతవాసన రాదు. అందుచేత ఆ ఈశ్వరునే – ఆ చంద్రమౌళీశ్వరుని పాదాబ్జములనే మనము అద్వైతసిద్ధి కొరకు నమ్ముకోవాలి (అప్పయదీక్షితులు శివతత్త్వవిలాసము) అందుకే – ఈ శివగీతలో కూడా ఈశ్వరానుగ్రహము ప్రస్తావించారు.

12. అగస్త్యగీతా, అనుగీతా, అవధూతగీతా, అష్టావక్రగీతా, ఈశ్వరగీతా (కూర్మపురాణాన్తర్గతా) ఉతథ్యగీతా, ఉత్తరగీతా, ఉద్ధవగీతా, ఋభుగీతా, ఋషభగీతా ఐలగీతమ్ (భాగవతాన్తర్గతమ్), కపిలగీతా కరుణాగీతమ్, కాశ్యపగీతా, గణేశగీతా, గర్భగీతా, గాయత్రీగీతా, గీతాసూచీ, గురుగీతా, గుహగీతా, జాయన్తేయగీతా (శ్రీమద్భాగవతాన్తర్గతా), జీవన్ముక్తిగీతా, తులసీగీతా, దేవీగీతా, ధర్మవ్యాధగీతా, నహుషగీతా, నారదగీతా (రామచరితమానసాన్తర్గతా), పరాశరగీతా పాణ్డవగీతా, పిఙ్గలాగీతా పితృగీతమ్ పురజనగీతా (హిన్దీ రామచరితమానససే) పృథివీగీతా, ప్రణయగీతమ్ (భాగవతాన్తర్గతమ్), బకగీతా, బిభీషణగీతా ధర్మరథగీతం చ (రామచరిత మానస), బోధ్యగీతా, బ్రహ్మగీతా (యోగవాసిష్ఠాన్తర్గతా), బ్రహ్మగీతా (స్కన్దపురాణాన్తర్గతా) బ్రాహ్మణగీతా, భగవద్గీతా, భిక్షుగీతా భూమిగీతమ్ (భాగవతాన్తర్గతమ్) భ్రమరగీతమ్ (భాగవతాన్తర్గతమ్) మఙ్కిగీతామహిషీగీతమ్ (భాగవతాన్తర్గతమ్), యమగీతా (విష్ణు, నృసింహ, అగ్నిపురాణాన్తర్గతా)। యాజ్ఞవల్క్యగీతా (మహాభారతాన్తర్గతా, యుగలగీతమ్ (శ్రీమద్భాగవతాన్తర్గతమ్), యుధిష్ఠిరగీతా, రమణగీతా, రామగీతా, రాసగీతా, రుద్రగీతమ్, రుద్రగీతా, లక్ష్మణగీతా (రామచరితమానసే), వసిష్ఠగీతా, వానరగీతా (పరాశరసంహితాన్తర్గతా), వామదేవగీతా, విచఖ్నుగీతా, విద్యాగీతా, విభీషణగీతా (అధ్యాత్మరామాయణాన్తర్గతా) వృత్రగీతా, వేణుగీతమ్ (భాగవతాన్తర్గతమ్) వైష్ణవగీతా, వ్యాసగీతా కూర్మపురాణాన్తర్గతం వ్యాసగీతా (బ్రహ్మపురాణాన్తర్గతా), శఙ్కరగీతా, శమ్పాకగీతా, శాన్తిగీతా, శివగీతా, శౌనకగీతా, శ్రుతిగీతా, షడ్జగీతా, సరస్వతీగీతా, సిద్ధగీతా, సూతగీతా, సూర్యగీతా, హంసగీతా, హంసగీతా (భాగవతపురాణాన్తర్గతా), హారీతగీతా – మొదలైన గీతలెన్నో ఉన్నాయి. వీటిలో భగవద్గీతతో పాటూ శివగీత కూడా ప్రశస్తమైనది.

13. అనేక జన్మలలో చేసుకొన్న పుణ్యమువలన ఈ జన్మలో శివునిమీద భక్తి కలుగుతుంది (కోటిజన్మార్జితైః పుణ్యైః శివే భక్తిః ప్రజాయతే – శివగీత మొదటి అధ్యాయము 16 వ శ్లోకం) మొదలైన వాక్యరత్నాలెన్నో ఈ శివగీతలో ఉన్నాయి. ❁

## 82

విశ్వనాథ **కాళహస్తిశతకము**లోని మొదటి పద్యము.

> **ఆజానుబాహువా! అప్రధృష్య! హృదంతరాపూర్ణ**
> **రాజితభక్తివశంవదా! సుశరస్థానకృత ర**
> **మాజాని! స్వర్ణముఖీతటిగేహా! మాంజిష్ఠవర్ణ!**
> **రాజిలభూష! శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ!**

**ప్రతిపదార్థము :** ఆజానుబాహువా! = మోకాళ్ళవరకు వ్రేలాడు పొడవైన చేతులు కల శివా! (వివ. దీర్ఘబాహువులు కలిగియుండుట ఉత్తమ పురుషలక్షణములలో ఒకటి. ఆజాను + బాహూ యస్య. (బహువ్రీహి సమాసము); అప్రధృష్య = ఎదుర్కొన శక్యము కానివాడా! (unconquerable); హృదంతరాపూర్ణ = హృదంతర + ఆపూర్ణ = హృదయములో పూర్తిగా నిండినవాడా!; రాజిత భక్తి వశంవదా! = ప్రకాశించు భక్తిచే లోబడువాడా!; సుశరస్థానకృత = చక్కటి బాణ స్థానముగా చేయబడిన; రమాజాని! = రమా స్వరూపమైన సీత భార్యగా కలిగిన విష్ణుమూర్తీ! (విష్ణువు బాణముగా కలిగిన వాడా అని భావము. త్రిపురాసుర సంహార సమయములో విష్ణువు – శివుని బాణమైనట్లు ప్రసిద్ధి. ); స్వర్ణముఖీతటి గేహా! = శ్రీకాళస్తీశ్వరాలయాన్ని ఆనుకొని ప్రవహిస్తున్న పవిత్ర స్వర్ణముఖీనది ఒడ్డున ఇల్లు (దేవాలయము) కలవాడా!; మాంజిష్ఠవర్ణ = మనోహరమయిన రంగు కలవాడా!; రాజిలభూష! = రెండు తలల పాము(ల)ను ఆభరణముగా కలవాడా!; శ్రీకాళహస్తీశ్వరా! = వాయులింగప్రభూ! శ్రీ (సాలెపురుగు), కాళ (పాము), హస్తి (ఏనుగు), ఈ మూడుజంతువులు శివభక్తి వలన మోక్షం పొంది శివునిలో కలసిపోయాయి. అందువలన ఇచ్చట స్వామి వారికి శ్రీకాళహస్తీశ్వరుడని అని ఈ నగరానికి శ్రీకాళహస్తి అని పేరు వచ్చాయి.; మహాదేవ! = గొప్ప దేవుడా (శివా!).

**తాత్పర్యము :** మోకాళ్ళవఱకు వ్రేలాడు పొడవైన చేతులు కల శివా! ఎదుర్కొన శక్యము కానివాడా! హృదయములో నిండినవాడా! ప్రకాశించు భక్తిచే లోబడువాడా! త్రిపురాసుర సంహార సమయములో విష్ణువుని బాణముగా కలవాడా! రమాస్వరూపమైన సీత భార్యగా కలిగినవాడా! శ్రీకాళస్తీశ్వరాలయాన్ని ఆనుకొని ప్రవహిస్తున్న పవిత్ర స్వర్ణముఖీనది ఒడ్డున ఇల్లు (దేవాలయము) కలవాడా! మనోహరమయిన రంగు కలవాడా! రెండు తలల పాము(ల)ను ఆభరణముగా కలవాడా! వాయులింగప్రభూ! శివా! (నీకు నమస్కారము).

**విశేషాలు :**

**రమాజాని :** నగజా జాని అని శివునికి పేరు. **న గచ్ఛతీతి నగః, తస్య పుత్రీతి నగజా, ఇయం జానిః యస్య స ఇతి నగజాజానిః.** నగజాజాని అంటే శివుడు. ఆడుదానికి భార్య ఉండదు గనుక ఇక్కడ బహువ్రీహి సమాసము మాత్రమే సాధ్యమని చెప్పారు. జానకీజాని అని శ్రీరామునికి పేరు. ఇక్కడ రమాజాని అని విశ్వనాథ ప్రయోగం. త్రిపురాసుర సంహార సమయములో లక్ష్మీదేవి స్తనములపై ఉన్న గంధము అంటుకొన్న వక్షస్థలము కల విష్ణువును బాణముగా చేసుకొన్నవాడా అని శ్రీనాథుని శివసంబోధన. (**"శ్రీ స్తన గంధసార పరిషేక సమంచిత సాయక ప్రయోగాస్త మహా పురత్రాయు"** – భీమేశ్వర పురాణము నాందీ పద్యము).

**హృదంతర :** ఈ హృదంతర పద ప్రయోగము విశ్వనాథ ఆంధ్రప్రశస్తిలో చాల పేరు పొందింది. **"ఇమ్ముగకాకుళమ్ము మొదలీవరకుంగల యాంధ్రపూర్వరా/జ్యమ్ములపేరు చెప్పిన హృదంతర మేలొ చలించిపోవు"** ఈ పద్యపాదం చాలామంది సాహితీపరుల నాలుకల మీద నడయాడుతుంటుంది.

**అప్రధృష్యుడు : "అప్రధృష్యశ్చ సంగ్రామే క్రుద్ధైరపి సురాసురైః** – యుద్ధరంగములో క్రోధముతో కూడుకొన్న దేవతలకు, రాక్షసులకు కూడా ఎదిరించటానికి శక్యము కానివాడు" (వాల్మీకి అయోధ్య. ప్రథమ 29శ్లో.) అను చోట రాములవారిని వాల్మీకి అప్రధృష్యుడు అన్నాడు. ఇక్కడ విశ్వనాథ శివునికి ఆ విశేషణము వాడాడు.

**మాంజిష్ఠ : మంజతి మనోజ్ఞే వర్ణే మంజిష్ఠా** – మనోహరమయిన వర్ణమందుండునది మాంజిష్ఠము. (అమరకోశము) ఈ అర్థములోనే భర్తృహరిశృంగార శతక ప్రయోగముంది. "హేమంతే దధి దుగ్ధ సర్పిరశనా మాంజిష్ఠ వాసో భృతః" (97వ శ్లోకం). విశ్వనాథ కూడా ఈ అర్థములోనే శివుని సంబోధించినట్లు అనిపిస్తుంది. మంజిష్ఠ అను వర్ణద్రవ్యముచే ఎరుపువన్నె అద్దబడిన గుర్రముల తలలందలి చామరముల పంక్తిలా – లోకులచేత సూర్యకాంతి చూడబడుచున్నది – (**మాంజిష్ఠీప్రష్ఠవాహావళివిధుత శిరశ్చామరాళీ ను లోకైః** సూర్యశతకము 27 వ శ్లోకం) అని మయూరుడు అన్నాడు. ఇక్కడ మంజిష్ఠాపదము వర్ణద్రవ్యము అను అర్థములో వాడబడింది. ఎంకి నాయుడుబావల అన్యోన్య దాంపత్యాన్ని వర్ణిస్తూ 'మాంజిష్ఠారాగం' అన్నారు సినారె. పసుపు ఎరుపు రంగులు కలిస్తే మాంజిష్ఠ వర్ణం అంటారు. పసుపు మంగళకరమైన అనుభూతులకి, ఎరుపురంగు బాగా ఉన్న ప్రేమకి గుర్తు. పైకి బాగా కనబడుతూ

స్థిరంగా నిలబడే లక్షణాలు పసుపు ఎరుపు రంగులలో ఉన్నాయి. శ్రవణమువల్లకాని, దర్శనమువల్లగాని పరస్పరము వృద్ధిపొందిన అనురాగము గల నాయికానాయకులకు మూడురకాల దశలు కలుగుతాయట. 1.నీలీరాగము, 2.కుసుంభరాగము,3. మంజిష్ఠారాగము.. బయటికిని విశేషముగా కనబడుచు లోపలను ఎప్పటికి వీడకుండెడు గాఢానురాగము మాంజిష్ఠారాగమని ఆలంకారిక శాస్త్రాలు.

**రాజిలభూష! :** రాజిల పదం తెలుగుపదమని భ్రాంతితో ప్రకాశించు – ఇలాంటి అర్థాలు చెప్పబోతాం. కాని ఇక్కడ రెండు తలల పాము అను అర్థములో విశ్వనాథ ప్రయోగించాడు. విశ్వనాథ మాత్రమే ఇలా ప్రయోగించగలడు. ❁

## 83

పుష్పదంతుని శ్రీ **శివమహిమ్నస్తోత్రము**లోని మొదటి శ్లోకం.

శ్లో॥ **మహిమ్నః పారం తే పరమవిదుషో యద్యసదృశీ**
**స్తుతిర్బ్రహ్మాదీనామపి తదవసన్నాస్త్వయి గిరః ।**
**అథావాచ్యస్సర్వః స్వమతి పరిమాణావధి గృణ**
**న్మమాప్యేష స్తోత్రే హర! నిరపవాదః పరికరః ॥**

**అన్వయప్రతిపదార్థములు :**

యది హర, (స్తోతుః) తే మహిమ్నః, పరం పారం అవిదుషః స్తుతిః అసదృశీ :– యది = ఐనచో; హర = ఓ పరమశివా!; తే మహిమ్నః = నీ మహిమ; పరమ్ = శ్రేష్ఠమయిన; పారమ్ = అంతము; అవిదుషః = పూర్తిగా తెలియనివాడు; స్తుతిః = నిన్ను గురించి చేసిన స్తోత్రము; అసదృశీ = అయోగ్యమయినది. (తర్హి ) సర్వః బ్రహ్మాదీనామ్ అపి (గుణ కథన రూపా) గిరః త్వయి విషయే అవసన్నా ఏవ :– (తర్హి = అందువలన;) సర్వః = అన్ని తెలిసిన; బ్రహ్మాదీనామ్ అపి = ఆ బ్రహ్మాదులు చేసిన; తత్ గిరః = నీ గుణ వర్ణన రూపములైన స్తోత్రములు కూడా; అవసన్నాః ఏవ = అయోగ్యములే అని చెప్పాలి. స్వమతి పరిణామావధి గృణన్ అవసన్నాః అపి సర్వః స్తుతిః :– స్వమతి పరిణామావధి = నాయొక్క బుద్ధి వృత్తికి తోచినంత గ్రహించి; గృణన్ = చేసిన; సర్వ స్తుతిః = ఈ స్తోత్రం అంతా; అవసన్నాః అపి = నశించు స్వభావము కలదయినా; అందరికీ ఆమోద యోగ్యం కాగలదు; మమాపి తవ స్తోత్రే ఆరంభః పరికరః నిరపవాదఃమమ + అపి = నాకు కూడా; తవ స్తోత్రే = నీ స్తోత్ర విషయమైన; ఆరంభః

= ఆరంభము (నమస్కారాది రూపమయిన నాంది మొదలయినవి) పరికరః = రాబోవు శ్లోకములలో నీ గురించి చేయ బోవు సార్థక విశేషణముల సమూహము; నిరపవాదః = ఖండించ దగినది కాదు. అనగా యోగ్యమైనదే.

**తాత్పర్యము :** హరా! నీ మహిమయొక్క అంతము పూర్తిగా తెలియనివాడు, (నీ మహిమ ఇంత అని తెలియనివాడు) నిన్ను గురించి చేసిన స్తోత్రము అయోగ్యమయినది. అందువలన అన్ని తెలిసిన ఆ బ్రహ్మాదులు చేసిన నీ గుణవర్ణన రూపములైన స్తోత్రములు కూడా అయోగ్యములే అని చెప్పాలి. ఎందుకంటే వారికి కూడా నీ మహిమ పూర్తిగా తెలియనందువల్ల వాళ్ల స్తుతి కూడా అయోగ్యమయినదే. అందువలన నాయొక్క బుద్ధి వృత్తికి తోచినంత గ్రహించి చేసిన ఈ స్తోత్రం – అంతా – నశించు స్వభావము కలదయినా, అందరికీ ఆమోదయోగ్యం కాగలదు. (ఎందుకంటే బ్రహ్మాదుల స్తోత్రాలను నువ్వు స్వీకరించావు కనుక.) నీ స్తోత్ర విషయమైన నమస్కారాది రూపమయిన నాంది మొదలయినవి, రాబోవు శ్లోకములలో నీ గురించి చేయబోవు సార్థక విశేషణముల సమూహము ఖండించ దగినది కాదు. అనగా యోగ్యమైనది.

**విశేషములు :** కవి శ్లోకము యొక్క పూర్వార్ధములో బ్రహ్మాదులకు కూడా శివమహిమ అందదని స్తోత్రం చేస్తున్నాడు. రెండవ భాగములో వినయాన్ని ప్రదర్శిస్తున్నాడు. పరమశివుని అనుగ్రహము పొందటానికి, తాను బ్రహ్మసమానులే అని వ్యంగ్యంగా తెలియచేస్తున్నాడు. (కవి బ్రహ్మతో సమానము). శివమహిమ పూర్తిగా తెలియని బ్రహ్మాదులు శివుని స్తోత్రం చేస్తున్నారు. శివమహిమ పూర్తిగా తెలియని తాను కూడా శివుని స్తోత్రం చేస్తున్నాడు. బ్రహ్మాదుల మీద దయచూపించిన దేవుడు తన మీద కూడా దయ చూపిస్తాడని, వాళ్ల స్తోత్రాలు యోగ్యమయితే, తన శ్లోకాలు కూడా యోగ్యమయినవే అని భావం.

శివభక్తితో కైలాసం చేరిన ఒక భక్తుడు ఒకసారి పార్వతీపరమేశ్వరుల రహస్య సంభాషణలు వినే ప్రయత్నం చేసాడట. అందువల్ల అమ్మవారి కోపానికి గురై మరలా మానవజన్మను ఎత్తాడు. వరరుచిగా పుట్టి ఆ తర్వాత జన్మలో గంధర్వుడయ్యాడు. ఒక రాజుగారి తోటలో పూలన్నీ తన శివపూజకు కోసి తెచ్చుకునేవాడు. ఒకనాడు ఆ రాజుగారు ఆ గంధర్వుడు వచ్చు మార్గంలో శివ నిర్మాల్యం (ధరించి తీసివేసిన పూలదండలు మొదలయినవి) ఉంచాడు. అది గ్రహించని గంధర్వుడు శివపూజ నిర్మాల్యాన్ని తొక్కాడు. దాంతో తన శక్తులూ, అదృశ్యరూపం పోగొట్టుకొన్నాడు.

రాజభటులు శిక్షిస్తారనే భయంతో ఈ శివమహిమ్న స్తోత్రం గానం చేసాడట. శివుని మెప్పించి తిరిగి కైలాసానికి చేరాడని ఒక కథ. **శివమహిమ్నస్తోత్రమ్** 40 శ్లోకాల చిన్న స్తోత్రమే. కానీ, చాలా ప్రసిద్ధి పొందింది. 'మహిమ్నః' అనే శ్లోకంలో మొదలవుతుంది కనుక, దీన్ని శివమహిమ్నస్తోత్రం అని అంటారు.

శ్లో॥ ఇత్యేషా వాఙ్మయీ పూజా శ్రీమచ్ఛంకర పాదయోః ।
అర్చితా తేన మే దేవః ప్రియతాం చ సదా శివః ॥

(ఈ స్తోత్రరూపములయిన వాక్కులను పుష్పములతో శ్రీ పరమేశ్వరుని పాదాల దగ్గర పూజ చేసాను. నా స్వామి నా స్తోత్రము చేత సంతోషపడుగాక!) అని చిట్టచివరి శ్లోకం. ఈ స్తోత్రానికి ఉన్న ప్రశస్తి శివస్వామి సంతోషానికి నిదర్శనం. **"మహేశాత్ నాపరో దేవో మహిమ్నో నాపరా స్తుతిః/అఘోరాత్ నాపరో మంత్రః నాస్తి తత్త్వం గురో పరమ్"** 'మహేశ్వరుడిని మించిన దేవుడు లేదు, మహిమ్నస్తోత్రాన్ని మించిన స్తుతి లేదు. అఘోరమంత్రాన్నిమించిన మంత్రం లేదు. గురువును మించిన పరతత్త్వం లేదు' అనే ఒక శ్లోకం శివమహిమ స్తోత్రం యొక్క గొప్పతనం చెబుతుంది.

**నిరపవాదము :** నిరపవాద పదానికి నింద లేని, ఏ బాధకమును సహింపలేని అను అను అర్థములను ఇచ్చాడు మోనియర్ (Monier William's Sanskrit-English Dictionary, 2nd Ed.)

"ఆది వేదమగు ఋగ్వేదమునందలి ఋక్కులన్నియు మంత్రద్రష్టలు భవ్యావిష్టులైయున్న సమయమున, తమంత వారి నోట వెలువడినవి. అపౌరుషేయమైన ఆ వేదవాక్కు ఛందోబద్ధముగనే ఆవిర్భవించుట కవిత్వమునకును, ఛందస్సునకును గల సహజసంబంధమును నిరపవాదసిద్ధాంతమును చేయును." అని పింగళి లక్ష్మీకాంతం గారు సాహిత్యశిల్పసమీక్షలో వ్రాసారు. కవిత్వమునకు, ఛందస్సుకు గల సహజ సంబంధము ఖండించదగినదికాదు అను అర్థములో నిరపవాదపదాన్ని పింగళి లక్ష్మీకాంతం ప్రయోగించారు. అపవాదము వేరు. నిరపవాదము వేరు.ఒకటి ఖండించదగినది. రెండవది ఖండించలేనిది. పుష్పదంతుడు ఈ రెండు విరుద్ధాలను తన శ్లోకములో చక్కగా పేర్కొన్నాడు. ఈ శ్లోకంలో కవి తన వాదనను నిరపవాదము అన్నాడు. కాని విచిత్రంగా వ్యాకరణ పరముగా అపవాద పదము కూడా పుష్పదంతుని వాదనను బలపరుస్తోంది. ఉత్తరాంశమువల్ల పూర్వాంశానికి బాధకలిగే సందర్భములో అపవాద న్యాయము వర్తిస్తుంది. "అపవాదై రుత్సర్గా బాధ్యన్తే" అను పరిభాషనుండి

యీన్యాయము పుట్టింది. వ్యాకరణశాస్త్రములో ఈ అపవాదన్యాయము ఎక్కువగా వాడతారు. మొదట చెప్పిన విషయమునకు బాధకముగా చెప్పే రెండవ వాక్యానికి అపవాదము అని పేరు. శివుని మహిమ తెలియనివాడు శివుని గురించి స్తోత్రము చేయుట యోగ్యము కాదు మొదటి వాక్యం. శివుని మహిమ తెలియని వాడు కూడా భక్తితో శివుని గురించి స్తోత్రము చేస్తే ఆ స్తోత్రము యోగ్యమయినదే అని చెప్పుట అపవాదము. విరుద్ధాలను సమన్వయించుకొన్నవాడు శివుడు. విషము వేడి. గంగ చల్లన. రెండూ ఆయనలోనే ఉన్నాయి. అందుకే మహిమోపేతమయిన ఈ శివ శ్లోకములో కూడా విరుద్ధాలు కూడ సమన్వయిస్తున్నాయి. ❀

## 84

శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి **"శ్రీత్రికూటేశ్వరత్రిశతి"** లో మొదటి పద్యము.

**భువనంబాంగిక మెల్ల వాఙ్మయము నిన్బోధించు విజ్ఞాన వై**
**భవ మాతారలు సూర్యచంద్రులరయన్ భద్రంబులౌ భూషలా**
**త్మ విలాసంబగు భక్త పాలన కళాతంత్రంబులన్ సాత్వికం**
**బవలోకింపగనయ్యె మాకు నటముఖ్యా! శ్రీ త్రికూటేశ్వరా!**

**ప్రతిపదార్థము :** శ్రీ త్రికూటేశ్వరా = మూడు శిఖరాల కోటప్పకొండకు అధిపతీ! ఓ మేధా దక్షిణామూర్తీ! ఓ శివా!; నటముఖ్యా! = నాట్యము చేయువారిలో ముఖ్యుడా!; భువనంబు = స్వర్గ, మర్త్య, పాతాళ లోకాలు మొదలైనదిగా విస్తరించిన సమస్త ప్రపంచము; ఆంగికము = నీ ఆంగికము (హస్తాదులచే చేయు అభినయము అభినయము ఆంగికము, కన్బొమలు కదలించుట, హస్తములు కదిలించుట ఇవన్నీ ఆంగికము.); ఎల్ల వాఙ్మయము = సమస్తమైన భాష (సాహిత్యము); నిన్బోధించు = నిన్ను తెలియ చేయు (బోధ = తెలివి, జ్ఞానం; బోధకుడు = గురువు, ఉపాధ్యాయుడు; బోధనం = చదువు చెప్పటం, నేర్పటం; బోధితుడు = చదువు నేర్చినవాడు.); విజ్ఞాన వైభవము = శాస్త్రాదులయందలి విశేషజ్ఞానముయొక్క వైభవము; ఆ తారలు = ఆ నక్షత్రములు; సూర్య చంద్రులు = సూర్య చంద్రులు; అరయన్ = విచారింపగా (On examining or searching for.); భద్రంబులౌ = శుభములైన, శ్రేష్ఠములైన; భూషలు = అలంకారములు; ఆత్మవిలాసంబగు = ఆత్మవిలాసంబు + అగు = నేనెవరు? ఆత్మను. ఎక్కడనుండి వచ్చినాను? ఆత్మనుండి. ఎక్కడికిపోగలను? ఆత్మకే చేరగలను. ఎంతకాలముండగలను? ఆత్మలో చేరునంతకాలము ఉండగలను. ఇప్పుడున్న దెక్కడ? అనిత్యములో, ఏ

రూపముతో? అనాత్మతో. ఏమి చేస్తున్నావు? అస్థిరములైన పనులు. ముందేమి చేయవలెను? నిత్యలోకమును చేరు ప్రయత్నము. ఇది ఆత్మవిలాసము. (సత్య సాయిబాబా) (అత సాతత్య గమనే. సంసారములో ఎప్పుడూ చరించువాడు. అతతి సంసరతీత్యాత్మా); భక్తపాలన కళాతంత్రంబులన్ = భక్తులను పాలించుట (రక్షించుట) అను కళకు సంబంధించిన కారణములు; సాత్వికంబు = ఇతరుల సుఖము, దుఃఖము మొదలైన భావాలను చూసి వానిని భావించే సమయంలో మనస్సులో కలిగే భావాలతో కూడిన అభినయము సాత్వికాభినయముగా; అవలోకింపగన్ + అయ్యె + మాకు = (గ్రంథాదులను) పరిశీలించగా మాకు అనిపిస్తోంది.

**తాత్పర్యము :** కోటప్పకొండకు అధిపతీ! ఓ మేధా దక్షిణామూర్తీ! ఓ శివా! నాట్యము చేయువారిలో ముఖ్యుడా! సమస్త ప్రపంచము నీ ఆంగికము. సమస్తమైన భాష, సాహిత్యము నిన్ను తెలియ చేయు శాస్త్రాదులయందలి విశేషజ్ఞానముయొక్క వైభవము. ఆ నక్షత్రములు, సూర్య చంద్రులు పరిశీలించగా శ్రేష్ఠములైన నీ అలంకారములు. ఆత్మవిలాసముగా ప్రకాశించే భక్తులను పాలించుట (రక్షించుట) అను కళకు సంబంధించిన కారణములు నీ సాత్వికాభినయముగా మాకు గ్రంథాదులను పరిశీలించగా అనిపిస్తోంది. (భక్తులను రక్షించు కళలలో ఆత్మ యొక్క జాడను ప్రదర్శిస్తూ శివుడు సాత్వికాభినయం చూపిస్తుంటాడు అని భావము.)

**విశేషాలు :**

1. నందికేశ్వరుడు రచించిన అభినయదర్పణములోని మొదటి శ్లోకము "ఆంగికం భువనం యస్య/ వాచికం సర్వ వాఙ్మయమ్/ఆహార్యం చన్ద్ర తారాది/తం వందే సాత్త్వికం శివమ్" అను శ్లోకమునకు ఇది అనువాదము. ఈ శ్లోకములోని పదాలలో "ఆంగికము" మొదలయిన పదాలు చాల వరకు ఈ పద్యంలో వచ్చాయి. (ఈ శ్లోక విస్తృత వ్యాఖ్యానము శ్రీ శివమంగళాచరణసురభి – 41 లో చేయబడింది)

2. భ్రూమధ్య స్థానం త్రికూటమని విశేషార్థం ఉంది. మూడు శిఖరాలున్న కొండను త్రికూటాచలమన్నారు. (పర్వత శిఖరమునకు కూటము అని పేరు. సూర్య దావాగ్నులచేత దహింపబడునది కూటము) తెలుగురాష్ట్రాలలో త్రికూటాచలం అంటే కోటప్పకొండ. ఇది మేధాదక్షిణామూర్తి క్షేత్రంగా ప్రసిద్ధి. మూడు శిఖరాలు బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు ప్రతిరూపాలని భావిస్తారు. ఇక్కడ శివుడు, లింగాకృతిలో, దక్షిణామూర్తి స్వరూపంలో పూజలందుకొంటాడు.

3. త్రికూటములుగా / వాగ్భవకూటము, 2. కామరాజకూటము, 3. శక్తికూటము. శంకర భగవత్పాదులవారి సౌందర్యలహరిలో ఈ వాగ్భవ కూటములకు సంబంధించిన విశేషాలున్నాయి. (ఉదా. సవిత్రీ... 17 వశ్లోకం)

4. తమోమయ, (బొడ్డునుండి కింది భాగము వరకు) రజోమయ (బొడ్డునుండి పైన ఉన్న కంఠము వరకు) సత్వమయ (కంఠమునుండి భ్రూమధ్యము వరకు ఉన్న మధ్య భాగము వరకు) కూటములుగా త్రికూటములను కొందరు పిలుస్తారు. ఈ మూడు కూటములే షట్చక్రములని వారి భావన.

5. శ్రీ మేధాదక్షిణామూర్తి అవతారరూపమే త్రికోటేశ్వరస్వామి. దక్షయజ్ఞము తర్వాత శివుడు బ్రహ్మచారిగా మేధాదక్షిణామూర్తి రూపంలో దేవతలకు, మహర్షులకు, నరులకు, ఎందరో మహానుభావులకు బ్రహ్మోపదేశం చేసిన క్షేత్రం **కోటప్పకొండ** పుణ్యక్షేత్రం. "కోటేశ్వరః కోమలాకారః కోటిసూర్యసమప్రభః / కోటిబ్రహ్మాండసంచారః కోటేశ్వర నమోఽస్తు తే" అని ఇక్కడ కోటేశ్వర స్వామిని కొలుస్తారు.

6. బ్రహ్మ నలుగురు కుమారులైన సనక, సనందన, సనాతన, సనత్కుమారులు దక్షిణామూర్తి దగ్గరకు వెళ్ళి తమకు జ్ఞానాన్ని బోధించవలసినదిగా కోరారు. అప్పుడు దక్షిణామూర్తి మాట్లాడలేదు. కాని సనక, సనందన, సనాతన, సనత్కుమారులకు తమ సందేహాలు తీరిపోయాయి. ఈ విషయాన్నే **"చిత్రం వటతరోర్మూలే...."** అను ప్రసిద్ధమయిన శ్లోకంలో వర్ణించబడింది.

7. నరసరావుపేటకు పద్నాలుగు కిలోమీటర్ల దూరం లో ఎల్లమంద, కొండకావూరు మధ్య ఉన్న పర్వతాన్ని "కోటప్ప కొండ" అంటారు. 1857 అడుగుల ఎత్తు, 1500 ఎకరాల వైశాల్యం, పన్నెండు కిలోమీటర్ల చుట్టుకొలతతో ఉంది.

8. **"చేదుకో కోటయ్య చేదుకోవయ్యా మమ్మాదుకోవయ్యా!"** అని భక్తులు శివరాత్రినాడు ప్రభలు కట్టుకొని ఇక్కడ తిరునాల (దేవోత్సవము) చేస్తారు. చేదుకో అంటే పైకి లాగు అని అర్థం. "నన్ను ఉన్నత స్థానానికి చేర్చవయ్యా!" అని శివునికివేడుకోలు. ఆ "చేదుకో కోటయ్య" ఆర్తి నుంచి వచ్చిందే డా॥ తూములూరు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి గారి శ్రీ త్రికూటేశ్వర త్రిశతి. మొత్తం మూడు వందల పద్యాలు.

9. "కనగా కన్నులు లేవు, గోడు వినగా కర్ణంబులున్ లేవు..." (32 వ పద్యం) అని లింగాకృతిలోని శివుని ప్రాచీన కవుల ఫక్కిలో నిందాస్తుతి చేసిన శాస్త్రి గారి కలం,

నిను నీలోనం గనుంగొన... (266) పద్యంలో దక్షిణామూర్తికి పద పట్టాభిషేకం చేసింది. త్రికూటేశ్వరుని నిరాకార సాకార దక్షిణామూర్తి స్వరూపాలను త్రిశతిలో వినుతి చేసి పండితుల ప్రశంసలు పొందారు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి గారు.

10. ఎవరినైనా గౌరవించాలంటే పేరుకు ముందు "శ్రీ" చేర్చాలి. కాని దక్షిణామూర్తి శాస్త్రి గారి పేరుకు ముందే "శ్రీ" ఉంది. ఈ "శ్రీ" వారి కవిత్వానికి కూడా గౌరవ వాచకమే.



## 85

ఉత్పలదేవుని **శివస్తోత్రావళి** లో మొదటి శ్లోకము.



**శ్లో॥ న ధ్యాయతో న జపతః**
**స్యాద్యస్యావిధిపూర్వకమ్ ।**
**ఏవమేవ శివాభాస**
**స్తం నుమో భక్తి శాలినమ్ ॥**

**ప్రతిపదార్థము :** న ధ్యాయతః = ధ్యానము లేకుండా (చాంచల్యములేకుండా భగవంతుని మనసున తలఁచుట ధ్యానము. ఇది యోగాంగములలో ఒకటి); న జపతః = జపము లేకుండా (జపములు ఏడురకములు. 1. సద్యోజపము, 2. నిష్కామజపము, 3. సాత్త్వికము, 4. మానసికము, 5. చిరకాలికము, 6. సకాలము, 7. రాజస తామసము.); అవిధిపూర్వకమ్ = విధి రహితంగా; (విధి అంటే చేయవలసిన పని. వేదం చెప్పిన పద్ధతి.); ఏవమేవ = ఈ విధముగా; శివ = శివుని; ఆభాసః = ప్రకాశము (ఆభాస అంటే పైకి కనబడుట. లోన లేకుండుట); స్యాత్ = ప్రాప్తిస్తుందో; తమ్ = ఆ; భక్తి శాలినమ్ = భక్తి చేత ప్రకాశించువానిని; నుమః = స్తోత్రము చేయుచున్నాము.

**తాత్పర్యము :** శివునికి రెండు రకాల స్వరూపాలు. ఒకటి నియతాకారముతో ఉండి జపించటానికి, ధ్యానించటానికి, శాస్త్రపూర్వకముగా ఆచారాలు పాటిస్తూ కొలువటానికి వీలయినది. శివుని రెండవ స్వరూపము నిరాకారము. (ఇంకొక మాటల్లో చెప్పాలంటే సర్వాకారము.) చిదానంద స్వరూపమైన ఆ శివుని ప్రకాశము ధ్యానము లేకుండా, జపము లేకుండా, నియమాలు లేకుండా కేవలం భక్తిశాలులకు మాత్రమే స్ఫురిస్తుంది. ఈ విధముగా అన్నింటా కనబడే శివుని ప్రకాశమునకు నమస్కారము.

**విశేషాలు : "ఎత్తెరంగునం జేసినను పరమేశ్వరారాధనంబు సర్వార్థసాధనంబగు; నందును లింగంబునందు బూజించుట యర్చ యందారాధించుట కంటె ననేక గుణంబు లెక్కుడు"** (మహాభారతము. ద్రోణ పర్వము. 05–419వ) అని మహాభారతములో శివ ప్రతిమకు, శివలింగానికి చేసే పూజల ఫలితములలోని తేడాను వ్యాసుడు చెప్పాడు. అర్చాకారము కంటె లింగపూజ విశిష్ట మయినది. లింగాకారము రూపము లేనిదానికి గుర్తు. దాని విశిష్టతను ఉత్పలదేవుడు ఈ శ్లోకంలో చెప్పాడు. లింగాకారాన్ని "అరూపరూపి" అన్నారు **నడిచే దేవుడు** శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరపరమాచార్యుల వారు. లింగానికి రూపం లేదు అందాం అంటే లింగస్వరూపం కనపడుతోంది. అది మూర్తి అనడానికి దానికి చేతులు కళ్లు లేవు. లింగం అంటే ఒక సంకేతం (గుర్తు) లింగాకారాన్ని పూజించడమంటే నిర్వికార నిర్గుణ పరబ్రహ్మమును ఆరాధించుట. అన్నింటా శివ బ్రహ్మాన్ని చూసే స్థితికి ఉత్తమ భక్తుడు ఎదగటానికి లింగార్చన సహాయ పడుతుంది.

ఈ శరీరమనే ఒక ఉపాధిని మనం ఆశ్రయించాం. ఆశ్రయించిన జీవాత్మ – పరమాత్మనుండి వచ్చింది. జీవుడు (జీవాత్మ) పరమాత్మలోకి ప్రయాణం చేయాలి. మనము ఇంటినుండి బయలు దేరి రకరకాల చోట్లకి వెళ్లినా ఇంటికి తిరిగి ఎలా వస్తామో జీవుడు అంతిమంగా పరమాత్మను చేరాలి.ఆ పరమాత్మ ధ్యానాదులు, జపాదుల చేత జీవునికి అందే పద్ధతి మొదటి మెట్టు. ఆ ప్రకాశాన్ని పూజాదులతో నిమిత్తం లేకుండా సర్వత్రా ఆ ప్రకాశాన్ని చూసి పరవశించే మహోన్నతమైన పద్దతి రెండవది. ఉత్పలదేవుడు ఈ రెండో పద్ధతికి ఈ శ్లోకంలో పెద్దపీట వేసాడు. ప్రత్యక్షముచే అనుమానముచే తెలియబడని విషయాన్ని విధివాక్యము విధిస్తుంది. విధివాక్యం ద్వారా అధికారము ప్రాప్తిస్తుంది. సహజ ప్రాప్తములైన వాటివిషయములో విధివాక్య ముండదు. ఉదాహరణకు మంచముమీద పడుకోవటానికి ఏ విధి వాక్యము అవసరము లేదు. అది సహజ ప్రాప్తం. మీమాంస చెప్పిన ఈ అవిధిని ఉత్పలదేవుడు తన శ్లోకములో ఇంకోరకంగా చెప్పాడు. సర్వత్రా భాసించే శివుని భక్తిపరులు సహజంగానే భక్త్యాతి శయంతో దర్శిస్తారు. దానికి విధి నియమాలు అవసరం లేదు. (అవిధిపూర్వకమ్)

ఉత్పలదేవుని శివస్తోత్రావళిలో 20 శివస్తోత్రాలు ఉన్నాయి. ఈ శ్లోకం మొదటి స్తోత్రమైన **భక్తివిలాసాఖ్యస్తోత్రం** లోనిది. విలక్షణంగా శివుని నుతించిన గళాలలో ఉత్పలదేవునికి ప్రత్యేక స్థానముంది. 

## 86

మంఖక కవి **శ్రీకంఠచరిత** కావ్యములోని మొదటి శ్లోకము



**శ్లో॥ జీయాత్ కృతానంగపతంగదాహః**
**ఖట్వాంగినో నేత్రశిఖి ప్రదీపః ।**
**యస్యాంతికే శుభ్రదశానివేశ -**
**శ్రియం కిరీటేందుకరాః శ్రయంతే ॥**

**ప్రతిపదార్థము :** యస్యాంతికే = యస్య + అంతికే = ఎవనియొక్క సమీపములో; శుభ్రదశానివేశ శ్రియమ్ = పరిశుభ్రమైన దశను పొంది చక్కటి స్థానలక్ష్మిని పొంది; కిరీటేందుకరాః = కిరీటముగా ప్రకాశించే చంద్రుని కిరణములు; కృతానంగ పతంగ దాహః = మన్మథుని మిడుత వలె మాడ్చి వేసిన (పతతి అగ్నౌ పతంగః – అగ్నియందు పడునది కనుక మిడతకు పతంగమని పేరు); ఖట్వాంగినః = ముక్కంటి, శివుడు (వ్యు. ఖట్వాంగము చేతియందు గలవాడు.) నేత్రశిఖి = నేత్రాగ్నిని; శ్రయంతే = సేవించుచూ ప్రదీపః = దీపమయ్యాయో, జీయాత్ = అటువంటి శివుడు సర్వోత్కృష్టుడగుగాక! (జయింపబడుగాక!)

**తాత్పర్యము :** మన్మథుని మిడుతవలె మాడ్చి వేసిన ముక్కంటియైన, శివుని నేత్రాగ్ని దీపమై చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. అటువంటి ఎర్రని చంద్రదీపము కలిగిన శివుడు సర్వోత్కృష్టుడగుగాక (జయింపబడుగాక!)

**విశేషాలు :**

చంద్రుడు తన గుణమును విడిచి, అగ్నియొక్క ధర్మాన్ని స్వీకరించాడు కనుక తద్గుణాలంకారము ఈ శ్లోకంలో ఉంది.

ప్రతి పాదములోనూ వరుసగా, త, త, జ, గగ అను గణములున్నాయి కనుక ఇంద్రవజ్ర ఈ శ్లోకములోని ఛందస్సు.

ఇరవై అయిదు సర్గలు కల ఈ శ్రీకంఠచరిత్రము త్రిపురాసురసంహారానికి సంబంధించినది. కనుక ఆ ప్రస్తావన తీసుకురావటానికి, శివుని మూడవ కంటిలోని అగ్నితో నాందీ శ్లోకంలో చంద్రుడు ఎరుపెక్కాడు. జీయాత్ (సర్వోత్కృష్టుడగుగాక!) అను ధాతువు కూడా సందర్భోచితంగా వాడబడింది.

**ఖట్వాంగము :**

ఖట్వా అంటే మంచము. **ఖట్యతే కాంక్షతే ఖట్వా... ఖట కాంక్షాయాం.** కాంక్షింపబడేది ఖట్వా... దాని అంగము.. అంటే ఒక భాగము మంచపు కోడు. కనుక ఖట్వాంగుడు అంటే మంచపు కోడు ఆయుధముగా కలవాడు. "ఖట్వాంగపాణిc జెంగల్వపుష్పంబుల పూజ చేసా"దని శ్రీనాథుడంతటి వాడు రాసాడు (శృంగార నైషధము). **"ఖట్వాంగాది ప్రహరణా వదనైక సమన్వితా!"** అని లలితా సహస్రనామములో ఉంది. శివునికి మంచపు కోడు ఆయుధమంటే నప్పటం లేదు. ఖట్వాంగానికి పెద్దలు ఇంకో సమన్వయం చెప్పారు. శ్రీవిద్యలో గదలా పట్టుకోవటానికి వీలుండే ఒక గద ఉండి చివర కపాలంలా ఉండే ఆయుధాన్ని ఖట్వాంగం అంటారు. విశుద్ధచక్రానికి సంబంధించిన శక్తి దేవత తన నాలుగు చేతుల్లో ఖట్వాంగము, ఖడ్గము, త్రిశూలము, చర్మము ఉంటాయి. శివయ్యకి, శివమ్మకి తేడాలేదు. వారిద్దరూ అర్ధనారీశ్వర స్వరూపంలో ఉంటారు. కనుక అమ్మ, అయ్య ఇద్దరూ ఖట్వాంగ పాణులే.

ఒక దినుసు ఔక్క పురుగును మిడుత అంటారు. ఆ మిడుత దీపం చుట్టూ తిరుగుతూ ప్రాణం కోల్పోతుంది కదా! అలా శివుని మూడవ కన్ను అనే దీపం చుట్టూ తిరిగి మిడుతలాగా కాలిపోయాడు మన్మథుడు. మన్మథుడిని మిడుతలా ఎందుకు పోల్చాడు? ప్రపంచములో అందరినీ జయించగలననే గర్వంతో ఉన్న మన్మథుడే శివుని ముందు మిడుత అయ్యాడు. ఇక త్రిపురాసురులు ఒక లెక్కకాదు అని శివ పరాక్రమపు ఔన్నత్యాన్ని తెలియచేయటానికి మన్మథుని మిడుతతో పోల్చాడు కవి. ❁

## 87

జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి **సాలంకార కృష్ణరాయలు** కావ్యములోని మొదటి పద్యము.

**నిరతంబున్ హిమవన్మహీధరదరిన్ నిష్ఠాపరస్వాంతయై**
**పరగన్ బార్వతి నాత్మ సేవనము తాత్పర్యంబునన్ బిల్వగా**
**నరయన్ రామి నిజార్ధదేహమున నిత్యా వాసినిన్ జేయు సుం**
**దరుడీశుండు శుభంబులన్ మనుచుతన్ నారాయణార్యాగ్రణిన్.**

**ప్రతిపదార్థము :** నిరతంబున్ = మిక్కిలి ఆసక్తితో; హిమవన్మహీధర దరిన్ = హిమవత్ + మహీధర దరిన్ = హిమాలయపు సమీపములో; నిష్ఠాపర స్వాంతయై = నియమముతో కూడిన మనస్సుతో; పరగన్ = ఒప్పుచుండగా; పార్వతిన్ = ఆ హిమవంతుని కుమార్తె

పార్వతిని; ఆత్మ సేవనము = తన సేవ కొరకు; తాత్పర్యంబునన్ బిల్వగా = తాత్పర్యంబునన్ + పిల్వగాన్ = అభిప్రాయముతో పిల్వగా; అరయన్ రామి = విచారింపగా రాకపోవుటచే; నిజార్ధదేహమున = నిజ + అర్ధదేహమున = తన శరీరము యొక్క సగభాగములో; నిత్యావాసినిన్ జేయు = నిత్యము నివసించుదానిగా చేసిన; సుందరుడీశుండు = సుందరుడు + ఈశుడు = అందగాడైన శివుడు; నారాయణార్యాగ్రణిన్ = నారాయణ + ఆర్య + అగ్రణిన్ = కృతిభర్తయైన నారాయణుడు అను పూజ్యులలో గొప్పవానిని; శుభంబులన్ = శుభములతో; మనుచుతన్ = రక్షించుగాక!

**తాత్పర్యము :** మిక్కిలి ఆసక్తితో హిమాలయపు సమీపముతో నియమముతో కూడిన మనస్సుతో శివుడు తపస్సు చేస్తున్నాడు. హిమవంతుని కుమార్తె పార్వతిని, తండ్రి శివుని సేవ కొరకు పంపించగా మొదట్లో ఆమె సిగ్గుతో రాలేదు. తనదగ్గరకు రావటానికే సిగ్గు పడుతున్న ఆమెను శరీరము యొక్క సగభాగములో నిత్యము నివసించుదానిగా చేసిన అందగాడైన శివుడు కృతిభర్తయైన నారాయణుడు అను పూజ్యులలో గొప్పవానిని శుభములతో రక్షించుగాక!

**విశేషాలు :**

1962, 2009 సంవత్సరములలో రెండుసార్లు ముద్రింపబడిన కావ్యమిది. వివిధ అలంకారముల లక్షణములకు లక్ష్యగ్రంథంగా రాయబడిన గ్రంథం కావటం చేత **సాలంకార కృష్ణరాయలు** అని పేరు పెట్టారు. మొత్తం 878 పద్యాలతో 06 ఆశ్వాసాలున్న కావ్యమిది. ఒక్కో పద్యంలో ఏ అలంకారముందో రచయితే స్వయంగా గ్రంథం చివర్లో పేర్కొన్నారు. విద్వద్గద్వాల సంస్థానంలో పరీక్షాధికారిగా పనిచేసిన ఈ పంచసహస్రావధాని యైన ఈ కవి ఒకేసారి వంద గ్రంథాలు చెప్పగల దక్షులుగా పేరు పొందారు. డా॥ అడుసుమిల్లి నారాయణరావుగారికి ఈ కావ్యము అంకితము ఇయ్యబడింది. రాయల బాల్యము (ప్రథమాశ్వాసము) నుంచి ఆయన ఆముక్తమాల్యద రచనము వరకు (షష్ఠాశ్వాసము) ఈ కావ్యములో ఉంది.

దేవతల కోరికపై పార్వతి తపస్సు చేస్తున్న శివుడికి సేవ చేయడానికి ఒప్పుకుంటుంది. (స్కందపురాణం 2-24, 25 అధ్యాయాలు) నారదుడు ఒకనాడు హిమవంతుని దగ్గరకు వచ్చి, పార్వతిని చూచి, 'ఆహా! ఈ కన్య తన సేవచేత శివుని అర్ధదేహాన్ని హరిస్తుంది సుమా! అని పలికాడు. సతీదేవి దహనం తరువాత శంకరుడు విరక్తుడై హిమవత్పర్వతం మీదనే నిరంతరం తపస్సు చేసుకుంటున్నాడు. శివపార్వతుల

కల్యాణం కోరికగా కలిగిన హిమవంతుడు పార్వతిని ఆయన శుశ్రూషకై నియోగించాడు. పార్వతికి తోడుగా జయ, విజయలనే ఇద్దరు చెలికత్తెలని కూడా ఉంచాడు. నిజానికి పార్వతిచేత సేవలందుకోవడం వలన తన తపోనిష్ఠ చెడిపోతుందని తెలిసినా ఆమె శు శ్రూషకి ఒప్పుకున్నాడు. మనస్సు చెదరటానికి కారణాలు ఉన్నా కూడా ఎవరి మనస్సయితే చెదిరిపోదో వారే ధీరులు. (కాళిదాసు కుమారసంభవం) స్కందపురాణ, కుమార సంభవాలలో ఎక్కడా శివసేవా విషయంలో పార్వతి సిగ్గు ప్రస్తావన లేదు. సిగ్గు – జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారి మనోహరమైన కల్పన. ❁

## 88

క్షేమరాజ **ప్రత్యభిజ్ఞాహృదయం**లోని మొదటి శ్లోకం.

**శ్లో॥ నమఃశివాయ సతతం**
**పంచకృత్యవిధాయినే ।**
**చిదానందఘనస్వాంత**
**పరమార్థవిభాసినే ॥**



**ప్రతిపదార్థము :** సతతమ్ = ఎల్లప్పుడు; పంచకృత్య = (పరమేశ్వర కృత్యములు) 1. సృష్టి, 2. స్థితి, 3. లయము, 4. అనుగ్రహము, 5. తిరోధానము; విధాయినే = విధించువానికొరకు; చిదానంద = చిత్ + ఆనంద = జ్ఞానానంద భరితమైన; ఘనస్వాంత = గొప్పదైన మనస్సుతో; పరమార్థ = ఆనందమును (దాగియున్న నిజమైన రహస్యమును); విభాసినే = ప్రకాశింపచేయువానికొరకు; శివాయ = శివునికొరకు; నమః = నమస్కారము.

**తాత్పర్యము :** ఎల్లప్పుడూ 1. సృష్టి, 2. స్థితి, 3. లయము, 4. అనుగ్రహము, 5. తిరోధానము అను పంచ కృత్యములు చేయుచూ జ్ఞానానందభరితమైన గొప్పదైన మనస్సును భక్తులకు కలిగించి – ఆ ఆనందములోపల దాగియున్న నిజమైన రహస్యమును (ప్రత్యభిజ్ఞ) భక్తుల హృదయములను ప్రకాశింపచేయు శివునికొరకు నమస్కారము.

**విశేషాలు :** కశ్మీరీ శైవ సంప్రదాయంలో – సంక్షిప్తమైన సూత్రీకరణ కాబడ్డ ప్రసిద్ధమైన పుస్తకం **ప్రత్యభిజ్ఞాహృదయం**. అభినవగుప్తుని (పదవ శతాబ్దం) శిష్యుడైన క్షేమరాజు క్రోడీకరించిన పుస్తకము ఇది.

సామాన్యాన్ని విశేషాలలో గుర్తించడమే ప్రత్యభిజ్ఞ. సొమ్ములు అన్నింటిలో బంగారాన్ని గుర్తించడమే ప్రత్యభిజ్ఞ. స్ఫురణ ఒక్కటే. స్ఫురించే పదార్థాలు అనేకం.

సాధకుడైనవాడు శరీరం మొదలుకొని, విశ్వశరీరం వరకు అస్తి, భాతి స్ఫురణ ఉందని గుర్తిస్తూ పోతే – అసలైన ప్రత్యభిజ్ఞ.

కంటికి కనిపిస్తున్న ఒక వస్తువును / పదార్థాన్ని చూసి, దానిని పూర్వరూపమైన కారణ వస్తువు / పదార్థం లక్షణాలను, గుణాలను గమనించి, గుర్తించడం ప్రత్యభిజ్ఞ. (ప్రతి అభిముఖ్యేన జ్ఞానం). చూచినది కార్యమైతే, దానికి కారణమైన దాని పరిజ్ఞానాన్ని పొందడం ప్రత్యభిజ్ఞ. వస్తువును చూడడం మొదట గుర్తించడం. కారణం లక్షణాలను, గుణాలను తెలుసుకుని మూలపదార్థాన్ని జ్ఞానదృష్టితో చూడడం రెండవసారి గుర్తించడం. **ప్రత్యభిజ్ఞ** అంటే స్థూలంగా తానే ఈశ్వరుడననే జ్ఞానం కలగడం.

కాశ్మీర శైవంలో ప్రత్యభిజ్ఞ ఒక భాగము. సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహాలు అనే పంచకృత్య శక్తుల వల్ల ఆ పరమశివుడే సద్యోజ్యాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానాలు అనే అయిదు భేదాలతో పంచబ్రహ్మలుగా తన కృత్యాలు నెరవేరుస్తుంటాడు. **"సదాశివానుగ్రహదా పంచకృత్యపరాయణా"** అని అమ్మకి పేరు (లలితాసహస్రనామము) అనగా దేవి బ్రహ్మరూపిణియై సృష్టిని, విష్ణు (గోవింద) రూపిణియై స్థితికార్యమును, రుద్రరూపిణియై సంహారమును, ఈశ్వరియై తిరోధానమును, సదాశివమూర్తియై అనుగ్రహమును నిర్వహిస్తున్నదని ఈ నామానికి వివరణం. లలితాసహస్రములోని శివమ్మ. ఈ శ్లోకంలో పంచకృత్య విధాయకుడైన శివయ్య – ఇద్దరూ ఒక్కరే.

"రవి సమాను ప్రత్యభిజ్ఞ నెరిగి ప్రథమపుత్ర స్నేహ మెరుకపడక యుండ ఇంతి యుండె" (భారత. ఆదిపర్వము 06-62 పద్యము) అని నన్నయగారు కుంతిదేవి స్థితిని వర్ణిస్తూ ఈ ప్రత్యభిజ్ఞ పదాన్ని మనోహరంగా ప్రయోగించారు. తాను తన గ్రంథములలోని సూత్రముల ద్వారా చెప్పదలచుకొన్న విషయాన్ని నాందీ శ్లోకములో **ఘనస్వాంత** (గొప్పదైన హృదయముతో) **పరమార్థ** (దాగియున్న నిజమైన రహస్యమును); **విభాసినే** (ప్రకాశింపచేయువాడు) అని శివస్తుతి ద్వారా కవి తెలియచేశాడు.

క్షేమరాజు చెప్పిన మొదటి సూత్రము **"చితిః స్వతంత్రా విశ్వసిద్ధిహేతుః"** చితి స్వరూపశక్తియే (చైతన్యము) అన్యాపేక్ష లేకుండ స్వతంత్రముగ విశ్వముగా రూపొందుటకు

కారణమగుచున్నదని స్థూలార్థము. శివునియొక్క పరిణామమే యీ విశ్వము. విశ్వమందలి ప్రతి అణువు ఆ శివరూపమే. దానిని గుర్తించే హృదయమే ప్రత్యభిజ్ఞా హృదయము. ఇలాగే మిగతా సూత్రాలు కూడా ఉంటాయి. ❀

## 89

విశ్వనాథ **"సిద్ధాబ్జహేళి"** లోని మొదటి పద్యం.



**శ్రీ తమలా శ్యామ లింగ! సిద్ధ సంసేవిత లింగ!**
**హేతుహీనసనాథ! అన్నపూర్ణా సహిత విశ్వనాథ!**
**నీతామరధునీక జటాజూటా! మణి శశి కిరీట!**
**స్ఫీత వియన్మౌళి నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి!**

**ప్రతిపదార్థము :** శ్రీ తమలా శ్యామ లింగ! = చీకటి మ్రానువంటి నల్లనైన రంగు కలిగిన లింగాకారము వాడా!; సిద్ధ సంసేవిత లింగ = అణిమ మొదలైన సిద్ధులు పొందిన వారిచే సేవింపబడినవాడా!; హేతు హీన సనాథ! = కారణమును విడిచి రక్షించువాడా!; అన్నపూర్ణా సహిత విశ్వనాథ! = అన్నపూర్ణాదేవితో కలిసి ఉన్న ప్రపంచాధిపతీ!; నీతామరధునీక జటాజూట! = నీత + అమరధునీక జటాజూటా! = భగీరథునిచే తీసుకురాబడిన దేవతల నది యైన గంగానదిని జడల సమూహమునందు కలిగినవాడా!; మణిశశి కిరీట! = శ్రేష్ఠుడయిన చంద్రుని కిరీటముగా కలిగినవాడా!; స్ఫీత వియన్మౌళి = అధికమైన (వ్యాపించిన, స్వచ్ఛమైన) ఆకాశము కొప్పుగా కలిగినవాడా! (వ్యోమకేశుడు – ఆకాశము జుట్టుగా కలిగినవాడు శివుడు); నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జ హేళి! = నెకరుకల్లు ప్రాంతములో వెలసిన సిద్ధుల ముఖపద్మాలను వికసింపచేయు సూర్యునివంటివాడా!

**తాత్పర్యము :** చీకటి మ్రానువంటి నల్లనైన రంగు కలిగిన లింగాకారము వాడా! సిద్ధులచే సేవింపబడినవాడా! భక్తులను కారణమును విడిచి రక్షించువాడా! అన్నపూర్ణాదేవితో కలిసి ఉన్న ప్రపంచాధిపతీ! భగీరథునిచే తీసుకురాబడిన దేవతల నదియైన గంగానదిని జడల సమూహమునందు కలిగినవాడా! శ్రేష్ఠుడయిన చంద్రుని కిరీటముగా కలిగినవాడా! అధికమైన ఆకాశము కొప్పుగా కలిగినవాడా! నెకరుకల్లు ప్రాంతములో వెలసిన సిద్ధుల ముఖపద్మాలను వికసింపచేయు సూర్యునివంటివాడా! నీకు నమస్కారము.

**విశేషాలు :**

ఈ నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి శతక పూర్వాపరాలను విశ్వనాథ స్వయంగా ఇలా చెప్పుకొన్నారు. "నర్సరావుపేట దగ్గర నెకరుకల్లు అను గ్రామము కలదు. అందులో భూమిలో పాతిపెట్టబడిన శివాలయమొకటి కనిపించినది. ఆ స్వామి చాల మహత్తులు ప్రకటించినాడు. వెళ్ళి నేను ఆ స్వామిని దర్శించి వచ్చితిని. వారిమీద కూడ మరియొక మధ్యాక్కఱ శతకము వ్రాసితిని. శ్రీశైలము, కాళహస్తి, భద్రాద్రి, తిరుపతి వేంకటేశ్వరస్వామి, మా కులదైవమైన శ్రీ విశ్వేశ్వరస్వామి, ద్రాక్షారామ భీమేశ్వరస్వామి, ఈ రీతిగా నివి పది మధ్యాక్కఱ శతకములైనవి. వేయి పద్యములైనవి. దానికే ఢిల్లీలోని కేంద్ర సాహిత్యపరిషత్తువారు బహుమాన మిచ్చిరి. నాకే బహుమానము వచ్చినను సరే, దానికెంతో హంగామా జరుగవలయును. ఆ బహుమానము కొందరు నాకు రాకుండ చేయుదురు. కొన్ని ఏండ్లు జరుగును. వారు కొంత యప్రతిష్ఠ బడుదురు. అప్పటికి నాయందు అభిమానము కలిగినవారికి బలము చేకూరును. తక్కినవారు నోరెత్తలేని స్థితిలో నుందురు. అప్పుడు బహుమానము వచ్చును. ఇది నా జాతక లక్షణము. నా ఉపాస్య దైవములు నాకు ఎక్కువ యాధ్యాత్మికముగా, తక్కువ లౌకికముగా ఉపయోగింతురు. (1947–1972 : నేనూ – నా సాహిత్య రచనలు : శ్రీ విశ్వనాథ సత్యనారాయణమహతి ఆగష్టు 1972, యువభారతి ప్రచురణ నుంచి; వారి సౌజన్యంతో)

తాజమహల్‌లో ఒక శివాలయము ఉన్నదట. దానిపేరు తేజోమహాలయము, అందులో అగ్రేశ్వరుడనబడే శివలింగముండేది. మొగల్ చక్రవర్తులు దానిని అపవిత్రం చేసి, సమాధిగా మార్చారని పెద్దలు చెబుతుంటారు. అలా కాలగర్భంలో కలిసిపోయిన, రూపు మార్చుకొన్న శివాలయాలు కొన్ని ఉంటే నెకరుకల్లు ప్రాంతములో శివాలయము బయట పడటము, అందులోని విశ్వనాథుడు, ఇంకొక విశ్వనాథునికి కనిపించి శతకము వ్రాయించుకోవటం తెలుగువారి అదృష్టము.

హేతుహీన సనాథ (కారణమును విడిచి రక్షించువాడా!) అని ఒక విచిత్రమైన శివ పరమయిన సంబోధన. సృష్టిలో ఏ పనయినా జరగటానికి ఈ 1. స్వభావము, 2. ఈశ్వరుడు, 3. కాలము, 4. యదృచ్ఛ, 5. నియతి (పూర్వజన్మ సంపాదిత ధర్మాధర్మములు), 6. పరిణామము అను ఆఱును కారణములని పెద్దలు చెబుతారు. శివుడిని భక్తితో ఆశ్రయిస్తే – జీవితంలో భక్తులకు అనివార్యములైన ఈ కారణముల

ప్రభావము లేకుండా వారిని రక్షిస్తాడు. శివ మహత్తులను దృష్టిలో పెట్టుకొని విశ్వనాథ ఈ ప్రయోగం చేసారు.

"నేనన్నదే లేని యిపుడు పాపముల్ నేనేమి సేతు / నేనేమి సేతు బాపములు చేసితి నీవనెదేని / నేనన్న భ్రాంతి మాయించు నీవును నేను నదొక్క చేనిలో పంటగా" (43వ పద్యము) – శివుడు చేను అయితే భక్తుడు పంటట. పంటకి సంబంధించిన గుణాలకు – చేను మూలకారణము కదా! అంటూ తన పాపాలకు సంబంధించి శివునితో కవి "నేను" తర్కము చేసాడు. ఇటువంటి అద్భుత తర్క సహితమైన – విశ్వనాథకు మాత్రమే సాధ్యమయిన పద్యరత్నాలెన్నో ఈ శతకంలో ఉన్నాయి. ❁

## 90

**శివమీడేస్తవము** లోని మొదటి శ్లోకము.



**శ్లో॥ వైలక్షణ్యం ధామసు యస్య త్రిషు సిద్ధం**
**భోజ్యాద్భోక్తుర్భోగత ఏవం త్రివిధాచ్చ ।**
**యస్మాచ్ఛ్రుత్వా నాస్తి చ కశ్చిద్వ్యతిరిక్తః**
**తం చిన్మాత్రం సాక్షిణమేకం శివ మీడే ॥**

ప్రతిపదార్థము : యస్య = ఎవరికి; త్రిషు ధామసు = మూడు అవస్థలలోను (జాగ్రత్, స్వప్న, సుషుప్తులు); వైలక్షణ్యమ్ = విలక్షణత; సిద్ధమ్ = సిద్ధంగా ఉన్నదో; ఏవమ్ = ఈ విధముగా; త్రివిధాచ్చ = త్రివిధాత్ + చ = మూడు విధములుగా ఉన్న; భోజ్యాత్ = భోజ్యమునకంటె; భోక్తుః = భోక్త కంటె; భోగతః = భోగము కంటె; వైలక్షణ్యమ్ = విలక్షణత; సిద్ధమ్ = సిద్ధంగా ఉన్నదో; యస్మాత్ = ఎవనికంటె; వ్యతిరిక్తః = విభిన్నుడయిన వాడు; కశ్చిత్ + చ = ఎవడును; నాస్తి = లేడో; తమ్ = అటువంటి; చిన్మాత్రమ్ = శుద్ధజ్ఞానరూపుడైన (1. The spiritual body, 2. The intellectual form); సాక్షిణమ్ = సాక్షియైన; శివమీడే = శివమ్ + ఈడే = శివుని పొగుడుచున్నాను.

**తాత్పర్యము :** జాగ్రత్, స్వప్న, సుషుప్తులు అను మూడు అవస్థలకంటె భిన్నుడు, భోజ్యమునకంటె భోక్తమంటె భోగముకంటె వేరయినవాడు, అటువంటి శుద్ధజ్ఞాన రూపుడైన, సాక్షియైన శివుని పొగుడుచున్నాను.

**విశేషాలు :** ఈ శ్లోకము బాగా అర్థము కావాలంటే త్రిపుటి గురించి బాగా తెలియాలి.

విషయముయొక్క మూలము వరకు ప్రవేశించి నిశ్చయముతో కూడిన జ్ఞానాన్ని

పొందుట (యథార్థ జ్ఞానము) **ప్రమ** అంటారు. ఇటువంటి ప్రమ కలిగిన వ్యక్తి **'ప్రమాత'**, 'ప్రమ' ను కలుగజేసే విశిష్టసాధనము **'ప్రమాణము'**. 'ప్రమ'కు సంబంధించిన విషయమే **'ప్రమేయము'**. ఈ ప్రమాత, ప్రమాణ, ప్రమేయము మూడింటిని కలిపి **'త్రిపుటి'** అంటారు.

1. జ్ఞాత, 2. జ్ఞానము, 3. జ్ఞేయము (తెలుసుకునేవాడు – తెలుసుకోవడం – తెలుసుకునే వస్తువు), 1. కర్త, 2. కారణము, 3. కార్యము; 1. దృష్టము, 2. దర్శనము, 3. దృశ్యము – ఇవి త్రిపుటులు. శివుడు ఈ త్రిపుటికి అతీతుడు. అనగా ఆయనకంటే వేరయినది ఏదీ లేదు. అన్నీ ఆయనే అని భావం.

బిల్వదళములోని మూడు రేకులను కలిపి ఆధ్యాత్మికంగా **త్రిపుటి** అంటారు. పూజకుడవు నీవే, పూజింపబడునది నీవే, పూజాక్రియవు నీవే. ("పూజకుడు – పూజ్యము – పూజ") అను భావనను కలిగించే **బిల్వపత్రాన్ని** అందుకే అంత పవిత్రంగా భావిస్తారు.

జ్ఞానవాసిష్ఠములో ఉన్న ఈ **"శివమీడే"** స్తవములో మొత్తం 42 శ్లోకాలు ఉన్నాయి. ఈ "శివమీడే" స్తవాన్ని శ్రీ దోర్బల విశ్వనాథ శర్మగారి హర్షిణీ వ్యాఖ్యానముతో తెలుగులో పెద్దలు శ్రీ రావి మోహనరావు గారు ప్రచురించారు.

**"తం చిన్మాత్రం సాక్షిణమేకం శివమీడే"** అని ఈ స్తవములోని ప్రతి శ్లోకములోని చివర ఉంటుంది. ఈ శ్లోకం **మత్తమయూరఛందస్సు**లో ఉంది. ప్రతిపాదములో వరుసగా మతయసగ గణములు వస్తాయి.

ఆనందనాథుని శిష్యునిగా చెప్పబడే త్యాగరాజు పేరు మీద (సంగీతకారుడు కాదు) "శివమీడే" అని ఇంకొక స్తోత్రం ఉంది. "తం సర్వాఘధ్వంసకమాద్యం శివమీడే" అని ఈ పుస్తకంలోని ప్రతి శ్లోకం చివర ఉంది. ❁

## 91

శ్రీ వ్యాఘ్రపాదమునీంద్రవిరచిత **"శ్రీ శంకరవందనస్తోత్రము"**లోని మొదటి శ్లోకము.

**శ్లో॥ వందే శంభుముమాపతిం సురగురుం వందే జగత్కారణం**
**వందే పన్నగభూషణం మృగధరం వందే పశూనాం పతిమ్ ।**
**వందే సూర్యాశశాంకవహ్నినయనం వందే ముకుందప్రియం**
**వందే భక్తజనాశ్రయం చ వరదం వందే శివం శంకరమ్ ॥**

**ప్రతిపదార్థము :** శంభుమ్ = సుఖము కలిగించువాడు, సుఖరూపియైన వానికి (శం సుఖం భవతి అస్మాత్ శంభుః); ఉమాపతిమ్ = పార్వతీదేవి భర్తకు; సురగురుమ్ = బృహస్పతి రూపములో ఉన్నవానికి, దేవతలకు గురుస్థానములో ఉన్నవానికి; జగత్కారణమ్ = ప్రపంచ సృష్టికి కారణమయిన వానికి; పన్నగభూషణమ్ = పాదములచేత పోవనిది, పడినట్టుగా పోవునది కనుక పాముకు పన్నగమని పేరు. (పద్భ్యాం న గచ్ఛతీతి పన్నగః – పన్నం పతితం యథా తథా గచ్ఛతీతి పన్నగః) ఆ పాములను భూషణముగా కలవానికి; మృగధరమ్ = లేడిని ధరించినవానికి (లేడి మాయకు గుర్తు); పశూనాం పతిమ్ = పశువులకు పతియైన వానికి (పశువులనగా ప్రమథులు, జంతువులు. వానికి ప్రభువు. పశువులనగా జీవులు. వారిని సంసారబంధమునుంచి రక్షించువాడు); సూర్య = సూర్యుడు (వ్యాపారములయందు ప్రేరేపించువాడు – షూఞ్ ప్రేరణే); శశాంక = చంద్రుడు (కుందేటిని గుర్తుగా కలవాడు); వహ్ని = అగ్ని (హవ్యమును దేవతలకు చేర్చువాడు – వహతి ప్రాపయతి హవ్యమితి వహ్నిః వహ ప్రాపణే); నయనమ్ = కన్నులుగా కలవానికి (నీయతే అనేన నయనం. ణీఞ్ ప్రాపనే. దీనిచేత అర్థములు పొందించబడును); ముకుందప్రియమ్ = విష్ణుమూర్తికి ఇష్టమయిన వానికి (మోక్షము నిచ్చువాడు ముకుందుడు); భక్తజనాశ్రయం చ = భక్తజనులకు ఆశ్రయము అయిన వానికి; వరదమ్ = వరములు ఇచ్చువానికి; శివమ్ = శివునికి (బ్రహ్మానంద స్వరూపుడు, నిర్వికారుడు కనుక శమించి ఉండువాడు కనుక శివుడు. సజ్జనుల మనస్సులు ఎవరియందు ఉంటాయో అతడు శివుడు. సాధువుల మనస్సులందు శయనించి యుండువాడు శివుడు. శివమనగా శుభము. దానితో కూడియుండు వాడు శివుడు.); శంకరమ్ = సుఖమును కలుగచేయు శంకరునికి (శం సుఖం కరోతీతి శంకరః – సుఖమును కలుగచేయువాడు. డుకృఞ్ కరణే); వందే = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** సుఖరూపియైన వానికి, పార్వతీదేవి భర్తకు దేవతలకు గురుస్థానములో ఉన్నవానికి, ప్రపంచ సృష్టికి కారణమయిన వానికి, పాములను భూషణముగా కలవానికి, లేడిని ధరించినవానికి, పశువులకు పతియైన వానికి, సూర్యుడు చంద్రుడు, అగ్ని మూడు కన్నులుగా కలవానికి, విష్ణుమూర్తికి ఇష్టమయిన వానికి, భక్తజనులకు ఆశ్రయము అయిన వానికి వరములు ఇచ్చువానికి, శివునికి, సుఖమును కలుగచేయు శంకరునికి నమస్కరించుచున్నాను.

**విశేషాలు :**

ఈ శ్లోకములో వందే నమస్కరించుచున్నాను – అని ఎనిమిది సార్లు వచ్చింది. ఒకసారి “వందే” అంటే సరిపోతుంది. ఎనిమిది సార్లు “వందే” అనటానికి కారణము భక్తితో కూడిన ఆర్తి ఒక కారణమయితే, శివుడు అష్టమూర్తి కావటం ఇంకో కారణం. (పంచభూతములు, సూర్యచంద్రులు, యాగముచేయు యజమానుఁడు శివుని అష్టమూర్తులు.) ఆ అష్టమూర్తులలో సూర్యచంద్రులు మొదలయినవి ఈ శ్లోకములో వర్ణింపబడ్డాయి. ఇందులో శశాంకుని శివుని నయనంగా కవి పొగిడితే, శంకర భగవత్పాదులవారు “రాజమౌళీ” అంటూ శివునితో ఇలా మాట్లాడారు.

జడతా పశుతా కలంకితా<br>
కుటిల చరత్వం చ నాస్తి మయి దేవ<br>
అస్తి యది రాజ మౌలే<br>
భగవదాభరణ్యస్య నాస్మి కిం పాత్రమ్ (శివానందలహరి – 69)

కుటిలత కళంకితయునా / పటు జడిమముపశుగణముల బంధమునావ / ద్దటునిటులేదున్నను; నీ స్ఫుటదాదరమున నేను పొందగ తగనా? – (తాడేపల్లి పతంజలి శివానందలహరి అనువాదము 2005) జడత్వము, పశుత్వము, కళంకము, కుటిల బుద్ధి నాయందు లేవు దేవా! ఒకవేళ ఉన్నా నీ ఆభరణముగా నుండుటకు తగనా? అని దీని భావం.

శివుని **‘రాజమౌళీ’** అని పిలవటంలో శ్లేష ఉంది. ‘రాజమౌళి’ అంటే – చంద్రవంకను శిరస్సుమీద ఆభరణముగా ధరించినవాడా’ అని అర్థము. శివుని ఆభరణమైన చంద్రుని ప్రస్తావనతో ఆయన ఆభరణాలను లక్షణాలను వ్యంగ్యంగా కవి ప్రస్తావిస్తున్నాడు. శివుడు కట్టుకున్న పులితోలు జడము. చేతిలో ధరించిన లేడి పశువు, నెత్తిన పెట్టుకొన్న చంద్రుడు మచ్చ కలిగినవాడు. ఇంకో ఆభరణమయిన పాము కుటిల బుద్ధి కలది. శివా! నీవు ధరించిన పులితోలులా నాకు జడత్వము లేదు. నీ చేతిలోనున్న లేడిలా పశుత్వము లేదు. చంద్రునిలా నాకు మచ్చలేదు. పాములా నాకు కుటిలత్వము లేదు. ఓ రాజమౌళీ! ఒకవేళ జడత్వము మొదలయిన లక్షణాలు నాలో ఉన్నా, జడత, కుటిలత లక్షణాలు కలిగినవి నీకు ఆభరణాలైనప్పుడు నేను మాత్రం నీకు ఎందుకు ఆభరణం కాను? వాటికేనా అర్హత? నాకు లేదా? అని దబాయింపు.

ఇది శివుని విమర్శ కాదు. భక్తి ఉంటే చాలు ఎటువంటి వాటినయినా ఆమోదించి రక్షించే బోళాశంకరుని స్తుతి. పైకి నింద కనబడుతున్నా, లోపల స్తుతి. దీనిని వ్యాజస్తుతి అలంకారము అంటారు. ❀

## 92

తులసీదాస్ (1554–1680) శ్రీరామచరితమానసములోని శివమంగళాచరణము.



**శ్లో॥ భవానీశంకరౌ వందే**
**శ్రద్ధావిశ్వాసరూపిణౌ ।**
**యాభ్యాం వినా న పశ్యంతి**
**సిద్ధాః స్వాంతఃస్థమీశ్వరమ్ ॥**

**ప్రతిపదార్థము :** యాభ్యాం వినా = ఏవి లేకపోతే (శ్రద్ధావిశ్వాసములు లేనిదే); సిద్ధాః = సిద్ధులు; స్వాంతఃస్థమ్ = స్వ + అంతఃస్థమ్ = తమ అంతఃకరణములలో ఉన్న; ఈశ్వరమ్ = ఈశ్వరుని; న పశ్యంతి = దర్శింపలేరు; (అట్టి); శ్రద్ధావిశ్వాసరూపిణౌ = శ్రద్ధా విశ్వాసములకు ప్రతీకలయిన (విశ్వసన్తి అనేనేతి విశ్వాసః శ్వస ప్రాణనే – దేనిచేత ఊరడిల్లుదురో అది విశ్వాసము); భవానీశంకరౌ = పార్వతీపరమేశ్వరులకు (భవస్య పత్నీ భవానీ, శివుని భార్య భవాని); వందే = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** శ్రద్ధావిశ్వాసములు లేకపోతే సిద్ధులు తమ మనస్సులలో ఉన్న ఈశ్వరుని చూడలేరు. అటువంటి శ్రద్ధా విశ్వాసములకు ప్రతీకలయిన పార్వతీపరమేశ్వరులకు నమస్కరించుచున్నాను.

**విశేషాలు :**

సాధారణ వ్యక్తులలో లేని అతీంద్రియశక్తులను సిద్ధులు అంటారు. ఇవి ఐదు విధాలు 1. పూర్వజన్మలో సాధనవల్ల కలిగేవి, 2. ఓషధుల వల్ల కలిగేవి, 3. మంత్రాలవల్ల కలిగేవి, 4. తపస్సువల్ల కలిగేవి, 5. సమాధి స్థితివల్ల కలిగేవి (పాతఞ్జల యోగశాస్త్రం కైవల్యపదం) ఈ సిద్ధులు కలిగినవారు సిద్ధులు.

**అంతర్ + కరణమ్**. లోపలి యింద్రియము. ఇది కర్మధారయ సమాసము (ఇందలి విసర్గము కకారమునకు ముందు ఊర్ధ్వాధోముఖములుగా నుంచెడు అర్ధచంద్రాకృతియగు విసర్గము. దీనినే **జిహ్వామూలీయము** అంటారు.) అంతఃకరణములు వేదాంతులు మతమున మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము అని అంతఃకరణములు నాలుగు

విధములు. వీనికి క్రమముగా సంశయము, నిశ్చయము, గర్వము, స్మరణము - విషయములు.

ఈశ = ఐశ్వర్యే - అనువిష్టేచ - ఈశ్ + వరచ్. (కృత్ప్రత్యయము) శివుఁడు. సర్వాంతర్యామి అయిన భగవంతుఁడు. ఈ పేరు సాధారణముగ సగుణబ్రహ్మ స్వరూపమును తెలియచేస్తుంది.

**శ్రద్ధ అంటే** 1. ఆస్తిక్యబుద్ధి, 2. ప్రగాఢ విశ్వాసంతో పెద్దల / గురువుల మాట వినడం / పాటించడం. వేదం, శాస్త్రం చెప్పే విషయాల పట్ల గౌరవం, 3. వైరాగ్యం, 4. మనో నైర్మల్యం.

పరమేశ్వరుని ఆజ్ఞచే అవధిలో (హిందీ వ్యావహారిక భాష) రాయబడిన శ్రీరామ చరిత మానస్ గ్రంథముపై పరమశివుడు **"సత్యం శివం సుందరమ్"** అని వ్రాసి సంతకం చేసాడట. అంతటి పవిత్రమైన గ్రంథము **రామచరిత మానస్.** (గీతా ప్రెస్ వారి రామచరిత మానస్ నివేదనలో)

వాల్మీకికి నారదమహర్షి గురుస్థానంలో ఉండి అతనిచేత రామాయణం ఎలా వ్రాయించాడో అదేవిధంగా తులసీదాసు చేత కూడా హనుమంతుడు గురుస్థానంలో ఉండి, రామచరిత మానస్‌ను వ్రాయించాడని చెబుతారు. తులసీదాసు ఒక తన సంకీర్తనా సమయంలో వృద్ధబ్రాహ్మణుని రూపంలో వున్న హనుమంతుని తెలుసుకుని అతనిని ప్రార్థించి రామదర్శనము చేయించమని వేడుకొంటాడు. హనుమంతుడు తులసీదాసుకు రామదర్శనం చేయించి అతని చేత రామాయణం రచింపచేశాడు.

'రచిమహేస నిజమానసరాఖా - పాఇ సుసమ ఉసివాసన భాషా
తాతేరామ చరిత మానసబర, ధరెఉనామ, హియహేరి, హరషిహర'
(బాలకాండ 34వ దోహా కింద ఉన్న 06వ చౌపాయి పంక్తులు)

శివుడు తాను స్వయంగా రచించి తన మనసములో నిక్షేపించుకున్న రామచరిత్రను తగిన సమయములో పార్వతికి చెప్పాడు. కనుకనే దీనికి 'రామచరితమానస'మని పేరు వచ్చింది.

వాక్కు, అర్థముల పోలికతో పార్వతీపరమేశ్వరులను కాళిదాసు నుతిస్తే, శ్రద్ధావిశ్వాసముల పోలికతో తులసీదాసు పార్వతీపరమేశ్వరులను వినుతించాడు. శ్రద్ధ ఉన్నచోట నమ్మకము, నమ్మకమున్నచోట శ్రద్ధ తప్పక కలిసి ఉంటాయి. ఉండాలి కూడా.

వక్రముగా ఉన్న చంద్రుడు కూడా శివుని ఆశ్రయించుట చేత అందరి జనులచే పూజలు అందుకొంటున్నాడు. అటువంటి జ్ఞానస్వరూపుడయిన, నిత్యుడైన, ఆదిగురువయిన శివునకు నమస్కారము అని తులసీదాసు రామచరితమానసములో ఇంకొక మంగళాచరణ శివస్తుతి. (రామచరిత మానస్ – బాలకాండ 3వ శ్లోకం). బుద్ధులలో వంకరతనం పోవాలని తులసీదాసుతో పాటు మనం కూడా శివుడిని ప్రార్థిద్దాం. ❁

## 93

టేకుమళ్ల రంగశాయికవి (15వ శతాబ్ది) **వాణీవిలాసవనమాలిక** లోని శివస్తుతి.

**హారకిరీటభాక్కమలహారికి వారణదైత్యవీర ని**
**ర్హారికి రౌప్యభూధరవిహారికి దేహవిభాజితాతి నీ**
**హారికి గాలకూటపరిహారికి సంతతసంశ్రితామృతా**
**హారికి జిహ్మగప్రకరహారికి మ్రొక్కెద గార్యసిద్ధికిన్.**

**ప్రతిపదార్థము :** హార కిరీట = హారము, కిరీటములతో; భాక్కమలహారికి = భాక్ + కమలహారికి = ప్రకాశించు కోరబడిన అందమయిన వానికి (కమల అనగా ఇక్కడ కము కాంతౌ = కోరబడునది); వారణ = అడ్డగించు; దైత్యవీర = రాక్షసవీరుల; నిర్హారికి = దూరముగా తరిమివేసి వ్యాపించిన కీర్తి పరిమళము కలవానికి; రౌప్య భూధర = వెండికొండ యైన కైలాసములో; విహారికి = విహరించువానికి; దేహ = శరీరములో; విభాజితాతి = విభాజిత + అతి నీహారికి = విభజింపబడిన అతి చల్లదనము కలిగిన చంద్రునికి (చంద్రుడు నీహార మయూఖుడు. అతి నీహారి– బాగా చల్లదనము కలిగిన కిరణములు కలవాడు. అటువంటి చంద్రుని – శివుడు అర్ధదేహుడై – రెండుగా తనకు, అమ్మకు విభజించాడని భావము.); కాలకూటపరిహారికి = విషమును పరిహరించినవానికి (పరిహరించు అంటే తప్పించు. లోకానికి విషముయొక్క ప్రమాదాన్ని తప్పించినవాడు కనుక శివుడు కాలకూట పరిహారి); సంతత = ఎప్పుడూ; సంశ్రితామృతాహారికి = ఆశ్రయింపబడిన అమృతము ఆహారముగా గలవానికి (అమృతము ఆహారముగా గల దేవతల సమూహముచే ఆశ్రయింపబడినవాడని అర్థం); జిహ్మగప్రకరహారికి = వంకరగా పోవు పాముల సమూహము హారముగా కలవానికి; కార్యసిద్ధికిన్ = కార్యము నెరవేరుట కొరకు; మ్రొక్కెద = మ్రొక్కెదను.

**తాత్పర్యము :** హారము, కిరీటములతో ప్రకాశించు అందమయిన వానికి, రాక్షసవీరులను దూరముగా నెట్టి వ్యాపించిన కీర్తి పరిమళము కలవానికి, వెండికొండయైన కైలాసములో విహరించువానికి, చంద్రుని దేహములో రెండుగా విభజించిన వానికి, విషప్రమాదమును లోకానికి తప్పించినవానికి, అమృతము ఆహారముగా గల దేవతల సమూహముచే ఆశ్రయింపబడినవానికి, వంకరగా పోవు పాముల సమూహము హారముగా కలవానికి – పరమశివునికి – కార్యము నెరవేరుట కొరకు మ్రొక్కెదను.

**విశేషాలు :**

వనమాలకు నాలుగు రకాల అర్థాలున్నాయి. 1. మోకాళ్ళవరకు వ్రేళ్లాడుతూ, అన్ని ఋతువులలోనూ పూచే పూలతో, మధ్యన పెద్దగుచ్ఛంతో విష్ణుమూర్తి మెడలో ఉండే దండ. 2. పంచతన్మాత్రలకు (శబ్దస్పర్శరూపరసగంధముల) రూపమైన దండ. 3. చివురుటాకులు, పూలు కూర్చిన దండ. 4. శివకేశవభేదం లేని దండ.

**వణ్యతే శబ్ద్యతే ఇతి వాణీ. వణ శబ్దే.** పలుకబడునది అని వాణీ పదానికి అర్థము. సరస్వతీదేవి యొక్క సొగసులతో కూడిన వనమాల **వాణీవిలాసవనమాల**. శబ్దవిలాసము, అర్థవిలాసము, అలంకార విలాసము – ఇటువంటివన్నీ వాణీ విలాసాలు. అన్నీ చివురుటాకులుగా పూలుగా మారి వేంకటేశుని మెడలో వేసిన వనమాల (వేంకటేశుడు ఈ కావ్యకృతిభర్త) ఈ కావ్యము.

తిరువళ్ళూరి వీరరాఘవ శతకము, కృష్ణదండకము, జానకీ పరిణయము (యక్షగానము), ద్విపద భాగవతము ఈ **టేకుమళ్ళ రంగశాయికవి** ఇతర రచనలు.

ఈ నాందీ పద్యము పోతనగారి పాఠశాలలో చదువు నేర్చుకొని వచ్చినట్లుంది. హారికి పదం – అనుప్రాసాలతో వయ్యారాలు పోయింది.

హారికిరీంద్రవిగ్రహవిహారికి నాశ్రితబృందదుఃఖసంహారికి,
ధూతదేవనివహారికి, కౌస్తుభసంజ్వలన్మణీ
హారికి హస్తపద్మగమహారికి సాగరాబాలికామనో
హారికి వాహనత్పణవహారికి శౌరికి గేలు మోడ్చెదన్

(రాఘవ పాండవ యాదవీయము – అయ్యగారి వీరభద్రకవి 01–02 పద్యం)

ఇందులో "హారికి", టేకుమళ్ళ వారి పద్యంలో "హారికి" దగ్గరి సంబంధాలున్నాయి.

మొత్తము నాలుగు ఆశ్వాసములు ఉన్న ఈ **"వాణీవిలాసవనమాల"** కావ్యములో

ఈ కవి బ్రహ్మస్వరూపము, బ్రహ్మాండ విభావములు మొదలైనవి వర్ణింపబడినవి. మొదటినుంచీ చివరిదాకా కొనసాగే ప్రత్యేకమైన కథ అంటూ ఇందులో ఏదీ లేదు. మొదటి ఆశ్వాసములో అష్టాదశస్మృతులు మొదలయినవి వర్ణింపబడ్డాయి. రెండవ ఆశ్వాసములో భారతదేశ నదులు, కాశీ, గయ మొదలయిన వర్ణనలున్నాయి. మూడవ ఆశ్వాసములో జలంధరోపాఖ్యానము. తులసీ ప్రభావము మొదలయినవి ఉన్నాయి. నాలుగవ ఆశ్వాసములో ఆయుర్వేదము మొదలయిన వర్ణనలు ఉన్నాయి.

ఐలుడను రాజు కడు నసహ్యమగు రూప
వంతుడై మాఘుసుస్నానమహిమ వలన
నలరు విలుకాని చెలువున వెలసెననుచు
నా దిలీపునితో మునియనియె మఱియు"

ఇది మాఘస్నాన మహిమను తెలుపుచూ కవి చెప్పిన పద్యము. దీనికి వ్యాఖ్యానము అవసరము లేదు. ఇది టేకుమళ్ల వారి లలితశైలికి ఉదాహరణము.

వెంకటేశుడు టేకుమళ్లవారి కలలో కనబడి "నా వనమాల విధముగా నువ్వు వ్రాసే వనమాల గ్రంథము ప్రకాశిస్తుంది" అని చెప్పారట. (పీఠిక) 1953 లో సిపిబ్రౌన్ ముందుమాటతో అచ్చు పొందిన ఈ వాణీవిలాస వనమాలిక కాంతి సాహిత్యములో ఇతోధికముగా కనబడాలని ఆశిద్దాం. (ఈ పుస్తకమును నాకు పిడిఎఫ్ ఫైల్ రూపంలో నాకు పంపిన ఆత్మీయ మిత్రులు శ్రీ టేకుమళ్ళ వెంకటప్పయ్యగారికి ధన్యవాదములు) ❁

## 94

బేతవోలు రామబ్రహ్మంగారి **శృంగారశ్రీకంఠము** లో శివపరివారస్తుతి

**గండ ప్రసవదంబు పారణ రట త్కాలాళి వైధూననో**
**ద్దండ ప్రక్రియ నోడిపోవుటగకుబ్దంతీంద్ర కర్ణామయో**
**చ్చండంబౌ గతి ఘీంకరించుదు గజాస్య స్వామి – షడ్వక్త్ర వా**
**హాండేజోత్తము నృత్తముల్ బహువిధాంహస్తాదనైకాఢ్యముల్.**

**ప్రతిపదార్థము :** గండ = చెక్కిలినుండి (గండతీతి గండః – గడి వదనైక దేశే. కూడుకొని ఉన్నది); ప్రసవత్ = పుట్టుచున్న; అంబు = ఏనుగు మదజలమును (the juice of rut, the ichor of a ruttish elephant.); పారణ = ఆహారముగా స్వీకరించుటకు; రటత్ =

ధ్వనించే; కాల + అళి = నల్లని తుమ్మెదలను; వైధూనన = విదిలించుటచే (ధూఞ్ కంపనే. ధూ విధూననే. విదిలించుట.); ఉద్దండ = ఎక్కువైన; ప్రక్రియన్ = విధానములో; ఓడిపోవుటన్ = ఓడిపోవుటచే; కకుప్ = దిక్కులను (కేన సూర్యేణ స్కభ్నం తిద్యోతంత ఇతి కకుభః – సూర్యునిచేత ప్రకాశించునవి కనుక దిక్కులకు కకుప్పులని పేరు); దంతీంద్ర = 1. ఐరావతము, 2. పుండరీకము, 3. వామనము, 4. కుముదము, 5. అంజనము, 6. పుష్పదంతము, 7. సార్వభౌమము, 8. సుప్రతీకము అను దిక్కులందుండు ఎనిమిది ఏనుగుల; కర్ణామయోచ్చండంబౌ గతి = కర్ణ + ఆమయ + ఉచ్చండంబు + ఔ గతి = చెవులకు రోగము కలిగించు విధముగా మిక్కిలి భయంకరంగా (ఆమయము = మీఙ్ హింసాయామ్ – ఆ + మీ + అచ్. (కృత్ప్రత్యయము) దేనిచేత హింసింపఁబడుదురో ఆ రోగమును ఆమయము అంటారు); గజాస్య స్వామి = ఏనుగు తొండము మోముగా కలిగిన వినాయక స్వామి; ఘీంకరించుడు = అరవగా (ఏనుగు అరుపుకు ఘీంకారము అని పేరు); షడ్వక్త్ర వాహ = ఆరు మోములు కలిగిన కుమారస్వామి వాహనమైన; అండేజోత్తము = నెమలి యొక్క; నృత్తముల్ = నాట్యములు; బహువిధాం హస్తాడనైకాఢ్యముల్ – బహువిధ + అంహః + తాడన + ఏకాఢ్యముల్; బహువిధ = అనేక విధములైన; అంహస్ = పాపములను (అంహతి నరకమనేన అంహః – అహి గతౌ. దీనిచేత జనులు నరకమును పొందుదురు.); తాడన = కొట్టుట యందు; ఏకాఢ్యముల్ = ఒకేవిధమైన అతిశయము కలవి.

**తాత్పర్యము :** శివుని పెద్దకుమారుడయిన వినాయకుడిది ఏనుగు ముఖము. కనుక ఆయనగారి చెక్కిలినుండి మదరసము కారుతోంది. ఆ మదరసాన్ని ఆస్వాదించటానికి నల్లటి తుమ్మెదలు వచ్చి గుంపులుగా చప్పుడు చేస్తూ వాలుతున్నాయి. వినాయకునికి చిరాకు పుట్టి ఆయన పెద్ద చెవులతోటి ఆ తుమ్మెదలను విదిలించాలని బాగా ప్రయత్నం చేసాడు. తుమ్మెదలు పోలేదు. దిక్కులు మోస్తున్న ఏనుగుల చెవులకు తట్టుకోలేక రోగము వచ్చేటట్లు తుమ్మెదల అల్లరి తట్టుకోలేని వినాయకుడు పెద్దగా అరిచాడు. ఈ వినాయకుని అరుపులు ఉరుముల చప్పుళ్లలా కుమారస్వామి వాహనమైన నెమలికి అనిపించిందట. మేఘము మెరుపుకి నెమలి పురివిప్పి నాట్యము చేయటం మామూలే కదా! అందుకే పురివిప్పి నాట్యము చేయటం మొదలుపెట్టింది. ఆ నెమలియొక్క నాట్యాలు మనందరి యొక్క పాపాలను పైకి లేవకుండా చితక్కొట్టుగాక! (మనందరి పాపాలను నశింపచేయుగాక)

**విశేషాలు :**

శ్రీశంకరభగవత్పాదులవారి శివపరివారస్తోత్రశ్లోకానికి ఈ నాందీ పద్యము స్వేచ్ఛానువాదమని ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారిని కలిసినప్పుడు స్వయంగా చెప్పారు.

1982లో ప్రచురితమయిన శృంగారశ్రీకంఠములో మొత్తం నూట నాలుగు పద్యాలు. కాలకూటమను పేరుగల విషమును భరించుట వలన కలిగిన శ్యామ శోభ కంఠమందు కలవాడు కనుక శివునికి శ్రీకంఠుడను పేరు వచ్చింది. శ్రీకంఠునికి సంబంధించిన శృంగార వర్ణనలు కలిగినది శృంగార శ్రీకంఠము. విష్ణువుకు, మిగతా దేవతలకు శృంగార వర్ణనలు ఎక్కువ. శివునికి సాహిత్యంలో చాలా తక్కువ శృంగార వర్ణనలున్నాయి. ఆ లోటును ఈ శృంగార శ్రీకంఠము పూర్తి చేసింది.

"ఓ నాథా! శివా! చూసావా! నా సవతి గంగమయొక్క గడుసుతనం. నీ కంఠమందు ఆవిడగారి కంటి కాటుక అంటుకొంది. దానిని అలానే ఉంచి నిన్ను బయటికి పంపించింది. ఏమంటానికి లేదు" అని శివుని కంఠమందున్న కాటుకను పయటతో తుడుస్తున్న పార్వతిని చూసి పకాలున నవ్వు శివుని నేను కొలిచెదను".

"నేలకు పోయేదానిని నెత్తి పెట్టుకొన్న స్వామివి నీవయ్యా! (గంగను నెత్తిమీద పెట్టుకొన్నావనటానికి వక్రోక్తి) ఎంత దయో నీది! చెప్పలేను" అని పరిహాసము చేయు పార్వతి పలుకులకు నవ్వు శివుని నేను కొలిచెదను".

మనోహరములైన కంకణముల చప్పుడు ఆకాశమునందుండి శివుని చెవులలో పడింది. వెంటనే "రమ్మా! గంగా! కౌగిలికి" అనుచూ శివుడు చేతులు చాచాడు. పక్కనే ఉన్న పార్వతి రోషముతో చూసింది. వెంటనే వేరే మాటలు మాట్లాడుట మొదలుపెట్టిన శివుని నేను కొలిచెదను" ఇటువంటి మనోహరములైన వర్ణనలు ఎన్నో ఈ శృంగార శ్రీకంఠములో ఉన్నాయి.

దేవీభాగవతము – మొదలైన అనేక గ్రంథాలు రచించిన అవధాన సంచాలకులుగా, ఉపన్యాసకులుగా లబ్ధప్రతిష్ఠులయిన రామబ్రహ్మంగారు తి.తి.దే. భారతంలో దోషాలు సవరించమంటూ, "స్వచ్ఛ 'భారతం' సాధించలేమా?" అని ఒక వ్యాసానికి శీర్షిక పెట్టారు. మోదీగారి స్వచ్ఛభారతకాలంలో రామబ్రహ్మంగారి చమక్కు ఇది. అధునాతన కాలానికి తగినట్లుగా ప్రాచీన సాహిత్యపు మెరుగులు అద్దుతున్న కృషీవలులలో అగ్రేసరులు వీరు.

అటు చమత్కారము. ఇటు పాండిత్యము రామబ్రహ్మంగారి సాహిత్య నేత్రాలు. ప్రస్తుతం యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్ ప్రాచీన తెలుగు అధ్యయన కేంద్రం సమన్వయకర్తగా ఉన్నారు. – ఆణిముత్యాలు తెలుగు పద్యాలు సంకలనం – దాసరి లక్ష్మణస్వామిగారి **"వర్ణనరత్నాకరము"**కు సంపాదకులుగా ఉండి, అనేకమంది పండితులతో కలిసి తాను కూడా ప్రతిపదార్థతాత్పర్యవ్యాఖ్య రాస్తున్నారు. ❁

## 95

అప్పకవి (17వ శతాబ్ది) **అప్పకవీయము**లోని శివస్తుతి

**కడు కఠినంబులద్రులు జగంబుననందున సంభవించి పెం**
**పదరు నినుం గరంప వశమా యని నన్నిపుడంటివే కదా**
**వడి గనకాద్రి చాపముగ వంచిన నీకు హిమాద్రి జాతయౌ**
**పడతి గరంచుటెంతయను పార్వతి మెచ్చు శివుం దలంచెదన్.**

**ప్రతిపదార్థము :** జగంబునన్ = ఈ ప్రపంచములో; అద్రులు = పర్వతాలు; కడుకఠినంబులు = బాగా కఠినాలు; అందున = ఆ పర్వతాలలో; సంభవించి = పుట్టి; పెంపు + అదరున్ = పెరిగిన; నినుంగరంప = నినున్ + కరంపన్ = నీకు చెప్పటం; వశమా = నా తరమా; అని నన్నిపుడంటివే కదా = అని + నన్ను + ఇపుడు + అంటివే కదా = అని నాతో ఇప్పుడు అన్నావు కదా!; వడిన్ = వేగముగా; కనకాద్రి = కనక + అద్రి = బంగరు కొండ అయిన మేరు పర్వతాన్ని; చాపముగ = ధనుస్సుగా; వంచిన నీకు = వంచిన నీకు; హిమాద్రి జాతయౌ = హిమ + అద్రి జాతయౌ = మంచుకొండకు పుట్టిన; పడతిన్ + కరంచుట = స్త్రీని నూరి పోయుట, ఎంత = ఎంత పని; అను పార్వతి = అని గడుసుగా జవాబు చెప్పిన పార్వతిని; మెచ్చు = మెచ్చుకొనెడి; శివుందలంచెదన్ = శివున్ + తలంచెదన్ = శివుడిని తలుస్తాను.

**తాత్పర్యము :** "పార్వతీ! ఈ ప్రపంచములో పర్వతాలు బాగా కఠినాలు అంటారు. అటువంటి ఆ పర్వతాలలో పుట్టి పెరిగిన నీకు ఏదైనా మాట చెప్పి లొంగదీసుకోవటం నా తరమా? (నీ మనస్సు ఒకపట్టాన మెత్తపడదు. నీ మనస్సు కఠినమైనది. నిన్ను లొంగదీసుకోవటం చాలా కష్టం.) ఇది శివుని చమత్కారమైన ప్రశ్న. "బంగారు కొండ అయిన మేరు పర్వతాన్ని ధనుస్సుగా వంచిన నీకు మంచుకొండకు పుట్టిన ఈ పార్వతి అనే స్త్రీని వశపరచుకొనుట ఎంత పని" ఇది పార్వతి గడుసు జవాబు. ఈ జవాబు

చెప్పిన పార్వతిని శివుడు మెచ్చుకొన్నాడు. అలా మెచ్చుకొన్న శివుడిని తలుస్తాను. అని అప్పకవి ముక్తాయింపు.

**విశేషాలు :**

ఆరుద్రగారి లెక్కప్రకారం **కాకునూరి అప్పకవి** మహబూబ్ నగర్ జిల్లా కల్వకుర్తి తాలూకాలోని కాకునూరి అగ్రహారానికి చెందినవాడు (సమగ్ర ఆంధ్ర సాహిత్యం, 11వ సంపుటం). **అప్పకవీయము**లో 05 ఆశ్వాసాలు లభిస్తున్నాయి. మొత్తం ఆయన వ్రాసినది 08 ఆశ్వాసాలట. (వావిళ్లవారి అప్పకవీయ ప్రతిలో గిడుగు వేంకట సీతాపతి గారి పీఠిక)

"శివుడు పర్వతాలు కఠినాలని అంటుంటే – పార్వతి హిమాద్రి జాతను – మంచుకొండకు పుట్టిన దానిని అన్నది." కరిగేది మంచు. నేను కూడా కరిగే కొండ కూతురిని. నా మనస్సు మెత్తనిది కనుక కరుగుతుంది. నువ్వు చెప్పినట్టు కఠినము కాదు" అను పార్వతి జవాబులో మనోహరత్వం ఉంది.

"గౌరి" ఇలాంటి పదాలు వాడకుండా "పార్వతి" (పర్వతమునకు కూతురు) అను పదప్రయోగములో కవి నేర్పు కనిపిస్తోంది.

బంగారం కరగటానికి కొంత సమయం పడుతుంది. మంచు వెంటనే కరిగిపోతుంది. నువ్వు బంగారు కొండను వంచావు. (ధనుస్సు వంగుతుంది) వంచటమంటే వశమే కదా! అటువంటి బంగారపు కొండ వశము చేసుకొన్న నీకు, కరిగిపోయే మంచుకొండ కూతురు ఒక లెక్కా!" అని చమత్కారము.

కఱపు అంటే "బోధించుట" అని మాత్రమే కాదు. "దుర్బోధన" అని రెండో అర్థం కూడా ఉంది. "నాకు దుర్బోధలు చేయటం మీకు ఎంత పని" అని దాంపత్య సహజమైన ప్రేమపూర్వకమైన ఎత్తిపొడుపు కూడా పార్వతి చేసినట్లుగా కూడా భావించవచ్చు.

ఈ అప్పకవి పోతన కవిత్వాన్ని నిరసించాడు. సలక్షణము కాదన్నాడు. "బమ్మెర పోతరాజ కృత భాగవతంబు సలక్షణంబు గా / కిమ్మహి నేమిటం గొదువ – (2-234)

"సర్వజ్ఞ సింగయ భూపాలుడు పాతిపెట్టించిన భాగవతములో కొంత శిథిలమయింది. దానిని వెలిగండల నారపరాజు మొదలయిన వారు పూరించారు. వాటిలో లక్షణ దోషాలున్నాయి కాని పోతన కవీంద్రుని కవితలో లక్షణమెప్పుడు తప్పదు"

అని కొంతమంది అప్పకవి వాదాన్ని తిప్పికొడితే, ఒక చాటుకవి ఎవరో అప్పకవికి కాస్త ఘాటుగా వడ్డించాడు. "తుచ్ఛుడు సరిగాదనినను / స్వచ్ఛపు పోతన కవిత్వ సంపద చెడునే? / స్వేచ్ఛ జరభి దూషించిననచ్చ పతివ్రతను బాపమంటుట గలదే?" (ఇందులో జరభి అంటే రంకుటాలు.)

"ఇది చదివినపిమ్మట మరి యేది యేనియు జదువు బుద్ధి యేలా వొడమున్" (01–07) అని అప్పకవి తన కావ్యము గురించి చెప్పుకొన్న మాట. పూర్తిగా నిజము కాదు కాని నిన్న మొన్నటి దాక అప్పకవీయమును చాలా మంది తిట్టడానికో, మెచ్చుకోవటానికో చదివారు. 

## 96

పతంజలి **చరణశృంగరహితస్తోత్రము**లోని శివస్తుతి.

**సదఞ్చిత ముదఞ్చిత నికుఞ్చిత పదం ఝలఝలచ్చలిత మఞ్జుకటకం**
**పతఞ్జలిహృదఞ్జనమనఞ్జనమచఞ్చలపదం జననభఞ్జనకరం**
**కదమ్బరుచిమమ్బరవసం పరమమమ్బుదకదమ్బకవిడమ్బకగళం**
**చిదమ్బుదమణిం బుధహృదమ్బుజరవిం పరచిదంబరనటం హృది భజ**

**ప్రతిపదార్థము :** సదఞ్చిత ముదఞ్చిత నికుఞ్చిత పదమ్ = శివుడు నృత్యం చేసేటప్పుడు ఒక కాలును వంచుతున్నాడు; ఝలఝలచ్చలిత మఞ్జుకటకమ్ = అతని మనోహరమైన కాలి అందెలు నృత్య భంగిమకు అనుగుణంగా అందంగా ధ్వని చేస్తున్నాయి; పతఞ్జలి హృదఞ్జనమనఞ్జనమ్ = పతంజలికి హృదయానికి జ్ఞానదృష్టిని కలిగించే అంజనము (మంత్రగాడు నిక్షేపాదులను కనిపెట్టుటకు వాడు కాటుక.) అతడే. అనంజనము (పరబ్రహ్మము. న విద్యతే అంజనం యస్య.) అతడే; అచఞ్చలపదమ్ = అచంచలమైన స్థానము (మోక్షదాయకుడని భావం) కలిగినవాడు అతడే; జనన భఞ్జన కరమ్ = జనన మరణ చక్ర నాశనకారి అతడే; కదమ్బ రుచిమమ్బర వసమ్ = అతను కదంబు చెట్టు యొక్క సౌందర్యము కలిగి; ఆకాశాన్ని వస్త్రముగా ధరించినవాడు; పరమమమ్బుద కదమ్బకవిడమ్బకగళమ్ = ఆయన గొంతు వర్షమేఘాల సమూహాము వంటి నలుపును అనుకరిస్తుంటుంది; చిదమ్బుధమణిమ్ = అతను జ్ఞాన సముద్రంలో ఆభరణము; బుధహృదమ్బుజరవిమ్ = అతను జ్ఞానవంతుల హృదయకమలాలకు సూర్యుడు; పరచిదమ్బరనటంహృది భజ = పవిత్ర స్థలమైన చిదంబరంలో ఉన్న గొప్ప నటకుడైన శివుని హృదయములో సేవిస్తాను.

**తాత్పర్యము :** శివుడు నృత్యం చేసేటప్పుడు ఒక కాలును వంచుతున్నాడు. అతని మనోహరమైన కాలి అందెలు నృత్యభంగిమకు అనుగుణంగా అందంగా ధ్వని చేస్తున్నాయి. పతంజలి హృదయానికి జ్ఞానదృష్టిని కలిగించే అంజనము అతడే. అనంజనము (పరబ్రహ్మము) అతడే. అచంచలమైన స్థానము కలిగినవాడు అతడే. జనన మరణ చక్ర నాశనకారి అతడే. అతను కదంబచెట్టు యొక్క సౌందర్యము కలిగి; ఆకాశాన్ని వస్త్రముగా ధరించినవాడు. ఆయన గొంతు వర్షమేఘాల సమూహము వంటి నలుపును అనుకరిస్తుంటుంది. అతను జ్ఞానసముద్రంలో ఆభరణము. అతను జ్ఞానవంతుల హృదయకమలాలకు సూర్యుడు. పవిత్ర స్థలమైన చిదంబరంలో ఉన్న గొప్ప నటకుడైన శివుని హృదయములో సేవిస్తాను.

**విశేషాలు :**

నటరాజు చేస్తున్న తాండవం – ఈ శ్లోకం చదువుతుంటే మనకు వినబడుతుంది.

ఈ శ్లోకంలో పతంజలి మొదట ప్రయోగించిన ''సత్'' పదార్థము విశిష్టమయినది. పరబ్రహ్మమే సత్ / సత్తు / సత్యం. పరబ్రహ్మాన్ని పలువురు పలువిధాలుగా వ్యాఖ్యానిస్తుంటారు. **"ఏకం సత్ విప్రా బహుధా వదంతి"**. "సత్ కు ఇంకా యజ్ఞం. సాధు భావం. విష్ణు ప్రీతికరమైన కర్మ, సద్భావం, మంచి అను అర్థాలున్నాయి. ఇవన్నీ కలిగిన పరమశివుని పతంజలి సదంచిత అని నుతించాడు.

**ఇది చరణశృంగరహిత నటరాజ స్తోత్రం. కాలు కొమ్ములేని నటరాజ స్తోత్రం. అంటే ఆ ఈ ఊ ఋూ వంటి దీర్ఘాలు – చరణాలు, ఏ ఓ ఐ ఔ – కొమ్ములు ఇవి లేని స్తోత్రం.**

పతంజలికి ఒకసారి నంది శివుని దర్శనానికి అనుమతి ఇవ్వకపోతే పతంజలి అప్పుడు ఆశువుగా నటరాజును ఉద్దేశించి ఈ శ్లోకాలు చెప్పాడట. కాళ్లతో నడిచే కొమ్ములుండే జంతువు నంది. కాలు, కొమ్ము లేకుండా ఉన్న శ్లోకాలు పతంజలివి. పతంజలి ఆదిశేషుని అవతారం. ఆయన సర్ప రూపాన్ని నందీశ్వరుడు ఎందుకో ఒకసారి ఎగతాళి చేసాడట. అప్పుడు పతంజలి నంది గర్వానికి ముఖ్యాలైన శృంగములు మరియు చరణములు వదలి ఈ స్తోత్రము చెప్పాడని ఇంకొక కథనం.

ఈ శ్లోకములోని ఛందస్సు **శంభునటనవృత్తానికి** సంబంధించినది. మొత్తం 26 అక్షరములు లేదా 33 మాత్రలు. ప్రతి పాదములోనూ జ, స, న, భ, జ, స, న, భ, వ (లగ) గణాలు వస్తాయి. ఈ స్తోత్రానికి శంభునటనస్తోత్రమని కూడా పేరు.

ఒకసారి కైలాసంలో పరమశివుడు ఆనందపారవశ్యంలో తాండవం చేసే సమయంలో నారాయణుడు ఆ ఆనందాన్ని ఆనందయోగాసనంలో చూస్తున్నాడు. ఆ సమయంలో ఆయన శరీరం అంతకంతకు బరువు పెరిగింది. ఆయనను మోస్తున్న ఆదిశేషుడు బరువుకి కారణం ఏమిటి? అని అడిగాడు. అప్పుడు విష్ణుమూర్తి శివుని నాట్యం చూస్తున్న నా పరవశత్వం నీకు బాగా బరువుగా మారిందన్నాడు. అప్పుడు ఆదిశేషుడు విష్ణుమూర్తి అనుమతితో కైలాసం చేరి శివుని యోగానంద నాట్యాన్ని నటరాజ స్వరూపంలో చూసాడు. ఆ ఆలోచనలతో వెనుతిరిగి ఆకాశమార్గాన భూమి మీదికి వస్తున్న సమయంలో ఆదిశేషుని శరీరం నుంచి స్వేద బిందువులు కిందుగా ఉన్న నదీజలాలలో అర్ఘ్యం ఇస్తున్న ఒక మునీంద్రుని దోసిలిలో పడ్డాయి. అర్ఘ్యం ఇస్తున్న సమయంలో దోసిలి (అంజలి) లో పడటం (పత్) కారణంగా పత్ మరియు అంజలి అనే పదాలు కలయికతో ఆదిశేషుని జన్మరహస్యాన్ని అందరికి తెలియచేస్తూ – ఆ ముని పతంజలి అని నామకరణం చేసాడు. (రామభద్ర దీక్షితులవారి పతంజలి చరిత్ర)

శక మొదలయిన పదాలకి అంధుః మొదలయిన పదాలు పరమయినప్పుడు పూర్వపదములోని చివరి అచ్చుకాని, వెనుక ఉన్న అచ్చుతో కూడి పూర్వ పదము చివరి హల్లుకాని లోపిస్తాయని సంస్కృత వ్యాకరణం. (**శకంధ్వాదిషు పరరూపం వాచ్యమ్**) అందువల్ల పతత్ + అంజ అన్నపుడు పతత్ పదంలో చివర ఉన్న హల్లు (త్) తన వెనుక ఉన్న స్వరంతో కూడా లోపించి పత్ + అంజలి = పతంజలి అని రూపమేర్పడింది.

పతంజలి ఈ **మహాభాష్యాన్ని** వెయ్యి మంది శిష్యులకు ఉపదేశించాడట. అందులో గౌడ పాదుడు అను ఒక్క శిష్యుడు మాత్రమే ఆ భాష్యాన్ని గుర్తుపెట్టుకున్నాడట. శిష్యుని శాపాన్ని పోగొట్టాలనే ఆలోచనతో తరువాత కాలంలో చంద్రశర్మ అను పేరుతో గౌడపాదునికి శిష్యుడయ్యాడు. – తాను బోధించిన మహాభాష్యాన్ని స్వయంగా తాను నేర్చుకున్నాడు. ఆ చంద్రశర్మయే గోవిందపాదులను పేరుతో ఆదిశంకరాచార్యులవారి గురువయ్యాడు.

"యోగేన చిత్తస్య పదేన వాచాం మలం శరీరస్య చ వైద్యకేన ।
యోపాకరోత్తం ప్రవరం మునీనాం పతంజలిం ప్రాంజలిరానతోఽస్మి ॥

అని పతంజలిని స్మరిస్తారు. యోగసూత్రాలలో మనస్సులోని మాలిన్యాలు పోగొట్టినవాడు, పాణిని వ్యాకరణ గ్రంథానికి మహాభాష్యం రచించి భాషను ఉద్ధరించినవాడు, చరక

ఆత్రేయ సంహితల ద్వారా శరీర కల్మషాలను పోగొట్టి శుద్ధిచేసిన పతంజలి మహర్షికి అంజలి. ❁

## 97

కంకంటి పాపరాజు **ఉత్తరరామాయణము**లో శివస్తుతి.

**వనితరొ వెండికొండ నెలవంకలు పెక్కు వహించెఁ జూచితే**
**యని సరసోక్తిఁ దా ననిన నచ్చపుగందపుఁబూతగుబ్బ జా**
**ఱిన నునుఁబైఁటకొంగు సవరించుచు నవ్విన గౌరిఁ గౌఁగిటం**
**దనిపెడు చంద్రశేఖరుఁడుదారకృపన్ మముఁ బ్రోచుఁగావుతన్.**

**ప్రతిపదార్థము :** వనితరొ = ఓ వనితా! పార్వతీ!; వెండికొండ = వెండికొండ; నెలవంకలు = 1. బాలచంద్రులు, 2. నఖక్షతములు; పెక్కు వహించెన్ = అనేకమయిన వాటిని ధరించింది; చూచితే = చూసావా? అని సరసోక్తిఁదా ననినన్ = అని సరస + ఉక్తిన్ + తాన్ + అనినన్ = అని వినోదంగా, రసయుక్తంగా శివుడు అనగా; అచ్చపు గందపుఁబూతగుబ్బ జాఱిన = అచ్చపుగందపున్ + పూత + గుబ్బ జాఱిన = తడి ఆరిన గందపు పూత తెల్లదనముతో ఉన్న స్తనముపై ఉన్న పైట కొంగు కొంచెం జారగా; నునుఁబైఁటకొంగు సవరించుచు = నునున్ + పైట కొంగు సవరించుచు = పల్చని పైటకొంగు సవరించుకొనుచు; నవ్విన గౌరిన్ = నవ్విన పార్వతీదేవిని; కౌగిటన్ + తనిపెడు = తన కౌగిలిలో తృప్తినొందించు; చంద్రశేఖరుఁడు = చంద్రుని ధరించిన శివుడు; ఉదారకృపన్ = అధికమైన దయతో; మముఁబ్రోచుఁగావుతన్ = మమున్ + ప్రోచున్ + కావుతన్ = మమ్ములను రక్షించుగాక!

**తాత్పర్యము :** ఓ పార్వతీ! వెండికొండ అనేకమయిన బాలచంద్రులను ధరించింది. చూసావా? అని వినోదంగా శివుడు అనగా తడి అరిన గందపు పూత తెల్లదనముతో వెండికొండలా ఉన్న స్తనముపై ఉన్న పైటకొంగు కొంచెం జారగా సవరించుకొనుచు నవ్విన పార్వతీదేవిని తన కౌగిలిలో తృప్తి నొందించు చంద్రుని ధరించిన శివుడు అధికమైన దయతో మమ్ములను రక్షించుగాక!

**విశేషాలు :**

శ్రీరాముని చరిత్రను పాడి కీర్తింపనిచో వాని జన్మ వృథా అని ఘంటాపథంగా చెప్పిన (ఉ.రా. 15వ పద్యం.) కవి కంకంటి పాపరాజు తన ఉత్తర రామాయణమును మదనగోపాలునికి అంకితమిచ్చాడు.

**వెండికొండ** అనే సమాసం రజతాద్రికి తెలుగు. వెండికొండ మన్నీడు అని శివునికి పేరు. కవులకి దేవుళ్ల వర్ణనల్లో స్వేచ్ఛ ఉంది.

"మెడ నాగన్నకు నొక్కటే బుసబుసల్, మేనన్ సగంబైన యా
బిడతో నీ కెపు డొక్కటే గుసగుసల్, వీక్షించి మీ చంద మె
క్కడ లేనంతగ నెత్తిపై రుసరుసల్ గంగమ్మకున్, నీ చెవిం
బడుటేలాగునొ మా మొఱల్ తెలియదప్పా మాకు మృత్యుంజయా!"

అన్నారు మాధవపెద్ది బుచ్చి సుందరశాస్త్రి.

శివునికి బుసబుసలు, గుసగుసలు, రుసరుసలట – వీటి మధ్య తన ప్రార్థనలు ఆయన చెవిని పడతాయో లేదోనని భక్తుని బాధ. నిజానికి శివునికి ఇవేమీలేవు. చదివే పాఠకునికి శివునిమీద "రుచి" పుట్టించాలి. అందుకే కవులు ఇలాంటి వర్ణనలు చేస్తుంటారు. ఈ తోవలోదే పాపరాజుగారి వెండికొండ వర్ణన. "వినుత సుకృతములకు దండ వెండికొండ." (పోతన భాగ 4–134.1–తే) పుణ్యాలకు దండవంటి దయిన వెండికొండ కంకంటికి శృంగారపరంగా తోచింది.

ఒక దృశ్యాన్ని మనస్సు మీద ముద్ర వేసే అందమయిన కవులలో కంకంటి ఒకడు.

రమణి మరికొంత వడి దాఁక రథముజూచు
దరుణి మరికొంతసేపు కేతనముఁజూచు
గాంత మరి మీద రథపరాగంబుఁజూచు
బడఁతి మరియంతటను వట్టి బయలు జూచు (06–299)

తనను దించి వెళ్లిన లక్ష్మణుని రథం వెళ్ళిపోతోంది. సీతమ్మ కొద్ది సేపటిదాక రథాన్నే చూస్తోంది. క్రమంగా రథం కనిపించలేదు. దానిపైన ఎగురుతున్న జెండా కనిపిస్తోంది. సీతమ్మ కొదిసేపటిదాక జెండానే చూస్తోంది. జెండా కూడా కనిపించకుండా పోయింది. గుర్రపు రేగుతున్న దుమ్ము కనిపిస్తోంది. ఆమె ఆ రథముపైన రేగుతున్న దుమ్మునే చూస్తున్నది. క్రమంగా ఆ దుమ్ము కూడా కనిపించలేదు! శూన్యం. ఆమె శూన్యాన్నే చూస్తూ ఉన్నది. శూన్యమనే పద ప్రయోగంతో మనస్సున్నవారి మనస్సులను కవి పిండేసాడు.

**రంగారు బంగారు చెంగావులు ధరించు**
**శృంగారవతి నార చీరె లూనె**

**భూజనంబులు మెచ్చు భోజనంబు లొనర్చు**
**కమలాక్షికందమూలములు నమలె**
**చంద్రకాంత విశాల చంద్రశాలల నుండు**
**జవ్వని ముని పర్ణశాల నుండె**
**మరులతో శ్రీరాము నురముపై బవళించు**
**బాలికామణి యొంటి పవ్వళించె**

**గన్ను సన్నల శుద్ధాంతకాంత లాద**
**దరించు సేవలు మెచ్చని కాంచనాంగి**
**యొగ్గె మునిముగ్ధకాంతాకృతోపచార**
**విధికి, నెంచనసాధ్యంబు విధికి గలదె** (06-320).

ఈ కంకంటి పాపరాజు పద్యము లవకుశ చలనచిత్రం ద్వారా చాలామంది నోటికి వచ్చింది.

నెలవంకలకు సంబంధించిన వర్ణన చేస్తూ శివుడిని చంద్రశేఖరుడు అన్నాడు. అది కవి ప్రతిభ. ❁

## 98

బమ్మెర పోతన **భాగవతము**లో శివస్తుతి.

**వాలిన భక్తి మ్రొక్కెద నవారితతాండవకేళికిన్ దయా**
**శాలికి శూలికిన్ శిఖరిజాముఖపద్మమయూఖమాలికిన్**
**బాలశశాంకమౌళికిఁ గపాలికి మన్మథగర్వపర్వతో**
**న్మూలికి నారదాదిమునిముఖ్యమనస్సరసీరుహాళికిన్.**

**ప్రతిపదార్థము :** వాలిన = అతిశయించిన; భక్తి = భక్తితో; మ్రొక్కెదన్ = మ్రొక్కెదను; అవారిత = అడ్డగింపబడని, నిషేధింపబడని; తాండవ కేళికిన్ = తాండవము ఆడువానికి (తాడ్యతే భూమిరనేనేతి తాండవం. దేనిచేత భూమి కొట్టబడునో అది తాండవము); దయాశాలికిన్ = దయకలవానికి; శూలికిన్ = త్రిశూలాయుధము ధరించినవానికి; శిఖరి = హిమవంతుడను కొండయొక్క; జా = పుత్రికయైన పార్వతీదేవి; ముఖ = ముఖము అనే; పద్మ = పద్మానికి; మయూఖమాలికిన్ = కిరణముల మాల కలిగిన సూర్యునివంటివాడయిన శివునికి; బాల = లేత; శశాంక = చంద్రుని (శశాంక – శశ

(కుందేలు) గుర్తు కలవాడు – చంద్రుడు; మౌళికిన్ = శిరస్సును ధరించిన వానికి; కపాలికి = పుర్రెను ధరించిన వానికి; మన్మథ గర్వ పర్వత + ఉన్మూలికిన్ = మన్మథుని గర్వమనే పర్వతాన్ని నిర్మూలించినవానికి; నారద + ఆది ముని ముఖ్య = నారదుడు మొదలైన మునిముఖ్యుల; మనస్ = మనస్సులనే; సరసీరుహ = పద్మాలలో తిరుగాడే (సరసీరుహ – సరస్సులో పుట్టినది.); అలికిన్ = తుమ్మెద లాంటి వానికి, శివునికి నమస్కారము.

**తాత్పర్యము :** నేను అతిశయించిన భక్తితో పరమశివునకు నమస్కరిస్తాను. ఆ శివుడు ఎవరూ ఆపటానికి సాధ్యంకాని తాండవనృత్యం ఆటగా గలవాడు. సర్వజీవులపై దయ కలవాడు. శూలం కలిగినవాడు. పార్వతీదేవి మోము అనే తామరపూవును వికసింపచేయు సూర్యుడు. చందమామను తలపై ధరించినవాడు. బ్రహ్మతలను గోటితో గిల్లి, ఆ పుఱ్ఱెను ధరించి తిరిగే కపాలి. మన్మథుని గర్వపర్వతాన్ని అవలీలగా కూల్చివేసిన వాడు. (మన్మథుని బూడిద చేసినవాడని భావం). నారదుని మొదలైన మునుల హృదయ పద్మాలలో అందమైన చప్పుడు చేస్తూ తిరిగే తుమ్మెద వంటివాడు. (నారదుడు మొదలయిన వారు ఎప్పుడూ శివధ్యానము చేస్తుంటారని భావం).

**విశేషాలు :**

చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరునొవ్వంగ హరికీర్తననుడువఁడేని
దయయు సత్యంబులోనుగాఁ దలఁపడేని
గలుగ నేటికిఁ దల్లుల కడుపుచేటు

అని పోతన చేతుల నిండుగా (చేతులు జోడించి) తృప్తితో శివపూజ చేయనివాడు – అంటే ఎల్లప్పుడూ హరినామ, గుణకీర్తనం చేయనివాడు – సత్యమూ, దయ మొదలైన మంచి గుణాలను గూర్చి ఆలోచించనివాడూ పుట్టడం వ్యర్థమన్నాడు. వాడి జన్మ తల్లికడుపు పంటగా కాకుండా, తల్లికడుపు మంట అని కఠినంగా చెప్పాడు పోతన.

చేతులారంగ – నిండు మనస్సుతో పోతన చేసిన శివపూజ “వాలిన భక్తి...” పద్యం.

ఈ పద్యంలోని అనుప్రాసలు సహజంగా ప్రయోగింపబడ్డాయి.

ఎందుకయా సాంబశివా ఎవరు నీకు చెప్పేరయ / ఈ అల్లరి చేతలు ఈ బూడిద పూతలు ఎందుకయా సాంబశివా ఎవరు నీకు చెప్పేరయ సాంబశివా సాంబశివా

సాంబశివా అనే గేయంలో **దేవులపల్లి కృష్ణశాస్త్రి** తోలు గట్టి పటకాగా కాలాగ్నిని కుట్టికేల త్రిశూలము పట్టి ఫాలమందు కీల పెట్టి – అని శివునితో మాట్లాడుతారు. త్రిగుణాలకు, ఇచ్ఛా, క్రియా, జ్ఞానములను త్రిశక్తులకి, భూత, వర్తమాన, భవిష్యత్తులను త్రికాలములకు ప్రతీక త్రిశూలము. ఈ ప్రతీకాత్మకమైన **త్రిశూలము** పట్టుకొన్న శివుడిని శూలికి అని పోతన్నగారు ప్రయోగించారు.

ఉద్ధతమైన (పైకి ఎగురు) కరణ అంగ విక్షేపాలు కలిగి ఆరభటీ వృత్త (ప్రౌఢి) ప్రధానమైన నృత్యాన్ని **తాండవ**మంటారు. ఇది పద్యంలో తాండవ కేళి అయింది.

కపాలికి సంబంధించిన వివరణ శివమహాపురాణములో ఇలా వస్తుంది. విష్ణువు శివుడిని ఇలా అడుగుతాడు. శంభో! శక్తినాథా! నీవు భిక్షాటనము చేయటానికి కారణమేమిటి? (కిమర్థం భగవాన్ శంభో భిక్షాం చరసి శక్తిప । సంశయో మే జగన్నాథ ఏష త్రైలోక్య రాజ్యద ॥ 23వ శ్లో) దానికి శివుని జవాబు ఇది. బ్రహ్మయొక్క శిరస్సును వ్రేలిగోటితో దునిమాను. ఆ బ్రహ్మ హత్యాపాపాన్ని పోగొట్టుకోవటానికి ఈ శుభవ్రతాన్ని చేస్తున్నాను (25వ శ్లో) ఆ బ్రహ్మకపాలం కాశీలో క్షణకాలములో నశించిపోయింది. ఎవడైతే కాశీలో కపాలమోచనమనే ఉత్తమ తీర్థమును స్మరిస్తాడో వాడు సర్వపాపములనుండి వెంటనే విముక్తుడవుతాడు. 60వ శ్లో) (శ్రీ శివమహాపురాణములోని శతరుద్ర సంహితలో భైరవ లీలావర్ణనమనే తొమ్మిదవ అధ్యాయము)

శివుడిని, విష్ణువుని ఒకటిగా చూసే పోతనగారి హరిహరాద్వైతము ఈ జాతికి శిరోధార్యం. ❁

## 99

డా॥ చెఱువు సత్యనారాయణశాస్త్రి (1943–1996) **సుందరేశ్వరవిలాసము**లోని శివస్తుతి.

**జింక చెయివంక, నౌదల**
**వంకన్నెలవంక, గుత్తివంకన్విసమున్**
**బొంకమిడుచుండు మరుచల**
**మింకించిన సామి యోము నీకబ్బమ్మున్**



**ప్రతిపదార్థము :** జింక = లేడి; చెయివంకన్ = చేతి దిక్కువైపు ఉన్నది. (చేతిలో ఉన్నది); ఔదలవంకన్ = తల ముందు వైపు (రూ. అవుదల..ఔ + తల– కర్మధారయ సమాసము); నెలవంక = బాలచంద్రుడు ఉన్నాడు; గుత్తివంకన్ = గుచ్ఛములా ఉండే

కంఠములో; విసమున్ = విషము (కాలకూటము); పొంకమిడుచుండు = పొంకము + ఇడుచుండు = అందమిచ్చుచున్నది; మరుచలము = మన్మథుని యొక్క చలించిన మనస్తత్త్వాన్ని (శివుడినయినా శృంగారానికి గురిచేస్తాను అని చలించిన గుణము); ఇంకించిన సామి = నశింపచేసిన శివస్వామి; ఈ కబ్బమ్మున్ = సుందరేశ్వర విలాసమను నా కావ్యమును (ప్రబంధమును); ఓమున్ = రక్షించుగాక!

**తాత్పర్యము :** శివుని చేతిలో లేడి ఉన్నది. తలపై బాలచంద్రుడు ఉన్నాడు. గుచ్ఛములా ఉండే కంఠములో విషము అందమిచ్చుచున్నది. మన్మథుని యొక్క చలించిన మనస్తత్త్వాన్ని నశింపచేసిన శివస్వామి సుందరేశ్వర విలాసమను నా కావ్యమును (ప్రబంధమును) రక్షించుగాక!

**విశేషాలు :**

అవధానవిద్యావాచస్పతి, ఉభయభారతి బిరుదులు కలిగిన డా॥ చెఱువు సత్యనారాయణ శాస్త్రిగారు, వారి ధర్మపత్ని లక్ష్మీదేవి ఈ పుస్తక రచయిత జీవితంలో, సాహితీ జీవితంలో ప్రభావము చూపించిన ప్రాతఃస్మరణీయులు.

మాకు పెదనాన్నగారయిన, ఋషితుల్యులు బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రి గారి మనుమడు డా॥ చెఱువు సత్యనారాయణశాస్త్రి.

ఏడు సంవత్సరముల వయస్సులో "సమహార్ద్రార్ద్రేసమీక్షణావిత... అంటూ ప్రౌఢశైలిలో **లింగోద్భవవృత్తమాలికాస్తుతి** చేసిన మహనీయులు చెఱువువారు.

పదేళ్ల వయస్సులో **కరిమకరీయము** (గజేంద్రమోక్షము), 15వ ఏట **ఉమాకల్యాణము**, 17వ ఏట **విప్రలబ్ధ**, 19వ ఏట ఈ **సుందరేశ్వరవిలాసము** రచించారు. ఈ సుందరేశ్వరవిలాసకావ్యము పెద్దలు శ్రీ రావి మోహనరావుగారి సౌజన్యముతో, సాధన గ్రంథమండలి తరపున ప్రచురించబడింది.

వారి రచనలన్నింటిపై పిహెచ్.డి. చేసి డాక్టరేట్ పట్టా పొందే అవకాశం – జ్ఞానములో అంగుష్ఠమాత్రుడనయిన నాకు స్వామి దయతో దక్కింది. (పుస్తకం అముద్రితం)

చెఱువు వారికి, శివుని అవినాభావసంబంధం లోకానికి ఇలా ప్రకటిత మయింది. గురువారం నాడు చెఱువువారు మరణించబోతుండగా, బుధవారం అర్ధరాత్రి వారి ఆత్మీయశిష్యులు త్రిభాషాశతావధాని బ్రహ్మశ్రీ వద్దిపర్తి పద్మాకర్ గారికి ఒక కల

వచ్చింది. ఆ కలలో శివపార్వతుల సంభాషణను పద్మాకర్ గారు విన్నారు. శివుడు చెఱువువారి పద్యాలకు మురిసిపోయి పార్వతితో "వాని సాటి కవి లేడంచు" చెప్పాడట. పార్వతీదేవి ఇలా అన్నది.

**"మనకు నాస్థాన పండితుడనెడివాడు**
**లేకపోవుట కరము బాధాకరమ్మ్మ**
**శుక్రవాసరమునకేను జూడవలయు**
**వాని కైలాసమందు నాస్థాన కవిగ"**

పద్మాకర్ గారికి వచ్చిన కల ఇలలో యథార్థమయింది. కైలాసములో కూడా యథార్థమయి ఉంటుంది.

మదురైలో అమ్మవారు మీనాక్షిగా అవతరించగా... సుందరేశ్వరుడు పేరుతో ఆమెను పెండ్లి చేసుకొంటాడు. శివుని చేతిలోని జింక మాయకు గుర్తు. మాయ తన అధీనమని చెప్పటానికి లేడిని శివుడు ధరించాడట. సుందరేశ్వరవిలాసము ప్రబోధచంద్రోదయంలా మాయాతత్వాన్ని, అంతర్గతంగా వివరించిన కావ్యము. అందుకే శివప్రార్థనలో **"జింక చెయివంక"** అన్నారు. పరమశివుడు 'శాంతం శివం సుందరం' ఆయనే సుందరేశ్వరుడు. **'సుందరస్య పత్నీ సుందరీ'** సుందరీశ్వరుని పత్ని సుందరీ – లలితాత్రిపురసుందరీదేవి. శాస్త్రిగారు తన కావ్యములో అమ్మవారిని తటాతట అని, అయ్యవారిని గిరీశ ప్రసాద దత్తుడు అన్నారు.

తానేమిటి? తన స్థాయి ఏమిటి అనే విషయం పరిశీలించుకోకుండా శివునిపైకి తన పూల బాణాలు వేయటానికి మన్మథుని మనస్సు చలించింది. ఆ చలించిన మన్మథుని మనస్తత్వాన్ని శివస్వామి నశింపచేసాడు. బూడిద చేసాడు. ఇక్కడ **"మరుచలమింకించిన సామి"** అని శివుని పొగిడారు శాస్త్రిగారు. "ఇంకించుట" అంటే నాశనము చేయుట అనే అర్థముతో పాటు "పల్లవింపచేయుట" అనే అర్థముంది. ఏ మన్మథునయితే తాను నశింపచేసాడో అదే మన్మథుడిని మళ్లీ బతికింపచేసాడు శివయ్య. రెండు వ్యతిరేకార్థాలను ఇచ్చే "ఇంకించు" క్రియా పదాన్ని ప్రయోగించి – రెండు సందర్భాలను గుర్తుకు తెచ్చిన శాస్త్రిగారి ప్రతిభ సూర్యకాంతిలా జేగీయమానమైనది.

అన్నీ తానై, అన్నింటా తానై వాక్యాలు చెఱువు వారికి వర్తిస్తాయి. "అద్వయ స్వరసానుభావాత్త మహిత వైభవోదిత సత్యవినిష్పంద..." (సుందరేశ్వరవిలాసము చతుర్థాశ్వాసము 61వ పద్యం) ఇలా ప్రౌఢ శైలిలో పద్యాలు వ్రాసిన వారి కలం, "సల్లా

యెంకటి సుబ్బలచ్మి బతుకేలా నీవు లేకుండినన్” అనే జానపద శతకాలు కూడా వ్రాసింది. జేజేలు అందుకొంది. అందుకే గరికపాటి వారు బహుముఖ ప్రతిభాశాలి అయిన శాస్త్రి గారిని నుతిస్తూ “చెరువు కాదది బుద్ధి కచ్చెరువు గాని” అని నుతించారు. ఈ మాటలు యథార్థ సత్యాలు. 

**100**

కోవెల సుప్రసన్నాచార్య **‘శివాభిసారిక’**లోని శివస్మరణ

**ఇంతదూరాననున్న నిన్నెంతగా పొందగా**
**పూల వంతెనలు కట్టి సాగి వస్తున్నాను**
**మన నడుమ ఎంత దూరమో**

**....................................**

**కదలని పర్వతం మీద వెలుగువై**
**గుండెలో పగులువై**
**పగులులో మొలిచిన రావి మొలకవై**
**దుఃఖ బంధంలో పొలిచిన తావివై**
**నుదుట మొలిచిన తార్తీయ నేత్రమై**
**స్మరణమాత్ర ధ్రువ!**
**కరుణ శిఖర సంభవ!**
**దూరమేదీ!**

**విశేషాలు :**

కొన్ని వేల సంవత్సరాల క్రితం శివస్మరణ మాటగా, పాటగా, శ్లోకంగా, పద్యంగా, మారింది. ఆధునిక కవిత్వంలో ఆ శివస్మరణ **“శివాభిసారిక”** అను ఒక వచనకావ్యంగా రూపుదిద్దుకొంది. కర్త పద్య, వచన, వ్యాస, విమర్శ ప్రక్రియలలో లబ్ధ ప్రతిష్ఠులయిన ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య 1936వ సంవత్సరంలో జన్మించిన వీరు, తన తొమ్మిదవ ఏట కందపద్య రచన మొదలుపెట్టారు. ఇప్పటివరకు 47 పుస్తకాలు రచించారు.

ఈ శివాభిసారిక కావ్యం విలక్షణమైన రీతిలో శివుని అనుసరించు నాయిక. కావ్యంలోని అభిసారిక ఆ శివమూర్తిలోని సౌందర్యానికి ముగ్ధురాలయింది.

అన్నమయ్య మధురభక్తి కీర్తనల్లోని నాయిక అన్నమయ్యే. అలాగే శివాభిసారిక కావ్యంలోని కథానాయిక కవి సుప్రసన్నాచార్య. ఈ కవి సహచరిని కోల్పోయినప్పటి నుంచి ఒంటరితనం అనుభవించాడు. ఆ లోపాన్ని పూరించటం కోసం ధ్యానం ప్రయత్నం చేసినాడు. అదే జీవుని సాధన. కావ్యసాధన.

ఈ మధుర భక్తి కావ్యంలో ప్రతి మాటా ఈశ్వరునితో మొరపెట్టుకోవటమే. ఆర్తితో ఎదురుగా నిలబడి మాట్లాడటమే. (రచయిత స్వయంగా పీఠికలో రాసుకొన్న వాక్యాలకు కొంత చేర్పు)

ఈ **శివమంగళాచరణానికి** అర్థం చెప్పటం కష్టం. ఎందుకంటే ఈ ఆధ్యాత్మిక ధ్వని కావ్యపు చప్పుడు పరవశించిన గుండె వినగలదు. ఆ చప్పుడును అక్షరాలలోకి తీసుకురావటమంటే – అనుభూతికి గంట కట్టే ప్రయత్నం. ప్రియునికోసం ప్రియురాలు దూరాలు లెక్కచేయకుండా ప్రయాణం మొదలుపెడుతుంది. అలా ప్రయాణించే ఆవిడకు అభిసారిక అని పేరు. ప్రియుని సంకేత స్థలమునకు రప్పించుకొనునట్టిది కాని, తానే స్వయముగా పోవునట్టిది కాని యగు స్త్రీ అభిసారిక. జీవుడు ఒక అభిసారిక. శివుడు కథానాయకుడు. తనలో ఉన్న శివుడిని వెతుక్కొంటూ అభిసారిక దూరాలు దాటే ప్రయత్నం మొదలుపెట్టింది. ఇంతదూరాననున్న నిన్నెంతగా పొందగా పూల వంతెనలు కట్టి సాగి వస్తున్నాను. ఇంత దూరాన ఉన్నాడని నాయిక లెక్కించి ప్రయాణం మొదలుపెట్టింది. రెండు అడుగులు వేసిందో లేదో... ఆమెకు తెలిసి వచ్చింది. తమ మధ్య ఉన్న దూరం "ఇంత" కాదని "ఎంతో" అని. జీవుడు శివుడు కావటం ఎంత సేపండి.! శివోఽహం (నేనే శివుడిని)... శివోఽహం (నేనే శివుడిని) అనుకో చాలు. ఇంత సులభమా అనుకొంటున్నావు కదూ!

సాధన మొదలుపెట్టిన తర్వాత, ధ్యానమార్గంలో ప్రయాణం మొదలుపెట్టిన తర్వాత దూరమెంతో తెలిసివస్తుంది. తనకు శివునికి మధ్య ఎంత దూరమో అనిపిస్తుంది. వంతెనలు దూరాలను కలుపుతాయి. మంత్రాక్షరాలు పూల వంతెనలు, శివునికి, జీవునికి మధ్య దూరాన్ని తగ్గిస్తున్నట్లు భ్రమింపచేస్తాయి. కాని వేల వేల జన్మలనుంచి చర్మంలా అంటిపెట్టుకొని వస్తున్న మాయ భౌతిక ఆకర్షణల దుర్వాసనలను, సువాసనలుగా భ్రమింపచేస్తుంది. "వారెవా..." అనే మూడు అక్షరాల ఆకర్షణలోని ఆనందము "శివా" అనే రెండక్షరాల సంగతిని తర్వాత చూడమంటుంది. శివుడికోసం కట్టుకొన్న పూల వంతెనల గమ్యాన్ని మాయ మారుస్తుంది. ఆ వంతెనల మీద మన(స్సు) స్వాధీనంలో

లేని గుర్రాల పరుగులు మొదలుపెడతాయి. శివుడికి, జీవునికి మధ్య దూరం పెరుగుతుంది. అదే మూడోపాదంలో కవి ఆవేదన.

శివుడు కదలని పర్వతం మీద వెలుగు. గుండెలో పగులు. పగులులో మొలిచిన రావి మొలక. శివుడు స్థిరమైనవాడే. వీరాసనములో ఆ మహానుభావుడు కదలని పర్వతం మీద వెలుగు కావచ్చు. కాని కవి గుండెలో పగులయ్యాడు. కవికి వియోగాల బాధలు కల్పించాడు. తాను అర్ధనారీశ్వరుడై ఉండి కూడా, కవిలోని అర్ధదేహాన్ని తీసేసుకొన్నాడు. గుండెను చీల్చాడు. అందుకే దేవాలయాల గోడల పగుళ్ల మధ్య రావి మొలకయ్యాడని కవి భావన. మరి శివుడు ఇంత అన్యాయం చేసాడు కదా! ఆయనకు దూరంగా పోవచ్చు కదా! ఊహు... శివుడు తన దుఃఖబంధంలో మొలిచిన కమ్మటి తావి. "సుగంధం... పుష్టి వర్ధనం" అని పైకి చెప్పకుండా శివస్తోత్రమును కవి ఇక్కడ వ్యంగ్యంగా చెప్పారు. శివుడు నుదుట మొలిచిన తార్తీయ నేత్రము... మూడవ కన్ను.

జ్ఞానం మహేశ్వరుని ఆధీనం. తనను జ్ఞానవంతుని చేసావని శివునితో కవి అంటున్నాడా? చేయమని అంటున్నాడా? "నేత్రమై" అని కవి ప్రయోగము కనుక తన జ్ఞానసముపార్జనకు సహకరించిన శివునికి ధన్యవాద ప్రస్తావన కవి చేసినట్లు భావించాలి.

**స్మరణమాత్రధ్రువ!**

శివా! అని స్మరిస్తే చాలు శివుడు ధ్రువుడవుతాడు. గుర్తు పెట్టుకొనే వాడవుతాడు. ఎవరిని గుర్తుపెట్టుకొంటాం? సాయం చేసినవారిని, రక్షించినవారిని... శివుడు కూడా తనను స్మరించిన వారి రక్షకుడవుతాడు.

**కరుణ శిఖర సంభవ!**

శిఖరమునుంచి పుట్టిన సెలయేరు అందంగా కిందికి ఉరుకులు పరుగులతో దూకుతుంది. చూడటానికి అందంతో పాటు, బతకటానికి చైతన్యాన్ని (విద్యుత్తును) ప్రసాదిస్తుంది. శివ జలపాతము మనలిని ఉద్ధరించటానికి దయ అనే శిఖరం నుంచి కిందికి జాలువారుతోంది. అది చూడటానికి గుండెకు కళ్లను అతికించాలి.

**దూరమేదీ!**

జీవన ప్రయాణములో ప్రతిచోటా నీ స్మరణము చేస్తున్నాను. ప్రతిచోటా నీ

దయను దర్శిస్తున్నాను. ఇలా చేస్తుంటే శివునికి, జీవునికి మధ్య దూరమెందుకుంటుంది? అని కవి ప్రశ్న.

కావ్యము చివరలో శివుడిని ఉద్దేశిస్తూ **"భువనమంతా పరచుకొన్న నిన్ను ఎక్కడికి రా రమ్మనేది"** అని కవి తీర్పు చెప్పారు.

కవి ఉదాత్తమైన భావనలను కాదనగలమా? కవిని ప్రశంసించకుండా ఉండగలమా? ఈ కావ్యం మొత్తం చదివి పరవశించిన డా॥ రాళ్లబండి కవితా ప్రసాద్ **"ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యుల వారి ఈ కృతి కవితాపిపాసువులందరిని ఋణగ్రస్తులిని చేసింది. ఎన్ని ధన్యవాదాలు కృతజ్ఞతలు చెప్పినా ఋణం మిగిలే ఉంటుంది. అది దేవ ఋణం, ఋషి ఋణం, ఈశ్వర ఋణం! ఆ ఋణాన్ని నిరంతరం తీర్చుకోవడమే శివాభిసరణం! కాదు రసాభిసరణం"** అన్నారు. ❁

## 101

గౌరన (15వ శతాబ్ది) **హరిశ్చంద్రోపాఖ్యానము**లోని శివస్తుతి.

**శ్రీ గిరిజాధీశు శ్రీగిరినాథు**
**నాగ చర్మాంబరు నాగ కేయూరు**
**బాణ వత్సలు పంచబాణ సంహారు**
**వాణీశ వినుతు గీర్వాణేశ వంద్యు**
**గంధర్వ కిన్నర గాంధర్వ లోలు**
**గంధర శ్యామల కంధరోదారు**
**దారుణాంధక దర్ప దళన ప్రచారు**
**జారు జాంబునద శైల కోదండు**
**గారుణ్య జలధి గంగాధరునభవు**
**శారదాచందన శారదాంభోద**
**మల్లికార్జున దేవుమహిత ప్రభావు**
**మా పాలనేపట్ల మమ్మేలు వేల్పు**
**పాపాళి బాప సద్భక్తి బూజించి**

**ప్రతిపదార్థము :** శ్రీగిరిజాధీశు = శ్రీగిరిజ + అధీశు = శ్రీ పార్వతీదేవికి భర్తయైన వానిని; శ్రీగిరినాథు = కైలాస పర్వతమునకు అధిపతియైనవానిని; నాగ చర్మాంబరు

= నాగ చర్మ + అంబరున్ = ఏనుగు తోలు వస్త్రముగా కలవానిని; నాగ కేయూరున్ = పాములు బాహుపురులుగా కలవానిని (కేయూరము = An ornament worn on the upper arm); బాణ వత్సలున్ = బాణుడను రాక్షసుని యందు ప్రేమ కలవానిని; పంచ బాణ సంహారు = అయిదు బాణములు ఆయుధములుగా గల మన్మథుని సంహరించిన వానిని (అయిదు బాణములు 1. అరవిందము lotus, 2. అశోకము Jonesia asoka, 3. చూతము mango blossom, 4. నవమల్లిక Arabian jasmine, 5. నీలోత్పలము blue lotus;); వాణీశ వినుతున్ = సరస్వతికి భర్తయైన బ్రహ్మదేవునిచే కొనియాడబడినవానిని; గీర్వాణేశ వంద్యున్ = గీర్వాణ + ఈశ వంద్యున్ = దేవతలకు ప్రభువయిన దేవేంద్రునిచే నమస్కరింపబడినవానిని; గంధర్వ కిన్నర గాంధర్వ లోలున్ = గంధర్వుల యొక్కయు, కిన్నరుల యొక్కయు సంగీతమునందు ఆసక్తి కలవానిని; కంధర శ్యామల = మేఘమువలె నల్లనైన; కంధరోదారు = కంధర + ఉదారున్ = కంఠము చేత గొప్పవాడును; దారుణాంధక దర్పదళన ప్రచారున్ = దారుణ + అంధక దర్ప దళన ప్రచారున్ = భయంకరుడైన అంధకుడను రాక్షసుని యొక్క గర్వమును చీల్చుట అను ప్రవృత్తి కలవానిని; చారు = అందమైన; జాంబునద శైల = బంగారుకొండ అనెడు; కోదండున్ = విల్లుగా కలిగిన వానిని; కారుణ్య జలధిన్ = దయకు సముద్రము వంటి వానిని; గంగాధరున్ = గంగను ధరించినవానిని; అభవున్ = పుట్టుక లేనివానిని; శారదా = సరస్వతి; చందన = చందనము; శారదాంభోద = శరత్కాలములోని మేఘము; మల్లికా = మల్లెలు; కర్పూర = కర్పూరము; మాలికా = విరజాజుల వంటి; యశుని = కీర్తి కలవానిని; మహిత ప్రభావు = గొప్పదయిన ప్రభావము కలవానిని; మల్లికార్జున దేవున్ = మల్లికార్జున దేవుని పూజించి; మాపాలన్ = మావైపు; ఏ పట్లన్ = ఏవిధముగానైన; మమ్మేలు వేల్పు = మమ్ము రక్షించు దేవుడయిన శివుని; పాపాళి బాప = పాప + ఆళిన్ = పాప సమూహములను పోగొట్టుకొనుట కొరకు; సద్భక్తిన్ = చక్కటి భక్తితో; పూజించి = పూజచేసెదను;

**తాత్పర్యము :** శ్రీ పార్వతీదేవికి భర్తయైన వానిని, కైలాస పర్వతమునకు అధిపతియైన వానిని, ఏనుగు తోలు వస్త్రముగా కలవానిని, పాములు బాహుపురులుగా కలవానిని, బాణుడను రాక్షసుని యందు ప్రేమ కలవానిని, అయిదు బాణములు ఆయుధములుగా గల మన్మథుని సంహరించిన వానిని, సరస్వతికి భర్తయైన బ్రహ్మదేవునిచే కొనియాడబడినవానిని, దేవతలకు ప్రభువైన దేవేంద్రునిచే నమస్కరింపబడినవానిని,

గంధర్వులయొక్క, కిన్నరులయొక్క సంగీతమునందు ఆసక్తి కలవానిని, మేఘమువలె నల్లనైన కంఠము చేత గొప్పవాడును, భయంకరుడైన అంధకుడను రాక్షసుని యొక్క గర్వమును చీల్చుట అను ప్రవృత్తి కలవానిని, అందమైన బంగారు కొండ (మేరువు) విల్లుగా కలిగిన వానిని, దయకు సముద్రము వంటివానిని, గంగను ధరించినవానిని పుట్టుక లేనివానిని సరస్వతి చందనము, శరత్కాలములోని మేఘము, మల్లెలు, కర్పూరము విరజాజుల వంటి తెల్లని కీర్తి కలవానిని, గొప్పదయిన ప్రభావము కలవానిని మమ్ము రక్షించు దేవుడయిన శివుని – పాప సమూహములను పోగొట్టుకొనుట కొరకు చక్కటి భక్తితో పూజ చేసెదను.

**విశేషాలు :**

నక్షత్రకుని పాత్ర గౌరన సృష్టి. హరిశ్చంద్రోపాఖ్యానమునకు మూలమయిన స్కాందపురాణములో నక్షత్రకుని పాత్ర లేదు. సరస సాహిత్య లక్షణ విచక్షణుడు అని గౌరన బిరుదు.

"పలికి బొంకని రాజు ఎవరైనా ఉన్నారా?" అని దేవేంద్రుడు మునులను ప్రశ్నిస్తే. "చ్యవనుదూరకయుండె శార్ఙ్గరవుండు నవుడు కొట్టెను నీళ్లు నమలె కశ్యపుండు" అని గౌరన రచన.

ఒకాయన జవాబు చెప్పకుండా ఊరికే ఉన్నాడట. ఇంకొకాయన నవుడు కొడుతున్నాడట. (నవుడు కొట్టు = భయముతో కండ్లు ఆర్పు, సందేహించు, ఆశ్చరముతో ఏమియు తోచకుండు.) మరొకాయన బదులు చెప్పలేక నీళ్లు నములుతున్నాడు. (బదులు చెప్పలేక సంకోచిస్తున్నాడు). **"నీవు నీళ్లు నమిలితే నిండెను వేదములు"** (6–156) అని అన్నమయ్య ప్రయోగం. ఏదయినా ప్రశ్న అడిగితే సభలోని వివిధ వ్యక్తుల ప్రతిస్పందనకు తెలుగుతనమద్దాడు **గౌరన**.

**"తనువెల్ల సత్యంబు తలపెల్ల గరుణ**
**పనులెల్ల ధర్మంబు పలుకెల్ల బ్రియంబు"**

అని హరిశ్చంద్రుని వర్ణన మధురశైలిలో చేస్తాడు కవి.

"కులము ప్రధానమే గుణము లేకున్న / గలశాబ్ధి బుట్టదే కాలకూటంబు" కులము ప్రధానము కాదు. గుణము ప్రధానము. పాల సముద్రములో విషము పుట్టలేదా?" అని గౌరన చాలా అందంగా చెప్పాడు.

శివకవులకు శివుడిని మల్లికార్జునుడని సంబోధించటం చాలా ఇష్టం. గౌరన కూడా తన నవనాథ చరిత్ర లో "రుచిరాంగు మల్లికార్జున మహాదేవు" అని నుతించాడు. ఈ హరిశ్చంద్రోపాఖ్యానము నాందిలో కూడా "మల్లికార్జున దేవుమహిత ప్రభావు" అన్నాడు.

'శ్రీశైల శృంగే' అంటే శ్రీశైలం శృంగంలో మల్లిక పూర్వంగా మల్లికార్జున నామధేయముతో పరమేశ్వరుడు లింగరూపంగా వసిస్తున్నాడు. "వివిధ ప్రసంగే" – ఏది కావలసినా శ్రీశైలంలో దొరుకుతుందని అభిప్రాయం. "శ్రీశైల శృంగే వివిధ ప్రసంగే శేషాద్రి శృంగే చ – సదావసంతం" ఈ శ్రీశైలంలో ఉండే మల్లికార్జునుడే శేషాద్రి శృంగానగూడా ఉన్నాడని భావం.

మల్లికాలత, అర్జున వృక్షం – యివి రెండూ కలిసి ఏకరూపంగా అర్ధనారీశ్వర రూపంగా ఉన్నాయి. ఒక లతకి అవలంబనంగా వృక్షం, లతకు అవలంబనంగా వృక్షం కావాలి. వృక్షానికి లత చుట్టుకోకపోతే అలంకారం లేదు. అందుచేత మల్లిక, అర్జునం – ఒక లత, వృక్షం – రెండూ కలిసినట్లు "తమర్జునం మల్లికపూర్వమేనం" – అని చెప్పబడ్డది. (జగద్గురు బోధలు ఎనిమిదవ భాగము)

ద్విపద అంటే రెండు పాదములుగల పద్యం. ప్రతి పాదములోను మూడు ఇంద్రగణాలు, ఒక సూర్యగణము ఉంటాయి.

అలతి అలతి తెలుగు పదాలలో విస్తారమయిన వర్ణనలు చేసిన గౌరన ప్రశంసార్హుడు.



## 102

డా॥ పప్పు వేణుగోపాలరావుగారి **"సప్త తాండవము"**లో శివస్తుతి.

శ్లో॥ **సంధ్యా తాండవ నాట్య నృత్త విలసల్లాస్యాంగనిర్దేశకం**
**ధంధంధం కృత సప్త సప్త రచనా భాషా విశేషాత్మకమ్ ।**
**ఈశానాది ముఖాబ్జ నాద జనితాస్సప్తస్వరాలంకృతం**
**వందే శంకరమీశ్వరం త్రికకరం సంగీతశిక్షాగురుమ్ ॥**

**ప్రతిపదార్థము :** సంధ్యా తాండవ = తన ఏడు తాండవములలో ఒకటయిన సంధ్యా తాండవములో అనగా ప్రదోష నృత్యములో (సంధ్య = ప్రొద్దుపొడుచుటకు ముందైదు గడియల వఱకును ప్రొద్దుగ్రుంకిన వెనుక మూడు గడియల వఱకును గల కాలము. గడియ అనగా 24 నిమిషముల కాలము); నాట్య = సర్వ రస ప్రధానమయిన

నాట్యమును (నటస్య కర్మ నాట్యం); విలసత్ = ప్రకాశించు; లాస్య = కైశికీ వృత్తి ప్రధానమయిన లాస్యమును (లసశ్లేషణ క్రీడనయోః – క్రీడించుట లాస్యము); అంగ నిర్దేశకం నృత్తమ్ = అంగ విక్షేప మాత్రమయిన నృత్తమును; నిర్దేశకమ్ = బోధించువాడు; ఢంఢంఢమ్ = ఢమ్ ఢమ్ ఢమ్ అను చప్పుళ్లతో; కృత = చేయబడిన; సప్త సప్త రచనా భాషా విశేషాత్మకమ్ = పద్నాలుగు సూత్రాలతో ఉద్భవించిన సంస్కృతభాషా విశేషాలు, రచనా విశేషాలతో కూడుకొన్న వాడు; ఈశానాది ముఖ అబ్జ నాద = ఈశాన + ఆది + ముఖ + అబ్జ = సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానము అను అయిదు ముఖాల నెడి పద్మముల మ్రోతలనుండి; జనితాః = పుట్టింపబడిన; సప్తస్వర + అలంకృతమ్ = 1. నిషాదము, 2. ఋషభము, 3. గాంధారము, 4. షడ్జము, 5. మధ్యమము, 6. ధైవతము, 7. పంచమము అను ఏడు స్వరములతో అలంకరింపబడినవాడు (“**నిషాదర్షభ గాంధార షడ్జ మధ్యమ ధైవతాః, పంచమ శ్చేత్యమీ సప్తతంత్రీకంఠోత్థితాః స్వరాః**” అమరకోశము 1–6–1) 1. ఉదాత్తము, 2. ఉదాత్తతరము, 3. అనుదాత్తము, 4. అనుదాత్తతరము, 5. స్వరితము, 6. స్వరితోదాత్తము, 7. ఏకశ్రుతి అను ఏడు స్వరములతో అలంకరింపబడినవాడు (త ఏతే తంత్రే తరనిర్దేశే సప్తస్వరా భవంతి ఉదాత్తః ఉదాత్తతరః అనుదాత్తః అనుదాత్తతరః స్వరితః స్వరతేయ ఉదాత్తః సోऽన్యేన విశిష్ట ఏకశ్రుతిః సప్తమః” పాతంజలమహాభాష్యము); త్రికకరమ్ = గీతము, వాద్యము, నృత్యము అను మూడు కలిసిన సంగీతమును అనుగ్రహించి (మార్గో దేశీతి తద్ద్విధా – అని సంగీతాన్ని సంగీతరత్నాకరము రెండు రకాలుగా విభజించింది. 1. మార్గ సంగీతము (బ్రహ్మాదులచే నన్వేషించబడి భరతాదులచే ప్రయోగించబడినది), 2. దేశి సంగీతము (ప్రతి దేశమునను దేని రుచిచే జనులకు మనోరంజనమగుచుండునో ఆ గీతవాద్యనృత్తమయమయిన సంగీతము); సంగీత శిక్షా గురుమ్ = సంగీత శిక్షా గురువైన; ఈశ్వరమ్ = ఈశ్వరునికి (ఈ ష్టే ఈశః – ఐశ్వర్య యుక్తుడు శివుడు); శంకరమ్ = శంకరునికి (శం సుఖం కరోతీతి శంకరః – సుఖమును కలుగచేయువాడు); వందే = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** సంధ్యాతాండవములో సర్వ రస ప్రధానమయిన నాట్యమును, లాస్యమును, నృత్తమును చెప్పువాడయిన శివునికి, తన ఢమరుకపు చప్పుళ్ల నుండి ఉద్భవించిన సూత్రాలతో సమస్త సంస్కృత భాషా విశేషాలు, రచనా విశేషాల మూలకర్త అయిన శివునికి, సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానము అను

అయిదు ముఖాలనెడి పద్మముల స్రోతలనుండి పుట్టిన సప్తస్వరాలతో అలంకరింపబడిన శివునికి, గీతము, వాద్యము, నృత్యము అను మూడు కలిసిన సంగీతమును లోకానికి అనుగ్రహించి, సంగీత శిక్షా గురువైన ఈశ్వరునికి, శంకరునికి నమస్కరించుచున్నాను.

**విశేషాలు :**

"తెలుగులోనూ, సంస్కృతంలోనూ ఉన్న అద్భుతమైన గ్రంథాలు ఇంగ్లీష్ లోకి రావాలి. అప్పుడే అవి ప్రపంచవ్యాప్తంగా అందరికీ చేరువవుతాయి" అని చెప్పటమే కాదు – సంగీత సంప్రదాయ దర్శిని, రసమంజరి వంటి సంస్కృత గ్రంథాలను ఇంగ్లీషులోకి అనువదించిన విద్వాంసులు డా॥ పప్పు వేణుగోపాలరావు గారు.

అన్నమయ్య కృతులకు వ్యాఖ్యానంతో "ఫ్లవర్ ఎట్ హిజ్ ఫీట్" అను పేరుతో నాలుగు పుస్తకాలు ప్రచురించిన విశిష్టులు శ్రీ వేణుగోపాలరావు గారు. ఇప్పటివరకు 22కు పైగా పుస్తకాలు తెలుగు, ఇంగ్లీషు భాషల్లో రచించారు.

కోయంబత్తూర్ భారతీయ విద్యాభవన్ వారి "సంగీత సమ్రాట్" అవార్డ్, తిరుపతి రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠ్ వారి "వాచస్పతి" (డాక్టరేట్) వంటి అనేక గౌరవాలు పొందిన శ్రీ వేణుగోపాలరావుగారు **"సప్త తాండవమ్"** అను నృత్యనాటికలో ఈ నాందీ శ్లోకం రచించారు.

"గీతము, వాద్యము, నృత్యము అను మూడు కలిసిన సంగీతమును లోకానికి అనుగ్రహించిన శంకరునికి నమస్కరించుచున్నాను." అని చివరి పాదములో చెప్పి మూడు పాదాలలో గీతం, వాద్యం, నృత్యాలకు సంబంధించిన పాదాలను మత్తేభ వృత్తములో వ్రాయుట గమనార్హం. గజచర్మాంబరధారికి, మత్తేభ వృత్త నమస్కారములో ఎంతో స్వారస్యముంది.

ఆనందతాండవం, సంధ్యాతాండవం, కాళితాండవం, త్రిపురతాండవం, గౌరితాండవం, సంహారతాండవం, ఉమాతాండవం అని ఏడు తాండవాలు శివుడు చేస్తాడట. (పాఠాంతరాలున్నాయి) శివుని సాత్విక నృత్యం సంధ్యాతాండవమట. సంధ్యా తాండవంతో ఈ సప్తతాండవ నాందీ శ్లోకం మొదలవుతుంది.

పరమేశ్వరుడు ఏకకాలంలో రెండు రూపాల్ని ప్రదర్శిస్తూ ఎడమ భాగాన పార్వతి, రెండవ భాగమున పరమేశ్వరరూపంగా అర్ధనారీశ్వరుడుగా దర్శనమిచ్చే కాలం ఈ సంధ్యాకాలం అని చెప్పబడింది. ఆ సంధ్యాసమయాల్లో పరమేశ్వరుడు పరవశించి

తాండవం చేస్తూ ఉంటాడు. ఆ నృత్యాన్ని దర్శించటానికి దేవతలందరూ అక్కడ కొలువుతీరి ఉంటారుట! ఆ సమయంలో ఆ తాండవ నృత్యానికి అనుగుణంగా సరస్వతి దేవి వీణవాయిస్తూ ఉంటే బ్రహ్మ తాళం వేస్తాడట. శ్రీమహాలక్ష్మి గానం చేస్తూ ఉంటే, శ్రీహరి మృదంగం వాయిస్తాడట. ఇంద్రుడు వేణునాదంతో పులకింపచేస్తూ ఉంటాడు! అటువంటి ప్రదోష సమయాల్లో దేవ గంధర్వ మహర్షి సిద్ధులందరూ పరమాత్మ స్వరూపాన్ని కొలుస్తూ ఉంటారుట. ప్రదోష సమయాల్లో శివుని ఆరాధిస్తే శివుని ఆశీస్సులతోపాటు మిగతా దేవతల ఆశీస్సులు కూడా ఏకకాలంలో మనం పొందగలుగుతామని చెబుతారు.

సంధ్యాకాలంలోని ఆ అర్ధనారీశ్వర స్వరూపాన్ని ధ్యానిస్తే రెండు ప్రయోజనాలు లభిస్తాయట. కామం అంటే కోర్కెలను నియంత్రించే శక్తి మరియు కాలాన్ని అంటే మరణాన్ని జయించే శక్తిని ప్రసాదిస్తాడుట. ఇంకా ఈ ప్రదోష దర్శనం సర్వశుభాలను కలుగచేసి, సర్వదారిద్ర్యబాధలను తొలగించి సర్వసంపత్తులు అనుగ్రహిస్తుంది. ఇటువంటి పవిత్రమైన సంధ్యా తాండవ ప్రసక్తితో నాందిని మొదలుపెట్టిన రచయిత అభినందనీయులు.

చిదంబరంలో నటరాజు తాండవం చివర ఉదయించిన పదునాలుగు శబ్దాలూ పదునాలుగు సూత్రాలుగా ఏర్పడినవి. వీనికి **మహేశ్వరసూత్రాల**ని పేరు. వీనిని మూలం చేసుకొని పాణిని వ్యాకరణ సూత్రాలు రచన చేశాడు. ఇవి మొత్తం పద్నాలుగు. **1. అఇఉణ్, 2. ఋక్, 3. ఏఓఙ్, 4. ఐఔచ్, 5. హయవరట్, 6. లణ్, 7. ఞమఙణనమ్, 8. ఝభఞ్, 9. ఘఢధష్, 10. జబగడదశ్, 11. ఖఫఛఠథచటతవ్, 12. కపయ్, 13. శషసర్, 14. హల్.** పరమశివుడు దమరుకం వాయించినప్పుడు వచ్చిన శబ్దాలు ఇవి. ఈ మాహేశ్వర సూత్రాలు సమస్తమయిన సంస్కృతభాషా విశేషాలకు, సాహిత్య రచనా విశేషాలకు మూలమనే కవి వాక్కు తిరుగులేనిది. పాణి అనగా చేయి. భగవానుని పాణి నినాదము పాణిని నాదముగా మారిందని కొందరు చమత్కరించారు.

“సద్యోజాతాదిపంచవక్త్రజ” అని త్యాగరాజస్వామి ప్రయోగం. సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానము అని శివలింగానికి మొత్తం 5 ముఖాలు. శివలింగానికి ఎదురుగా ఉన్న ద్వారం పశ్చిమంవైపు ఉన్నా లేదా శివలింగం పశ్చిమం వైపు చూస్తున్నా అది సద్యోజాతము. ఉత్తరం వైపు చూస్తే ముఖము “వామదేవ” ముఖమని పేరు. శివలింగం దక్షిణానికి చూసే ముఖాన్ని దక్షిణామూర్తి స్వరూపము అంటారు. ఇదే అఘోర ముఖం. శివలింగం తూర్పువైపుకు చూస్తూ ఉంటే, దానికి

తత్పురుష ముఖమని పేరు. శివలింగం పైన ఉండే ముఖాన్ని "ఈశాన" ముఖమని పేరు. ఈ అయిదు ముఖాలనుండి సప్తస్వరాలు పుట్టాయని కొందరంటే – సద్యోజాత ముఖము నుండి "ద", వామదేవ ముఖము నుండి – "మ", అఘోర ముఖము నుండి – "గ", తత్పురుష ముఖము నుండి – "రి", ఈశాన ముఖము నుండి – "ని" పుట్టాయని మరికొందరంటారు. సహజంగానే అనాది పురుషుడయిన శివునితో పాటు స, ప అనే ప్రకృతి స్వరాలున్నాయి. అందుకే ఈ కీర్తనలో అయిదు ముఖాలకు సంబంధించి అయిదు స్వరాలను చెప్పుకోవాలని శ్రీ చాగంటి వారు వాగ్గేయకార ప్రసంగాలలో చెప్పారు.

"ఈశానాది ముఖాబ్జనాదజనితాస్సప్తస్వరాలంకృతం" అని ఈ విశేషాలన్నింటిని ఒకే పాదంలో చెప్పిన వేణుగోపాలరావుగారి ప్రతిభ ప్రశంసాపాత్రమైనది. ❀

## 103

విహారి గారి **సుందరకాండ** కావ్యములో శివస్తుతి.

> **భగవంతంబగు రాత్రి; ఈ నిఖిల నిత్య వ్యాప్త చంద్రుండునున్**
> **భగవంతంబగు; ధారుణీసుత – మహాభాగ్య ప్రపూతన్ గనన్**
> **భగవంతంబగు; జన్మమన్న ప్లవగ ప్రాముఖ్యు గాపాడు నా**
> **భగవంతుండగు గాక రక్షకుడు కావ్యస్థానవిఖ్యాతికిన్.**

**ప్రతిపదార్థము :** రాత్రి = ఈ రాత్రి; భగవంతంబగు = భగవంతుని లక్షణములు కలిగినది అవుతుంది; ఈ నిఖిల నిత్యవ్యాప్త చంద్రుండునున్ = ఈ సమస్త ప్రపంచములోనూ నిత్యముగా వ్యాపించి ఉన్న చంద్రుడు కూడా; భగవంతంబగు = భగవంతుని లక్షణములు కలిగినవాడు అగుచున్నాడు. మహాభాగ్యప్రపూతన్ = గొప్పదైన భాగ్యముచే పరిశుద్ధురాలయిన; ధారుణీసుత = భూదేవి కుమార్తె అయిన సీతమ్మను; కనన్ = నేను కనుక చూస్తే; జన్మము = నా జన్మ; భగవంతంబగు = భగవంతుని లక్షణములు కలిగినది అవుతుంది; అన్న = అని పలికిన; ప్లవగ ప్రాముఖ్యు = వానర ప్రముఖుడయిన హనుమంతుని; కాపాడు = రక్షించు; రక్షకుడు = రక్షించువాడయిన; ఆ భగవంతుండు = ఆ భగవానుడైన శివుడు; కావ్యస్థాన విఖ్యాతికిన్ = చక్కటి పేరుతో ప్రముఖమైన స్థానాన్ని నా కావ్యము పొందేటట్లుగా; అగుగాక = చేయుగాక!

**తాత్పర్యము :** ఈ రాత్రి భగవంతుని లక్షణములు కలిగినది అవుతుంది. ఈ సమస్త

ప్రపంచములోనూ నిత్యముగా వ్యాపించి ఉన్న చంద్రుడు కూడా భగవంతుని లక్షణములు కలిగినవాడు అగుచున్నాడు. గొప్పదైన భాగ్యముచే పరిశుద్ధురాలయిన భూదేవి కుమార్తె అయిన సీతమ్మను నేను కనుక చూస్తే నా జన్మ భగవంతుని లక్షణములు కలిగినది అవుతుంది అని పలికిన వానర ప్రముఖుడయిన హనుమంతుని రక్షించు సమస్త లోక రక్షకుడయిన ఆ భగవానుడైన శివుడు - చక్కటి పేరుతో ప్రముఖమైన స్థానాన్ని నా కావ్యము పొందేటట్లు చేయుగాక!

**విశేషాలు :**

సంస్కృతంలో కల, కలిగిన అనే అర్థంలో ఏ పదానికైనా వంత, మంత అనే పదాలు ప్రక్కన వచ్చి చేరతాయి. 'అ'కారం తర్వాత అయితే 'వంత', 'ఇ'కార, 'ఉ 'కారాల తర్వాతైతే 'మంత' అని చేరుతుంది. ఇక్కడ భగ శబ్దము అకారాంతము కనుక భగవంతము అయింది.

విష్ణుసహస్రనామాలలో 558వ నామము భగవాన్. **ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః । జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా॥** - సమగ్రమైన ఐశ్వర్యము, వీర్యము, యశము, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము మొదలైన ఆరు లక్షణములకు భగమని పేరు. "ఉత్పత్తిం ప్రలయం చైవ భూతానామాగతిం గతిమ్ । వేత్తి విద్యామవిద్యాం చ స వాచ్యో భగవానితి ॥" (విష్ణుపురాణే షష్ఠాంశే పఞ్చమోఽధ్యాయః 78శ్లో) భూతముల ఉత్పత్తి, ప్రళయములను గమనాగమనములను, విద్యావిద్యలను ఎవడు తెలుసుకొంటాడో ఆతడు 'భగవాన్' ఆ భగవానుని లక్షణములు కలిగినది భగవంతము.

ప్రసిద్ధ కథకులు, కవి అయిన విహారి గారి పద చిత్ర రామాయణములో సుందరకాండలో నాందీ పద్యముగా ఈ భావచిత్రములు కలిగిన ఈ పద్యాన్ని వ్రాసుకొన్నారు. ఈ పద్యము చాలామంది విమర్శకుల మెప్పును పొందింది.

వాల్మీకి సుందరకాండలో అయిదవ సర్గలో రాత్రికి, చంద్రుడికి భగవాన్ విశేషణాలు ప్రయోగించారు. (06, 08 శ్లోకాలు) పుల్లెల వారు ఈ విషయాన్ని పరిశీలించి వివరించారు. అది చదివిన విహారిగారు తన నాందీ పద్యానికి రూపకల్పన చేసారు. (శ్రీ విహారిగారు ఫోను సంభాషణలో నాకు ఈ విషయాన్ని చెప్పారు 25-02-2015)

రాత్రి భగవంతుని లక్షణములు కలిగినది ఎలా అవుతుంది? రాతి సుఖమితి రాత్రిః రాదానే. సుఖాన్ని ఇచ్చేది రాత్రి. వైరాగ్యము భగవంతుని లక్షణాలలో ఒకటి. కనుక రాత్రి భగవంతము.

**చందయతీతి చంద్రః చది ఆహ్లాదనే**. సంతోషింప చేయువాడు చంద్రుడు. నిర్మలమయిన జ్ఞానము కూడా సంతోషింప చేస్తుంది. కనుక ఈ సమస్త ప్రపంచములోనూ నిత్యముగా వ్యాపించి ఉన్న చంద్రుడు కూడా భగవంతుని లక్షణములు కలిగినవాడు అగుచున్నాడు.

భగవంతుని లక్షణములలో ఒకటి సత్కీర్తి. సీతమ్మను కనుగొంటే హనుమంతునికి సత్కీర్తి లభిస్తుంది. అందుకే సీతమ్మను కనుగొన్న తర్వాత తన జన్మ భగవంతుని లక్షణములు కలిగినది అవుతుందని హనుమంతుడు చెప్పాడు.

ఆంజనేయుడు కూడా శివునిలా త్రినేత్రుడు. తమిళనాడు రాష్ట్రం, నాగపట్నం జిల్లాలోని ఆనందమంగళంలో **త్రినేత్ర దశభుజ వీరాంజనేయ** ఆలయము ఉంది. ఈ ఆలయంలో పది భుజాలు, నుదురుపై మూడో కన్ను కలిగిన ఆంజనేయుడు భక్తుల పూజలందు కుంటున్నాడు.

శివాంశతో జన్మించినవానిగా ఆంజనేయుని చెబుతారు. దీనిలోని ప్రతీకాత్మకతను మనం గ్రహించాలి. శివుడు లయం చేస్తాడంటే "నేను, నాది" అనే భావనను నశింపచేస్తాడని అర్థం. అపరిమిత శక్తి లయంలో ఏర్పడుతుంది. అటువంటి శివతత్త్వం కలిగినవాడు అపరిమితతేజస్కుడు **హనుమంతుడు**.

శివకేశవులు ఇద్దరూ ఒక్కరే. మహాభారత యుద్ధము తర్వాత **శివసహస్రనామస్తోత్రం** గురించి చెప్పమని భీష్ముడిని ధర్మరాజు అడుగుతాడు. "శ్రీకృష్ణుడు మాత్రమే శివ సహస్రనామ స్తోత్రాన్ని చెప్పగలడని భీష్ముడు చెబుతాడు. శ్రీకృష్ణుడు శివుని వేయి పేర్లను ప్రవచిస్తాడు. (అనుశాసనిక పర్వం) **"శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే"** అందుకే రామభక్తుడైన హనుమంతుడు ఈ నాందీ శ్లోకంలో శివధ్యానము చేసాడు.

భగవంతుఁడు అనే శబ్దానికి : విష్ణువు, శివుఁడు, పూజ్యుఁడు అను అర్థాలను ఇచ్చింది శబ్దరత్నాకరము (బహుజనపల్లి సీతారామాచార్యులు) 1912. అందులో శివార్థాన్ని విహారి గారు స్వీకరించారు. కథను ఎంత అందంగా చెప్పగలరో, పద్యాన్ని కూడా అంత అందంగా నడిపిస్తారు. ఉదాహరణకు ఒక పద్యం. సీతను చూచిన తర్వాత హనుమంతుడు ఇలా అనుకొంటాడట.

"అవును కాబోలు; కాబోలు నవుననుకొని
మనము తాను ద్వైధీభావ మగ్నమయ్యె
గుండె నీట నిండిన కొత్త కుండయయ్యె
వాఙ్మయము మూగవోయిన భ్రాంతి నింపె"

ఆధునిక కాలములో ప్రతిభా సంపన్నులయిన విహారిగారి అసలు పేరు జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి. కాని ఆయనను రస విహారి, కవితా విహారి – ఇలా అనుకొని పొగిడితేనే మనస్సు సంతృప్తి పడుతుంది. ❁

**104**

వావిలికొలను సుబ్బారావు **రామాయణము**లోని శివస్తుతి.

**ప్రేమ సురార్థమై విషము మ్రింగుట డాయుట స్థాణ్వపర్ణతన్**
**సామతి ద్యోనదీందులవి చక్కదొలంపగ రామి రామనా**
**మామృతభుక్తి జేవ గొని యంది మహేశ్వర సర్వమంగళా**
**త్వామిత భూతి మీఱెడు శివాఽసమకల్పలతన్ కృతిత్రముల్.**

**ప్రతిపదార్థము :** ప్రేమన్ = అనురాగముతో; సుర + అర్థమై = దేవతలను రక్షించుట కొరకు; విషము మ్రింగుట = పాలసముద్రములో పుట్టి లోకములను కాల్చుచున్న హాలాహల విషమును మింగుట చేత; శివుడును డాయుటన్ = శివునిని, విషమును సమీపించుట చేత; స్థాణ్వపర్ణతన్ = స్థాణు + అపర్ణతన్ – స్థాణు = శివుడు స్థాణువయి (ఎండిపోయిన చెట్ల బోదె వలె అయ్యాడు); అపర్ణతన్ = పార్వతి కూడా ఆ విషమును సమీపించుట వలన దావాగ్ని సెగకు కమలి ఆకులు రాలిపోయిన చెట్టు అయి; సామతి = సగము శుష్కించి పోయారు; ద్యోనదీందులు = దోనది + ఇందులు = ఆకాశగంగ, చంద్రుడు; చక్కన్ = పూర్తిగా; తొలంపగ రామి = వారి విష తాపమును తొలగింప రాకుండుటచే; రామనామ + అమృత భుక్తిన్ = రామ నామమను అమృతమును భుజించుటచే; చేవ గొని = బలము కలిగి; మహేశ్వర = మహేశ్వరత్వమును; సర్వమంగళాత్వ = సర్వమంగళాత్వమనెడి; అమిత భూతి = మితిమించిన శక్తిచే; అంది = పొందినవారై; మీరెడు = అతిశయించెడు; శివాఽసమకల్పలతన్ = శివుడు, శివ అను పేర్లు కలిగిన అసమాన కల్పవృక్షపు తీగలు; కృతిత్రముల్ = ఈ కృతిని రక్షించుగాక!

**తాత్పర్యము :** దేవతలను రక్షించుట కోసం, ప్రేమతో లోకాలను కాలుస్తున్న హాలాహలమును శివుడు మ్రింగాడు. ఆ తాపమువల్ల మొద్దుబారిపోయాడు. ఆయన పక్కనే పార్వతి కూడా ఆ విషపు సెగకు ఆకులు రాలిపోయిన చెట్టు అయింది. అయ్యో! మనకోసం శివపార్వతులిద్దరూ ఇలా అయ్యారే అని దేవతలు వాళ్ల తలలమీద గంగను, చంద్రుడిని ఉంచారు. కాని ప్రయోజనము లేదు. అప్పుడు రామ నామమను అమృత ప్రభావమువలన తాపము పోయి బలము వచ్చి శివుడు **మహేశ్వరు**డయ్యాడు. పార్వతి **సర్వమంగళ** అయింది. ఈవిధముగా రామనామముచే బాగుపడిన శివపార్వతులు ఈ రామాయణమును రక్షింతురుగాక!

**విశేషాలు :**

ఉత్తరహరివంశంలో (నాచనసోముడు) శివుడిని కృష్ణుడు పారిజాతవృక్షంతో పోల్చి పొంగిపోతాడు. కుజము కుంజరముచే గూలునో కూలదో / కూలు గుంజరము నీ కుజము కూల్చె" (02-176) లోకంలో ఎక్కడయినా ఒక చెట్టు - ఏనుగు చేత కూలుతుందో లేదో చెప్పలేం కాని, ఈ శివుడనే పారిజాత వృక్షం ఉత్తరంగా తలపెట్టుకొని నిద్రలో ఉన్న గజాసురుడు అనే ఏనుగును కూల్చివేసిందంటాడు. శివుడనే పారిజాత వృక్షం తనకు అందుబాటులో ఉండటం వల్ల తన కోర్కెలన్నీ తీరినట్లే అని ఆనందంతో కృష్ణుడు శివుని స్తుతి చేస్తాడు.

శంకర భగవత్పాదులంతటివారు - తమ ఆనందలహరిలో కృతస్థాణు స్థానా - అమ్మవారు అనే కల్పవృక్షపు తీగ శివుడనే మోడును పెనవేసుకొన్నది అన్నారు. (ఆరవ శ్లోకం)

కుమారస్వామిని (విశాఖుడు) కొలుస్తూ నన్నెచోడుడు "తన జనకుడగు స్థాణువు" అన్నాడు. తండ్రి శివుడు స్థాణువు. అంటే మోడువారిన చెట్టు. తల్లి పార్వతి అపర్ణ అంటే ఆకులు లేనిది. కుమారస్వామి మాత్రం విశాఖుడు. అంటే కొమ్మలు లేనివాడు. అయినా ఫలాలను ఇస్తాడు అని పద చమత్కారం చేసాడు.

**తన జనకుఁడురుస్థాణువు,**
జనని యపర్ణాఖ్య దా విశాఖుం డనగాఁ
దనరియు నభిమత ఫలముల
జనులకు దయ నొసఁగుచుండు షణ్ముఖుఁ గొలుతున్

(కుమార సంభవం 1.8)

ప్రళయము నందు కూడా ఉండువాడు అని స్థాణు శబ్దానికి అసలు అర్థం. (ప్రళయేపి తిష్ఠతీతి స్థాణుః – ష్ఠాగతి నివృత్తౌ). అటువంటి స్థాణువయిన శివుడు ఈ పద్యంలో వాసుదాసుగారి దృష్టిలో విషం తాగి ఎండిపోయిన చెట్టులా అయ్యాడు.

చలనచిత్రాలలో అప్పుడప్పుడు మనం చూస్తుంటాం. రెండు పాత్రలు మాట్లాడుకొంటున్నప్పుడు ఒక పాత్రమీద కెమెరా ఫోకస్ చేసినప్పుడు, రెండోపాత్ర మీద కాంతి తగ్గిపోతుంది. ఇక్కడ ఫోకస్ చేసిన పాత్ర వెలిగిపోతుంది. రెండో పాత్ర మీద కాంతి తగ్గుతుంది. సరిగ్గా ఇదే పద్ధతి ఈ పద్యంలో జరిగింది. రాముని గొప్పతనాన్ని రామభక్తుడైన కవి చెప్పదలుచుకొన్నాడు. ఆయన మీద ఫోకస్ ఎక్కువయింది. శివుడు రామనామామృతాన్ని తాగి చైతన్యము తెచ్చుకొన్నవాడు అయ్యాడు.

మన పురాణాల్లో ఉన్న పద్ధతి ఇదే. విష్ణువును గొప్ప చేసే పురాణాలు శివ ప్రాధాన్యాన్ని తగ్గిస్తాయి. శివుడిని గొప్ప చేసే పురాణాలు విష్ణు ప్రాధాన్యాన్ని తగ్గిస్తాయి. ఇద్దరూ సమానమే అని ఎంత గొంతు చించుకున్నా, తమకు తెలిసినా కవులు ఆగలేరు. తమ మనస్సుకు నచ్చిన దేవుడిని ఎక్కువ చేస్తారు. మనం కూడా వారి పద చమత్కారాల వరకు మాత్రమే ఆనందాన్ని అనుభవించాలి.

శివుడు అర్ధనారీశ్వరుడు. సగము శరీరము శివుడు. సగము శరీరము పార్వతి. వారిద్దరూ శుష్కించుటకు కారణము విషము త్రాగుట అని చెప్పబడింది కనుక హేతూత్ప్రేక్ష అలంకారం.

**వావిలికొలను సుబ్బారావు** (జనవరి 23, 1863 – ఆగష్టు 1, 1936) **"శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము"** అను పద్యకావ్యము రాసారు. శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణ క్షీరార్ణవ మందరము అను పేరుతో, తన పద్యాలకు, వాల్మీకి శ్లోకాలకు కలిపి **న భూతో న భవిష్యతి** అనునట్లుగా వ్యాఖ్య వ్రాసారు. **ఆంధ్రవాల్మీకి** అని వీరి బిరుదు. **వాసుదాసు అని చాలామంది పిలుస్తారు.**

**వావిలికొలను సుబ్బారావుగారు ఒంటిమిట్టలోని కోదండరామస్వామి ఆలయ పునరుద్ధరణకు ఒక కొబ్బరిచిప్పను భిక్షాపాత్రగా చేసుకొని విరాళాలు సేకరించిన మహానుభావుడు.**



## 105

శంకరభగవత్పాదుల **దక్షిణామూర్తిస్తోత్రము**లోని మొదటి శ్లోకం.

**శ్లో॥ మౌనవ్యాఖ్యాప్రకటితపరబ్రహ్మతత్త్వం యువానం**
**వర్షిష్ఠాన్తేవసదృషిగణైరావృతం బ్రహ్మనిష్ఠైః ।**
**ఆచార్యేంద్రం కరకలితచిన్ముద్రమానందమూర్తిం**
**స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తిమీడే ॥**

**ప్రతిపదార్థము :** మౌన = మౌనమైన; వ్యాఖ్యా = వ్యాఖ్యతో; ప్రకటిత = ప్రకటించబడిన; పరబ్రహ్మతత్త్వమ్ = పరబ్రహ్మతత్త్వం కలిగిన; యువానామ్ = యౌవనవంతుని; బ్రహ్మనిష్ఠైః = భగవంతుని గురించి తెలుసుకొనగోరు; వర్షిష్ఠ = ఎక్కువ వయస్సుకల, అంతేవసదృషిగణైః = శిష్యులయిన ఋషిసముదాయములచేత; ఆవృత్తమ్ = చుట్టుకొనబడిన; కరకలిత = హస్తముచేత రచింపబడిన; చిన్ముద్రమ్ = జ్ఞానముద్ర కలిగినవానిని (చూపుడువ్రేలి కొనను బొటనవ్రేలి కొనతో చేర్చి మిగతా మూడు వ్రేళ్ళను దాచి ఉంచిన ముద్ర. మేధా దక్షిణామూర్తిని జ్ఞాపకం చేసే ముద్ర.); ఆనందమూర్తిమ్ = ఆనందస్వరూపుని; స్వాత్మారామమ్ = తన ఆత్మయందే రమించుచున్నవానిని; ముదితవదనమ్ = సంతోషముతో కూడిన ముఖము గలవానిని; ఆచార్యేన్ద్రమ్ = ఆచార్య + ఇన్ద్రమ్ = గురువులలో గొప్పవాడయిన; దక్షిణామూర్తిమ్ = దక్షిణామూర్తి స్వామిని; ఈడే = స్తుతి చేయుచున్నాను.

**తాత్పర్యము :** మౌనమైన వ్యాఖ్యతో పరబ్రహ్మ తత్త్వం ప్రకటించు యౌవనవంతుని, భగవంతుని గురించి తెలుసుకొనగోరు ఎక్కువ వయస్సుకల, శిష్యులయిన ఋషిసముదాయములచేత చుట్టకొనబడినవానిని, హస్తముచేత రచింపబడిన జ్ఞానముద్ర కలిగినవానిని, ఆనందస్వరూపుని, తన ఆత్మయందే రమించుచున్నవానిని, సంతోషముతో కూడిన ముఖము గలవానిని, గురువులలో గొప్పవాడయిన దక్షిణామూర్తి స్వామిని స్తుతి చేయుచున్నాను.

**విశేషాలు :**

మౌనం యొక్క గొప్పతనం చేసే స్తోత్రము **దక్షిణామూర్తిస్తోత్రము.**

బ్రహ్మయొక్క నలుగురు కుమారులు సనక, సనందన, సనాతన, సనత్కుమారులు. వారు బ్రహ్మజ్ఞానం కోసం అనేక రకాలుగా తపస్సు చేసారు. అయినా

వారికి బ్రహ్మజ్ఞానం తెలియలేదు. చివరికి ఒక మఱ్ఱిచెట్టు క్రింద కూర్చున్న పరమశివుని దగ్గరకు వెళ్ళి, తమకు ఆ పరమాత్మజ్ఞానాన్ని చెప్పవలసినదిగా కోరారు. శివుడు ఒక్కమాట కూడా మాట్లాడకుండా యోగభంగిమలో ఉన్నాడు. ఋషులకు జ్ఞానోదయమైంది. పరమాత్మ జ్ఞానము మాటల్లో వర్ణించలేనిది, కేవలం అనుభవించదగినది అని ఈ విషయం తెలియచేస్తోంది.

తమిళనాడులోని మైలదుత్తురైలోని దక్షిణామూర్తిదేవాలయం ప్రసిద్ధి కలిగినది.

నడిచే దేవుడు శ్రీ కంచిస్వామి తన బోధలలో ఈ దక్షిణామూర్తి ముద్రను ఇలా వివరించారు. "బొటనవ్రేలిని అంగుష్ఠమని అంటారు. హృదయ మధ్యంలో అంగుష్ఠమాత్రుడై యీశ్వరుడుంటాడు. లోపలి వస్తువొకటి, బయటి వస్తువొకటి" అని రెండు వస్తువులులేవు. రెండు రకాలు లేవు. అన్నీ ఒకటే అన్న స్వానుభవాన్ని బొటనవ్రేలు చూపుడువ్రేళ్ళ కలయికచే దక్షిణామూర్తి చూపుతున్నారు.

జ్ఞానం రెండు తెగలు. ఒకటి పరోక్షజ్ఞానం, మరొకటి అపరోక్షజ్ఞానం. మొదటిది థియరీ. రెండవది ప్రాక్టికల్. దానిచేత పరోక్షజ్ఞానంకంటె అపరోక్ష జ్ఞానమే శ్రేష్ఠం. అపరోక్ష జ్ఞానోపదేశమే **దక్షిణామూర్తి మౌనవ్యాఖ్య**.

శంకరభగవత్పాదులు రచించిన బ్రహ్మసూత్ర భాష్యం, గీతాభాష్యం, ఉపనిషద్భాష్యం అను ప్రస్థానత్రయాన్ని గురువులవద్ద చదువునపుడు ముందు వెనుక ఈ దక్షిణామూర్తి శ్లోకములను చదవాలని ఒక సంప్రదాయమున్నది.

ఈ స్తోత్రములో తరచుగా వచ్చు **"శ్రీ దక్షిణామూర్తయే"** కు పెద్దలు రెండు రకాల అర్థాలు చెప్పారు. శ్రీ అనగా అనాదియగు, అచింత్యమగు, మాయాశక్తియని అర్థము; అట్టి మాయాశక్తిచేత; దక్షిణ = సృష్టి స్థితి లయముల యందు నిపుణుడు అని ఒక అర్థము. శ్రీ దక్షిణామూర్తయే అన్నపుడు అకారప్రశ్లేషచేత "అమూర్తయే" అని అర్థము వచ్చును. అమూర్తి అంటే మూర్తిలేనివాడు, నిర్వికారుడని అర్థము.

ఆకారమున్నవాడు, (మూర్తి) ఆకారము లేనివాడు (అమూర్తి) రెండూ పరమశివుడే.

రెండుగా కనిపిస్తూ, రెండుగా లేని అద్వైతాన్ని విశ్వం దర్పణ... మొదలయిన శ్లోకాల్లో ఉదాత్తంగా బోధించిన దక్షిణామూర్తి స్తోత్రంలో – రెండు పదాలను తనలో ఇముడ్చుకొని ఒకటిగా కనిపించే దక్షిణామూర్తి పదప్రయోగం కేవలం శంకరులకు మాత్రమే సాధ్యం.

మౌనంగా ఈ దక్షిణామూర్తి స్తోత్రాన్ని – లేదా ఒక్క శ్లోకాన్ని – చదువుకొని చిత్త శాంతి పొందినవాళ్లు చాలామంది ఉన్నారు. 

## 106

కొఱవి గోపరాజు **సింహాసనద్వాత్రింశిక** కావ్యములో మొదటి పద్యము.

**శ్రీ మత్పర్వత నందనా తనులతాశ్లిష్టాంగ మై బాహు శా**
**ఖా మధ్యంబున నున్న పన్నగ ఫణౌఘంబాకులై యొప్ప ను**
**ద్దామంబౌ శశికాంతి పుష్పరుచినొందంగా జటా పల్లవ**
**స్తోమంబౌ హరపారిజాతము నుతింతు న్వాక్ఫలావాప్తికిన్.**

**ప్రతిపదార్థము :** శ్రీమత్ = శుభము కలిగిన, సంపద కలిగిన, పర్వత నందనా = హిమవంతుడను పర్వతము యొక్క కుమార్తె అయిన పార్వతీదేవి యొక్క; తనులతా = శరీరమనెడి లతను; ఆశ్లిష్ట + అంగ = కవుగిలింపబడిన అవయవములు కలిగినది; మై = శరీరము యొక్క; బాహు శాఖా మధ్యంబునన్ + ఉన్న = చేతులనెడి చెట్టుకొమ్మల మధ్య ఉన్న; పన్నగ = పాములయొక్క; ఫణౌఘంబు = ఫణ + ఔఘంబు = పడగల సమూహము; ఆకులై యొప్ప = ఆకులై + ఒప్ప = ఆకులుగా ప్రకాశించుచున్నది; ఉద్దామంబు + ఔ = అడ్డము లేనిదయిన, అధికమయిన; శశికాంతి = చంద్రుని కాంతి; పుష్పరుచిన్ = పుష్ప కాంతిగా; ఒందంగా = పొందినది; జటా పల్లవ = జడలు కట్టిన వెంట్రుకలనెడి చిగురించిన కొమ్మలు; స్తోమంబౌ = స్తోమంబు + ఔ = సమూహము కలిగినదయిన; హరపారిజాతము = శివుడనెడి కల్పవృక్షమును (పారిజాతము, మందారము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము – ఇవి దేవవృక్షములు); వాక్ఫలావాప్తికిన్ = వాక్ ఫల + అవాప్తికిన్ = వాక్కులనెడి ఫలమును పొందుటకు; నుతింతున్ = పొగడెదను.

**తాత్పర్యము :** శివుడనెడి కల్పవృక్షము శుభము కలిగిన పార్వతీదేవియొక్క శరీరమనెడి లతతో అల్లుకొనబడింది. ఆమె కౌగిలిలో చేతులనెడి చెట్టుకొమ్మల మధ్య ఉన్న పాముల యొక్క పడగల సమూహము ఆకులుగా ప్రకాశిస్తున్నాయి. శివుని అధికమయిన చంద్రుని కాంతి పుష్పకాంతిలా మెరుస్తోంది. తన జడలు కట్టన వెంట్రుకలు చిగురించిన కొమ్మల సమూహములా ఉన్నాయి. అటువంటి శివుడనెడి కల్పవృక్షమును వాక్కులనెడి ఫలమును పొందుటకు పొగడెదను.

**విశేషాలు :**

తెలంగాణా రాష్ట్రంలోని నిజామాబాద్ జిల్లాలో గల భీంగల్ – కొఱవి గోపరాజు (1500–1530) స్వస్థలం. ఆయన సంస్కృతంలో ప్రసిద్ధ కథల సంపుటి అయిన సింహాసనద్వాత్రింశికను తెలుగులోకి అనువదించారు.

సింహాసనద్వాత్రింశికతో పాటు, సింహాసన ద్వాత్రింశతి అనికూడా పేరు కావ్యానికి ఉంది.

నాందీకి సంబంధించిన ఈ శార్దూల పద్యములో సమస్త వస్తు విషయ సావయవ రూపకము అను అలంకారము ఉన్నది. అవయవి, దాని అవయవములు సమగ్రముగా రూపకాలంకారములో చెబితే అది సమస్త వస్తు విషయ సావయవ రూపకము. ఈ పద్యములో పారిజాతము (కల్పవృక్షము) అవయవి. దాని సమస్త అవయవములు ఆకులు, పుష్పాలు, కొమ్మలు శివునిలో ఆరోపింపబడినవి.

చెట్టునుంచి ఎవరైనా పండు కోరుకొంటాం. శివుడనే కల్పవృక్షమునుంచి వాక్కు అనే పండును కోరుకొన్న కవి ఊహ ప్రశంసనీయమైనది.

అరువది నాలుగు కళలలో చాలా కళలు సింహాసనద్వాత్రింశికలో ఉన్నాయి. ఉదాహరణకి దొంగతనానికి సంబంధించి ఇదివరకటి రోజుల్లో గాలిచీర పట్టుకు వెళ్లేవారట. కన్నం వేసాక గాలి జొరకుండా మూయడానికి దానిని వాడేవారు. దీపాలు ఆర్పే పురుగులని గదిలోకి ఊదటానికి పురుగుల గొట్టం పట్టుకు వెళ్లేవారు. ఇలా దొంగలకు కావలసిన పనిముట్లు, వాటి ఉపయోగాలు ఈ కావ్యంలో చాలా ఉన్నాయి.

కాకతీయుల కాలములో 'క్రీడాభిరామము' కావ్యములా, రెడ్డిరాజుల కాలములో 'సింహాసనద్వాత్రింశిక' ప్రసిద్ధి పొందినది.

ఒక ఇంద్రజాలికుడు యుద్ధం చేయడానికి వెళుతున్నానని చెప్పి తన భార్యను రాజుగారి సన్నిధిలో రక్షణ కొరకు విడిచిపెట్టి వెళ్లాడు. ఒక త్రాటిని పైకి నిలువుగా నిలబెట్టి, దానిపైకి పాకి మాయమయిపోయాడు. తరువాత ఇంద్రజాలికుని కాళ్ళూ, చేతులూ, తల, మొండెం విడివిడిగా క్రిందబడ్డాయి. భర్త చనిపోయాడని భావించి రాజుగారి దగ్గర ఉన్న ఇంద్రజాలికుని భార్య భర్తతో సహగమనం చేసింది. తరువాత ఇంద్రజాలికుడు పైనుంచి తాడుతో కిందికి దిగి వచ్చి తన భార్యను తనతో పంపమన్నాడు. ఇలా ఆ కాలంలో ఉన్న ఇంద్రజాలవిద్యను మనోహరమైన కథనంతో – కొఱవి గోపరాజు – తన కావ్యంలో నమోదు చేసాడు.

ససేమిరా (పూర్తిగా, బొత్తిగా) ఒప్పుకోవటం లేదు అను అర్థంలో **"ససేమిరా"** పదం ఈ రోజు మనం వాడుతున్నాం. ఈ ససేమిరా తెలుగు కావ్యంలో నుంచి పుట్టుకొచ్చి ప్రచారం పొందిన ఒక నుడికారం. జక్కన **విక్రమార్కచరిత్ర**లో – "ససేమిరా" అను అక్షరాలతో ప్రారంభమయ్యే నాలుగు పద్యాలున్నాయి. ఒక ఎలుగ్గొడ్డును మోసం చేసిన మిత్రద్రోహికి ఈ ససేమిరా అను అక్షరాలతో ప్రారంభమయ్యే నాలుగు పద్యాలు వినిపిస్తే శాపం పోతుంది.

సరిగ్గా జక్కన పద్ధతిలోనే – కొఱవి గోపరాజు ఒక చమత్కార పద్యం వ్రాసాడు. ఒక పేద వాడయిన కవి – కుమార్తెతో సహా రాజుగారి దగ్గరకు వచ్చి "రాజ(జా) దీని వివాహము చేయవయ్యా" అని అడగదలుచుకొన్నాడు. సీసపద్యములోని ప్రతి పాదము ముందు "రాజ(జా) దీని వివాహము చేయవయ్యా" అని ఒక్కో అక్షరము వచ్చేటట్లు వ్రాసాడు. ఆ పద్యమిది–

సీ॥ **రా** జ్యంబు వదలక రసికత్వమెడలక
  **జ** యశీలముడుగక నయము చెడక
**దీ** నులఁజంపక దేశంబునొంపక
  **ని** జముజ్జగింపక నేర్పుగలిగి
**వి** ప్రులఁజుట్టాల వెన్నుసొచ్చినయట్టి
  **వా** రినిగొల్చిన వారి ప్రజల
**హ** ర్షంబుతోగాచి యన్యాయముడుపుచు
  **ము** న్ను జెప్పిన రీతిఁజెన్ను మీరి

గీ॥ **చే** తలొండు లేక చేయుచు మేళ్లను
**య** శము కలిమి తమకు వశముగాగ
**వ** సుధ యేలు రాజవర్గంబులోన న
**య్యా** దివిష్ణుమూర్తివంద్రు నిన్ను.

గోపరాజు నాందీపద్యములో వర్ణించిన శివపారిజాతము సింహాసనద్వాత్రింశిక కథలనే ఆకులలో నిత్యనూతనంగా పరిమళిస్తూనే ఉంది. 

## 107

అప్పయ్య దీక్షితులవారి (1520–1593) **శివార్చనాచంద్రికలో** శివస్తుతి.

**శ్లో॥ యస్యాహురాగమవిదః పరిపూర్ణశక్తే రంశే -**
**కియత్యపి నివిష్టమముం ప్రపంచమ్ ।**
**తస్మై తమాలరుచిభాసురకంధరాయ**
**నారాయణీ సహచరాయ నమశ్శివాయ ॥**

**ప్రతిపదార్థము :** యస్య = ఎవనియొక్క; పరిపూర్ణశక్తేః = సంపూర్ణశక్తి యొక్క; అంశే = అంశములో; అముమ్ = ఈ; ప్రపంచమ్ = ప్రపంచము; కియత్యపి = కియత + అపి = ఎంత; నివిష్టమ్ = ప్రవేశించినదని; ఆగమ = 1. వేదం, 2. శాస్త్రజ్ఞానం, 3. యామళోక్త మంత్ర శాస్త్రం, 4. పూజా విధానాలను, ఆలయ నిర్మాణాది విశేషాలను తెలియజేసే పాంచరాత్రాదికం. (శైవాగమాలు, వైష్ణవాగమాలూ వేర్వేరుగా ఉన్నాయి) 1. వసిష్ఠ, 2. శుక, 3. సనక, 4. సనందన, 5. సనత్కుమార శుభాగమాలు. (వైదిక పంచకంగా వీటిని వ్యవహరిస్తారు); విదః = తెలిసినవారు; ఆహుః = చెప్పగలరు? (చెప్పలేరని భావము); తస్మై = అతనికొరకు; తమాల రుచి భాసుర = వాడిన కాంతితో ప్రకాశించే; కంధరాయ = కంఠము కలవానికి (కం శిరో ధారయతి కంధరా. ధృఞ్ ధారణే – శిరస్సును ధరించునది); నారాయణీ సహచరాయ = పార్వతీదేవి స్నేహితుని (కూడా ఉండేవానిని); శివాయ = శివుని కొరకు; నమః = నమస్కారము.

**తాత్పర్యము :** ఊహించుటకు అలవికాని శివుని పరిపూర్ణ శక్తిలో ప్రపంచములు ఎంత వరకు ప్రవేశించాయో చెప్పటానికి వీలు పడదని వేదశాస్త్రాలు చదివినవారు చెబుతున్నారు. (శివ శక్తి ఊహాతీతమని భావము) వాడిన కాంతితో ప్రకాశించే కంఠము కలవానికి పార్వతీదేవి స్నేహితునికి, శివునికి నమస్కారము.

**విశేషాలు :**

చంద్రయుక్తమైనది కనుక వెన్నెలకు **చంద్రిక** అని పేరు. (చంద్రః అస్తి అస్యామితి చంద్రికా). విగ్రహాన్నో, వ్యక్తినో, ఏదైనా పవిత్రవస్తువునో పూజించడం అర్చన. చంద్రుని నెత్తిన ధరించిన శివుని అర్చనను – చంద్ర సంబంధమైన వెన్నెలగా పేరు పెట్టిన కవి ప్రతిభ కొనియాడదగినది.

1. రంగవల్లి, 2. చందనము, 3. అక్షతలు, 4. పుష్పము, 5. ధూపము, 6.

దీపము, 7. నైవేద్యము, 8. తాంబూలము. అని ఎనిమిది రకాల అర్చనలు ప్రసిద్ధి. ఇవే కాకుండా దంతధావన విధి, స్నానవిధి, సంక్షిప్తశైవసంధ్యావిధి, భస్మధారణవిధి – ఇలా 38 శివుని పరమైన పూజా విధులను వివరంగా అప్పయదీక్షితులు ఈ పుస్తకములో తెలియచేసారు.

దేవిని పూజించిన గల్గు ఫలమెంత యుండునో! ఇంత ఫలము గలుగునని కచ్చితముగ చెప్పగలవాడెవ్వడు గలడు? (ఏవం ప్రభావా సా దేవీ తత్పూజాయాః ఫలం కియత్ । ఆస్తీతి కేన ప్రష్టవ్యం వక్తవ్యం వా న కేనచిత్ ॥ స్కం 18వ అధ్యా 70వ శ్లో) అని దేవీ భాగవతములో అమ్మ పరంగా ''కియత్'' శబ్దాన్ని ప్రయోగిస్తే – అప్పయ్యదీక్షితులు అయ్య పరంగా "కియత్" శబ్దాన్ని ప్రయోగించారు.

**శివతత్వాన్ని** – అంతరంగాన్ని ఎన్ని ఆగమాలు చదివినా – ఆ శాస్త్రపు చూపుతో చూడటం కష్టం. నలుపులో చూపు చొచ్చుకొని పోవటం కష్టం. "నల్లని కంఠము కల" అని కావాలనే కవి ప్రయోగము. శివానుగ్రహము ఉంటేనే శివతత్త్వగ్రహణము సాధ్యము. అందుకు ఒకటే మార్గం. అదే నమస్కారము అని కవి ఉపదేశము.

వెల్లూరులోని చిన్నబొమ్మరాజుగారికి శివుని గొప్పతనాన్ని, శివుని పూజించే విధానాన్ని తెలియచేయటానికి అప్పయ్యదీక్షితులు ఈ **శివార్చనచంద్రిక** రచించారట. మహేశ్వరే వా జగతామధీవ్వరే / జనార్దనే వా జగదంతరాత్మని, న వస్తు భేద ప్రతిపత్తి రస్తి మే / తథాపి భక్తిస్తరుణేందుశేఖరే. "రెండు వస్తువులున్నవని నేను అనుకోవటం లేదు. రెండూ ఒక్కటే అన్న భావము తనకున్నది" అని ప్రకటించిన అప్పయ్యదీక్షితుల వారు తనకు శివునిపై అపారభక్తి కలదని చెప్పారు.

**దీక్షితులవారు** తమ శివభక్తిని పరీక్షించుకోడానికి మార్గమేదని ఆలోచించారు. పిచ్చిపట్టిన సమయంలో మాటలు చేష్టలు, సహజ స్వభావానికి గుర్తులుగా ఉంటాయని భావించారు. శిష్యులను పిలిచి, తాను మందుతిని పిచ్చిగా ఉన్నప్పుడు చెప్పే మాటలన్నిటినీ వ్రాసి ఉంచమని చెప్పారు. పిచ్చి తగ్గటానికి కావలసిన మందు కూడా వారికిచెప్పి పిచ్చివాడై పోయారు. ఆ పిచ్చి ఎక్కిన సమయంలో అప్పయ్యదీక్షితులవారు ఏబది శ్లోకాలు ఆశువుగా చెప్పారట. వాటికే **ఆత్మార్పణస్తుతి** అనీ, **ఉన్మత్తపంచశతి** అనీ పేర్లు.

అర్కద్రోణప్రభృతికుసుమైరర్చనం తే విధేయం, ప్రాప్యం తేఽ జనస్మరహర

ఫలం మోక్షసామ్రాజ్యలక్ష్మీః, (శివ శివా! నీ దయని ఏమని వర్ణించను? సులభంగా లభించే జిల్లేడుపూలను, తుమ్మిపూలను భక్తుల నుండి గ్రహించి వాళ్లకు మోక్ష సామ్రాజ్యలక్ష్మిని అనుగ్రహిస్తున్నావు. ఇది తెలియకుండా కాలాన్ని మేము వృధా చేసుకొంటున్నాము) ఇటువంటి ఉదాత్తమైన శ్లోకాలు ఉన్మత్తపంచశతిలో ఉన్నాయి.

**నారాయణీ నాద రూపా** (లలితా సహస్రనామము). శరణ్యే త్ర్యంబకే నారాయణీ నమోఽస్తు తే – ఇలా అమ్మని "నారాయణీ" పేరుతో సంబోధిస్తుంటాం. నారాయణత్వ లక్షణము కల తల్లీ, పార్వతీదేవి నారాయణీ. విష్ణుని సోదరిగా కొందరు నారాయణీ శబ్దాన్ని చెబుతారు. ఆ నారాయణీ సహచరునిగా శివుని ఈ శ్లోకంలో అప్పయ్య దీక్షితులు పేర్కొన్నారు.

శ్రీనివాస దీక్షితులు అనే పండితుడు అస్తమిస్తున్న సూర్యుడిని "రత్నఖేటం"తో (రత్నాల డాలు) ఉత్ప్రేక్షించాడట. అప్పటినుండి "రత్నఖేటదీక్షితులు" అని పేరు వచ్చింది. ఈయన "అప్పయ్యదీక్షితుల వారితో నమస్కారం పెట్టించుకొంటాను" అని సవాలు చేసి వాదం చేసాడట. వాదంలో అప్పయ్య దీక్షితుల చేతిలో శ్రీనివాసదీక్షితులు ఓడిపోయాడు. అప్పయ్య దీక్షితులను బతిమిలాడి తన కూతురు నిచ్చి పెళ్ళి చేసి శ్రీనివాసదీక్షితులు మామ అయ్యాడు. అప్పుడు అల్లుడు అప్పయ్యదీక్షితులు శ్రీనివాసదీక్షితులకు నమస్కరించాడట. ఇలా అప్పయ్యదీక్షితులవారి చుట్టూ ఎన్నెన్నో కథలు – గాథలూ. **అప్పయ్య దీక్షితులంటేనే శివభక్తికి సాగరం.** ❁

## 108

తనికెళ్ళ భరణి (1956) **"శబ్బాష్ రా శంకరా"** లో మొదటి స్తుతి.

**గణపతిదేవుడు నీకు బిడ్డ**
**ఖబరస్తానేమో నీ అడ్డ...!**
**నీ తత్వాల్ పాడతా – కాళ్ళామీద బడ్డా**
**శబ్బాష్రా... శంకరా!!"**

**ప్రతిపదార్థము :** గణపతి = గణములకు అధిపతి – వినాయకుడు; ఖబర్ = సమాధి; బొంద = శవమును పూడ్చు గుంట (ఉర్దూ – తెలుగు నిఘంటువు బి.రామరాజు 1962); అడ్డ = పశువులు, బండ్లు నిలిచిఉండే స్థలము; కూలిపని నిమిత్తం మనుషులు నిలిచి ఉండే స్థలం; శబ్బాష్రా = ప్రశంసా సూచన శబ్దం; తత్వాల్ = పరమాత్మ స్వభావము; పాడతా = పాడుతా.

**తాత్పర్యము :** ఓ శివా! ఆ వినాయకుడు నీ కుమారుడు. శ్మశానం నీ నివాసస్థలం. నీ స్వభావములు గురించిన కవితలు పాడుతూ నీ కాళ్లమీద పడ్డాను. కాపాడు.

**విశేషాలు :**

**"వాక్యం రసాత్మకం కావ్యం"** - రసాత్మకమయిన వాక్యాన్ని కావ్యమని పిలవటానికి మన పెద్దవాళ్లు అభ్యంతరం చెప్పలేదు. ఆ దృష్ట్యా తనికెళ్ళ భరణి వ్రాసిన "శబ్బాష్ రా... శంకరా" పుస్తకంలో చాలా వాక్యాలు రసాత్మకాలైన కావ్యాలు.

విఘ్నాలను పోగొట్టే వినాయకుడు శివునికి కుమారుడు. బతుకులకు మంగళం పాడే శ్మశానం శివుని నివాసం. ఇంకోరకంగా చెప్పుకోవాలంటే విఘ్నాలను ప్రసాదించే వినాయకుడు శివునికి కుమారుడు. జీవితాలను అనుగ్రహించే శ్మశానం శివుని నివాసం.

ఒక గీత కింద దానిని మించిన పెద్ద గీత గీస్తే పైన ఉన్న గీత చాలా చిన్నదిగా కనబడుతుంది. కర్మవశాత్తూ - ఒక పెద్ద విఘ్నం - కష్టం మనకు రావాలి. గణపతిని నిండు హృదయంతో ప్రార్థించాం. అంతే పెద్దగీత - చిన్న గీతవుతుంది. గీత అనేది ఉంటుంది, కాని చిన్నదిగా కనబడుతుంది. కష్టమనేది ఉంటుంది. కాని స్వామి దయతో కష్టం చిన్నదవుతుంది. ఏ యాక్సిడెంట్లో కాలు విరిగి తీసేయాలన్నంత కష్టం, ఒక చిన్న ముల్లు గుచ్చుకోవటమంత చిన్నదవుతుంది. అలా - మనము నమ్ముకొంటే - విఘ్నాలను చిన్నదిగా చేసి అనుగ్రహించే వినాయకుడు నీ బిడ్డ అని కవి మొదటి చెప్పాడు.

జీవుల అహంకారాన్ని, కర్మబంధాలను భస్మీ భూతం చేసేది శ్మశానం. **శవానాం శయనం శ్మశానం**. శవాలకి శయనం కనుక దీనికి శ్మశానమని పేరు. శ్మశానానికి రాజు–పేద అనే తేడాలేదు. అందరూ అక్కడకు రావలసినదే. తనతో వచ్చిన వారందరు వెనక్కి వెళ్ళిపోగా, తన వాళ్ళకోసం బాధ పడుతున్న సూక్ష్మశరీరానికి "నీకు నేనున్నాను" అని శివుడూ అభయ మిచ్చే అడ్డా శ్మశానం.

ఇక్కడ మనకొక సందేహం రావాలి. శుభమా అని తన పుస్తకాన్ని ప్రారంభిస్తూ కవి శ్మశాన ప్రసక్తి ఎందుకు తెచ్చాడని? మనందరికి శ్మశానమంటే అమంగళమని ఒక అభిప్రాయం. కుమారసంభవంలో పార్వతీదేవితో మాయా బ్రహ్మచారి వేషంలో శివుడు మాట్లాడుతూ ఇలా అంటాడు "శ్మశానంలోని కఱ్ఱముక్కకి, పవిత్రమైన యజ్ఞములో కఱ్ఱగా పాతే గౌరవము లేదు. శ్మశానంలో తిరిగే అమంగళ కరుడైన శివునికి శుభమైన పెండ్లి చేసుకొనే అర్హత లేదు" (పంచమ సర్గ 73వ శ్లో.)

దీనికి జవాబుగా పార్వతీదేవి మాయా బ్రహ్మచారితో ఇలా అంటుంది. "శివుని శరీర స్పర్శతో పవిత్రమయిన శ్మశానంలోని చితాభస్మము పవిత్రమవుతుంది. దేవతలందరూ ఆ విభూతిని నెత్తిమీద ధరించి ధన్యులవుతున్నారు." (పంచమ సర్గ 79వ శ్లో.) ఇక "శ్మశానవాసి" యైన శివుని ఆధిక్యతను మనం వేరే చెప్పనక్కరలేదు.

ఆలోచిస్తే ఒళ్ళు జలదరిస్తుంది కాని ఈ ప్రపంచమే ఒక రుద్రభూమి. మనమందరం శ్మశాన నివాసులమే. కొన్ని వందల సంవత్సరాల క్రితం – మన పూర్వీకులు ఇళ్లు కట్టకమునుపు మనం – ప్రస్తుతం ఉంటున్న ప్రదేశంలో – ఎన్ని శవాలు పూడ్చిపెట్టారో – ఎంతమంది విగత జీవులు తమకు తామే ఈ మట్టిలో కలిసిపోయారో, ఎన్ని వరదలు వచ్చాయో, భూకంపాలు వచ్చాయో చెప్పగలిగినవారు ఎవరైనా ఉన్నారా? వాళ్ల ఎముకలతో సర్వం మట్టిలో కలిసి పోయింది కనుక – ఆనవాళ్ళు లేవని మనకి మనం సంతోషపడుతూ – ఇళ్లు కట్టుకొంటున్నాం. కాని మన ఇల్లు ఉన్న భూమి కొన్ని వందల సంవత్సరాల క్రితం శ్మశానం. కనుక శ్మశానమయిన ఈ ప్రపంచమే శివుని అడ్డా. 

# పాణిమంత్రం

**ఓం నిధనపతయే నమః – నిధనపతాంతికాయ నమః**
**ఓం ఊర్ధ్వాయ నమః – ఊర్ధ్వ లింగాయ నమః**
**ఓం హిరణ్యాయ నమః – హిరణ్యలింగాయ నమః**
**ఓం సువర్ణాయ నమః – సువర్ణలింగాయ నమః**
**ఓం దివ్యాయ నమః – దివ్యలింగాయ నమః**
**ఓం భవాయ నమః – భవలింగాయ నమః**
**ఓం శర్వాయ నమః – శర్వలింగాయ నమః**
**ఓం శివాయ నమః – శివలింగాయ నమః**
**ఓం జ్వలాయ నమః – జ్వలలింగాయ నమః**
**ఓం ఆత్మాయ నమః – ఆత్మలింగాయ నమః**
**ఓం పరమాయ నమః – పరమలింగాయ నమః**
**ఓం ఏతత్ సోమస్య సూర్యస్య సర్వలింగగ్గ్‌స్థాపయతి పాణిమంత్రం పవిత్రమ్.**

(కృష్ణయజుర్వేదము – తైత్తిరీయ ఆరణ్యకము మహానారాయణోపనిషత్ తైత్తిరీయ ఆరణ్యకము 16.1–2)

**ప్రతిపదార్థ తాత్పర్యాలు :**

**ఓం నిధనపతయే నమః**

నివృత్తోఽర్థ సమ్బంధోఽత్ర నిధనః - దేనియందు ధన సంబంధము నివృత్త మవుతుందో అది నిధనము (ప్రళయము). నియతం ధనమత్రేతి నిధనం - నియతముగా దేనియందు ధనముంటుందో అది కూడ నిధనము (కులము). నిధనమునకు అధిపతి అయిన ఈశ్వరునకు నమస్కారము.

**నిధనపతాంతికాయ నమః**

ఇంకొక అర్థములో నిధనపతి అంటే యముడు - అంతో నాశః అస్యామస్తీతి అంతికా - దేనివలన పదార్థములకు నాశనము కలుగునో అది అంతికా. అంతము చూపించే యమునికే అంతము చూపించే శివునికి నమస్కారమని "నిధనపతాంతికాయ నమః" అను మంత్రమునకు అర్థము. శివసహస్రనామాలలో ఒక నామము మహాంతకః (466) అంతకుడు యముడయితే, వానికి అంతకుడు మహాంతకుడు. యమునికి ఈ సృష్టి ఒక అన్నమువంటిదట. ఆ యముడు ఈ మహాంతకునికి (శివునికి) ఊరగాయ వంటివాడు.

**ఓం ఊర్ధ్వాయ నమః**

శక్తికారకమైనది, పొడవైనది ఊర్ధ్వము. అటువంటి శక్తి కారకుడైన శివునికి నమస్కారము (ఉన్నతుడైన శివునికి నమస్కారమని భావము).

**ఊర్ధ్వలింగాయ నమః**

లింగము ఒక సంకేతము. మహత్తనబడు ఒక తత్త్వము. **లీనం విలీనమపి సర్వజ్ఞత్వాద్గచ్ఛత్యవగచ్ఛతి జానాతీతి లింగః** - లీనమైన దానిని తెలుసుకొను సర్వజ్ఞుడు లింగం. (శివసహస్రనామాలు 918 నామం). సదాశివుని అభిజ్ఞ ఊర్ధ్వలింగము. సత్తుయొక్క ఆకృతి ఊర్ధ్వ లింగాకారము. అటువంటి ఊర్ధ్వలింగాకారునికి నమస్కారము. (అత్యున్నతమైన లింగాకారునికి నమస్కారము).

**ఓం హిరణ్యాయ నమః**

**హయ్యతి గచ్ఛతీతి హిరణ్యం** - పోవునది హిరణ్యము. (బంగారము) సృష్టిలోని జీవులకు క్షేమము కలిగించు దారిలో పోవువాడు హిరణ్యుడు. సృష్టిలోని జీవులకు

క్షేమము కలిగించువాడని తాత్పర్యము. అటువంటి హిరణ్యుడైన శివునికి నమస్కారము. కనకః (519); కాంచనచ్ఛవిః (520); పీతాత్మః (889) – ఇవన్నీ శివుని సహస్రనామాలలో ఉన్నాయి.

**హిరణ్యలింగాయ నమః**

బంగారముతో నిర్మించబడిన లింగము హిరణ్యలింగము. అటువంటి హిరణ్య లింగాకారుడయిన శివునికి నమస్కారము.

**ఓం సువర్ణాయ నమః**

**శోభనో వర్ణో యస్య తత్ సువర్ణం** – మంచి వర్ణము కలది సువర్ణము. అటువంటి సువర్ణుడైన (splendorous) శివునికి నమస్కారము.

**సువర్ణలింగాయ నమః**

బంగారముతో తయారు చేయబడిన లేదా ఉజ్జ్వలమయిన లింగము సువర్ణ లింగము. అటువంటి సువర్ణలింగ రూపియయిన శివునికి నమస్కారము.

**ఓం దివ్యాయ నమః**

మోక్షప్రాప్తి కలిగించేది దివ్యము. అటువంటి దివ్యస్వరూపుడయిన శివునికి నమస్కారము.

**దివ్యలింగాయ నమః**

దేవతాచిహ్నమైనది దివ్యలింగము. అటువంటి దివ్యలింగాకారుడయిన శివునికి నమస్కారము.

**ఓం భవాయ నమః**

జనన మరణాలకు సంబంధించినది భవము. ఆ భవకారకుడయిన శివునికి నమస్కారము.

**భవలింగాయ నమః**

మానవులచే కొలువబడు లింగము భవలింగము. అటువంటి భవ లింగాకారుడయిన శివునికి నమస్కారము.

**ఓం శర్వాయ నమః**

ప్రళయములో సమస్త జీవులకు విశ్రాంతినిచ్చువాడు శర్వుడు. అటువంటి శర్వాకారుడయిన శివునకు నమస్కారము.

**శర్వలింగాయ నమః**

దయను ప్రసాదించు శివలింగమును శర్వలింగమంటారు. అటువంటి శర్వలింగాకారుడయిన శివునికి నమస్కారము.

**ఓం శివాయ నమః**

అత్యంత శుభదాయకుడు శివుడు. అటువంటి శుభాకారుడయిన శివునకు నమస్కారము.

**శివలింగాయ నమః**

లింగాకారుడయిన శివరూపము శివలింగము. అటువంటి లింగాకారములో ఉన్న శివునకు నమస్కారము.

**ఓం జ్వలాయ నమః**

జాజ్వల్యమానముగా వెలుగువాడు జ్వలనుడు. మహాజ్వాలః అని శివునికి సహస్రనామాలలో ఒక పేరు (435). తస్య భాసా సర్వమిదం విభాతి. బాగా ప్రకాశించు శివుని తేజస్సువల్ల మిగిలినవి ప్రకాశిస్తున్నాయి. **జ్యోతిషామపి తజ్జ్యోతిః** – ఆ విధంగా అగ్నిహోత్రునిలా వెలిగే శివునికి నమస్కారము.

**జ్వలలింగాయ నమః**

ప్రకాశించే లింగము జ్వాలా లింగము. ఆ జ్వాలా లింగాకృతి అయిన శివునికి నమస్కారము.

**ఓం ఆత్మాయ నమః**

సమస్త జీవాత్మలను తనలో కలుపుకొనేవాడు పరమాత్మ. ఆ పరమాత్మ స్వరూపుడయిన శివునికి నమస్కారము.

**ఆత్మలింగాయ నమః**

సమస్త జీవులను తనలో గుప్తంగా దాచుకొన్న లింగము ఆత్మలింగము.

అటువంటి ఆత్మలింగాకారుడయిన శివునికి నమస్కారము.

**ఓం పరమాయ నమః**

అసమానమైనది పరమము. అటువంటి పోలికలేని దేవదేవుడయిన శివునకు నమస్కారము. శివసహస్రనామాలలో "పరం" అని ఒక నామము (1001) జాగ్రత్స్వప్న సుషుప్త్యావస్థలకు అతీతుడైన అద్వయుడైనవాడు శివుడు. పరాత్పరతరం బ్రహ్మ తత్పరాత్పరతో హరిః యత్పరాత్పరతోధీశః తన్మే శివ సంకల్పమస్తు (శివసంకల్పం)

**పరమలింగాయ నమః**

దయాశాలియైన, మోక్షదాయకుడయిన ఈశ్వరునికి గుర్తు పరమలింగము. అటువంటి పరమలింగాకారుడయిన శివునికి నమస్కారము.

**ఓం ఏతత్ సోమస్య సూర్యస్య సర్వలింగగ్గ్ స్థాపయతి పాణిమంత్రం పవిత్రమ్.**

సోమునిచేత, సూర్యునిచేత ప్రాతినిధ్యము వహించిన శివుని ఇరవై రెండు నామములు గల ఈ పాణిమంత్రము పవిత్రమైనది.

**విశేషాలు :**

తైత్తిరీయ ఆరణ్యకములోని పదవ అధ్యాయము మహానారాయణోపనిషత్.

ఆ మహానారాయణోపనిషత్ లో ఈ పాణిమంత్రం వస్తుంది.

ఈ మంత్రాలను శివోపాసన మంత్రాలని అంటారు.

శ్రీరుద్రము చదివిన తర్వాత శాంతిమంత్రాలుగా వీటిని చదివే ఆచారము ఉంది.

పాణి అంటే మణికట్టునుండి వ్రేళ్లతో కూడిన చేతిని పాణి అంటారు. పణతి వ్యవహర్యత్యనేన పాణిః – పణ వ్యవహారే స్తుతౌ చ

మానవుడు చేతితో వ్యవహారాలు చేస్తాడు కనుక మణికట్టునుండి వ్రేళ్లతో కూడిన చేతికి పాణి అని పేరు. చేతిలో చంద్ర సూర్యులకు చిరునామాగా నిలిచే శివలింగాన్ని నిలుపుకొని ఈ మంత్రాలను భక్తితో చదవాలని, అందుకే దీనికి పాణిమంత్రం అని పేరు వచ్చిందంటారు. చిన్నపాటి శివలింగాన్ని అరచేతిలోకి తీసుకుని ఇదివరకు ఈ పాణిమంత్రంతో వీరశైవపూజ చేసేవారు.

పణ ధాతువునకు (పణ వ్యవహారే స్తుతౌ చ) స్తుతి అను ఇంకో అర్థము

ఉంది కాబట్టి పాణి అంటే స్తోత్రము అను అర్థాన్ని బోధాయనమహర్షి ఇచ్చాడు. కనుక **పాణిమంత్రమంటే స్తుతి మంత్రము.**

తాంత్రిక వ్యాఖ్యానాల ప్రకారము సోముడు శక్తికి, సూర్యుడు శివునికి ప్రతీక. అందువలన శివలింగము శక్తి, శివుల కలయిక

దీనిని ఇంకొకరకముగా చెప్పవచ్చు. సమస్తమైన సృష్టి వేడి మరియు చల్లదనములతో కూడి ఉంది. వేడికి సూర్యుడు ప్రతీక. చల్లదనానికి చంద్రుడు ప్రతీక. ఈ వేడి చల్లదనముల తత్వాన్ని కలిగి ఉన్న శివలింగము సూర్యుడు, సోములచే స్థాపింపబడిందని ఈ పాణి మంత్రము చివరలో ప్రతీకాత్మకంగా చెప్పబడింది. ❁

**ఓం శాంతిస్ శాంతిస్ శాంతిః**

# శ్రీః



